రాధాస్వామీ దయాళ్ కీ దయా

రాధాస్వామీ సహాయ్

పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజ్

వారి

# అమృత వచనములు

తెనుగు అనువాదము

## ప్రథమ భాగము

రాధాస్వామీ సత్సంగసభ అనుమతితో హిందీ మూలమునుండి
తెనుగు భాషలోనికి తర్జుమా చేయబడినది

ప్రకాశకులు

రాధాస్వామీ సత్సంగసభ
రాధాస్వామీ సంవత్ 162
దయాల్బాగు ఆగ్రా - 5

198[illegible]



**Param Guru Huzur Mehtaji Maharaj**
**(1885-1975)**



**Param Guru Huzur Mehtaji Maharaj**
**(1885-1975)**

# భూమిక

పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజువారు, సత్సంగములో నప్పటప్పట భిన్న భిన్న విషయములను గురించి వచనములను సెలవిచ్చు దివ్యేచ్ఛను ధరించు చుండెడివారు. వచనములను సెలవిచ్చుటలో వారి తీరువ నూతన విధముగ నుండెడిది. తాము సెలవివ్వదల్చుకొన్న విషయ మును వారు ముందు సత్సంగములో ప్రసంగరీత్యా సూచనచేసి, అచ్చట నున్న సత్సంగులను అందు విషయములో వారి వారి అభిప్రాయములను చెప్పు డని అడిగెడివారు. ఆ దయాళురు, అటు పిమ్మట తమ అభిప్రాయమునుగూడ సెలవిచ్చి, తర్వాత ఆ విషయమును గురించి దివ్యేచ్ఛకు పవిత్ర గ్రంథము నుండి శబ్దమును తీయించి, ఆ శబ్దము ద్వారా తమ అభిప్రాయమునకు సమర్థ నము చేసికొనుచుండిరి. ఉర్దూ హిందీ ప్రేమ ప్రచారక పత్రికలలో ఆ వచ నములు అప్పటప్పట ప్రచురించ బడుచుండెను. పరమగురు మెహతాజీ మహా రాజువారి యీ వచన సంగ్రహము అట్లు ప్రేమ ప్రచారక పత్రికలలోని వచనములను బట్టియే తయారుచేయబడినది. ప్రేమ ప్రచారక పత్రికా సంపాదకుడు తన సొంతమాటలతో తన అభిప్రాయములను గూడ అచ్చు టచ్చుట నీ వచనములలో జేర్చి వ్రాయుచుండెను. మేము పత్రికా సంపాద కుని సొంత అభిప్రాయములను సొంత మాటలను సాధ్యమైనంతవరకు తొల గించి, హుజూరు మెహతాజీ మహారాజువారి అభిప్రాయములను వారి మాట లను మాత్రమే యీ సంగ్రహములోని వచనములలో వ్రాసితిమి. అయి నను, ఈ పరిస్థితుల మూలమున రాధాస్వామీ సత్సంగసభ యీ వచనముల విషయములో బాధ్యత వహించ నేరదు.

రాధాస్వామీ సత్సంగసభ ఈ వచన సంగ్రహము ప్రథమ భాగ మును ఆంధ్రసోదరీ సోదరుల సౌకర్యార్థమై తెనుఁగున తర్జుమా చేయించిరి. కొన్ని సత్సంగ గ్రంథములను ఇదివరలో తర్జుమాచేసిన ప్రేమీభాయీ ఉప్పలూరి సత్యనారాయణగారు దీనినిగూడ తర్జుమాచేసిరి. దీనివలన హిందీ

భాషా పరిచయము లేనట్టి ఆంధ్ర సోదరీ సోదరులకు పరమ గురు హుజూరు మెహతాజీ మహారాజువారి దివ్యవచనములను అర్థము చేసికొని పరిపూర్ణ లాభము నొందు సావకాశము గలుగగలదని ఆశించుచున్నాము.

ఈ భాగములో 1945 వ సంవత్సరము వఱకు సెలవివ్వబడిన వచనములు మాత్రమే చేర్చబడినవి. హుజూరు మెహతాజీ మహారాజువారిచే అటుపిమ్మట వివిధ సమయములలో దయతో సెలవివ్వబడిన వచనములు, సందేశములు, భాషణములును ద్వితీయ భాగములో ప్రచురింపబడగలవు.

దయాల్బాగు
8-3-1980

గురు సరన్‌దాస్ సహగల్
ప్రెసిడెంటు
రాధాస్వామీ సత్సంగసభ

రాధాస్వామి దయాల్ కీ దయా
రాధాస్వామి సహాయ్

# పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజ్ వారి

# అమృత వచనములు

1

13 సెప్టెంబరు, 1937 – ఈనాడు విద్యార్థుల సత్సంగములో పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజువారి ట్లు సెలవిచ్చిరి.— ప్రియ బాలకులారా, మీరందఱి విద్యార్థులతో కలిసి కూర్చుండు నావకాశమిదే మొట్టమొదటిసారి నాకు లభ్యమైనది. నాకు చాల సంతోషముగ నున్నది. 1937 వ సంవత్సరము జూన్ నెల 23 వ తేదీన సాయంకాలము మదరాసులో సముద్రపు టొడ్డున దయచేసి కూర్చుండి నపుడు, హుజూర్ సాహబ్జీ మహారాజువారు, "నా కర్తవ్యములను నెరవేర్చుటలో నేను నా జీవితములో నెన్నడు లోపము చేయలే" దని సెలవిచ్చిన మాట మీకు జ్ఞాపకముండ వచ్చును. అట్లు చెప్పుటలో హుజూర్ సాహబ్జీ మహారాజు వారి అభిప్రాయము రాధాస్వామీ సత్సంగ సభయు, సమస్త సత్సంగులును, తమ కర్తవ్యములను ఏమఱుపాటు లేకుండగను, శరీరమును మనస్సును పూర్తిగ అర్పణ చేయు భావముతో పాలించుచుండ వలయునని చెప్పుటకే అయి యుండునని గోచరమగుచున్నది.

నేను పూజ్యురాలైన మా తల్లిగారును,పిమ్మట కొంత కాలమైనతర్వాత పూజనీయులైన మా తండ్రిగారును పోయిన సమయములలో దగ్గఱ లేను. ఈ విషయము బహుశా మీకు తెలియకపోవచ్చును. కాని అందువలన నాకు, పసిపిల్లలకు తమ తలి దండ్రుల వియోగ మెంత దుఃఖదాయకముగ నుండునో, వారి మృదు కోమల హృదయము లందు అట్టి శాశ్వత వియోగ మెట్టి గాఢ ప్రభావము గలుగ జేయునో బాగుగ తెలిసినది. వారు అట్టి పరిస్థితి మూలమున మహా నిరాశలో నైన పడిపోవచ్చును. లేదా ఒక్కొక్కప్పు డట్టి పరిస్థితి వారికి మహాకృత్యములు చేయుటకై ప్రోత్సాహమును పుట్టించినను పుట్టించగలదు. ప్రస్తుతము గూడ మన పరమపిత హుజూర్ సాహబ్జీ మహారాజు వారు మదరాసులో శరీర త్యాగము చేసిన సమయమున మన సోదరులలో చాలమంది

అచ్చుటలేరు. అందువలన పైన చెప్పిన ప్రభావమువంటి ప్రభావమే మన సోదరీ సోదరులు పిన్న పెద్దలందరి హృదయములందు, మనసునందును గాఢ రూపమున ముద్రితమైపోయి యుండునని నేననుకొనుచున్నాను.

ఇపుడు రాధాస్వామీ దయాళుని పిల్లలకు, తమ శిరముల మీదినుండి ఆ పరమపిత దయామయ రక్షణ హస్తము తొలగిపోయినదేమో అని కాని, ఇపుడు తమ యోగక్షేమములను జూచువా రెవరును లేరేమో యని కాని పొరపాటుననైన అపభ్రమ యెట్లు కలుగకుండునో అట్టి శుభపరిణామము కలుగ జేయునట్టి కార్యక్రమమును సాగించవలయునని రాధాస్వామీ సత్సంగసభ వారు తీర్మానించుకొనిరి. అందువలననే సభవారు ఈ సంవత్సరము ప్రస్తుతములో నొక మాసము వరకు విద్యార్థులకు పాలు ఉచితముగ నిచ్చుట కేర్పాటు చేసిరను విషయము మీకు తెలిసియే యుండును. మరొక ఆలోచన గూడ నీ కార్యక్రమము నవలంబించుటకు కారణభూతమైయున్నది. ఏమనగా సభవారిచ్చిన పాలు మీరు త్రాగుచుండినందున ఆ పాల వలన నుత్పన్నమైన రక్తము మీయొక్క ప్రతి రక్తనాళములో ప్రతి నరములోను గూడ సత్సంగసేవ చేయుటకై కుతూహలోత్సాహములను సహజముగ నుత్పన్నము చేయగలదనియు, మీకు కలిగెడి సంతానము మీకన్న శ్రేష్ఠముగ నుండుననియు ఆశించుచున్నాము.

ఈ క్షీరమునిచ్చుటలో గల యుద్దేశములు సిద్ధించుచున్నట్లు సూచనలు ఈ నెల లోపున కాని, యీ నెల ఆఖరైన పిదప కాని కనిపించిన యెడల సత్సంగ కార్య కర్తలు ఈ యేర్పాటును ఈ నెల తరువాత కూడ అధమము కొంత కాలమైనను సాగించుట అసంభవము కాదు.

కావున మన దైనందిన ప్రవర్తన వలనను, మన కృత్యములు భావనల మూలమునను పై ఉద్దేశ్యములు సఫలము కాగలవని తగినంత నమ్మకము సభ వారికి కలిగించ వలసిన బాధ్యత మనమందరి మీద ఉన్నది. ఆఖరున, హుజూర్ సాహబ్జీ మహారాజు వారు ప్రతి సత్సంగియు తన బాధ్యతలను ఉత్తమ రీతిని నిర్వహించుట తన ప్రధాన కర్తవ్యముగ భావించుకొనవలయునని సెలవిచ్చిన ఉత్తమ భావ పూర్ణమైన వచనమును నేను మరల నొకసారి మీకు జ్ఞాపకము చేయగోరుచున్నాను.

## 2

12 అక్టోబరు 1937 — ఈనాడు అవరాహ్ణము హుజూరు వారి అధ్యక్షత క్రింద ఆర్. ఇ. ఐ. టెక్నికల్ కాలేజీల సీనియర్ విద్యార్థుల సమావేశము జరిగినది. రెండు శబ్దములను చదివిరి.

అందొక శబ్దము—

సున సున రహస్య న జాయ మహిమా సతగురు కీ ॥టేక॥
మఛరీ పడీ భఁవర కే మాంహీం బహతీ బే బస ధార ।
రహా వేన కో కహీం ఠౌర న పాలే మఛువా ఖడా రే కినార ॥

(ప్రేమ బిలాస శబ్ద 117)

శబ్దపఠనానంతరము హుజూరువా రిట్లు సెలవిచ్చిరి.

ప్రస్తుతము భారతదేశములోని నవయువకుల పరిస్థితి కూడ నిరుద్యోగము వలన పై చరణములో వర్ణించిన మత్స్యమువలెనే అయిపోవుచున్నది. ఈ నిస్సహాయులు కూడ అత్యంత నిరాశావస్థలో చిక్కుకొని యున్నారు. కావున ప్రతి విద్యార్థియు తన జీవితమున కొక లక్ష్యమును త్వరలో నిశ్చయించుకొని ఆ లక్ష్య ప్రాప్తికై శక్తికొలది ప్రయత్నము చేసి తానొక్కనికే కాక తన సంఘమంతకును కూడ లాభము కలుగ జేయుట తన కర్తవ్యముగ నెంచుకొనవలయును. ఇంచుమించు రెండు డజన్ల విద్యార్థులను హుజూరువారు నిలబెట్టి, "నీ వేకార్యమును నీ జీవిత లక్ష్యముగ నెన్నుకొంటివి" అని ఒక్కొక్కరినే ప్రశ్నించిరి. అందు సగము విద్యార్థులు తామెద్దియు అట్లు జీవిత లక్ష్య మేర్పాటు చేసికొనలేదని చెప్పుకొనిరి. హుజూరువారు వారలకు ఏమరుపాటుగ నుండుట అత్యంత హానికరమని బోధపరచిరి.

## 3

29 జనవరి 1938—వసంత పంచమి రోజున ఉదయము సత్సంగములో రెండుశబ్దములును ఒక వచనమును చదివిన పిమ్మట ఇట్లు సెలవిచ్చిరి : జనవరి 1వ తేదీని ఉదయమున నేను సమస్త సత్సంగి సోదరీ సోదరులకును సత్సంగమునకును నూతన వర్షాభినందనములు చెప్పియుంటిని. జనవరి 2 వ తేదీని అమృతసర్‌లో మిల్లును కొనియుంటిమి. 29 వ తేదీని మిల్లులో పనిచేయుట

ప్రారంభించితిమి. కౌడాగారు తీసికొనివచ్చిన ఈ దారము ఆ మిల్లులో వడికీన దే. ఈనాడు ఉదయము సత్సంగములో కూడ హుజూరు సాహబ్జీ మహారాజు వారు సత్సంగములో సర్వదా పరమార్థమునకే ఎక్కువ ప్రాముఖ్యము ఈయవలసి యున్నప్పటికిని దానితో స్వార్థము కూడ అవశ్యముగ కలిసియే యున్నది" అని సెలవిచ్చిన వచనమే దివ్యేచ్ఛ వలన చదువబడినది. ఈ పవిత్ర వసంత పంచమీ శుభదినమున నేను నా సమస్త సత్సంగ సోదర సోదరీమణులతోను హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు ఆ దయాళురు మన సేవను స్వీకరించు కటాక్షము చేయుదురుగాక యని ప్రార్థించ వలయునని మనవి చేయుచున్నాను. ఈ మాట విన్నతోడనే సత్సంగులంద రును రాధాస్వామీ అని బిగ్గరగ నరచిరి.

4:

17 ఏప్రియల్ 1938— ఈ శుభదినమును సత్సంగము యొక్క నూతన యుగములో నొక చరిత్రాత్మక సుదినముగ పరిగణింపవలసి యున్నది. ఈ రోజుననే సత్సంగులకు తమ ప్రియతముడు సత్సంగములో కుర్చీపైన విరాజమానులై యుండగ చూచు సౌభాగ్యము కలిగినది. ఈ రోజున ప్రేమీ భక్తులు చాల పట్టు పట్టి ప్రార్థించిన మీదట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి.

"ఈ సమయమున రాధాస్వామీ దయాళుని దయాధార మహావేగ ముతో మీదికి ప్రవహించుచున్నదనియు వారి దివ్య రక్షణ హస్తము సత్సంగ సంఘముపైన ప్రకట రూపముగ కన్పట్టుచున్నదనియు, సత్సంగ సోదరీ సోదరులందరును తెలిసికొని సంతోష పూరితులు కాగలరు. ఏలనన ఏ కార్యము చేబూనినను అది సంపూర్ణముగ సఫలమైపోవుచునే యున్నది. పరిశ్రమల అభివృద్ధి నిమిత్తమై ప్రయత్నించిన యెడల అందు సాఫల్యము కలుగుచున్నది. అటులనే సత్సంగము యొక్క అభివృద్ధి నిమిత్తమై భూమి ఆవశ్యకమైనచో మన ఇచ్ఛానుసారముగ భూమియు సులువుగ లభ్యమగు చున్నది. సత్సంగి సోదరీ సోదరులు ఈ తరుణములో నడుము కట్టుకొని కార్య క్షేత్రము లోనికి దిగి సేవ చేయుటకును ఆత్మ సమర్పణ చేయుటకును పూర్తిగ సంసిద్ధులై యుండవలయును.

## 5

21 డిశంబరు 1939—ఉదయము సత్సంగములో నీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు తీసి చదివిరి.

జబ లగ జివ జగ రస చహే ।
సహే దుఃఖ బహు తాప ॥
నీచ ఊంచ జోనీ ఫిరే ।
కాల కరమ సంతాప ॥

(ప్రేమ బిలాస శబ్ద 133)

ఈ శబ్దమును ప్రమాణముగ చేసికొని హుజూరువారిట్లు సెలవిచ్చిరి- గత దినములలో నేను సంభాషణ క్రమములో నెగతాళిగ "మన రస" (మానసికానందము) కన రస (కర్ణానందము), తన రస (శరీరా నందము) అనియు చెప్పుచుంటిని. కాని ఇపుడు చూడగ ఆ మాటలు చాల భావగర్భితములైనట్లు కనబడుచున్నది. ఈ శబ్దములో ఈ రసములను "జగ రస" (ప్రాపంచికానందము) అని పేర్కొనుచు మన జీవ కళ్యాణము సాధించగలిగిన "భక్తి రస" (భక్తియొక్క ఆనందము) దీనికి విరుద్ధమని చెప్పబడినది. మీరు ఈ శబ్దమును ఎంత ఎక్కువ శ్రద్ధగ చదివి అవగాహన చేసికొందురో అంత ఎక్కువగనది గంభీర భావ పూరితమైనట్లు మీకు గోచరము కాగలదు. ఈనాడు వస్తు ప్రదర్శనమును ఉద్ఘాటన చేయు రోజు. ఈ శబ్దము మేము ఇంతకు పూర్వము చెప్పిన విషయములనే సమర్థన చేయుచున్నది. కావున నేడు ఈ పవిత్రదినమున మిమ్ములను అభినందించుచున్నాను.

## 6

21 డిశంబరు 1939— హుజూరువారిట్లు సెలవిచ్చిరి. నా మనసున నున్న రెండు మూడు విషయములను మీకు నివేదించుకొన గోరుచున్నాను. రేపు పెండ్లిండ్లకై నియుక్తమైన రోజు కావున బహుశః చెప్పుకొనుటకు రేపు అవకాశముండక పోవచ్చును. కావున వానిని ఈ రోజుననే వివరించుట యుక్తము. ఇదేమియు క్రొత్త విషయమును కాదు. ఒక వచనము కూడ కాదు. కాని మనలను రక్షించెడి విషయము. వ్యాపారమునకును, పరిశ్ర

మలకును సంబంధించిన ప్రత్యేక విషయమును గురించియే మిమ్ములను మరల ఆలోచించగోరుచున్నాను.

మదరాసు పంజాబు రాష్ట్రములలో చాల స్టోర్లు రిజిష్టరు అయిపోయి నట్లు ప్రేమ పరిచారక పత్రిక మూలమున మీకు తెలిసియే యుండును. వస్తు ప్రదర్శనము కూడ గత వర్షముల కన్న ఈ సంవత్సరము ఎక్కువ శోభాయమానముగ నున్నది. ఈ రోజున దాని యుద్ఘాటనము కూడ బియాస్ సత్సంగ నేతయైన సర్దార్ జీగారి పవిత్ర హస్తములతో చేయబడినది. గృహ పరిశ్రమల నెక్కువగ అభివృద్ధి చేయవలయునని నొక్కి తీర్మానించిన సెప్టెంబరు నెల (దసరా) సత్సంగసభా తీర్మానమును మీకు నేను జ్ఞాపకము చేయ గోరుచున్నాను. ఆ తీర్మానము యొక్క ఉద్దేశ్యము మన పరిశ్రమలు ఇతోధికముగ నభివృద్ధి చెందవలయుననియే. ఈ కొద్ది కాలములోనే గృహ పరిశ్రమలకు చేకూరిన సాఫల్యమును మీరు వస్తు ప్రదర్శనశాలకు వెళ్ళి చూచినచో మీకు తెలియగలదు. అచట నొక విభాగము ప్రత్యేకముగ ఈ కార్యమునకై ఏర్పరచబడియున్నది.

మీరు ఈ వస్తు ప్రదర్శనమును శ్రద్ధగ పరికించి చూచినచో పూర్వపు వస్తు ప్రదర్శనములకన్న ఈ సంవత్సరపు ప్రదర్శనములో మీకు మూడు చిత్తాకర్షకమైన క్రొత్త విషయములు కన్పించగలవు.

మొదటిది. బేసిక్ ఎడ్యుకేషను యొక్క పనులు. ఇందులో ఆర్.ఇ.ఐ. లోని చిన్న పిల్లలు స్వహస్తములతో వస్తువులను తయారుచేసి పెట్టిరి. ఈ పని ప్రారంభించి మూడు మాసములు మాత్రమే అయినది. కాని పని ఉత్సాహవర్ధకము గనే యున్నది. పనిని చూడగ ఆ పిల్లలకు ఆ పనిలో కావలసినంత శ్రద్ధయున్నట్లు తేట పడుచున్నది. దీనినిబట్టి ఈ బాలురు విద్యాభ్యాస కాలములోనే కొద్ది గొప్ప సంపాదించు కొనగల వారు కాగలరని ఆశ పొడముచున్నది. మీరు ఆ బాలుర కృత్యములను తప్పక చూచి వారు తయారుచేసిన వస్తువులను కొనుగోలుచేసి, వారలకు తగినంతగ ఉత్సాహ వృద్ధిని కలుగచేయ వలయునని కోరుచున్నాను.

మీకు అక్కడ కనబడెడి రెండవ క్రొత్త విషయము మహిళా సంఘమువారి శాల. ఈ సంఘముకూడ నీ మధ్యననే పుట్టిన పసిపిల్ల, ఆ

శాలలో మీకు కనబడు వస్తుసామగ్రి అంతయు పదునైదు ఇరువది రోజుల లోపుననే తయారుచేయబడినది. ఈ సోదరులు రాధాస్వామీ దయాళుని అనుగ్రహమును, ప్రసన్నతను సంపాదించుకొనవలయునను కోరికతో శరీరమును వంచి కఠిన పరిశ్రమయు, తపమునుజేసి సేవాభావముతో కొద్ది వ్యవధిలోనే ఈ సమస్త సామగ్రిని తయారుచేసి మీ యెదుట పెట్టిరి.

మీరు ఈ సారి వస్తు ప్రదర్శనములలో చూడదగిన మూడవ విషయ మేమనగా - దయాల్బాగ్ మహిళా హోజియరీ ఇన్‌స్టిట్యూటువారు నూలుతోను ఊలుతోను తయారుచేసిన హోజియరీ వస్త్రములు. ఈ పని అంతయు కూడ ఈ సంస్థలో పనిచేయుచున్న స్త్రీలు చేసినదే. ఈ సంస్థయొక్క ఆర్థిక పరిస్థితి ఇంకను సంతోష దాయకముగ లేదుకాని వీరి పని నిస్సందేహముగ ఆశాప్రదముగనే యున్నందున అది రాబోవు సంవత్సరము ఇంతకన్న నెక్కువ బాగుగ నుండగలదని ఆశించుచున్నాము.

శీతలప్రసాద్ మెహతా జపానులో గృహ పరిశ్రమల యొక్క విధానమును, వస్తువులను పరికించి చూచుటకై యీ యేడు ప్రారంభములో ఇచ్చటి నుండి జపానువెళ్ళి అచట సమస్త కార్యకలాపమును చూచి ఈ మధ్యనే తిరిగి వచ్చెను. మోడల్ ఇండస్ట్రీసు మేనేజరుగారి పర్యవేక్షణ క్రింద ఆయన కొన్ని రమ్యమైన వస్తువులను ఇచ్చటి యంత్రములతోనే తయారు చేసిరి. వానిని నేను ఇప్పుడే మీ ముందర పెట్టబోవుచున్నాను. వ్యవధి తక్కువగ నుండుటచే ఆరు, ఏడు రకముల వస్తువులు మాత్రమే తయారు చేయగలిగిరి. కాని అవి సుందరముగను, ఉత్సాహవర్ధకముగను ఉండుటచే సమయము లభించినపుడు ఇంతకన్న నెక్కువ పరిమాణములో తయారు కాగలవను ఆశ కలుగుచున్నది. కావున గృహ పరిశ్రమలు అభివృద్ధి చేయుటకు చాల అవకాశ మున్నది.

మీరీ వస్తువులను చూచిన పిమ్మట గృహ పరిశ్రమల విషయములో చేసిన సెప్టెంబరు నెల తీర్మానమును మరల గమనించి, మీకిపుడు చేకూరిన సాఫల్యమును లభ్యమైన సావకాశములను దృష్టిలో నుంచుకొని, మీరు ఈ పనిని చేయగోరుచున్నారో లేదో తేల్చుకొని చెప్పగోరెదను. ఈ పై సమస్త విషయములును మనము చేయుచున్న కార్యక్రమమును సకల విధముల జయప్రదముగ జరుగుచున్నట్లు కనబ్బచుచు మన ముఖ్యోద్దేశ్యమును సాధించుటకు

తోడ్పడుచున్న యెడల భగవంతుని గుప్తహస్తము మనకు తోడుగ నున్న దనియు మనకు తప్పక సాఫల్యము చేకూరగలదనియు మనము తెలిసికొనవలసి యున్నది. హుజూర్ సాహబ్జీ మహారాజువారు తమ పంచవర్షీయ ప్రణాళికాను సారము ఒక కోటి రూప్యముల విలువ గల వస్తువులనుతయారుచేయు విషయ ములు సెలవిచ్చిన ఆ సుప్రసిద్ధ వచనము కూడ తప్పక పూర్తి కాగలదనియు మనము తెలిసికొన వలయును. ఇప్పుడు ఆ దయాళుని దయామయ పాదఛాయ క్రిందనుండి మీరు ఈ విషయములో సంపూర్ణ ప్రయత్నము చేయుట యుక్తము. ఇదికాక మరియొక విన్నపము కూడ చేసికొనవలసియున్నది. ఒక సంవత్సరమున కంతకును కావలసిన సామగ్రి కొనుగోలు చేయు నిమిత్తము అంచనా ఫారములు అచ్చువేయబడి యున్నవి. మీరా ఫారములను శ్రద్ధగ చదువుకొని సంవత్సరమున కంతకును అవసరమైన సామగ్రిని ఏయే రకములు ఎంతెంత కావలయునో ఆ వివరములతో- ఆ ఫారములలో సరియైన స్థలము లలో నింపవలసి యున్నది. ఈ ఆవశ్యకమైన విషయమును గూర్చి మీరు ఆలోచించు కొనుటకై అధికాధిక సమయము మీకు లభ్యము కావలయునను ఉద్దేశ్యముతోనే నేనీ విషయమును మీకు 24 గంటలు ముందుగ చెప్పుచు న్నాను. ఈ విషయమును మీరు ఒక పారమార్థిక వచనముగ భావింపరాదు. భావికాలమున మీకు ఆపదలు కష్టములు రాకుండ కాపుదల చేసి మీ ప్రాణ ములను కాపాడు నిమిత్తమెయే నేనిదంతయు మీకు మనవి చేసికొన్నాను. కావున మీరీ విషయములను మనసున నెలకొల్పుకొని ఆచరణలో పెట్టు కొనుడు.

# 7

22 డిసెంబరు 1939 — ఈనాడు రాత్రి సత్సంగమైన తరువాత సుమారు 8 గంటలకు నాలుగు వర్ణాంతర వివాహములు జరిగినవి. అందు ఒకటి రాధాస్వామీ సత్సంగసభ ప్రెసిడెంటు రాయబహదుర్ గురుశరనదాస్ మెహతాగారి సుపుత్రుని వివాహము. ఆయన ఢిల్లీలో ఒక సుప్రసిద్ధ దంత చికిత్సకుడుగ పనిచేయుచున్నాడు. వరునికి పినతండ్రి అయినట్లుగ పరమ పూజ్యులైన హుజూరువారు పరిహాసముగనిట్లు సెలవిచ్చిరి. "ప్రే॥ భా॥ ప్రేమ స్వరూపు పెండ్లిలో అతని పినతండ్రి ప్రే॥ భా॥ జ్యోతి స్వరూపుగారు ఒక "సెహరా" పాట పాడిరి. నాకు "సెహరా" పాడుట రాదుకాని, పినతండ్రి రూపములో వరుని మెడలో "సెహరా" (పూలదండను) తప్పక వేయు

చున్నాను. ఈ విధముగ నేను పినతండ్రి ధర్మమును నెరవేర్చు కొను చున్నాను." హుజూరువారు వధూవరులకు మెడలో పూలదండలను వేసిరి. అప్పుడు వధూవరు లందరి వైపునకు తిరిగి హుజూరువారిట్లు సెలవిచ్చిరి. "మీకీరోజున స్త్రీపురుష సంబంధ మేర్పడినది. మీరిక జీవితమును సంయమ సహితముగ గడుపుచు స్వార్థ కార్యములను ఒండొరుల లాభనష్టముల నాలోచించుకొని చేయుచు పారమార్థిక కార్యక్రమములో కూడ ఒకరి కొకరు తోడుగ నుండి పరస్పరము ప్రేమ, ఆదరము లతో మసలు కొనవలయును. మీరు ఈ ప్రకారము నడచుకొనిన యెడల మీ జీవితమంతయు సుఖప్రద ముగ గడచిపోగలదు. మీ సంతానముకూడ ఆరోగ్యవంతులు, సుందర రూపులు, భగవద్భక్తులును కాగలరు. అందువలన సంఘమునకు గూడ లాభము సేకూరును. మీకును ఈ సేవాఫలితముగ హుజూరు రాధాస్వామీ దయాళుని దయా ప్రసన్నతలును చేకూరగలవు. మరొక విషయము కూడ మీకు నేను చెప్ప గోరుచున్నాను. అదేమనగా మీరు ఈనాటి నుండియు మనసున నొక పవిత్రాదర్శమును ఏర్పరచుకొని దానిని సాధించుటకు తీవ్ర ప్రయత్నము చేయు చుండవలయును. మీ రందరు వధువులు, వరులునుకూడ మీ తల్లిదండ్రుల యెడల వివాహము కాకముందు ఎంత వినయ విధేయ తలతో ప్రవర్తించు చుండిరో ముందు కూడ అట్టి వినయ విధేయతలతోనే నడచుకొనవలయును. వారికి తమ పిల్లవానికి పెండ్లియై కోడలు ఇంటికి కాపు రము వచ్చిన తోడనే తమ పిల్లవాడు తమ వశములో నుండి తప్పిపోయెనని చింతించుట కవకాశము కలుగ చేయరాదు. మీరిట్టి వాగ్దానమును, ప్రతిజ్ఞను సమస్త సంఘము నెదుట చేసితిమని జ్ఞాపకముంచు కొనుడు. కావున ఆ ప్రతిజ్ఞపైన స్థిరముగ నుండుట మీ యొక్క అవశ్య కర్తవ్యమై యున్నది.

## 8

25 డిసెంబరు 1939—ఈరోజు సత్సంగములో నీ క్రింది విధముగ వ్రాసి యున్న హుజూరు సాహబ్జీ మహారాజువారి వచనము ఒకటి చదువబడినది. "ఓ మానవుడా! మత్స్యములకు జలము నెడల నెట్టి ప్రీతి కలదో అట్టి ప్రీతి నీకు కూడ నీ గురువు నందుండవలయునను అభిలాష నీకున్నచో అట్టి ప్రీతి కల్గుట బహుకష్ట సాధ్యమను విషయము నీవు గ్రహించు కొనవలయును. ఇందుకు ఒకటే విధానము కలదు. అదేమనగా సద్గురు చరణములయందు నిష్కపట మైనప్రీతిని ముందు స్థిరపరచు కొనవలయును. నిజమైన ప్రీతి ప్రతీతులు

సేవా సత్సంగముల వలననే లభ్యము కాగలవు. ఈతరహాను పొందగోరు వ్యక్తి చాల జాగరూకతతో వారి సత్సంగ సేవలను చేసికొనుచు నుండ వలయును. గ్రంథములు చదివి నందువలనను, గప్పాలు కొట్టినందు వలనను ఈ ఉత్తమ పదవి లభ్యము కానేరదు."

హుజూరు మెహతాజీ మహారాజువారు దీని సారాంశమును బహు జాగ్రత్తగా అర్థము చేసికొని తదను సారముగ నడచు కొనవలసి యుండునని చాల గట్టిగ నొక్కి చెప్పిరి. తరువాత "సత్సంగ కే ఉపదేశ" అను గ్రంథము నుండి మరియొక వచనముచదివిరి. ఆ వచనములో జీవునికి దోషదృష్టి (తప్పు లెన్నెడి లక్షణము) లేకుండనున్నపుడే సద్గురువు నందు ప్రీతి కలుగుట సాధ్యమగు ననెడి ప్రశ్నను మొట్ట మొదట తర్కించిరి. అందుకు సమాధాన మిట్లు చెప్పబడినది. ఇది నిస్సందేహముగ అతిదుష్కరమైన విషయమే. కాని దీనికొక్కటే ఉపాయము కలదు. అదే మన జీవుడుసద్గురువు యొక్క సేవా సత్సంగములను తదేక దీక్షగల మనస్సుతో కొంత కాలము చేసికొన వలసి యున్నది. అట్లు చేసికొనుటవలన సద్గురువుని దయాదృష్టి తానంతట నదియే ఆ జీవునివైపు మరలిపోయి వారి యెదుటకు వచ్చినంతనే ప్రేమ సింధువైన సద్గురువు అతని హృదయమును ప్రేమతో పరిపూర్ణముగ నింపివేయు దురు. ప్రేమ ప్రీతులు సంపాదించు కొనుటకై దీనిని మించి శ్రేష్ఠమైనదిగాని సులభమైనది కాని ఉపాయము మరెద్దియు లేదు.

హుజూరు మెహతాజీ మహారాజువారీ వచనముపైన తమ అభిప్రాయము నిట్లు సెలవిచ్చిరి.

"ఈ వచన మింత విస్పష్టమైన మాటలతో చెప్పబడియున్నను, ఇందలి ప్రతి విషయము విధానమును బహు విశదముగ వివరించబడి యున్నను కూడ మనకు అవి బోధపడ లేదనినచో బుద్ధి హీనత చాల శోచ నీయము. కాని మనము ఆ వచనము చదువుచున్నపుడు ఆ వచనము మీద ధ్యానము సంపూర్ణముగ పెట్టుకొనక మరొక వైపునకు చూచుటయే దీనికి కారణము. మీరు ఆ వచనము మీదనే పూర్తిగ శ్రద్ధపెట్టుకొని చివరి వరకు నట్లే వినుచుండిన యెడల నా మాటలోని సారము మీకు బోధపడగలదు. కావున మీరు సత్సంగములో కూర్చొనినపుడు తప్పక ఈ సలహా ప్రకారము నడచుకొని దాని లాభమును పొందుడు.

౭

ఈ విధముగా సెలవిచ్చిరి. పంజాబు రాష్ట్ర సంఘము యొక్క సమావేశము రేపు ఉదయము 8-30 గంటలకు కాగలదు. ఆ తరువాత అచ్చటనే ఉత్తరప్రదేశము, ఢిల్లీ, బీహారు రాష్ట్రముల సంఘ సమావేశములును జరుగును. ఏదైన నొక ముఖ్య విషయమును చేయదలచినపుడు దానినే మాటి మాటికి రెట్టించి చెప్పుట ప్రపంచములో నొక రివాజుగా నున్నది. సత్సంగములో కూడ ఈ రివాజు లేకపోలేదు. ఇది కాక అట్లు రెట్టించి చెప్పుటకు మరొక కారణము కూడ నున్నది. ఏమనగా ఈ రోజులలో సత్సంగులు చాలమంది ఇచ్చటికి వచ్చుచున్నారు. వారికి నేను ఇంతకుముందీ విషయమును గురించి చెప్పిన మాటలు వినుట కవకాశము లభించియుండదు. కావున తిరిగి మరొక సారి ఈ విషయమును రెట్టించుట ఆవశ్యక మగుచున్నది. మొదటి విషయమేమన అమృతసరు మిల్లు షేర్లు ఇంకను లభ్యమగుచున్నవి. వాని నింతవరకు కొనని సోదరులు ఇపుడు కొనుగోలు చేసికొనవచ్చును. షేర్లు కొనుగోలు నిమిత్తమై ఇంతకు ముందే దరఖాస్తు పెట్టుకొని మాట యిచ్చిన వారు వారివారి మొదటి వాయిదా మొత్తమును కట్టవలయును. మొదటి వాయిదా మొత్తమును కట్టిన వారిప్పుడు రెండవ వాయిదా సొమ్మును కట్టవచ్చును. ఈ రోజులలో సర్ సాహబ్జీ మహరాజ్ మిల్లు కార్యాలయ మిచ్చటనే టౌను హాలులో పగలు 10 గంటల నుండి 5 గంటల వరకు తెరచి యుండుచున్నది. మీరు అచ్చటికి వెళ్ళి అవసరమైన పని చేసికొనవచ్చును.

నేను మీకు చెప్పదలచిన రెండవ ముఖ్య విషయమేమనగా ప్రస్తుతము భారతదేశములోని అన్ని పట్టణములలోను దయాల్బాగు స్టోర్సులు కొన్ని చోట్ల పూర్తిగా స్థాపించబడియు మరికొన్ని స్థలములలో నిపుడు క్రొత్తగ స్థాపించబడుచు నున్నవి. వానినిపుడు 1913 సంవత్సరము చట్టము ప్రకారము రిజిష్టర్డు లిమిటెడ్ కంపెనీల క్రింద త్వరలో మార్పు చేయవలసి యున్నది. స్టోర్సులు ఇంతవరకు ఎచ్చటెచ్చట స్థాపించి యుండలేదో అచ్చటచట త్వరలో స్థాపించు నేర్పాటు చేయవలసి యున్నది. ఈ స్టోర్సులను కంపెనీలుగా చేయుటకై షేర్లు కొనుగోలు చేసినవారు ఆ షేర్ల మొత్తముల నతి త్వరితముగ చెల్లించవలయును. అట్లు చేసినచో ఆ స్టోర్లు రిజిష్టరు చేయించెడి కార్యక్రమము సాగించుటకు వీలగును.

మూడవ విషయము. క్రితముసారి మూడునాలుగు రాష్ట్ర సంఘములు తమ సభ్యుల సంఖ్యను పెంచుటకు ప్రయత్నముకూడ చేసిరి. కొన్ని సంఘములలో మెంబరుల సంఖ్య పెరిగినదని కూడ తెలిసినది. సభ్యత్వపు సాలు సరి చందా రూ 5/- నుండి రూ 3/- చేయబడినది' ఈ మొత్తములు వసూలు చేయుటలో ఉద్దేశ్యమేమనగా రాష్ట్రములోనే స్థలములోని సత్సంఘులైనను క్రొత్త స్టోర్సును తెరచుటకు కాని ఉన్న స్టోర్సును కంపెనీ క్రింద మార్చుటకు గాని తగినంత ధనవంతులు కానియెడల మనరాష్ట్ర సంఘములట్టి పరిస్థితిలో వారికి ధన సహాయము చేయవలయుననియే. కావున మీ అందరును రాష్ట్ర సంఘములలో సభ్యులుగా జేరుట అత్యంతావశ్యకము.

నాల్గవది. డిసెంబరు 21వ తేదీన వస్తు ప్రదర్శనశాల ఉద్ఘాటన చేయబడినది. ఈ యేడు వస్తు ప్రదర్శనములో గత సంవత్సరములకన్న సామగ్రిని ఎక్కువ శ్రేష్ఠమైన రకమును, అధిక పరిమాణములోను పెట్టిరి. ఈ సారి ఇచ్చుటకు దయచేసిన పెద్దలు మీ రందరికిని నేను చేసికొను మనవి యేమనగా - నేను తిరిగి తిరిగి చెప్పుచున్నందున మీరు సాలుసరికి కావలసిన ఆవశ్యకవస్తువుల అంచనా తయారు చేసికొని అందులకై బిజినెస్ సెక్రటరీ గారు మీ కందజేసిన అచ్చుఫారములలో ఆయా స్థలములలో మీకు కావలసిన వివిధవస్తువుల పరిమాణములను నింపి ఆ ఫారములను తిరిగి ఈయవలయును.

మరొక విషయముకూడ నేను మనవి చేసుకొన వలసి యున్నది. ఎన్నియో మాసముల నుండి కొన్ని స్టోర్సులు, కొందరు వ్యక్తులును అమృత సర్ మిల్లునకు సొమ్ములు బాకీపడి యున్నారు. అవి అన్నియు కలసి చాలపెద్ద మొత్తమయి పోవుచున్నది. ప్రస్తుతము సరకుల ధరలు ముఖ్యముగ ప్రత్తి ధర చాల పెరిగిపోయినదని మీ కందరుకును తెలుసునుకదా! ముడిసరుకులు కొనుగోలు చేయుటకై మిల్లుకు డబ్బు చాల అవసరముగ నున్నది. కావున వ్యక్తి గతముగను స్టోర్సుల మీదను బాకీలున్న మొత్తములను మీరందరును ఒకటి రెండు రోజుల లోపున తీర్చి వేయవలయును.



25 డిసెంబరు 1939 రాత్రి సత్సంగములో హుజూరువారిట్లు సెల విచ్చిరి. ఆంగ్లేయుల లెక్క ప్రకార మీ రోజు నొక మహా దినముగ చెప్పు కొందురు. కాని మన సంఘమునకు గొప్ప దినము హుజూరు సాహబ్జీ మహా రాజువారు సభయొక్క సంస్థలు సాలునకు కోటి రూపాయల విలువగల వస్తూ త్పాదన చేయవలయుననెడి మహత్వ పూర్ణమైన సుప్రసిద్ధ తీర్మానమునే నాడు సత్సంగ సభా సమావేశములో పాస్ చేయించిరో ఆ రోజే అని మీరు జ్ఞాపకముంచుకొనుడు. మనకు రెండవ గొప్పదినము పరమ పూజ్యులైన హుజూరువారి యనంతరము ఏనాడు సభ అక్టోబరు నెల సమావేశములో ఈ తీర్మానమును ధృవపరచినదో ఆ దినమై యున్నది. ఈ మహనీయమైన తీర్మానమును హుజూరువారి ఆజ్ఞను పూర్తిచేయు నిమిత్తమై మన సంఘము ఏనాడు ఆచరణ రూపముగ ముందడుగు వేసినదో అదియ మనకు మూడవ మహాదినము. ఆ రోజు కూడ నిశ్లే నిరుడు గడచి పోయినది. ఇప్పుడు నా అభిప్రాయములో ఈ మహత్త్వ పూర్ణమైన తీర్మానమును గురించి తిరిగి ఆలోచించు నిమిత్తమై సభాసమావేశము జరిగించుట కేర్పాటు చేసిన 28వ తేదీని మన కన్నింటి కన్న గొప్పదినము రాబోవుచున్నది. ఇక రెండురోజులు గడువున్నది. ఈ రెండు రోజులలోను, మన ఇండస్ట్రియల్ ప్రోగ్రామును మనము పూర్తి చేసుకొను నిమిత్తము, మరింత వేగముగ ముందంజ వేయుటయా లేదా, లేక కేవలము నీ ప్రస్తుత మందగతిలోనే దానిని పోనిచ్చుటయా? లేక అట్లునుగాక మీరందరు బెదిరి వెనుకతోవ పట్టెదరా? అనెడి ఈ అత్యంతావశ్యక విషయములను మీరందరును మీ బాధ్యతను గమనించు కొనుచు గంభీరముగ విమర్శించుకొని తేల్చుకొనవలసియున్నది. నేను ఈ విషయములను గురించి మూడు నాలుగు రోజులనుండి మీకు గట్టిగ చెప్పుచున్నాను. అంచనా వేసి మీరు నింపుటకై మీకిచ్చిన అచ్చుఫారములలో మీ అంచనాల ప్రకారము మీకుకావసిన వస్తువుల పరిమాణములను నిర్దిష్టస్థలములలో పూరించి వానిని మీ ప్రావిన్షియల్ అసోసియేషన్ల కార్యకర్తలకు ఈ రోజుననే ఇచ్చివేసినయెడల వానినన్నిటిని వారు జతపరచి సభ వారికి చూపించి, మీరందరు పరిపూర్ణ బాధ్యతవహించి పనిచేయుట కిష్టపడుచుండిరో లేదోనను విషయము ఇపుడు జరుగబోవు ప్రావిన్షియల్ అసోసియేషన్ల సమావేశములలో తెలియపరచగలరు. మీరందరు నీ కార్యభారము

నంతను ఒకరిద్దరు లేక నలుగురి నెత్తిమీదనే పడవైచి తక్కినవారు తప్పించుకొన చూచినయడల ప్రయోజనము లేదు. ఈ మహత్వపూర్ణ కార్యమును తప్పక సాగించవలెననియు అందు సాఫల్యముపొందవలెననియు మీకున్నయడల మీరందరు దృఢనిశ్చయము చేసికొని సంఘములోని ప్రతివ్యక్తియు నిందు పాల్గొనవలసియున్నది. మీరట్లు అవిచలితమైన దృఢనిశ్చయముతో ప్రవర్తించనియడల కార్యసిద్ధి కలుగుట దుష్కరము. పిరికితనము, నిరుత్సాహము, మనశ్చాంచల్యమునుండిన యడల లోకములో ఏ కార్యము సిద్ధించనేరదు. మహాఘనకార్యములను సాధించుటకు అత్యధికమైన ఉత్సాహసాహసములు దృఢసంకల్పము నత్యావశ్యకము. మీరివ్విధమైన దృఢసంకల్పముతోను ఉత్సాహముతోను సేవాభావముతోను పనిచేయుచు ప్రోగ్రామును పూర్తి చేయుటకై ముందంజవేయుచుండిన యడల హుజూరు రాధాస్వామీ దయాళురు మీ మీద నెట్టి దయాకటాక్షములు ప్రసరించెదరో మీకే అనుభవరూపముగ తెలియగలదు. కాని ముందుగ దృఢనిశ్చయముతో పాటుపడి పనిచేయుట మీ కర్తవ్యమై యున్నది.

- -
- - - -

28 డిశంబరు 1939—ఈ నాడు రాత్రియంతయు సత్సంగము జరిగినది. సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి—

గురు సమ కోఈ హితకారీ నాహీం ॥

(ప్రేమబానీ-భాగ 3 బచన 13, శబ్ద 6)

ఈ శబ్దము నాధారము చేసి హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. అసలు విషయమేమనగా ఈశబ్దము రచించిన సమయములోగల పరిస్థితి మనకిపుడు లేదు. ఆ సమయమున గురుమహారాజువారు దేహస్వరూపములో నుండిరి, అందుచే వారు ఈశబ్దము నా పరిస్థితిలో వ్రాసిరి. ఆ పరిస్థితి ఇపుడు ఉండియున్నయడల అందుమూలమున పనిసాగిపోయి యుండెడిది. ఆ పరిస్థితి ఇపుడు లేనందున మనమా శుభ పరిణామము నెట్లు సాధించ గలమనెడి ప్రశ్న పొడముచున్నది. హుజూరు సాహబ్జీ మహారాజువారు మనకొక ప్రణాళికను నిర్ణయించి మనదృష్టికి కానరాకుండ నంతర్హితమైపోయిరి. కావున ఈ శబ్దము వలన లాభమునొందగోరిన యడల మన మా దయాళుని మన మధ్యకురమ్మని జీరవలయును. కాని వారిని బిలచి మనమధ్యకు వచ్చునట్లు చేసుకొనగల్గుటకు

నా అభిప్రాయములో నొకటే ఉపాయమున్నది. అది యేమనగా మనము వారి ప్రోగ్రామును పూర్తిగ నెరవేర్చి ఆయినను చూపవలయును. లేదా అట్లు నెరవేర్చుటకై అందరును కలసి తదేక దీక్షతో పాటు పడినట్లైనను చూపవలయును. అపుడు మీలో నెవరెవరు వారియాజ్ఞా పాలన నిమిత్తమై కష్టపడి పనిచేయుచున్నారో వారికి తెలియగలదు.

మద్రాసులో నుండగ హుజూరు సాహబ్జీ మహారాజువారు మనలను విడచి రాత్రి సుమారు 8-30 గంటలకు వెడలిపోయిరని మీకు తెలుసును కదా ! ఇప్పుడు 7-30 గంటలైనది. ఇంక నొక గంట వ్యవధి యున్నది. 8-30 గంటలకు వారు సత్సంగములోనికి బహుశ దయచేసి వచ్చినను రావచ్చును. కావున మీ రందరును 8-00 గంట లగుసరికే గట్టిగా నడుము కట్టుకొని ఈ కార్యక్రమము విషయములో పనిచేయుటకు సంసిద్ధులై యుండ వలెను. ఈ ప్రోగ్రాములో పాల్గొనుట కిష్టము లేని పిరికిపంద ఎవరైన నున్నచో అతడు చేయి యెత్తవలయును. అట్టి వానిని మేము మహా శూరు డని చెప్పగలము. ఏలనన అతడు తన పిరికితనమును మహా శౌర్యముతో అందరి నెదుట ప్రకటించు సాహసమును చూపు చున్నాడు.

## 2

డిశంబరు 1939 – ఇట్లు సెలవిచ్చిరి. ఇపుడు భండారా పూర్తియైనది. ఈ భండారా సంతోషములో పడి మీరు అసలు ప్రోగ్రామునే మరచిపో రాదు. దయాల్బాగులోని స్వార్థ సంస్థలను గురించి వ్రాసిన వచనము నిప్పుడే కదా చదివిరి. దానిని బట్టి సత్సంగములో స్వార్థ సంస్థలు ఏ యుద్దేశ్యముతో స్థాపించబడినవో మీకు బోధపడి యుండవలయును ఇప్పుడు ఆ సంస్థల నభి వృద్ధి చేయుచుంటి మనగా ఆ కార్యక్రమ మంతెయు కూడ అదే యుద్దేశ్య మును పూర్తిచేయు నిమిత్తమే చేయుచుంటిమని మీరు పూర్తిగ విశ్వసించ వలయును. మరి యిప్పుడు జరిపించుచున్న ఇడస్ట్రియల్ ప్రోగ్రాము పూర్తిగ హుజూరు సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞ ప్రకారము, దివ్యేచ్ఛ ప్రకారమే జరుపబడుచున్న దనుట నిజమే యైనపుడు ఆ ప్రోగ్రామును మీ యెదుట పెట్టినతోడనే మీరు సంకోచించెదరేల ? నే నడిగెడిది మన అమృత సర్ మిల్లులో మీరేల పేర్లు కొనుగోలు చేయుట లేదనియే.

మీకు నేను గట్టిగ నొక్కి చెప్పదలచిన రెండవ విషయము లిమిటెడ్ కంపెనీ ష్టోర్సుల గురించి. దీనిలో షేర్లు మీరు కొనవలయును. మీకు ఈ విషయములో నేమైన తెలిసికొనవలసిన కఠిన విషయము లున్నయెడల వానిని రేపు జరుగబోవు జనరల్ మీటింగులో తేల్చుకొనవచ్చును. ఈ విషయము మీ కందరకును మాటి మాటికి రెట్టించి చెప్పుచుండుట వలన నాకు గొంతుక పోయినది. అయినను ఈ విషయము అంత ఎక్కువ ఆవశ్యకమైనదియు భవిష్య కాలములో మహా లాభదాదాయకమైనదియు నగుటవలన నేనట్లు రెట్టించకుండ నుండలేకపోయితిని. ఏలనన గొంతుక పోయినను తిరిగి బాగుపరచుకొనవచ్చును కాని నేను చప్పుమని ఊరకుండిన యెడల నీ విషయము అసలే చతికలపడిపోవును.

ఇంతకన్న నెక్కువ ముఖ్యమైన విషయము ఏమనగా మీలోనే ఏ యే పెద్దమనుష్యులు కాని, లేక ష్టోర్సులు కాని దయాల్బాగునకు అమృతసర్ మిల్లునకును సొమ్ములు బాకీపడియున్నారో వారా మొత్తములన్నీ సమయములో వెంటనే చెల్లించవలయును. మీ కందచేసిన అచ్చు ఫారముల నన్నిటిని మీ రీపాటికి బహుశ నింపియే యుందురు. అట్లు చేయనిచో ఇచట నుండి 10-00 గంటలకు లేచివెళ్ళిన పిదప మీకు అట్లు నింపుటకు కావలసినంత సావకాశమున్నది. ఆ సమయములో నీ పనిని పూర్తి చేయుడు. ఈ ఫారములను రేపు దాఖలు చేయుట అత్యంతము నావశ్యకము. దయయుంచి మీరీ విషయము గుర్తుపెట్టుకొనుడు. భక్త సోదరలకు కూడ నేనీ విషయమునే నివేదన చేసికొనుచున్నాను. వారు కూడ అమృతసర్ మిల్లులో షేర్లు కొన్నారు. సామగ్రియు కొనుగోలు చేసియున్నారు. కావున వారు కూడ బాకీలు చెల్లించవలసియున్నారు. వారు కూడ ఆ బాకీ మొత్తములను త్వరలో చెల్లించవలసి యున్నది. మీ రందరును "ఉధార్" ఉద్ధారము కొరకు అభిలాష పెట్టుకొనుట నిస్సందేహముగ మంచి విషయమే కాని కార్ఖానాల మేనేజర్లను కార్యకర్తలను ఉధార్ "అప్పు" ఇవ్వమని బలవంతము చేయవలదు. మీరు నగదువ్యాపారమునే చేయవలయును. అనగా ఒక చేతితో సామగ్రి తీసుకొని రెండవ చేతితో దాని ఖరీదు వెంటనే కట్టివేసి మూడవ చేతితో ఉద్ధారమును సేకరించవలయును. మీరు మీ అకౌంట్లలో బాకీ లేకుండ నుండునట్లు చేసుకొనవలయును. మీతో నేను వ్యాపారసరళిగవ్యవహరించుచున్నాను. మీరు నట్లే నడుచుకొనవలయును, అందువలననే మీకు లాభము కలుగును.

హుజూర్ సర్కార్ సాహబ్ వారు శరీరము విడిచి వెడలిపోయినపుడు వారు తమ ఆజ్ఞను సత్సంగులు మన్నించనందు వలననే వెడలిపోయితి మని హుజూర్ సాహబ్జీ మహారాజువారి ద్వారా సత్సంగమందలి అందరికిని కబురు పంపిరను విషయము మీకు జ్ఞాపక ముండియుండును. అందుపైన హుజూర్ సాహబ్జీ మహారాజువారు సత్సంగుల కిపుడు తమ తప్పులు బోధపడి వారందరు హృదయ పూర్వకముగ పశ్చాత్తాపముతో పరితపించుచు హుజూర్ వారిని క్షమాపణ చేయుడని ప్రార్థించు చుంటిరని చెప్పుచు సర్కార్ సాహబ్ వారి చరణములందు ప్రార్థన చేసిరి. అపుడు సర్కార్ సాహబ్ వారు ఆ మాట యథార్థముగ నిజమే అయిన యెడల, తాము తిరిగివచ్చి సంఘ సంరక్షణ చేయుటకు సంసిద్ధులమై యున్నామని సెల విచ్చిరి కదా. ఆ విషయమే ఇప్పుడుకూడా వర్తించును. హుజూర్ సాహబ్జీ మహారాజువారు గుప్తము కాక ముందు వారు మనకొక ప్రణాళికను తయారుచేసి యిచ్చిరి. మనమా ప్రణాళికను త్వరలో పూర్తిగ నెరవేర్చి చూపవలసి యున్నది. మీరట్లు వాగ్దానము చేసినయెడల వైస్ ప్రెసిడెంటు గారును ఆ వాగ్దానమును హుజూర్ సాహబ్జీ మహారాజువారి చరణములకు అందజేయగలరు. అపుడు హుజూర్ సర్కార్ సాహబ్ వారు సెలవిచ్చిన విధముగనే మన యీ ప్రస్తుత కార్యక్రమమునకు కూడ ఫలితము గ్రల్గును. సత్సంగులు ఇకముందునుంచి సరిగ ప్రవర్తించెదమని ప్రతిన చేసిన యెడల హుజూర్ సర్కార్ సాహబ్ వారు తిరిగి మనమధ్యకు వచ్చియుందుమని సెలవిచ్చిరి. అటులనే మనము హుజూర్ సాహబ్జీ మహారాజువారి కభిమతమైన ప్రణాళికను వారి యిష్ట ప్రకారము పూర్తిగ నెరవేర్చిన యెడల ఇప్పుడు కూడ నట్టిఫలితమే లభింపగలదు. ఈ కారణముననే నేను మిమ్ములనీ పనులు పూర్తిచేయుటకై ఇంత గట్టిగా నొక్కి రెట్టించి ప్రోత్సహించు చున్నాను.

ఆఖరున హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి.

ముశ్కిలే నీస్తకి ఆసాన శవదే
మర్ద బాయద్ కి హరాసా న శవద్.

అనగా, పట్టుదలతో ప్రయత్నించినచో సాధించ శక్యముకాని కృత్య మెద్దియును లేదు. ఎట్టి పరిస్థితి కల్గినను నిరాశ చెందకుండు మానవుడే పురుషుడు,

౫

31 డిసెంబరు 1939- ఇట్లు సెలవిచ్చిరి.- సత్సంగ సోదరీ సోదరులకును సత్సంగ సంఘమంతకును గూడ ఈ నాటితో వారి జీవితములో నొక వర్షము గతించిపోవును. క్రొత్త సంవత్సరము ఇంక మూడు నాలుగు గంటలలో ప్రారంభము కాగలదు. కావున మన మిపుడు మిగిలియున్న కాలములో మనసంఘము ఈ సంవత్సరారంభములో నెట్టి పరిస్థితిలో నుండెనో ఇప్పుడు నట్లే యుండిపోయినదా, అంతకన్న కూడ వెనుకబడి పోయినదా, లేక యేమైన ముందంజ వేయగలిగెనా యను విషయమును పరిశీలించుకొన వల యును. ఈ విషయమును గురించి మీరు చాల గంభీరముగ నాలోచించ వలసియున్నది. ఇంతవరకునట్టి సింహావలోకనమును మీరు చేసుకొని యుండ నిచో, నిప్పుడైనను అట్లుచేసికొనుటకు సాలు సమాప్తమగు లోపున మూడు నాలుగు గంటల కాలము వ్యవధి మీకు ఉన్నది. మీరు భోజనము చేయక ముందే యీ విషయమును తేల్చుకొనుట మంచిది. భోజనానంతరము అయితే మీరు మరచిపోవచ్చును. ప్రతి వ్యక్తియు తన ప్రవర్తన గత సంవత్సరములో నెట్లుండెనను విషయము గురించి సింహావలోకనము చేసి కొనవలసియున్నది. వ్యక్తి కానిండు, సంఘము కానిండు ఇరువురును గూడ తమ పూర్వ కృత్యములను పరిశీలించుకొని తామెంతవరకు సరిగ ప్రవర్తిం చిరో చూచుకొనవలయును. అట్టి పరిశీలన నిమిత్తమై నేను నాలుగు కొల బద్దల రూపమైన సలహాలను వారికి చెప్పెదను. మీరు ఆ మానదండముల ననుసరించి మీ కృత్యములను పరిశీలించుకొని నిర్ణయమునకు రావలయును.

(1) మీకు హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రీతి ప్రతీతులు వృద్ధియైనవా, లేదా? అనగా మీకు రాధాస్వామీ దయాళుని సాన్నిధ్యము ఇతః పూర్వము కన్న ఎక్కుడుగ అనుభవములో తెలియుచున్నదా, లేదా?

(2) మీరు మీ స్థానములో సత్సంగమును సంగఠన చేయు నిమిత్తమై ఆచరణ రూపముగ నేమైన చేసితిరా, లేదా? ఆ వైపు ధృఢమైన ముందంజ వేసితిరా, లేదా?

(3) మీరు మీ సంఘ క్షేమమునకై సేవచేయు చుంటిరా, లేదా? మీ సంఘమునకు సహాయము చేకూరి శక్తిని గలిగించి పురోభివృద్ధి కలుగు లాగున మీరేమైనను సేవ చేసితిరా?

(4) మీ బంధు మిత్రుల సుఖశాంతుల నిమిత్తమై మీరేమైన సేవ చేయుచుండిరా, లేదా?

హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రేమ ప్రీతులు మీకీ సంవత్సరములో వృద్ధియై మీరు వారికి సేవచేసి యుండినను, లేక సంఘమునకు సత్సంగమునకును మీరేమైన లాభము కలిగించినను, లేక సత్సంగము యొక్క సంగఠన ధృఢతరము చేయుటకై మీరేమైన ప్రయత్నించి మీ బంధు మిత్రులకు సుఖము గల్గించినను హుజూరు రాధాస్వామీ దయాళుని దయా రక్షకహస్తము మీ శిరములపైన నున్నట్లు నేను నమ్మకముగ జెప్పగలను. ఈ విషయములలో నెందైన లోపము కనిపించిన యెడల మనము అందరము అపమార్గముననే పోవుచుంటిమి. మనమట్లు అపమార్గమున బోవుట నిజమైన యెడల ఈ రాత్రి పండ్రెండు గంటల లోపునగాని లేక ఆ పిదప వెంటనే కాని సరియైన మార్గమునకు మనము మారిపోవలసి యుండును. మీ తప్పు మీకు బోధపడిన వెంటనే మీరు మరొక సవ్య మార్గము నన్వేషించుకొన వలెను. ఒక అన్వేషణచేయుట మాత్రమే చాలదు. రెండున్నర సంవత్సరములు ఇంతవరకు అన్వేషణలోనే గడచిపోయినది. ఇంక నెక్కువ కాలము చల్లగ కూర్చుండి పోవుట యుక్తము కాదు.

— 4 :

13 ఫిబ్రవరి 1940. ఈనాడు వసంత పంచమీ శుభదినము. ప్రాతఃకాల సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి. హుజూరు స్వామీజీ మహారాజువారు 1861వ సంవత్సరములో ఈ రోజుననే రాధాస్వామీ మతము యొక్క మూల బంధము స్థాపించి సర్వజన సామాన్యమైన సత్సంగమును జారీ

చేయించు దివ్యేచ్ఛను ధరించిరి. వారు ఆ విధముగ మీరొక్కరి నిమిత్త మైయే కాక సమస్త జగత్తునకు, ఇప్పుడు చదివిన శబ్దములో చెప్పినట్లు, జన్మమరణ చక్రము నాశనము చేయు నిమిత్తమై ప్రబంధము చేసిరి. వివిధ సమయములందు సత్సంగులు సత్సంగములో జేరుచు, అటుపిమ్మట వారు జరిగించిన కార్య కలాపము యొక్కయు, వారి యెడల రాధాస్వామీ దయాళుని వివిధ స్వరూపములు దయా కటాక్షములు చూపి భిన్న భిన్న సమయములలో వారి కనుగ్రహించిన ప్రేమ ప్రీతుల వరదానముల యొక్కయు, మొత్తము ప్రభావమును శుభ పరిణామమును ఇప్పుడు మీ యొక్కయు, ఇతర సత్సంగుల యొక్కయు పరిస్థితులను, ముఖ వైఖరిని చూచిన స్పష్ట మగుచున్నది. ఇంతవరకు జరిగిన కార్యక్రమ మంతయు నెట్లు పూర్తిగ నిర్దుష్టముగ నుండెనో ముందుకూడ నట్లే నిర్దుష్టముగ నుండ గలదని చెప్పుటకు సందియము ఎంతమాత్రము లేదనుటలో మీరందరు నాతో నేకీ భవింతురని నమ్ముచున్నాను.

పిమ్మట నీ క్రింది శబ్దము చదువబడినది.

జో జబాఀ యారీ కరే ఖుల కర సునా।
ఆజ దిల కోఇ రాగ బజమేఀ యార కా॥

(ప్రేమబిలాస. శబ్ద 110)

ఈ శబ్దముపైన పూజ్యులగు హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఇపుడు చదివిన శబ్దములో నిజమైన భక్తుల స్థితిని వర్ణించుచు భక్తుల పంథా ప్రపంచమున కతీతముగ నుండునని చెప్పబడినది. సత్సంగులు గత 79 సంవత్సరములలోను తమ ప్రవర్తనను జీవిత విధానమును ఈ శబ్దములో చెప్పిన ప్రకారముగనే సాగించిరి. వారి నడవడి కూడ ప్రాపంచిక జీవుల నడవడికన్న పూర్తిగ అతీతమై యుండెను. ప్రేమీ సోదరీ సోదరులైన మీరందరును హుజూరు సాహబ్జి మహారాజు వారు నిర్మించిన సత్సంగమనెడి దివ్య శోభాయమాన భవనమునకు మహా స్తంభములుగ నున్నారు. మీరు అన్ని పనులను మీ కర్తవ్య బాధ్యతలను మనసున నుంచుకొని చేయుచుండ వలయును. ఏదైన ఒక్క స్తంభము మాత్రమే బలహీనమై పోయినను సమస్త భవనమునకు ప్రమాదము వాటిల్లగలదను విషయము మీరు జ్ఞాపక ముంచుకొనవలయును. రాధాస్వామీ దయాళురు మన సంఘమును లోక

కళ్యాణము కొరకును లోకసేవ కొరకును ఎన్నుకొనిరని హుజూరు సాహబ్జి మహారాజువారు సెలవిచ్చిరి. మీకు ఈ మహాసేవ సఫలముగ నెరవేర్చి అవ్విధముగ ఆదాతా దయాళుని ఆజ్ఞాపాలనము చేయవలయునను అభిలాష యున్నచో మీరు సంపూర్ణముగ కష్టపడి ప్రయత్నించ వలయును. మీ కర్తవ్యములను పాలించకుండ నుండినచో లోక కల్యాణార్థమైన కార్యక్రమము తానంతట నదియ సాగిపోవుట అసంభవము. కావున ఈ కార్యసిద్ధికై మీలో ప్రతివ్యక్తియును పూర్ణప్రయత్నము చేయవలసి యున్నది.

## 5

వసంత పంచమినాడు రాత్రి సత్సంగములో చదివిన శబ్దము యొక్క ప్రథమ చరణ మీ క్రింది విధముగ నున్నది.

బచన గురు మనువా౦ లో ఆజ మానా।

(ప్రేమబానీ బాగ2 బచన॥ (2) శబ్ద 16)

పరమ పూజ్యులైన హుజూరు వారు ఈ శబ్దమును గురించి ఇట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములో "నిజ బచన్" అను పదము ప్రయోగించబడినది. అనగా మనకు భగవంతుని యందు పరిపూర్ణ విశ్వాస ముండవలె ననియు మనమెప్పుడు వారి మీదనే ఆధారపడి యుండవలెననియు దీని భావము. మనకే కృత్యమును గాని సేవనుగాని చేయుటకు ఆదేశము వచ్చినను మన మేపని చేసినను అదంతయు భగవంతుని యందు పూర్ణ విశ్వాసము పెట్టుకొని చేయవలయును. పని చేసిన పిమ్మట దాని ఫలితమును భగవంతుని దివ్యేచ్ఛ పైన విడిచి పెట్టవలయును.

ఇట్లు సెలవిచ్చిరి— మనమీ పవిత్ర వసంత పంచమినాడు రాత్రి హుజూరు సాహబ్జీ మహారాజువారును సత్సంగములోని కార్యకలాపమును నిస్సంశయముగ కనిపెట్టుచున్నారనెడి విశ్వాసముతో శబ్దములను ఎన్నియో సార్లు దివ్యేచ్ఛకు తీయించితిమి. ఆ శబ్దములన్నియు బహు సమయానుకూలముగ పరిస్థితుల కనుగుణముగను వచ్చినవి. అందువలన మన కార్య క్రమములో ఆ దయాళురు యథా ప్రకారము పాల్గొనుచున్నారనెడి మహా ధైర్యము బలమును మనకు చేకూరుచున్నవి. రెండు విషయములను మీరు జ్ఞాపకముంచు కొనవలయును. మీరు భగవంతుని యందు సంపూర్ణ

విశ్వాసము కలిగి వారి శరణ్యమును అనన్యాధారముగ చేసికొనియు ఇంతకు పూర్వము ఏ పనినైన చేసియుండినచో ఆ పని చేయు సమయములో ఏదైన సహాయము కాని విశేషదయాకటాక్షానుభవముకాని మీ కా దయాళుని వైపు నుండి లభించియున్న యెడల అది ఈ విషయమునే ఋజువు చేయు చున్నదని మీరు గ్రహించుకొని ఇక ముందు కూడ మీరు అదే పద్ధతిని నడచుకొని వారి దయా కటాక్షములను సంపాదించుకొనుడు. ఇంత వరకు నట్టి యనుభవము మీకు కలుగనియెడల ఇక ముందైన అవ్విధముగ ప్రవర్తించుడు. మీకీ విషయముల వాస్తవికత మహా కఠిన సమయము వచ్చినపుడు బోధ పడగలదు. మీకెట్టి సహాయము పై నుండి లేకుండ నున్న మహా కష్ట సమయము వచ్చినపుడే ఈ చిట్కా (నుస్ఖా) మీకు కార్య సాధక మైనటుల తెలియగలదు.

## 3

వసంత పంచమి రాత్రి శబ్ద పఠనమైన పిదప హుజూరువారు సంఘము వైపునకు తిరిగి ఇట్లు సెలవిచ్చిరి. సత్సంగులవద్ద నుండి నాకు వచ్చుచున్న ఉత్తరములలో వారు ఈ క్రింది నాలుగు విషయములను గురించియే వ్రాయు చున్నారు. 1. కొన్ని పత్రములలో సంతానము కొరకై విన్నపములు చేసికొను చున్నారు. 2. కొన్ని పత్రములలో తమ అనారోగ్యమును రుగ్మతి లను గురించి చెప్పుకొనుచు వానిని పోగొట్టవలయు ననెడి ప్రార్థనలున్నవి. 3. కొన్ని పత్రములలో కోర్టు వ్యాజ్యములు తమ పక్షము తీర్మానము కావలయునను ప్రార్థనలున్నవి. 4. కొన్ని పత్రములలో సత్సంగులు తమ నిరుద్యోగ పరిస్థితిని నిరుపాధ్యవస్థను చెప్పుకొనుచు తమకు నౌకరీ ఇప్పించ వలయునని ప్రార్థించు చున్నారు.

అన్ని పత్రములలోను ఇవ్విధములైన కష్టములను బాధలను గురించి మొదట వ్రాసుకొనుచు చివరన తమకీ చింతలు కష్టములు నుండుటచే స్మరణ ధ్యానములు సాగుటలేదని వ్రాయుచున్నారు. కొందరు ఈ మధ్య జనవరి నెలలో తమకింట నుండి పని చేయుటకు వీలుగ నుండు గృహ పరి శ్రమలను వేనినైన జారీ చేయించ వలెనని కోరుచు వ్రాసుకొన్న ఉత్తర ములు కూడ వచ్చినవి. సత్సంగులు తమకు స్మరణ ధ్యానములు చేయ సాధ్యము కాకుండెనని చెప్పుకొను ఫిర్యాదులును అందులకు హేతుభూతమైన

ట్లుగ చెప్పుకొన్న విషయములును యథార్థ మైనచో ఈ వసంత పంచమీ పవిత్రదినమున సంఘ మందరును హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు, ఆ దయాళురు సత్సంగుల ఈ చింతా వ్యాకుల పరిస్థితులను తొలగించు లాగున దివ్యేచ్ఛ ధరించవలయునని ప్రార్థన చేయవలయునని నా అభిప్రాయము అనగా ఆ దయాళురు సంతానము కోరు సత్సంగులకు సంతానమును, ఆరోగ్యము నిరామయత్వమును గోరు వారికి ఆరోగ్య నిరామయత్వములను జీవికోపాధి కోరు వారికి అందుకు తగిన సౌకర్యములను కోర్టు వ్యాజ్యములలో జయమును కోరువారికి అట్టిజయమును కలిగించి వారి సమస్త విధములైన చింతలను అవ్విధముగ తొలగించి భగవంతుని భక్తిని స్మరణ ధ్యానములను చేసికొనుటకు సావకాశము కల్పించవలయునని మనము ప్రార్థన చేయవలసి యున్నది. మీరందరును కలసి తీర్మానించుకొని ఈ బాధలను చింతలను పోగొట్టవలయుననెడి విన్నపమును ఆ దయాళుని చరణముల యొద్దకు పంపుకొనవలయును. మానవు డీ ప్రపంచమున ఇహ పరములయొక్క ఆనందములు రెండును పొందు నిమిత్తమైయే పుట్టెనని హుజూరు సాహబ్జీ మహారాజువారు దీవన దునియా నాటకములో వ్రాసిరి. ఆ దయాళురు అనేక పర్యాయములు, భగవంతుడు సత్సంగులు ఈ విధ మైన ఆనందమును పొందుచు తమ జీవితమును సఫలము చేసికొనవలయునను తలంపుతో సత్సంగులకు ఒక చేతిలో స్వార్థమనెడి లడ్డును, రెండవ చేతిలో పరమార్థమనెడి లడ్డునుపెట్ట గోరుచున్నాడని సత్సంగములో సెలవిచ్చి యున్నారు. హుజూరు సాహబ్జీ మహారాజువారట్లు సెలవిచ్చినపుడు సత్సంగు లకు పరమార్థ దానముతో బాటు స్వార్థదానము గూడ నేల నివ్వకూడదు. జగత్పదార్థములందు బంధనము పెట్టుకొని లిప్తము కాకూడదనుట సరియే. ప్రాపంచిక పదార్థముల యందు లిప్తుగుట కాని వాని విషయములో బంధ నము పెట్టుకొనుట కాని దూష్యమే అయినను అంతర్దృష్టి మేల్కాంచియుండి గురు మహారాజువారి దయాహస్తము శిరమున నున్నప్పుడు సంత్సంగులకు స్వార్థ సౌకర్యములు విరివిగ లభించినను వారు వాని దుష్ప్రభావమునుండి సురక్షితులు కాగలరు. కావున నీ తీర్మానమును మీరందరును ఈ రోజున ఏక గ్రీవముగ నామోదించి హుజూరువారి చరణముల యొద్దకు పంపుకొనుట సరిగనుండును. సత్సంగులందరితో బాటు నేను గూడ హుజూరు రాధాస్వామీ దయాళుని చరణముల యొద్దకు ఆ దాతా దయాళురు ఈ చతుర్విధ కష్టక్లేశ ములనుండియు సత్సంగులను కాపాడి వారికి సహాయము చేయవలయునని

ప్రార్థన పంపుకొందును. ఈ వరదానము లభించినచో ఉత్తరములలో మరల నిట్టి ఫిర్యాదులు రానేరవు. అప్పుడుకూడ సత్సంగులు స్మరణచేసి కొనకుండనే ఉన్న యెడల పట్టుపడి పోవుదురు. హుజూరు సాహబ్జీ మహారాజువారు దీనవ దునియా నాటకమును ఒక పెద్ద మహాశయము లేకుండనే వ్రాయలేదు. ఆ నాటకము నే నిపుడు మీ యెదుట పెట్టిన విషయమునే సమర్థించుచున్నది, కావున నీ ప్రార్థనను మన మీ పవిత్ర వసంత పంచమీ శుభ దినమున వారి చరణముల యొద్ద చేసికొందము. అట్లు చేయుట అయుక్తమైన యడల దానికి శిక్షను నే ననుభవించెదను. అది యుక్తమైనచో సత్సంగు లందరును దాని ఫలితమును పొందుదురుగాక! ఈ క్రిందిశబ్దము దివ్యేచ్ఛచే తీయ బడినది.

గురు ప్యారే కీ దమ దమ శుకర గుజార ।

(ప్రేమబానీ భాగ 3 బచన 12 (2) శబ్ద 73)

శబ్దము చదివిన పిమ్మట దేదీప్యమాన స్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. చూడుడు, వైస్ ప్రెసిడెంట్‌గారు ఈ మీ తీర్మానమును హుజూరువారి చరణముల యొద్ద పెట్టిరి. ఈ చతుర్విధ క్లేశములను గురించియు ఆ దయాళుని కెరుక లేనట్లు సూచించెడి పదమొక్కటి కూడ ఈ శబ్దమున కానరాదు. కావున మీరు ఈ క్లేశముల విషయములో మీకిక ముందు సహాయము చేకూరగలదనెడి ఆశాభావముతో నుండ వచ్చును. ఇదంతయు చెప్పుటలో ఆ దయాళురు మీకు ప్రేమ ప్రీతుల వరదానమును ఇవ్వకుండ నుండవలయునని నా అభిప్రాయము కాదు. మీకు హుజూరు వారు ప్రేమ ప్రీతుల వరదానమును ఒక చేతనుంచి రెండవ చేతిలో ప్రాపంచిక సుఖశాంతులు సౌకర్యములు ననెడి వరదానమును పెట్టవలయు ననియు, అయినను మీ రావిధముగ సౌకర్యములను పొంది వాని ఆనందము ననుభవించుచుకూడ భగవచ్చరణముల ధ్యానమును మీరు నిరంతరము చేసి కొనుచు వారి చరణములకు ధన్యవాదముల నర్పించు చుండవలయు ననియే నా ఉద్దేశము.

# 7

రాత్రి వివాహము లైన పిదప వధూవరులు పెండ్లి వారివైపునకును తిరిగి హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. "కొంత మందికి వివాహానంతరము పరిస్థితులు కటువుగ పరిణమించు చుండును. కావున మీరిప్పటి నుండియు మీ వివాహానంతరము మీ జీవితము సుఖప్రదముగను శాంతియుతముగ నుండునట్లు జేయు కార్యక్రమమునే ఆచరించ వలయును. ఈ సందర్భములో మీకు ఐదు ప్రధాన విషయముల గురించి చెప్పగోరుచున్నాను.

1. మీ వివాహము సత్సంగములో జరిగినందున మీరు రాధాస్వామీ దయాళుని నెల్లప్పుడు జ్ఞాపక ముంచుకొనుచు వారిని సర్వసాక్షియని తెలిసికొని సత్సంగ సేవ చేయుచు సత్సంగ ధర్మమును పాలించుచు నుండుట మీ ముఖ్య కర్తవ్యమని మీరు జ్ఞాపకముంచు కొనవలయును. ఇదెన్నడును మరువరాదు. 2. సత్సంగమునకు సంబంధించిన విషయములలో మీరు సత్సంగ సేవ చేయుటకై పరస్పరము తోడ్పడుచుండ వలయునేకాని ఒకరికొకరు ఆటంకము నెన్నడు కలుగజేయ కూడదను విషయమును జ్ఞాపకముంచు కొనవలయును. 3. వివాహ మహోత్సవము జీవితములో నొక్కసారియే జరుగునని మీకు తెలియును కదా! కావున అట్టి శుభావసరమున మీరేదైన నొక శ్రేయస్కరమైన శుభ ప్రతిన మనసున స్థిరము చేసికొని లేదా ఏదైన నొక చెడ్డ అలవాటును పరిత్యజించవలయుననెడి దృఢ నిశ్చయము నైనను చేసికొని ఆ ప్రతిన లేక నిశ్చయమును మనసున దృఢముగ నుంచుకొని హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు దానిని అర్పణచేసి దానిని సఫలముగ ఆచరించుటకు శక్తిని ప్రసాదించవలయునని వారిని ప్రార్థించవలయును. వారు మీకు తప్పక అట్టి శక్తిని అనుగ్రహింతురు. 4. మీకు రోగములు కష్టములును వచ్చినపుడు మీరు పరస్పరము సహాయము చేసికొన వలయును. పెండ్లియైన పిదప నొక్కొక్కప్పుడు ఇరువురి మనసులలోను మతభేదము కలిగినను కలుగవచ్చును. ఒక్కొక్క విషయములో రెండు మనస్సులును కలువక పోవచ్చును. అట్టి వైషమ్యములు ఎప్పుడైనను కలిగినను ప్రమాదము లేదుకాని ఇరువురును సాధ్యమైనంతవరకు సహనశక్తి కలిగి మనోనిగ్రహముతో ప్రవర్తించ వలయును. మీరు ఈ

బోధల ననుసరించి నడచుకొనిన యెడల హుజూరు రాధాస్వామీ దయాళుని దయ మీాయం దుండును. మీారు సర్వవిధముల నభివృద్ధినంది మీా కుటుంబము మీా సంతానము సుఖశాంతులతో నిండి మీా వంశము అభివృద్ధి నొంద గలదు,

# 8

"సత్సంగ్ కే ఉపదేశ్" లోనుండి ఒక వచనము చదివిరి. దానిలోని కొన్ని అంశముల నీక్రింద పొందుపరచు చున్నాము. మానవుని స్వభావము పరివర్తనలలోను మార్పు కలుగవలెనన్నచో అతనికి ప్రపంచము నెడల అసలైన వైరాగ్యమును, భగవచ్చరణము లందు నిజమైన అనురాగమును ఉండుట అత్యావశ్యకము. ఈ వైరాగ్యము అనురాగమును ఉత్తమ సంస్కారముల మూలముననే కలుగును. ఆ సంస్కారములు గురు మహారాజువారి చరణ సన్నిధానమున వారి సత్సంగము చేసికొనినందువలననే ఉత్పన్నమగును. ఇవ్విధముగ సత్సంగి కొన్ని దినములు వారిచరణముల వద్ద నుండి వారి సత్సంగము చేసికొనుచు తనలో ఉత్తమ సంస్కారములు మేల్కొని ఉత్తమ పరివర్తన కలుగుచున్న విషయమును గమనించు కొనవలయును. అట్టి పరివర్తన మతనిలో కలిగినపుడు ప్రపంచములోని జీవులకు సత్సంగ శిక్షణ యందు ఆదర గౌరవములు కలిగి ఈ మతము విశ్వవ్యాప్తము కాగలదు.

ఈ వచనము చదివిన పిమ్మట హుజూరు మెహతాజీ మహరాజు వారిట్లు సెలవిచ్చిరి. బహుశ వసంత పంచమీా రోజున నేను మీాకొక మాట చెప్పి యుంటిని. అదేమనగా మీారు గతించిన 79 ఏండ్లకాలము సత్సంగములో చేరి గురు మహారాజువారి చరణముల యొద్దనుండి వారి వచనములను పవిత్ర గ్రంథములను వినుచున్నందువలన కలిగిన యుత్కృష్ట ప్రభావము మీా ముఖముల మీాదను, హృదయముల మీాదను, ప్రవర్తనలోను నేదైన నొక శుభ పరివర్తము, సాంసారిక జీవులలోకన్న ఉత్తమ విధమైనది, మీాలో కలిగించినదా లేదాయను విషయమును చూచుకొనవలయునని చెప్పి యుంటిని. అట్టి పరివర్తనము కలిగిన యెడల అది గొప్ప పవిత్ర చిహ్నమై మనలో నూతనమైన ఉత్తమ సంస్కారములుత్పన్న మగుచున్నట్లు సూచించును. నే చెప్పిన ఈ మాటను ఇప్పుడు చదివిన వచనము యొక్క

భావార్థముతో సరిపోల్చి చూచుకొనుడు. ఈ రెండింటికి నెంత సామ్య మున్నదో మీ కపుడు గోచరము కాగలదు.

## - ౯ -

"సత్సంగ్ కే ఉపదేశ్ " రెండవ భాగమునుండి "సేవా కీ జరూరత్ " అను శీర్షికగల వచనము చదువబడినది. ఈ వచనము చదివిన పిదప హుజూరు మెహతాజీ మహారాజువా రిట్లు సెలవిచ్చిరి. సత్సంగము సూపర్మేన్ (Supar Man)- అనగా అధి మానవ జాతిని ఉత్పన్నము చేయగలదని హుజూరుసాహబ్జీ మహారాజువారు తరచు సెలవిచ్చు చుండెడివారు. అట్లను టలో వారి అభిప్రాయమేమనగా సత్సంగులకు సత్సంగములో లభించెడి శిక్షా విధానము యొక్క ప్రభావము వలన సత్సంగములో కొంతకాలమైన పిమ్మట తమ స్వార్థపరమార్థములకు సంబంధించిన సమస్త ధర్మములను ఉత్తమ విధమున నెరవేర్చుకొనుచు ప్రస్తుత తరము మానవజాతియొక్క సేవచేయుటయే గాక, రాబోవు తరములవారికి గూడ తగిన ప్రబంధము చేయగల్గునట్టి నూతన జాతి మానవులు తయారు కాగలరనియే. అధి మానవునికి హుజూరు సాహబ్జీ మహారాజు వారు నాలుగు లక్షణము లుండునని సెలవిచ్చు చుండెడివారు— (1) అతనికి బ్రాహ్మణవర్ణ లక్షణములుండవలెను. అనగా భగవంతుని భజన ధ్యానములకై యతడు కొంతసమయము స్వాయముగ వినియోగించుచు ఇతరులకు గూడ పారమార్థిక శిక్షణ నిచ్చుచుండును. (2) క్షత్రియజాతి లక్షణములు కూడ అతనిలో నుండవలయును. అనగా బీదలకు ఆ పద్గ్రస్తులకును రక్షణ సహాయములు చేయుచు, అందునిమిత్తమై ఎట్టి త్యాగమైనను చేయ సంసిద్ధుడై యుండవలయును. (3) వైశ్య వర్ణధర్మములు కూడ అతనికి నుండుట యావశ్యకము. అనగా వాణిజ్యము ద్వారాను పరిశ్రమల మూలము నను అతడు తన సంఘమునకును దేశమునకును సంపదభివృద్ధి గావించుచు ప్రజలకు తన విశ్వాసనీయత ధారాళత్వమునందును నమ్మకము కలుగునట్లు ప్రవర్తించుచు శ్రేష్ఠమైన వస్తుసామగ్రిని అందజేయు చుండవలయును. (4) శూద్ర ధర్మములు కూడ అతనికి ఉండవలయును. అనగా అతని వలన సంఘమున కెట్టి సేవా సౌకర్యములు అవసరమైనను అతడు అన్నియు సంతోష పూర్వకముగ చేయ సంసిద్ధుడై యుండవలయును.

ఇప్పుడు సత్సంగముయొక్క ప్రోగ్రాములో ఈ నాలుగు వర్ణముల కృత్యములును సమ్మిళితమై యున్నవి. అనగా మీకు రోజూ పారమార్థిక కృత్య

ముల నిమిత్తమై ఉదయాస్తమయములు రెండు మూడు గంటల కాలము లభించుచున్నది. విద్యాసంస్థలలోను కార్ఖానాలలోను పనిచేసి మీరు మీ సంఘమునకును, విద్యావిహీనులు నిరుద్యోగులైన బాహ్య ప్రజలకును కూడ విద్య నేర్పుచు పనులను కల్పించి ఆ విధముగ వారికి సహాయములు చేయుచున్నారు. మరియు వస్తూత్పాదన కార్యము నిర్వహించుచు వ్యాపారము వాణిజ్యమును చేయుచు సంఘమునకు ధనము చేకూర్చుచున్నారు. అటులనే ఆపదలు రోగములు వచ్చినపుడు మీరు మీ సోదరులకు సేవచేయుచు సుఖశాంతులు కలుగ జేయుచున్నారు. మొత్తము మీద మన సత్సంగము యొక్క ప్రస్తుత ప్రోగ్రాములో నాలుగు వర్ణముల ధర్మములును చేరియున్నవి. క్రమముగా సత్సంగులు ఈ నాలుగు వర్ణముల లక్షణములను తమలో ఉత్పన్నము చేసికొనుచున్నారు.

ఈ విధముగ సత్సంగులలో నిరాడంబరముగ ఇట్టి శీలము (Character) తానంత నదియే ఉద్భవించుచున్నది. ఇప్పుడు మనము ఈ కృత్యములన్నింటిని మరింత తీవ్రముగను, ఉత్సాహముతోను సాగించుటయే ముఖ్యావసరము. మీరు ఈ లక్షణములను మీ లోను మీ సంతానములోను పట్టుదలపట్టి శ్రద్ధవహించి అధిక పరిమాణములో నుత్పన్నము చేసికొని అభివృద్ధి చేసికొనుటకు గట్టి ప్రయత్నముచేసి వానిని పెంపొందించుకొను నిమిత్తమై ఆవశ్యకమైన ప్రబంధమును సౌకర్యములను కలుగ జేసినయెడల మీ జాతియొక అధిమానవ జాతిగా రూపొందగలదు. ఈ విషయ మీ ప్రకృతి యొక్క సర్వోత్తమ కార్యమును ఒక నూతన సృష్టియు కాగలదు.

## 2్

19 ఫిబ్రవరి 1940 "సత్సంగ కే ఉపదేశ్" నుండి ఒక వచనమును చదివిరి. అందులో ఇంగ్లాండు దేశములోని నిరుద్యోగ పరిస్థితిని గురించియు వివరించబడినది. ఈ వచనముపైన చర్చించుచు హుజూరు మెహతాజీ మహారాజువారు సత్సంగములో ప్రస్తుతము జరుగుచుండెడి ప్రోగ్రాముకు బలవత్తరమైన సమర్థనము ఈ వచనములో నున్నదని సెలవిచ్చిరి. హుజూరు సాహబ్జీ మహారాజువారు సర్వశక్తిమంతులు. వారు సత్సంగమునకై ఇచట హెడ్ క్వార్టర్సు ఏర్పాటుచేసి, ఎన్నియో సంస్థల దివ్యభవనములతో విరాజిల్లు బహుశోభాయమానమైన మూలబంధమును స్థాపించి వానిని దృఢతర

ముగ చేసిరి. వారు సర్వశక్తిమంతులు కావున ఈ సమస్త కార్య కలాపములు కావించ కలిగిరి. కాని ఇపుడు ఈ పని బలహీన హస్తముల లోనికి వచ్చినది. ఈ విధానమంతయు వైస్ ప్రెసిడెంటు గారి చేతులలోను, దయాల్బాగులోని యితర కార్యకర్తల చేతులలోను ఉన్నది. కావున ఒక్క మూలబంధము మీదనే అనేక భవనములను నిలబెట్టుట సాధ్యముకాదు. ప్రస్తుత విధానము ప్రకారము ఏ భవనమునకా భవనము ఒకప్రత్యేక మూలబంధము మీద నిలబడునట్లుగ చేయుచున్నాము. అనగా ప్రతి వ్యక్తియు తన పొట్ట తాను పోసుకొనుచు తనశక్తి పైననే ఆధారపడునట్లుగ నేర్పాటు చేయవలయునని నా అభిప్రాయము. అట్టి ఏర్పాటు చేయు నిమిత్తము ఎట్టి కార్యక్రమము జరుగుట యవసరమని తోచునో -అది మీకు భగవత్ప్రేరణ వలన తోచినను సరే లేక తానంతట నదియే మీకు స్ఫురించి నను సరే- దానినే మనము ఆచరించుదము. హుజూరు సాహబ్జీ మహారాజు వారు సత్సంగ కేంద్రము, ముందు బలపడిన పిమ్మట బయట యితర స్థలము లలో కూడ ఇదే కార్యక్రమము నవలంబించ వచ్చునని చాలసార్లు సెల విచ్చిరి. కావున మనము మన సంస్థలన్నిటిని ముందు దయాల్బాగులో స్థాపించి వానిని దృఢపర్చుకొన్న పిమ్మటనే దేశములోని ఇతర స్థలములలో నట్టి సంస్థలను స్థాపించి నడిపించ వలసియున్నది. దయాల్బాగులో కార్యక్రమము ఇంకను మందగతిగ నున్నదని కొందరు ఆక్షేపించుచున్నారు. కాని నే నది ఒప్పుకొనజాలను. హుజూరు సాహబ్జీ మహారాజువారు ఇచ్చటి కార్య క్రమమును బలహీనమైన మూలబంధముమీద నట్లేయుంచి విడచిపెట్టి యుందురనియే వీరి అభిప్రాయమా? కాదు. అట్లెన్నటికిని కానేరదు. ఈ పెద్దలు పొరపాటు పడుచున్నారు. ఆ దయాళురు ఇచటి కార్యక్రమమునంతను ధృడతరము బలవత్తరముగను చేసిన పిమ్మటనే ఇచటినుండి వెడలిపోయిరి. దయాల్బాగు యొక్క పునాదులు ఇంకను పచ్చిగ నున్నవనియు, హుజూరు సాహబ్జీ మహరాజువారు తమ కార్యమును అర్ధమాత్రమే చేసి అసంపూర్ణ ముగ విడచిపెట్టి వెళ్ళి పోయిరనియు చెప్పెడి పెద్దమనుష్యు లందరును దయా ల్బాగు పునాదులు వేయుటలోకాని వానిని వృద్ధిచేయుటలో కాని రవ్వంత యైన నిస్వార్థమైన సేవ ఎన్నడు చేసి యెరుగని వారేయని నా అభిప్రాయము. ఆ కారణము వలననే వారికి దయాల్బాగు పునాదులు పచ్చిగ నున్నట్లు అగు పడుచున్నవి. వారట్టి కార్యమేదైనను కాని సేవకాని చేసియుండినను, లేదా ఆ విషయములో ఒక్క ఇటికను తీసిపెట్టి యుండినను వారికి దీని పునాదులు పచ్చిగను బలహీనముగను ఉన్నట్లు కనపడ నేరవు.

# 2

8 ఏప్రియల్ 1940. పాలంకోటలో సత్సంగమైన పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. సభాధ్యక్షులు అకస్మాత్తుగ నన్ను కోయంబత్తూరునకు ఆవడికిని వెళ్ళవలయునని పట్టుబట్టిరి. ఇంతలో మీ ప్రెసిడెంటు చెట్టిగారు నన్ను మధుర, పాలంకోటకును రమ్మని అహ్వానించుచు వ్రాసిన అర్జీ కూడ నాకు చేరినది. ఇచటకు వచ్చిన పిమ్మట ఇచ్చట సత్సంగులు చాల భక్త్యుత్సాహములతో సేవజేయుచుండుట చూడగ నాకు చాల సంతోషము కలిగినది. మీసేవ చూచి హుజూరు సాహబ్జీ మహారాజువారు సుప్రసన్నులగుట వలననే కదా వారికి మదాసు ప్రాంతమునందు ఎక్కువ అభిమానము ఉండెడిది. ఈ ప్రాంతపు సత్సంగులింతవరకు నెట్టి ప్రేమోత్సాహములతో పనిచేయుచున్నారో ఇకముందు కూడ నట్టి ప్రేమోత్సాహములతోను సేవా భావముతోనే పనిచేయుచుండిన యడల వారికి హుజూరు సాహబ్జీ మహారాజువారు గుప్తము కాకముందు వాగ్దానము చేసిన బహుమానము నిరంతరముగ లభించుచునే యుండ గలదని నేను మీకు ధృఢముగ నమ్మకము చెప్పగలను. ఉపదేశము కొరకై నీ వద్ద కు వచ్చుచున్న దరఖాస్తులలో నూటికి అరవై దరఖాస్తులు మద్రాసు ప్రాంతము నుండియే వచ్చుచున్నవి. వీరు స్వేచ్ఛగా తమంతట తామే రాధాస్వామీ మత సంఘములో చేరగోరుచుండుట వలన హుజూరు రాధాస్వామీ దయాళురు ఏ బహుమానమును మీకు వాగ్దానము చేసిరో దానిని ఈ కాలములో నిచ్చుచున్నారని ప్రకటమగుచున్నది. మీరందరు నింతకు ముందువలెనే హృదయపూర్వకముగ పరస్పర సహకారము చేసికొనుచు సేవ చేయుచు దయాల్బాగు సంస్థలు అమృతసర్ సంస్థలు ఇంకి నిందుకు సంబంధించిన ఇతర సంస్థల యొక్కయు సరుకులలో ఈ సంవత్సరములోను రాబోవు సంవత్సరములలోను కొనవలసిన కోటా పూర్తి చేసిన యడల ముందు ముందు మీకు ఇంకె నెంతెంత గొప్ప బహుమానములు లభించనై యున్నవో చెప్ప శక్యము కాదు. మీరిపుడు కట్టిన బట్టలనుబట్టి చూడగ మీరును ఇచటి సత్సంగేతరులును కూడ బట్టల కొనుగోలు ఇంక నధికముగా వృద్ధి చేయుటకు చాల సావకాశమున్నట్లు తెలియుచున్నది. నేనిపుడు చెప్పినమాట మీరు ప్రస్తుతము ధరించిన దుస్తులను చూచుటవలననే కాక నాకింతకుముందే తమిళ సోదరులు చాలమంది శరీరములో నర్ధభాగము బట్ట

కట్టుకొనకుండగనే యుందురని తెలిసి యుండుటచేత కూడ చెప్పుచున్నాను. ఆవడిలో పని ప్రారంభించిన తరువాత మీకిపుడు దయాల్బాగునుండియు అమృతసర్ నుండియు బట్టలు ఎంతెంత ఖరీదులకు వచ్చుచున్నవో అంత కన్న ఎంతయో చౌకధరలలో మీకు లభించగలవు. మీకు తమిళ దేశములో విక్రియములు వృద్ధి యగుటలో సహాయకరమైన విషయములు పైన చెప్పి నవేకాక ఇంకను కూడ ఉన్నవి. ఆఖరుగ నేనిచ్చటికి వచ్చుట విషయము ప్రెసిడెంటు గారును నేనును తొందరగ తీర్మానించుకొని మీకు వ్యవధి తక్కువగ తెలియపర్చినను కూడ మీరు మా వసతి సౌకర్యముల కొరకై తీసికొనిన శ్రమకు మీకు మా హార్దిక కృతజ్ఞతను తెల్పగోరుచున్నాను.

# 22

"సత్సంగ్ కే ఉపదేశ్"లో నుండి "గురూ గోవిందసింహ సాహబ్ కే జీవన చరత్రి మేం సే ఏక్ వర్క్" అను శీర్షికగల వచనము చదువ బడినది. ఆ వచనములో నిట్లు వ్రాయబడినది. "ఈ విధముగ ఐదు సర్దారు లను ఎన్నుకొని వారి అధికారము క్రింద సంఘము నంతను పెట్టి గురు గోవింద సింగు గారు సిక్కు మత సంఘము నంతను ఖాల్సా సైన్యము క్రింద మార్చి వేసి ఆ సంఘమును నశించిపోకుండ మృత్యు ముఖము నుండి రక్షించిరి." ఈ వచనము పైన చర్చించుచు హుజూరు మెహతాజీ మహరాజు వారిట్లు సెల విచ్చిరి. "ఈ వచనమును బట్టి గురుగోవింద సాహెబ్ వారు సిక్కు సంఘ మును మహా ప్రమాదకరమైన ఆపత్పరిస్థితి వచ్చినపుడు సంఘీయులను బలి దానము కొరకై యాచనచేసి యథార్థమైన భక్తుల నెంచుకొని సమస్త సంఘము నెట్లు రక్షించి సరియైన మార్గమున బెట్టిరో మీకు బోధపడియుండ గలదు. ఇప్పుడు సరిగ నట్టి పరిస్థితియే మన సంఘమునకు వచ్చినది. తురకలు వగైరా ఇతర జాతులవలన దారుణములు ప్రమాదము లిపుడు కలుగు పరిస్థితి లేనందున మనము కత్తులు కఠారులు పట్టుకొన నవసరము లేదు. కాని మన సంఘమునకును దేశమునకును ఆర్థిక కష్టములు రాబోవు చున్నవి. జీవనోపాధికి వృత్తికిని సంబంధించిన సమస్యలు పెరిగి క్లిష్టతరమై పోవుచున్నది. ముందునుండియు జాగ్రత్తపడి అన్యోన్య సహకార భావముతో ఈ ప్రమా దము నెదుర్కొని నిర్మూలము చేసికొనకుండ నుండిపోయిన జాతుల వారందరును నాశనమై పోవచ్చును. అందువలననే రాధాస్వామీ సంఘ

మును భావికాలములో ప్రమాదముల నుండి కాపాడుటకై యే ఈ ఆర్థిక పారిశ్రామిక ప్రణాళికను తయారుచేసి మీ యెదుట పెట్టితిమి. గురుగోవింద సింహాగారు ఐదుగురు సర్దారులను మాత్రమే కోరిరి కాని ఇపుడు పరిశ్రమలు, వస్త్రవిక్రయ కార్యములను జరిగించవలసిన బాధ్యతను వహించి ఈ ప్రణాళికను పూర్తిగ నెరవేర్చి మన సంఘమునకు వృత్తి జీవనోపాధుల నిమిత్తమై ఏర్పాటుచేసి సంఘమును రాబోవు వినాశక్షయముల నుండి కాపాడు నిమిత్తమై శూరా గ్రేసరులవలె కర్మక్షేత్రమున నడుగిడుటకు మనకు ఐదువేల మంది సర్దారులు అవసరమై యున్నది. గురుగోవింద సింహగారీ విధముగ ప్రాణత్యాగ సంసిద్ధులైన ఐదుగురు సిక్కులను ఎన్నుకొని శిబిరమునకు బయట సిక్కు సంఘ సభలోనికి తీసికొనివచ్చి నిలబెట్టి వారందరి ఎదుటను వీరి వైపునకు తిరిగి ఇట్లు వక్కాణించిరి. గురునానక్ వారి కాలములో ఒక్క గురు అంగద్ గారే వారి శిష్యులుగ తయారు అయ్యెను కాని ఇప్పుడు నా కాలములో నైదుగురు శిక్కులు తయారైరి. వీరు శిక్కు మతమునకు నూతనమైన మూలబంధమును ఏర్పరచగలరు, ఈ సత్య మతము నలుదెసల వ్యాపించకలదు.'' ఈ వచనమును ఆధారము చేసికొని హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. మన సంఘము కూడ ప్రపంచమున మహనీయమైన సేవలు చేయు నిమిత్తమై యెన్నుకొన బడినది. కావున ఇప్పుడు ప్రాణత్యాగ సంసిద్ధులై సేల్సుమెన్ రూపమున కాని ఇండస్ట్రీస్‌లో వాటాదార్ల రూపమున కాని ఆత్మ సమర్పణ చేయుటకు తయారై ముందుకు వచ్చు వారినిగూడ ఇక్కాలములో మహాశూర వీరులుగ నెంచ వలయును. అట్టి శూరులు ఐయిదుగురు "ప్యారా''ల కన్న నెంతమాత్రము తరహాలో తీసిపోనేరరు. మున్ముందు దివిటీ పట్టుకొని సత్సంగ జాతిని (నేషన్) ముందుకు తీసికొని పోవలసిన మహాశూరులు వీరే. భగవంతుడు వారికి ఈ సేవ చేసినందుకు మహా ఫలితమును అనుగ్రహించగలరు. మీ కందరికిని ఈ స్పర్ధనీయ పదవి పొందవలయునని లేదా? అట్టి ధైర్యసాహసములు కలవారు చేతులెత్తుడు. సమస్త సోదరీ సోదరులును చేతులెత్తివేసిరి.

## 22

28 ఏప్రియల్ 1940. ఈ రోజున స్కూలు విద్యార్థులను ఇండస్ట్రీస్‌లో పెట్టుటను గురించి హుజూరు వారీ విధముగ సెలవిచ్చిరి. మీ శేష

జీవితములో మీ పోషణకును మీ సంతానముయొక్క పాలన పోషణలు శిక్షా దీక్షలకును సరిపడునంత ధనసంపత్తి గలవారు మీలో బహుశః చాల తక్కువమందియే నుండవచ్చును. శేషజీవితములో మీ నిర్వాహమునకు మాత్రమే సరిపోయిన ధనము కలవారు అయితే మీలో కొందరు ఉండ వచ్చును. ఇపుడు చేతులెత్తిన వారినిబట్టి చూడగ రెండవరకము సంత్సంగులు సత్సంగములో కొద్దిగ యుండి, శ్రమపడి పనిచేసి ధనార్జన చేసికొనకుండ శేష జీవితమును శాంతియుతముగ కాలక్షేపము చేయజాలని వారు చాల మంది ఉన్నట్లును తెలియుచున్నది. కాని మీ పిల్లల జీవితము కన్న మీ శేషజీవితము చాల తక్కువగ నుండును. కావున మీ పిల్లల జీవనోపాధి నిమిత్తమై వృత్తిని కల్పించుటకై మీరు పాటుపడవలసి యున్నది. దీనిని బట్టి మన సంఘీయులకు తమపిల్లల శిక్షా దీక్షలు పాలన పోషణ నిమిత్తమై కావలసినంత ధనము లేదని తెలియుచున్నది. కాలము చాల ప్రమాదా వహముగ నున్నందునకు నిరుద్యోగ పరిస్థితి ఎక్కువగ వ్యాపించిపోవు చున్నం దునను మన మిప్పుడే మన పిల్లల పాలన పోషణాలు, విద్యాభ్యాస విషయము లలో సంపూర్ణమైన యుక్త ప్రబంధము చేసికొనని యెడల వారికి ముందు ముందు కష్టపరిస్థితులు సహించుకొనవలసి వచ్చును. మీరు బహుశః మేమి పుడు సంపాదించుచున్నాము కావున మేము సంపాదించినంత కాలము ఇట్లు చింతించ నవసరము లేదని చెప్పవచ్చును. కాని నేనా అభిప్రాయముతో ఏకీభ వించలేను. ఏలనన మీరు వృద్ధులు కావున మీ జీవితము మీ పిల్లల జీవి తము కన్న నిశ్చయముగ చాల అల్పముగ నుండును. అందుచే మీరు మీ సంతానముయొక్క భావికాలపు ఆవశ్యకతలకు తగినంత సంపాదించుకొను టకు సాధ్యముకాదు. మీరు బ్రతికియున్నంత కాలము మాత్రము మీకును మీ బంధువులకును కష్టము లేకుండ గడచిపోయినను మీ అనంతరము బహుశః వారికి కష్టముల నెదుర్కొన వలసిన పరిస్థితి కలుగవచ్చును. కావున మీ మాట మీరట్లుంచి మీ పిల్లల జీవికానిర్వాహమునకు తగినంత సంపాదనవారు చేసికొన గలుగు యోగ్యత వారికి గల్గులాగున మీరు ప్రయ త్నించుటయే తెలివియైన పని. వారి విషయములో మీరు ఎక్కువ శ్రద్ధ తీసికొనుట ఆవశ్యకమగుటలో మరొక యుద్దేశ్యమేమనగా వారు త్వరలోనే సంపాదన యోగ్యులు కావలెననియే. మరొక నివేదన ఏమనగా మీరు మీ

పిల్లల కిప్పుడు గరపించు విద్యాభ్యాసమును గురించి కూడ బాగుగ నాలోచించుకొనవలయును. మీ పిల్లలు చక్కని బుద్ధిశాలురై పెద్ద చదువులు చదివి పెద్ద సంపాదనలు చేయగల సమర్థులైనచో అట్టి పిల్లలకు పెద్ద చదువులు మీరు సంతోషముగ చెప్పించుకొన వచ్చును. కాని మీ పిల్లలు చదువులో అంత తెలివైన వారును ప్రజ్ఞావంతులును కాకుండుటచే మీరెన్ని ప్రయత్నములు చేసినను వారు పరీక్షలలో ఉత్తీర్ణులు కాకుండ ఉండిపోవుచున్నను లేదా వారలక్లాసులలో వెనుకబడియే యుండిపోవుచున్నను నా అభిప్రాయములో మీరు అట్టి పిల్లలకు పెద్ద చదువులు చెప్పించ బూనుటవలన కాలమును ధనమును పాడు చేసికొనుటయే కాక ఆ పిల్లలకు భావికాలములో నభివృద్ధికిని జీవికానిర్వహణమునకును ఆటంకము కలుగజేసిన వారగుదురు. స్కూలు చదువులలో తెలివితక్కువగ నుండి వెనుకబడి పోయిన పిల్లలకు వారి వారి అభిరుచి ననుసరించి ఏదైన నొక పరిశ్రమకాని, చేతిపనిగాని నేర్పించినచో వారు అట్టి పనిలో ప్రవీణత సాఫల్యములను సంపాదించుకొనుట కవకాశమున్నది. కావున అట్టి విద్యార్థుల విషయములో నా సలహా ఏమనగా వారిని స్కూళ్ళనుండి తీసి వారి యోగ్యతను అభిరుచిని అనుసరించి ఏదైన నొక చేతిపనిలోకాని పరిశ్రమలో కాని ప్రవేశపెట్టి త్వరలో వారు తమ పొట్ట పోషించుకొనెడి శక్తి కల వారినిగ చేయవలయును. అందువలన మీకు ఖర్చులు తగ్గిపోయి సుఖశాంతులు కలిగి మీ పిల్లల విషయములో ధైర్యము కూడ చేకూరును. ఇపుడు రెండు మాసములు వేసవి సెలవులు ప్రారంభమైనవి. కావున అట్టి పిల్లలు తమ తల్లి దండ్రుల అనుమతి తీసికొని ఏదైన నొక పరిశ్రమ లేక చేతిపనిని నేర్చుకొనుటకై ఈ సెలవులను ఉపయోగించ దలచినచో వారికి ఆ పని నేర్చుకొనుటకు తగినంత వ్యవధి యున్నది. పని నేర్చుకొనిన పిమ్మట వారి యోగ్యతానుసారముగ జీతము ముట్టగలదు. నే నిపుడా ఉద్దేశ్యముతోనే అట్టి పిల్లలు వచ్చి వారల అభిరుచి ననుసరించి ఏదైననొక ఇండస్ట్రీలో కాని హస్త పరిశ్రమలోకాని పని నేర్చుకొనుటకు నిశ్చయించు కొనవలయు నను విషయమును గురించి ప్రస్తావించితిని. మోడల్ ఇండస్ట్రీసు మేనేజరుగారు ఈ కార్యక్రమములో ఇక్కాలమున చాల అభిరుచి చూపు చున్నారు. వారిపుడు మేజోళ్ళు అల్లుట, బనియన్లు అల్లుట, నట్టులు, హింజీలు తయారు చేయుట, పాడ్ బోల్టులు తయారు చేయుటయు, బొత్తములు తయారు చేయు

టయు న నెడి ఐదు రకముల పరిశ్రమలను నేర్చుకొన గోరునట్టి విద్యార్థుల పేర్లు కావలెనని కోరుచున్నారు. మీరు మేనేజరుగారి ఈ ప్రకటన వలన లాభమును పూర్తిగ పొందవలయును. ఈ విషయములో మీరు ఆలస్యము చేయరాదు. ఏలనన నిరుద్యోగ పరిస్థితి చాలకాలము నుండి వ్యాపించి పోవు చున్నది. ఈ పరిశ్రమలలో 15 సంవత్సరముల పిల్లల నుండి 40-45 సంవత్స రముల వయస్సువరకు నున్న వారిని చేర్చుకొందురు. కాని మన నవ యువకు లైన విద్యార్థులు ఈ విషయములో అభిరుచి చూపినయడల చాలా సంతో షింపదగిన విషయము.

## 24

హుజూరువారిట్లు సెలవిచ్చిరి. పూజ్యులైన హుజూరు సాహేబ్జీ మహా రాజువారు 1939-40 సంవత్సరములు చాల గడ్డు సంవత్సరములని ఎన్నియో సార్లు సెలవిచ్చిరన్న విషయము మీకందరకును జ్ఞాపకమున్నదా లేదా? ఈ ఏండ్లలో దేశమంతట అశాంతి వ్యాపించి వివిధ రకములైన ఆపత్తులు కష్టములును సంభవించ గలవని సెలవిచ్చిరికదా? ఈ వచనము నాధారముగ జేసికొని ఈ నెల ప్రారంభములోనో లేక గతమాసము చివరిరోజుల లోనో ఒకటి రెండుసార్లు ఈ విషయమును గురించి సూచించి మరొకసారి విస్పష్టముగనే కూడ వివరించి యుంటిని. నేనట్లు చేయుట యుక్తమే. కొందరు నా మాటను ఉత్త నవ్వులాటలు మాటగా అనుకొనిరి. వారు అట్లు చేసి నందున నాకేమి కష్టము లేదు. కాని ఈ విషయములోనా నివేదన ఏమనగా మనకు గాఢ సంబంధముకల విషయ మెద్దియైనను, లేక మనకందరికి నభిరుచి గల విషయమేదైనను ఏ విధముగనైన తెలిసి నపుడును లేక ఏదైన ప్రమాదము మీదికి వచ్చునట్లు ముందాకట్టు తెలిసినను దానిని ప్రతి ఘటించుటకు తగిన ప్రయత్నము చేయకుండ నుండి పోవుట దూరదర్శిత, బుద్ధి మత్త్వము కానేరదు. అట్టి బుర్రలో ఊకపేడ తప్ప మరెద్దియు లేదని మామూలుగ ననుచుందురు. మనకే విషయమును గురించి యైనను ముందా కట్టు తెలిసినపుడు మనకును మన బంధువులకును అందువలన హాని కలుగ కుండునట్లు తగిన ఏర్పాటు చేసికొనుటయే బుద్ధిమత్త్వము. హుజూరు సాహేబ్జీ మహారాజువారు అంత చాల ముందుగనే సమస్త సంఘమును ఈ విషయ మును గురించి హెచ్చరించుటలో ఆ దయాళుని యభిప్రాయము సంఘములో నందరును అట్టి ఆపత్కష్టముల నెదుర్కొనుటకు మొదటి నుండియు సంపూర్ణ

ముగ సంసిద్ధులై యుండి వాని నుండి తమ్ము తాము రక్షించుకొన గలరనియే. ఇప్పుడు "సత్సంగ్ కే ఉపదేశ్" లోనుండి చదివిన వచనములోని విషయము కూడ నిదియే. ఈ వచనములో నేదైన కష్టము వచ్చినపుడు భగవచ్చరణములను ధ్యానము చేసికొని దానిని ప్రతిఘటించుటకు యుక్తమని తోచిన ఉపాయమును చేసి కొనవలయునని విస్పష్టముగ బోధ చేయబడినది. కష్టము వచ్చినంతనే బెదిరిపోక మీ విచక్షణా శక్తిని ఉపయోగించు కొనవలయును. పిమ్మట నొక శబ్దము దివ్యేచ్ఛకు తీసి చదివిరి.

ఘర ఆగ లగావే సఖీ,
సోఇ శీతల సముంద సమావే॥

(సార బచన - బచన 13—శబ్ద.2)

నేనిప్పుడు చెప్పిన విషయము మీరు ముందు రాబోవు కష్టములు ఆపత్తులను తలచుకొని బెదరి పోవలయునని చెప్పలేదు. మీ కేదైనను కష్టముగాని ఆపత్తుకాని అకస్మాత్తుగ కలిగినపుడు మీరు నిరుత్సాహము, నిరాశయు పడిపోకుండ నుండవలయునని యె. మీకు సలహా యేమనగా మీ కేదైనను ఆపత్తుకాని కష్టముకాని మీదికి వచ్చినపుడు మొట్ట మొదట హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు బహు దీనత్వ నమ్రత్వములతో సహాయ సంరక్షణలకై ప్రార్థించి న్యాయ బుద్ధితో విమర్శించుకొని ఏ పద్ధతిని ప్రవర్తించిన యుక్తమో ఆలోచించుకొని ఆ పద్ధతిని నడచుకొన వలయును.

## 25

21 ఏప్రియల్ 1940. రాత్రి సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. — 8 ఏప్రియల్ 1940 ఉర్దూ ప్రేమ ప్రచారక్ మొదటి పుటలో "నయే ప్రోగ్రామ్ కేలియే పరజోర్ అపీల్" అను శీర్షికతో హుజూరు సాహబ్జీ మహారాజువారి వచనము ప్రచురించిరి. అందులో హుజూరు సాహబ్జీ మహారాజువారు మన సంఘము మంతకును ప్రస్తుతము నడిపించుచున్న ప్రోగ్రాము నే భవిష్యవాణి రూపములో సూచన చేయుచు ఒక మహా ప్రభావవంతమైన నివేదనను చేసిరి. ఇప్పుడు సత్సంగముయొక్క పారిశ్రామిక విద్యా సంస్థలన్నియు సుసంఘటితములును సుదృఢములు నైనందున సత్సంగోద్య

మమును దేశమున నలుదిశల వ్యాపింపజేసి అభివృద్ధి నొందించు నిమిత్తమును భవిష్య బాధ్యతా భారమును వహించు నిమిత్తమును, సమస్త సోదరులు నధిక పరిమాణములో కార్య క్షేత్రములోనికి దిగవలసి యున్నదనియు, అట్లు చేసిన యడల సభవారు రాబోవు సభా సమావేశములో ఈ ప్రణాళికను కార్య రూపములో పెట్టుటకు తీర్మానించ గలుగుదురనియు హుజూరు సాహబ్జీ మహా రాజువారు ఆ నివేదనలో సెలవిచ్చిరి. ఇప్పుడు మీరు చేతులమీద పెట్టుకొన్న ప్రణాళిక అప్పుడు హుజూరు సాహబ్జీ మహారాజువారి దృష్టిలో నున్న ప్రణాళి కయే అను విషయమును మీరు బాగుగ నాలోచించవలసి యున్నదని హుజూరు మెహతాజీ మహారాజువారు సెలవిచ్చిరి. కావున ఈ ప్రోగ్రామును ఆచరణ రూపములో పెట్టవలసినదనియు వస్తు విక్రయమును స్టోర్సును క్రమ బద్ధముగ జరిపించవలయుననియు సత్సంగ సోదరీ సోదరులు అధిక పరిమాణములో ఈ సేవలో పాల్గొనవలయుననియు మీకు చేయబడు ప్రార్థన యంతయు పైన చెప్పిన వచనమును పూర్తిచేసి పరమ పూజ్యులైన హుజూరు వారి ఆజ్ఞను పాలించుటయే. పై వచనములో ఆఖరున హుజూరు సాహబ్జీ మహారాజువారు ఈ నూతన ప్రణాళిక సమస్తసంఘమునకు సుఖ సమృద్ధులు కలిగించుటకు హేతుభూతమని సెలవిచ్చిరి. హుజూరు వారికి ఆ వెంటనే దీర్ఘ వ్యాధి ప్రారంభించుటచే ఆ దయాళువు ఈ వచనమును ఆ చరణాత్మకముగ చేయజాలక పోయిరి. వారికి ఆరోగ్యము సరిగనుండిన యడల తప్పక అవిధమైన ప్రయత్నము చేసియుందురు. ఈ వచనమును దృష్టిలో నుంచికొను సత్సంగులు తమమనస్సుల నుండి ప్రస్తుతము జరిగించబడుచున్న సత్సంగ కార్యక్రమము హుజూరు సాహబ్జీమహారాజువారి దివ్యేచ్ఛకు ప్రతి కూలమేమో ననెడి శంకను సందేహమును పూర్తిగ ఒక్క పెట్టున తొలగించుకొని ఈ పవిత్ర సేవా కార్యములో యథా శక్తిగ లీనమై పోవలసియున్నది.

"స్వార్థ సంస్థావోంకీ గరజ" అనెడి అదే ప్రేమ ప్రచారక్ మొదటి పేజీలో నున్న వచనమును కూడ మీరందరు చదువవలెననియు కూడ హుజూరు వారు సెలవిచ్చిరి. ఆ వచనములో చిట్ట చివర మీ అందరు ఆచరణలో పెట్టునిమిత్తమై హితోపదేశ రూపమున నొక అత్యంత మహత్వ పూర్ణమైన వాక్యముకూడ నున్నది. హుజూరు సాహబ్జీ మహారాజువారు సత్సంగి సోదరీ సోదరుల నందరిని తమ్ము రాధాస్వామీ దయాళుని

కుటుంబము యొక్క సభ్యులుగ నెంచు కొనుచు నుండవలయు ననియు అందరును కలిసి మెలసి జీవితమును గడప వలెననియు వారి అభివృద్ధి నిమిత్తమై ఇచ్చెడి హితోపదేశములను హృదయ పూర్వకముగ నాచరించ వలయుననియు హెచ్చరించి అట్లు చేసినందున వారికి భావి జీవితమెంత సుఖశాంతులతో గడిచిపోవునో చూచుకొన వలయునని ఆ వాక్యములో సెలవిచ్చిరి. ఈ పంక్తులలో కూడ ఈ ప్రోగ్రాముగను గురించి సూచింప బడినది. మన ప్రస్తుత ప్రోగ్రాములో కూడ కార్యక్రమ మంతయు ఒకే కుటుంబములోని సభ్యులవలెనే కలిసి మెలసియే జరిగించ బడుచున్నది. పై కార్యక్రమము పూర్తి చేయుటకై సత్సంగులు తగిన పద్ధతి నవలంబించుట లేదు అనెడి విషయముమొక్కటే లోపము. ప్రస్తుతము నా అభిప్రాయ మేమనగా ఈ ప్రోగ్రాము విషయములో హెడ్ క్వార్టర్సు నుండియు, బిజినెస్ సెక్రెటరీగారి నుండియు అప్పటప్పట జారీ చేయబడుచున్న హెచ్చరికలును సలహాలును మీరు సరిగ పాటించక పోవుటచే ఈ ప్రణాళికను త్వరగ అమలు జరుపుటలో ఆటంకములు తప్పనిసరిగ కలుగు చున్నవి. మీరు బిజినెస్ సెక్రెటరీగారిచే జారీచేయబడుచున్న హితోపదేశములు వారి స్వకపోల కల్పితములని ఎన్నడు భావించవలదు. ఆ హితోపదేశములన్నియు సక్రమముగ అనుజ్ఞ పొందిన పిదపనే జారీ చేయబడుచున్నవి. కావున మీరు వానిని ఆవశ్యకమైనవనియు మహత్త్వ పూర్ణమైనవనియు తెలిసికొని శీఘ్రాతి శీఘ్రముగ మన్నించవలయును.

# 23

3 మే 1940. రాత్రి సత్సంగములో చదివిన వచనమును గురించి హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఇప్పుడు చదివిన వచనములో సంత్ సద్గురువు విరాజమానులై యుండి సత్సంగమును చేయించుచునున్న కాలములో సత్సంగులు ఆ కార్యక్రమము యొక్క లాభమును తమకు సాధ్యమైనంత అధికముగ పొందుటకు యత్నింప వలయునని చెప్పియున్నది. అదే విధముగ సత్సంగము కాక ఇతరమైన శరీర వ్యాయామము వగైరా ప్రబంధములను వేనినైన వారు జారీ చేయించిన యెడల దాని వలన గూడ పరిపూర్ణ లాభమును పొందుటకు ప్రయత్నించ వలయును. అట్లు పరిపూర్ణ లాభమును యుక్త సమయములో సంపాదించు కొనకుండ నుండి పోయిన యెడల

పూర్వపు వచనములను ఆచరణలో పెట్టలేక పోయితిమని ఇపుడు మనసున బాధపడుచున్నట్లే ఈ కార్య క్రమములను గురించి కూడ మనసున పరితపించెదరు.

# 27

15 మే 1940 తేదీన ఇట్లు సెలవిచ్చిరి. మీరు ఈ రోజులలో ప్రతి దినము నుదయము వ్యాయామ స్థలమునకు వచ్చి వ్యాయామమును చేయుచున్నందు వలనను నేను బయటకు వెళ్ళు చున్నానని తెలిసి భేంటు నిచ్చుట మూలముగ ప్రకటించిన భక్తి శ్రద్ధలను బట్టియు చూడగ మీ హృదయములలో భగవత్ప్రేమ యున్నదనియు భగవంతుని దయా దృష్టి మీ మీద నున్నదనియు తేటపడుచున్నది. అందు వలననే శరీర మనో ధనములకు సంబంధించిన కష్టక్లేశముల నన్నిటిని మీరు సహించుకొను చున్నారు. కాని సత్సంగములో జరిగించెడి ప్రతి కార్యక్రమములోను- శరీర మనస్సులకు అందువలన క్లేశము కలిగినను కలుగవచ్చును- బహుదూర దర్శితయు ఉత్తమ లాభమును సమ్మిళితమై యుండునని మీరు జ్ఞాపక ముంచుకొనుడు. ఈ విశ్వాసము ననుసరించి ఒకమాట అనగా మీరు ఇప్పుడు సహించుకొను చున్న శారీరక కష్టములకును సత్సంగ కార్యములలోను భేంట్లు వగైరా నిమిత్తమున్ను చేయుచున్న ధనవ్యయము నకును ప్రతిఫలముగ కొద్దికాలములోనే హుజూరు రాధాస్వామీ దయాళుని దయవలన మీ శరీరములు ప్రస్తుత శారీరక కష్టములను సహించు కొనగల బలిష్ఠముగను ఆరోగ్యవంతముగను అయ్యెడి పరిస్థితి యేర్పడ గలదను విషయమును ధృడముగ చెప్పవచ్చును. మీరు చేసెడి ధన సేవకు ఫలితముగ సమానముగ సత్సంగుల ఆర్థికదశ సంతోష ప్రదముగ నుండి సంఘముయొక్క ధన సంపత్తులు కూడ వృద్ధి చెందగలవు. ఇపుడు మీరు ఇండస్ట్రీస్ వృద్ధి చేయుటకును వ్యాపారమును వృద్ధి చేయుటకును అవసరమైన క్రొత్త ఉపాయములను ప్రయత్నములను గురించి ఆలోచించి ఆ ప్రకారము మీరాచరించవలసి యున్నది. పరిశ్రమలలో పనిచేయుటకు సమర్థులయిన పిల్లలకు వారి కాలమును వ్యర్థపుచ్చకుండు లాగున హితబోధ చేయవలయును. వారి ఖాళీ సమయములో వారు ఏదైన చేతిపనులను, కళలను నేర్చుకొను నట్లు చేయుడు. మోడల్ ఇండస్ట్రీసు మేనేజరుగారు ఈ రోజులలో ముఖ్యముగ అట్టి విద్యార్థులకు అట్టి

పనులు నేర్పు విషయములో సౌకర్యములు చాల కలుగ చేయుచున్నారు. ఈ పద్ధతుల ప్రకారము మీరు కొంతకాలము నడచుకొనిన పిమ్మట మీ యొక్కయు సమస్త సంఘము యొక్కయు ఆర్థిక పరిస్థితియు మొత్తము మీద చాల మెరుగగుచున్నట్లు మీకే కన్పడగలదు. మీ సంఘములో నిరుద్యోగముండ నేరదు. ఆ విధముగ సంఘము యొక్క సాముదాయిక ఆదాయము అభివృద్ధియగును. కావున నేను బయటకు పర్యటనమునకై వెళ్ళిన పిమ్మట మీరు మీ ఆర్థిక పరిస్థితిని సుస్థుపరచు నిమిత్తమును మీకు మీ శరీర మనోధనములతో సేవ చేయగల సమర్థత కలిగించు నిమిత్తమును్నా ఇచ్చట ఏర్పాటు చేయబడిన పద్ధతులు ప్రణాళికల ప్రకారము నడచుకొనుచు అందువలన పరిపూర్ణ లాభమును పొందవలయును. భగవంతుడు మీ శరీర మనోధనములను సంరక్షించి మీకు ఇతోధికముగ సేవ చేయుటకు సావకాశము అనుగ్రహించెదరు. ఉదయము వ్యాయామము చేయుటకు ఆలస్య మెక్కువగనై పోయి చాల ఎండ ఎక్కిపోవుచున్నదని తోచిన యెడల ఉదయము సత్సంగము 15 నిముషములు ముందుగ ప్రారంభింప వచ్చును. అట్లుచేసిన యెడల ఉదయము వ్యాయామ కాలములో ఎండ అంత తీక్షణముగ నుండక మీకు వ్యాయామము చేయుటలో శ్రమ కలుగ నేరదు.

## 28

అలహాబాదులో హుజూరువారి దర్శనార్థమై ఒక పంజాబు దేశస్థుడు వచ్చి ఇట్లు చెప్పుకొనెను–. నాకు ధనలోప మేమియు లేదు. కుటుంబ విషయములోను లౌకిక వ్యవహార విషయములోను పరిస్థితులన్నియు నిశ్చింతగను సంతోష ప్రదముగనే యున్నవి. అన్ని పరిస్థితులు ఈ విధముగ నున్నప్పటికి నా మనస్సునకు శాంతి సుఖములు లేకున్నవి. నేను మనశ్శాంతిని కోరుచున్నాను గాని నాకది లభ్యమగుట లేదు. నేనెందరో సాధు సంతుల దర్శనము కూడ చేసికొని తీర్థయాత్రలు కూడ చేసితిని. అయిననుకూడ నాకెక్కడను శాంతి లభించలేదు. తమరు ఇచ్చటికి వచ్చుచున్నారని తెలిసి నేనీరోజున ఆశీర్వాదము నొందుటకొరకై సత్సంగమునకు వచ్చితిని. నేను చిరకాలము నుండి తమ దర్శనమునకై ఆశించుచుంటిని, ఆ అభిలాష ఈ రోజున పూర్తియైనందుకు నేను ధన్యవాదముల నర్పించుచున్నాను. "హుజూరు వారు

అందుకు సమాధానముగ నిట్లు చెప్పిరి. ఈ అశాంతి మీకు శుభప్రదమే కాని చెడ్డది కాదు. ఏలనన దీని మూలముననే మీలో సత్యాన్వేషణ కొరకై తీవ్రాభిలాష కలిగి అది సిద్ధించువరకు మిమ్ములను ముందుకు గొనిపోవు చుండును. మీ అభిలాషయు హృదయ వేదనయు యథార్థమైనపుడు భగవంతుడు తప్పక మీ యందు దయ జూపి మీ అభిలాష తీర్చగలుగునట్టి పరిస్థితిని కల్పించునని మీరు దృఢముగ విశ్వసింపుడు. పిమ్మట నీ క్రింది శబ్దములను దివ్యేచ్ఛకు దీసి చదివిరి.

1) సురతియా భాగ భరీ
ఆజ గురు దర్శన రస లేత॥
(ప్రేమ బానీ భాగ 2, బచన 10, శబ్ద. 80)

2) ధన్య ధన్య సఖి భాగ హమారే
ధన్య గురూ కా సంగ రీ॥
(ప్రేమ బిలాస శబ్ద 126)

3) అరే మన రంగ జా సత గురు ప్రీత ।
హోయ మతి ఔర కిసీ కా మీత॥
(సారబచన, బచన 18, శబ్ద 7)

4) మైం గురు ప్యారే కే చరనోం కీ దాసీ।
(ప్రేమబానీ భాగ 3, బచన 13, శబ్ద 1)

## 29

19 ఏప్రియల్ 1940- సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి.- ఈ సారి మద్రాసు ప్రాంతమునకు పర్యటనము చేసి

కని కాని అచ్చటి జలవాయు పరివర్తనము కొరకని కాని కాదు. మద్రాసు ప్రాంతము సత్సంగ బీజము మొలకరించుటకు బహు యోగ్యమై యున్నదని కనిపెట్టి ఆ దయాళురు సత్సంగ బీజముల నచ్చట జల్లుదమను ఉద్దేశ్యముతోనే వెళ్ళుచుండెడివారు. హుజూరు సాహబ్జీ మహారాజు వారచ్చట చల్లిన బీజము లిప్పుడు మొలకెత్త నారంభించినవి. వాని పాలన పోషణ వికాసముల నిమిత్తము వానికిపుడు నీరు పెట్టవలసియున్నది. నీరు పెట్టినందువలన మొక్కలు పెరిగి వృక్షములుగనై ఫలభరితములు కాగలవు. అపుడు సమస్త సంఘమును దేశమును లాభము నొందగలవు. ఈ సారి అచ్చటి జనులతో సంభాషణ చేసినపుడు వారి హృదయములు శ్రద్ధాభక్తులతో నిండియున్న వనియు వారు ఇంకను అధికమైన ప్రేమ భక్తి దానములకు అర్హులై యున్నారనియు బోధ పడినది. వారిలో నీ పారమార్థిక భావమును చూచినపుడు వీరు నిజముగ పరిపూర్ణ సహాయము పొంద నర్హులని అందరు అంగీకరించవలసి యున్నది. నా అభిప్రాయములో అమృతసర్ లోని కార్యక్రమము జరుపుటకు ఒక అడుగుముందుకు వేయవలయు నన్నచో మద్రాసులో కార్యక్రమము సాగించుటకు నాలు గడుగులు ముందుకు వేయవచ్చునని చెప్పవలసియున్నది. ఇప్పుడు దీనిని గురించి మీరు ఏదైన నొక తీర్మానము చేయుటయో లేక ఆచరణరూపముగ నొక అడుగు ముందు వేయుటయో మీరు చేయవలసిన పని. ఉత్త కబుర్లు చెప్పినందువలన పని సాగదు. అందులకై బలిదానమును సేవయు అత్యావసరము. ఈ వైపునకు ఆచరణ రూపముగ ముందంజ వేయవలయునని మీకు సంపూర్ణమైన అభిలాషయు ఉత్సాహమునున్న యెడలనే మీరీ వైపునకు ఉన్ముఖమై రండు. లేనిచో చల్లగ మౌనము వహించి ఊరకుండుడు. మీరు పనిని ప్రారంభించినపుడు లోకులు మీ పైన నెపము లెన్నుచు మిమ్ములను "ఇపుడు సత్సంగము ఉత్తర దిక్కునుండి మళ్ళి సముద్రము వైపునకు పోవుచున్నది." అనుచు వెక్కిరింతలు ఎగతాళియు చేయవచ్చును. కాని హుజూరు సాహబ్జీ మహారాజువారు ఇక్కడనుండి మద్రాసు వెళ్లి శరీరత్యాగము చేయు దివ్యేచ్ఛను అంత్య సమయములో ధరించుటలో ఒక మహోద్దేశ్యము లేక పోలేదని మీరు జ్ఞాపక ముంచుకొనుడు. నిస్సంశయముగ దీని కర్థము సత్సంగయొక్క భావి కార్య క్రమము మద్రాసు వైపునకే ఎక్కువగ ప్రసరించి అచ్చట సత్సంగము చాల ఔన్నత్యమును అభివృద్ధిని పొందగలదనియే.

# 3

"సత్సంగ్ కే ఉపదేశ్" మూడవ భాగములో 5 వ వచనమును సత్సంగములో చదివిరి. ఈ వచనములో రాధాస్వామీ దయాళురు ఒక నవీన మార్గమును నడపించు చున్నారనుటకు సందియ మొద్దియు లేదు కాని సత్సంగము యొక్క ఈ నవీన మార్గమును గురించి ఆక్షేపణ చేయువారు ఈ మార్గమును గురించి మొట్ట మొదట విపులముగ పరిశీలించి తెలిసికొనవలసి యున్నదని చెప్పబడినది.

ఈ వచనము చదివిన పిమ్మట హుజూరు మెహతాజీ మహారాజు వారిట్లు సెలవిచ్చిరి. హుజూరు సాహబ్జీ మహారాజువారి పై వచనమును మీరు శ్రద్ధగా నాకర్ణించి యున్నయెడల మీకు ఆ దయాళురు ప్రపంచము లోని ఇతర మతములలో జరుగుచున్న విధముగ అమాయక భక్తులను ఇచ్చకపు మాటలను జెప్పి మోసముజేసి వారి ధనమును దోచుకొనియు, లేక యాచన జేసి ధనము నార్జించియు జీవికోపార్జన జరిగించుకొను పద్ధతులను ఎంతమాత్రము అంగీకరించ లేదని బోధపడియుండును. పై గావారు ఇతరుల ధనమును దోపిడీ చేయుటయు లేక మోసముచేసి లాగుకొనుటయు ఎంత దూష్యము నిషిద్ధమునో సత్సంగ సంస్థలను చందాలు వసూలు చేసియు ముష్టి ఎత్తియు నడిపించుటకూడ అంత ఎక్కువ దూష్యమును ఆక్షేపణీయము నైన విషయమే అని సెలవిచ్చిరి. అందువలననే పరమ పూజ్యులైన హుజూరు వారు సత్సంగము ఇతరుల ఔదార్యదాతృత్వముల పైన నాధారపడ నక్కర లేకుండగనే సంఘముయొక్క సామూహిక ప్రబంధ కార్యక్రమములను సాగించుకొన గల్గు నిమిత్తమును సత్సంగులకు వ్యక్తిగత నిర్వాహము జరిగి పోవు నిమిత్తమును, సత్సంగ ప్రబంధము పరాధీనము లేకుండ చక్కగ సాగి పోవునంత ఆదాయము ఆర్జించగల్గి నట్టియు, సత్సంగు లందరికిని న్యాయార్జన చేసికొని బ్రతుకగల సావకాశము గల్గించగల్గు నట్టియు సంస్థలను స్థాపించు కొనవలయునని నిర్దేశించిరి. ఈ సందర్భములో పైన జెప్పిన న్యాయమైన ధనార్జన అనగా అది ఆ సంపాదకుని యొక్కయు, అతని కుటుంబము యొక్కయు పోషణకు సరిపడునంత యధికముగ నుండవలయునను విషయమును మీరు గమనించవలెను. ఈ యుద్దేశ్య సాధనకై ఉచిత ప్రబంధమును చేయుట రాధాస్వామీ సత్సంగముయొక్క కర్తవ్య మైయున్నది. ఖర్చులు రెండు విధములుగ నున్నవి. ఒకటి సత్సంగియొక్క సొంత ఖర్చు. రెండు సంఘము

యొక్క సాముదాయిక వ్యయము. మొదటి ఖర్చు సత్సంగి కష్ట పరిశ్రమ చేసి న్యాయముగ నార్జించుకొన్న సంపాదన నుండియే భరించుకొనవలయును. అదికాక సత్సంగముయొక్క ప్రబంధ కార్యక్రమము సాగించుట కవసరమైన ఖర్చు వేరుగనుండును. ఈ రెండురకముల ఖర్చులకును తగిన సంపాదనకై సత్సంగ మేర్పాటు చేయవలసియున్నది. అనగా సత్సంగమెట్టి సంస్థలను స్థాపించినందువలన సత్సంగులకు అందు పేర్లుకొన్నందువలన వారి జీవికా నిర్వహణమున కవసరమైనంత ధనము వారికి న్యాయార్జితముగ లభించునో మరియు ఎట్టి సంస్థల మూలమున సంఘము యొక్క సాముదాయిక వ్యయమున కవసరమైనంత ధనము సత్సంగమునకు లభ్యమగునో అట్టి పరిశ్రమ సంస్థలను నెలకొల్ప వలయునని అభిప్రాయము. ఈ విషయములో కార్యసిద్ధి కలుగుటకై సంఘములోని చిన్న పెద్దలందరును కలసి ఐకమత్యముతో పనిచేయవలసియుండును. సత్సంగము వృద్ధియగుచున్నకొలది దాని ఖర్చులుకూడ పెరిగిపోవుచుండుననియు ఆ ఖర్చులను భరించుటకై పెద్ద పెద్ద నూతన సంస్థలను స్థాపించవలసియుండుననియు మీరు జ్ఞాపక ముంచుకొనవలయును. ఈ కాలములో సత్సంగములో జరుగుచున్న పారిశ్రామిక వ్యాపార సంస్థల కార్యక్రమమంతయును అందుకు సంబంధించిన ప్రణాళికల విస్తృతి అంతయును ఈ దృష్టి కోణముతోనే జరిగించబడుచున్నది. హుజూరు సాహబ్జీ మహారాజువారు మనకు ఆదేశరూపముగ దయచేసిన పంచవర్షీయ ప్రణాళిక యొక్క సారగర్భిత మహోద్దేశ్యమును మహత్త్వమును మీరు తెలుసుకొని దానిని పూర్తిచేయుట ప్రస్తుత పరిస్థితులలో నెంత యావశ్యకమో, పైన చెప్పిన విషయములనుబట్టి మీరాలోచించుకొనుడు. దానిని పూర్తి చేయుట వలననే సంఘములో నందరికిని తమ జీవిత నిర్వాహణమునకు కావలసినంత ధనమును కష్ట పరిశ్రమచేసి సంపాదించుకొనుటకును సంఘము నిరుద్యోగ పరిస్థితులకు లోనుగాకుండ నుండుటకును సాధ్యమగును. సత్సంగము తన కార్యకలాపము నభివృద్ధి చేసికొని సత్సంగోద్యమమును ప్రపంచములో సఫలముగ వ్యాపింపజేయు నిమిత్తమై అవలంబించవలసిన విధానములలో నిదియ అద్వితీయ మైనది. పై సమస్య సత్సంగమునకు శాశ్వతముగ ఏ నాడు పరిష్కరింపబడి పోవునో ఆ దినము నిజముగ నొక గొప్ప మహా పవిత్ర దినము. రాబోవు రెండు మూడేండ్ల లోపున మన ప్రయత్నములు సఫలమైనచో నెంతో శ్లాఘనీయముగ నుండును.

పే్రిమీ భా ఈ మాధవరావు నాయుడుగారిని గురించి, ఆయన బహుశః 1914వ సంవత్సరములో రిటైరై మదరాసు నుంచి ఇచటికి సత్సంగము కొరకై వచ్చిరని హుజూరు వారు సెలవిచ్చిరి. కొన్ని రోజులు వ్యాధిగ్రస్తులై యుండి ఈ నాడు మధ్యాహ్నము రాధాస్వామీ ధామమునకు వెడలిపోయిరి. ఈ మధ్య కాలములో ఆయన తమ జన్మభూమికి తిరిగి ఎన్నడు వెళ్ళినట్లే లేదు. ఆయన ఇన్నాళ్ళును హుజూరు సాహబ్జీ మహారాజు వారి చరణ సాన్నిధ్యముననే ఉండిపోయిరని నా అభిప్రాయము. ఆయన అందరి యడల పే్రమ భావముతో నుండి ఎవరితోగూడ పేచీలు కజ్జాలు పెట్టుకొనలేదు. ఆయన అభ్యాసములో పరిపక్వతనొంది హుజూరుసాహబ్జీ మహారాజువారికి ప్రియముగ నుండెడివారు. ఆయన రుగ్మత సమయమంతయు సవ్యముగనే గడచిపోయినది. ఆయన తన పుత్రికను అల్లుని పిలిపించుమని చాల ముందే చెప్పినందున వారు నిన్న నిచ్చటికివచ్చి ఆయనను సజీవముగ నుండగ చూచిరి. ఆయన ఈనాడు అపరాహ్ణమున అంతిమ యాత్రను చేసిరి. మీరందరును హుజూరు రాధాస్వామీ దయాళుపు ఆయనకు తమ చరణములయందు నివాసమిప్పించుగాత యని నేనిపుడు చేయుచున్న ప్రార్థనలో సమ్మిళిత మయ్యెదరని విశ్వసించుచున్నాను.

# 32

11 జూన్ 1940 తేది సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి. గడచిన ఆరుసంత్సరముల నుండియు సత్సంగులందరికిని అన్నవస్త్రములు సులువుగ లభించగల సౌకర్యములను ప్రసాదించ వలయునని నేను అనుదినము హుజూరు రాధాస్వామీ దయాళుని చరణ కమలముల వద్ద నిరంతర ప్రార్థన చేయుచుంటినని మీకు ఇంతకుముందు కూడ చెప్పియుంటిని. ప్రతి సత్సంగియు దాని ఫలితమును పొందగల సావకాశము భగవత్కృపవలన మనకిపుడు లభించినది. మీరు ఉదయాస్తమయములు సత్సంగమును వ్యాయామమును చేయుటయే కాకుండగ ఇతరములైన పనులను కూడ చేయుటకు సంసిద్ధులై యున్నారా! లేదా! అను విషయమునిప్పుడు చెప్పవలయును. ఇట్టి సావకాశము జీవితములో సర్వదా లభించనేరదు. గత మహాయుద్ధ సమయములోనైతే నిస్సంశయముగ నట్టి సావకాశము కలిగినది కాని కొద్ది మంది

తప్ప దాని లాభము నందరును పొందలేదు. అప్పుడు పనిచేసిన వారిలో పురుషులు సగటున 20–25 రూప్యములు మొదలుకొని 50 రూప్యముల వరకును స్త్రీలు 10–12 రూపాయలును నెలసరికి సంపాదించు కొనిరి. కాని ఈ సారి మనమందరమును కూడ ఈ పనిలో పాల్గొనవలసి యున్నది. హుజూరు సాహబ్జీ మహారాజువారు ముందు ముందు భండారా ఘర్ లోనే వంటలు చేసి భోజనము ఇండ్లకు పంపించు చుందురనియు ఇంటిలోని ఆడ వాండ్రు పిల్లలు నందరును పనిచేయుచుందు రనియు తరచు సెలవిచ్చు చుండిరి. మీరందరు ప ని చే యు చు నుండవలయును. మీ జీతములు మీ ఎకౌంటులో జమ చేయబడుచుండును. జీవితమునకు ఆవశ్యకమైన పదార్థము లన్నియు మీకు యథాప్రకారము లభ్యమగు చుండును. ఇప్పు డెవరు పనిచేయుదురో వారికే భోజనము లభించు సమయ మాసన్నమైనది.

మీరందరు నందుకు సిద్ధముగ నున్నచో బడే భాఈ సాహెబ్ వారు హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణముల వద్ద ఈ విన్నపమును దాఖలు చేసెదరు. ఛోటేభాఈ సాహెబ్ వారు దానిని సిఫారసు చేయుటకు సిద్ధముగ నున్నారు. కావున ఈ పరిస్థితిలో మీ ప్రార్థన అంగీకృతము కాగలదని పూర్ణవిశ్వాసము కలుగుచున్నది. పని వత్తిడి కలిగినచో మీలో ప్రతి వ్యక్తియు పని చేయవలసి యుండునని జ్ఞాపకముంచు కొనుడు.

౬౬

12 జూన్ 1940 తేజః స్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఈ రోజు చదివిన వచనము (సత్సంగ్ కే ఉపదేశ్ – 3వ భాగములో 130వ వచనము)ను మీరు వినియున్నచో హుజూరు సాహబ్జీ మహారాజువారు సంఘమును రక్షించి కాపాడుటకై తగిన సలహాలను ఎంత అసందిగ్ధ స్పష్ట రూపమున సెలవిచ్చిరో మీకు బోధపడగలదు. ఈ కార్యము సంఘ సంరక్ష ణకు సంబంధించినది కాని వచనములు చెప్పుట వలన నెరవేరునది కాదు. ఇందు కొరకై అందరును కలిసి ఏకమై పని చేయవలసి యున్నది. అందు వలననే మీకు అప్పచెప్పెడి కృత్యములను, ఈ వచనములో చెప్పిన ప్రకా రము, కష్టపడి నెరవేర్చుటకు యత్నించవలయును.

24 జూన్ 1940 తేదీని హాథరస్‌లో సత్సంగ సమయములో హుజూరువారు శబ్ద పఠనమునకు ముందుగ నిట్లు సెలవిచ్చిరి. మన సత్సంగములో కొన్ని సమయములందు భాషణ నిచ్చుటకు బదులుగ దివ్యేచ్ఛను శబ్దమును తీసి చదివించుటయు అట్టి శబ్దములు అప్పుడు సత్సంగములో జరుగుచున్న ప్రసంగమునకు సరియైన సమాధానముగగాని అందుకు సంబంధించిన హితోపదేశముగ గాని ఉయియుండుటయు ఒక్క విశేష విషయము. ఆ ప్రకారము ఈ క్రింది శబ్దమును చదివినపుడు,-

క్యా నర సోయా బావరే, లాంబీ టాంగ పసార।
చోరన నేతో హిం లూటియా, ఘర బిచ ఖోదామార॥

( ప్రేమ బిలాస శబ్ద 54 )

హుజూరువారు "ఈ శబ్దము మేలుకొలుపు శబ్దము. జీవుడీ సంసారములోనికి రాగానే అతనిమీద నిర్లక్ష్యము మందమతుల నెడి పరదా వైచి అతనికి నిజ పరిస్థితి తెలియకుండ చేయబడినదని చెప్పుచు జీవునికి జాగృతి కలుగజేయబడినద"ని సెలవిచ్చిరి. ఈ శబ్దముయొక్క క్రింది చరణములో నిట్లు చెప్పబడినది.

క్యా హిరదయ తుమ ధారియా, కుమతి కౌన తుమ లీన।
మాల అపనా సబ ఫూంక కర, జగ బిచ హాంసీ కీన॥

(ప్రేమబిలాస, శబ్ద 54)

అనగా నీ సొత్తు అంతయు ఈ సంసారములో కాలకర్మలును, మాయయును దోచుకొనిపోయి నిన్ను రిక్తహస్తునిగ చేసివేసిరి. యథార్థముగ ప్రపంచ మంతయు గుడ్డివానివలె మహా భ్రమలో పడి తప్పుడు త్రోవను కొట్టుకొనిపోవుచున్నది. నిజమైన సుఖమును అన్వేషించుటకు బదులు అసత్య విషయములలో చిక్కుకొని దుఃఖములపాలై విలపించుచున్నది. కావున అట్టి తప్పుడు త్రోవను పోయెడి జీవులకు ఈ క్రింది చరణములో దాని దుష్పరిణామమును తెలుపుచు పథ ప్రదర్శనము చేయబడినది.

సతగురుసేవా జిన కహీ, హిరదే చిన్తా ధార ।
ఘాటత హీ సో పహుంచియా, సాహబ కే దరబార ॥

(ప్రేమ బిలాస్ శబ్ద 54)

## ౬5

21 జూలై 1940 తేదీని విద్యార్థుల సత్సంగములో నొక శబ్దమును చదివిరి.

శబ్దపఠనమైన పిమ్మట హుజూరువారు "మీరు ప్రేమభరితమైన దృష్టినే కోరుచున్నారా" అని చిన్న పిల్లలను ప్రశ్నించిరి. హుజూరువారు అప్పుడు అచ్చట నున్న మామిడిపండ్ల వైపునకు సంకేతము చేసిరి.

పిల్లలు 'దయా భరిత దృష్టియే' అని సమాధానము చెప్పిరి.

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. మీరిప్పటి నుండియు మీ జీవితాదర్శమును నిర్ణయించుకొనవలసి యున్నది. మీరు చదువు పూర్తిచేసికొని పెద్దవారైన పిమ్మట ఏమి పని చేయుదురో జీవితము నెట్లు గడపెదరో అను విషయమును ఇప్పటి నుంచియు తేల్చుకొనవలసి యున్నది. మీరు జీవితములో నున్నతా దర్శమును పెట్టుకొని ప్రతి కార్యమును ఆ యాదర్శసిద్ధికి తోడ్పడునట్లుగ చేసికొనవలయును. మీకు చెప్పదలచు కొన్న రెండవ విషయ మేమనగా మీలో ప్రతి వ్యక్తియు తన కర్తవ్యమును తెలిసికొని మసలు కొనవలయును. మీకు జీవితములో అనేక విధములైన జనులతో సంబంధము కలుగు చుండును. వారిలో ఒక్కొక్కరి విషయములో ఒక్కొక్క విధమైన కర్తవ్యము బాధ్యతయు మీరు వహించవలసి యుండును. ఉదాహరణకు పిల్లల యెడల మీరు ప్రేమ భావము దయాభావము చూపించవలసి యుండును. పెద్దలయెడల ఆదర గౌరవములు చూపవలసి యుండును. అటులనే మీకు మీ కుటుంబము పరివారము విద్యాలయముల యెడలను మీ దేశము యెడల భగవంతుని యెడలను ప్రత్యేకమైన కర్తవ్యములు వేరు వేరుగా నిర్ణీతమై యున్నవి. మీరు ఆదర్శములను పాలించుట యుక్తము. మీరీ కర్తవ్యము లన్నిటిని మీ సౌకర్యమును ఇష్టము ననుసరించి ఒక క్రమములో పెట్టుకొన వచ్చును. నా అభిప్రాయములో మీ విద్యాలయము విషయములో మీకుగల కర్తవ్య ధర్మములు మీ ప్రస్తుత పరిస్థితిలో ముఖ్యముగ మీకు అన్నిటికన్న నెక్కువ ఆవశ్యక విషయములు. మీరీ కర్తవ్య

ములను చక్కగ పాలించు చుండినచో ఇచ్చటి కార్యకర్తలు అధ్యాపకులు నందరును మీ విషయములో సానుభూతి చూపుచు మీకు అన్ని విధముల సుఖ సౌకర్యములను కలుగ చేయుచున్నట్లు తెలిసి కొనగలరు. ఇచ్చటి నియమములు కట్టు బాట్లును క్రమ క్రమముగ మీలోనొక సంతోషప్రదమైన ఉత్తమ పరివర్తనమును కలిగించ గలవు. మీరు ఇచ్చటకు విద్యాభ్యాసము కొరకై వచ్చితిమను విషయము జ్ఞాపకముంచుకొని ఆ విద్యాభ్యాసమునందే ప్రధానముగ శ్రద్ధ వహించ వలయును. పగలు క్లాసులో మీకు ఏపాఠమునుగాని విషయమునుగాని చదివి చెప్పుదురో సాయంకాలము దానిని మరొకసారి చదువుకొని మరునాడు చెప్పబోయెడి పాఠమును ముందొకసారి చదువు కొనుచుండవలయును. అట్లు చేసిన మీకు మరునాడు ఆ పాఠమును క్లాసులో చదివించినపుడు మీకది చక్కగ నవగాహన కాగలదు. ఈ విధముగ ప్రతి విషయములోను మీరు మీ కాళ్ళమీదనే నిలబడుటకు ప్రయత్నము చేయుచుండవలెను. ఉదాహరణకు మీ అధ్యాపకులు మీ యింటివద్ద చేసికొనుట కేమైన పని అప్పచెప్పిన యడల మీరా పనిని ఇతరులెవ్వరి సహాయమును తీసి కొనకుండగనే చేయుటకు యత్నించ వలెను. మీకేదైన విషయము తెలియనపుడు మీరా విషయములో మీ స్నేహితులు, సహపాఠులు, అధ్యాపకుల నుండియు సహాయము పొంద వచ్చును. మీరీ పద్ధతిని నడచు కొనుచుండిన యడల మీ యొక్కయు మీ అధ్యాపకుల యొక్కయు పరిశ్రమ సఫలము కాగలదు. దయాల్బాగులోని నియమములు కట్టు బాట్లును విద్యార్థుల లాభము కొరకే చేయ బడినవని ఒక సత్సంగేతరుడైన నూతన విద్యార్థి ఇప్పుడే చెప్పెనుకదా! మీకు కూడ అట్టి అభిప్రాయమే ఉన్న యెడల మీరు వానిని పూర్తిగ అనుసరించి నడచు కొనవలసి యున్నది. మీకొక వారమునకు అవసరమైన ఆహార పానీయములను గురించి ప్రోగ్రాము ముందుగనే వేసుకొనుచుండవలయును. దయాల్బాగులో అమ్ముచున్న మిఠాయి సామగ్రి సాధారణముగ శ్రేష్ఠమును స్వాదిష్టమునై యుండుచున్నది. కాని మీరు మిఠాయివస్తువులు కాకుండ నూతన ఫలములను డెయిరీలోని తాజా క్షీరములను వాడుట శ్రేష్ఠమని నా అభిప్రాయము. మీలో నెవరును మీ వార్డను యొక్కగాని ఉపాధ్యాయుని యొక్కగాని అనుజ్ఞ లేనిదే పట్టణమునకు ఎన్నడు పోరాదను

విషయమును మీరు గుర్తు ఉంచుకొనవలయును. జీవితమునకు ఆవశ్యకమైన సమస్త పదార్థములు నిచ్చటనే లభించుచున్నపుడు ముఖ్యముగ మీరు ఏదైన ఒక ప్రత్యేకావసరము లేనిదే పట్టణమున కెన్నడు పోరాదు. మీ వినోద విహారములకైతే దయాల్బాగులో పెద్ద పెద్ద ఆట స్థలములును వ్యాయామ స్థలములును కావలసినన్ని యున్నవి. మీరు వీధిలోను నదియొడ్డునను షికార్లు చేయవచ్చును. మీరొక కాలపట్టిక (Time Table) నేర్పాటు చేసికొని దాని ప్రకారము ప్రతికృత్యమును చేసికొనుచుండవలెను. ఇచ్చట ఉదయము పూట వ్యాయామము చేయుటకు ఏర్పాటు ఉన్నది. మీలో ప్రతివ్యక్తియు నందు పాల్గొనవలెను. ఇంతకు సారాంశమేమనగా, మీరీ విధముగ అధిక కృషి చేయుచు ఈ పై హితోపదేశముల ప్రకారము నడచుకొనుచుండిన యెడల, అనగా ఆహార పానీయములు, వ్రాత కోతలు, వ్యాయామము విషయములను నియమ బద్ధముగను వివేకముతోను చేసికొనుచుండినచో మీ రిచటికి వచ్చి ఇచ్చటి సంస్థలలో చదువుకొను చున్నందుకు సంపూర్ణ ఫలితమును నిశ్చయముగ పొందగలరు. మీ తల్లి దండ్రులు కూడ తమ పిల్లలను దయాల్బాగు పంపించి డబ్బు ఖర్చు పెట్టుట సఫలమైన దనియు తమ పిల్లవాడు సకల విధముల బాగు పడెననియు సంతోషించెదరు.

ఆఖరున హుజూరువారు ప్రిన్సిపాలు గార్లనందరను పిలిచి విద్యార్థుల స్వాస్థ్యమును గురించి సంపూర్ణముగ శ్రద్ధ తీసికొను నట్లుగ నొక సబ్ అసిస్టెంటు సర్జనును నియోగించవలయునని చెప్పిరి. ప్రతి మాసము ప్రతి విద్యార్థియొక్క బరువు చూచుచు విద్యార్థి యొక్క ఆరోగ్యము ఎట్లు అభివృద్ధి అగుచున్నదో కనిపెట్ట వలయునని సెలవిచ్చిరి.

## ౫6

7 ఆగష్టు 1940 రాత్రి గుంతకల్లులో సత్సంగ సమయములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. కొంతకాలము ముందు 1934వ సంవత్సరము దరిదాపులో మీ రందరును మదరాసు రాష్ట్రములోని బీదసోదరుల పరిస్థితి మెరుగుపరచు నిమిత్తమై ఆ దయాళురు ఏదైన నొక పరిశ్రమను ఇచ్చటకూడ స్థాపించుటకు దివ్యేచ్ఛ ధరించవలయునని హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రార్థన చేసిరి. ఆ దివ్య ప్రభువు మిమ్ముల నందరను యుక్తసమయము వచ్చి దివ్యేచ్ఛ కలుగువరకు వేచియుండుడని

అప్పటిలో మీ ప్రార్థనకు సమాధానము చెప్పిరి. అటుతరువాతనే ఆ దయాళురు దయాల్బాగులోని వస్త్రోత్పాదన సాలుకు ఒక కోటి రూప్యములగునట్లుగ (అప్పటికి సాలుసరి వస్త్రోత్పాదన ఆరులక్షలు మాత్రమే యుండెను) ఐదేండ్ల లోపున పెంపుచేయవలయునని సభచేత తీర్మానము చేయించిరి. ఈ ప్రోగ్రాముకు మనము చేబట్టి రెండు సంవత్సరములు పూర్తియై మూడవ సంవత్సరము జరుగుచున్నది. ఇక రెండు సంవత్సరములు మాత్రమే ఈ ప్రోగ్రాముకు పూర్తి చేయుటకై మిగిలియున్నది.

హుజూరు సాహబ్జీ మహారాజువారు ఆఖరుసారి 1937 వ సంవత్సరములో మద్రాసు దయచేసినపుడు వారు మిమ్ములను మద్రాసునకు దరిదాపులో నేదైన సుక్షేత్రమును సంపాదించుటకు ప్రయత్నించుడని సెలవిచ్చిరి. మద్రాసు గవర్నమెంటువారి దయవలన మీకు ఆవడిలో భూమి దొరకినది. ఆంగ్లభాషలో "Work is worship. Work in power." అను లోకోక్తి యున్నది. దానికి "పనియే భగవత్పూజయు, పనియే శక్తియు" నని అర్థము. హుజూరు సాహబ్జీ మహారాజువారు నిర్ణయించియున్న పద్ధతిని మీరు నడచుకొనుచు పాటుపడి పనిచేసినయెడల మిమ్ములను ఎక్కువగ వేధించుచున్న నిర్ధనత దారిద్ర్యములనుండియు నితర క్లేశములనుండియు మీకు విముక్తి చేకూర గలదు. మీరు ధనలోపమువలన గాని దారిద్ర్యమువలన గాని ఎవ్విధమైన కష్టమును పడవలసిన అవసర మికపైన ఉండనేరదు. ఇపుడు మీరందరును రాధాస్వామీ దయాళురు మాయాకాలుర బంధనమునుండి విముక్తి కలుగజేయు నిమిత్తమై మహోపకారకమైన ప్రణాళికలను జారీ చేయించినందుకు ఆ దయాళుని చరణములందు శిరములు వంచి ధన్యవాదము లర్పించవలయును.

## 37

8 ఆగష్టు 1940 తేదీని ఆవడిలో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. మద్రాసు ప్రాంతపు సోదరుల కిప్పుడు వారి ప్రథమ సంపాదనలో నుండి కొంతభాగము ఫలితము చేకూరినది. ఈ ప్రపంచము కర్మభూమి. కష్టపడి పనిచేసిన వానికే ఫలితము చేకూరును. సాహబ్జీ మహారాజు వారి ఆజ్ఞానుసార మిపుడు ఆవడిలో ప్రారంభించిన కార్యక్రమములో మద్రాసు ప్రాంతపు బీదసోదరులు పాల్గొని పనిచేసిన యెడల, తమ పరిశ్రమయొక్క-

మధుర ఫలితమును వారు నిస్సంశయముగ పొందగలరు. జీవిత మంతయు నెల్లప్పుడు దారిద్ర్యములోనుండిపోనక్కర లేకుండ తనపొట్ట తాను పోషించుకొన గల్గునట్టి అవకాశము లభ్యమైన యెడల అది గొప్ప భాగ్యమే కదా. కావున అట్టి సౌభాగ్యము గల్గిన యెడల మీరు భగవంతుని చరణము లందు ధన్యవాదము లర్పించవలయును కాని, ఆ సావకాశమును చేతులారా పోగొట్టుకొనరాదు. మీరు మొట్ట మొదట 1934 వ సంవత్సరములో హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణములందు, మదరాసు ప్రాంతమున జనులు అధిక సంఖ్యాకులు ఇతర మతములలో జేరిపోవు చున్నారనియు, వారికి సుమతి గలుగజేసి అపమార్గమున పోకుండ కాపాడవలయు ననియు జేసు కొన్న ప్రార్థన అప్పటినుండియు నింతవరకు నట్లే వచ్చుచున్నది. మీరు హుజూరువారు అందు విషయములో తొందరపడవలదనియు అందుకు దివ్యేచ్ఛ గలిగి యుక్తసమయము వచ్చు వఱకు వేచియుండ వలయుననియు సెలవిచ్చిన సలహా మీకు జ్ఞాపకముండియే యుండును. హుజూరు సాహబ్జీ మహారాజువారు ఆఖరిసారి 1937 సంవత్సరములో మదరాసు దయచేసినపుడు మదరాసులో స్థలములు కొనవలసినదని సలహాయిచ్చిరి. ఆ తర్వాత మనకు గవర్నమెంటువారి అనుమతితో భూమియు లభించినది. సభవారు ఇచ్చటి ప్రజల దారిద్ర్యమును పోగొట్టు నిమిత్తమై మదరాసులో పరిశ్రమల నారంభించవలసినదని ఒక తీర్మానమును ప్యాస్ చేసిరి. కావున ఆవడిలో కార్ఖానాలు పెట్టినందువలన జనులకు దారిద్ర్యబాధ తగ్గి ముందు ముందు వారికి అధిక సౌకర్యము కలుగ గలదను నమ్మకమిప్పుడు కలుగుచున్నది. మీ కీవిధముగ ప్రాపంచిక చింతలు తగ్గిన పిమ్మట మీరు సంతోషముగ సత్సంగమును స్మరణ ధ్యాన భజనాభ్యాసములను చేసికొనగలుగుదురు. గుంతకల్లులో ఈ సారి 3, 4 శబ్దములను చదివిరి. వాని అన్నిటిలోను దారిద్ర్యము పేదతనమును గుఱించియే వర్ణింపబడి యున్నది. ఈ నాడు దివ్యేచ్ఛకు తీసిన శబ్దములు కూడ వరుసగ ఒకదానికన్న నెక్కువగ మరొకటి, సమయమునకు సందర్భమునకు సరిపోవునట్లు వచ్చినవి. నే నీ రోజున మీకు చెప్పిన విషయములనే గుంతకల్లులో సత్సంగులకు కూడా చెప్పితిని. హుజూరు సాహబ్జీ మహారాజు వారిపుడిచ్చటనే యుండి వారి ఆజ్ఞలు ఆవడిలో ఇండస్ట్రీస్ స్థాపించుట మూలముగనే ఇట్లు కార్యరూపము లోనికి తెచ్చి పాలన చేయబడుచున్నవో చూచిన యెడల వారు తప్పక అధిక ప్రసన్ను లగుదురు.

# ౬౪

4 సెప్టెంబరు 1940 తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. హుజూర్ సాహబ్జీ మహారాజు వారొక ప్రత్యేక మహోద్దేశ్యమును దృష్టియందుంచుకొనియే "గురుగోవిందసింహ జొర్ ఉస్కే పాంచ ప్యారే" అను వచనమును వ్రాసిరి. ఆ వచనము చదివిన మీదట ఆ కాలములో సిక్కుల పరిస్థితి యెట్లుండెనో, యిప్పుడు సత్సంగముయొక్క పరిస్థితికూడ పూర్తిగ నదేతీరున నున్నట్లు తెలియగలదు ఆ కాలములో సిక్కుల మీదికెట్టి క్లిష్ట పరిస్థితులు వచ్చిపడెనో, సరిగ నదే విధమైన మరొక క్రొత్త పరిస్థితి లోనిపుడు మన సంఘము పడియున్నది

గురు గోవింద సింహగారు తురకలు తమ సిక్కు జాతి వారికి దారుణమైన కష్టములు బాధలు గలుగ జేయుచు వారిని నాశనముచేయు తలంపుతో నున్నారని తెలుసుకొన్న మీదట వారి జాతికి ఐకమత్యము గలుగజేసి వారి నెట్లు నాశనముగాకుండ కాపాడదల్చిరో, అట్లే హుజూర్ సాహబ్జీ మహారాజువారును, సర్వసామాన్యముగ ప్రపంచ పరిస్థితియు, ముఖ్యముగ హిందూ మతముయొక్క పరిస్థితియు, చాల దుర్దశలోపడిపోవుచున్నదనియు సకల స్థలములలోని నిరుద్యోగము నిర్జీవికా పరిస్థితులును, జనులను బాధించుచున్నవనియు జూచి, జనులందరిని సంఘటితము చేయుబూని, ఆ సంఘటన కార్యక్రమమును సత్సంగ సంఘములోనే మొదట ప్రారంభించదల్చిరి. కావున నా దిశకు వారుకార్యరూపమున ముందంజవేయ నిశ్చయించిరి. ఈ సందర్భములో గురుగోవింద సింహ వారు పరీక్షించి నిర్ణయించ బడినట్టి అసలైన సేవకులను ఎన్నుకొను నిమిత్తమును, సంఘ మంతటికి నొక మహత్త్వ పూర్ణమైన ప్రకటనను వినిపించు నిమిత్తమును, ఆనందపురములో ఒక పెద్ద సిక్కుల సమావేశమును చేయించి జాతి సంరక్షణ నిమిత్తమై అయిదుగురు మహాశూరుల శిరములను బలి కావలయునని యెట్లు కోరిరో, అటులనే హుజూరు సాహబ్జీ మహారాజువారును, మదరాసు రాష్ట్రపు సత్సంగులు చేసిన పై ప్రార్థనపైన, కొంతకాలమైన పిదప, ఇండస్ట్రీస్ కార్యక్రమము మదరాసు ప్రాంతములో ప్రారంభించుటకు నిశ్చయించిరి. ఆనందపుర సమావేశములో గురు సాహబ్ వారి కోరికపైన నొక భక్తుడెట్లు తన శిరమును సంతోషముతో గురుసేవ కర్పించెనో అట్లే సాహబ్జీ మహారాజువారి ప్రకటనపైన అందఱి

కన్న ముందు పంజాబు ప్రావిన్షియల్ అసోసియేషనువారు హుజూరువారి ఆజ్ఞను శిరసావహించి ఆ ప్రాంత మందంతటను వేర్వేరు స్థలములలో స్టోర్సులను స్థాపించి, శక్త్యను సారము ధనము నర్పించి తమ ధనసేవా భావమును ప్రదర్శించిరి. ఎట్టి బలిదానమునకు గూడ వెనుదీయనట్టి అయిదుగురు ప్రియ తమ సర్దారులను గురుసాహబ్ వారు ఆ సమావేశములో నుండి యెన్నుకొనిరో, అట్లే ఇప్పుడు సమస్త ప్రావిన్షియల్ అసోషియేషన్లును హుజూరువారి ఆజ్ఞను శిరసా వహించి పాలించుచున్నవి. గురుగోవింద సింహ సాహబ్ వారు "ఖండే కా పాహుల్" (1) అనగా ఖడ్గప్రసాదమును క్రొత్త ఆచారము నెట్లు ప్రారంభించిరో, అట్లే ప్రస్తుత సమయములో మన సంఘములో "ఇండస్ట్రీ కా పాహుల్ అనగా ఇండస్ట్రీస్ యొక్క ప్రసాదమును ఆచారములో పెట్టి, దయాల్బాగు వస్తువులు, అమృత్సర్ మిల్లు వస్తువుల రూపమున సత్సంగ ప్రసాదము దేశములో నన్నివైపుల మూల మూలలకు అందచేయబడుచున్నది. ఈ అయిదుగురు ప్రియ భక్తులను పాంచ ప్యారే ఎన్నుకొన్న పిదప ఆ గురు సాహబ్ వారు సిక్కులను సింహములుగ మారిపోవలయునని సాటింపుచేసి, సంఘములో నొక గొప్ప పరివర్తనము గలిగించినట్లే, సాహబ్జీ మహారాజువారు తమ సంఘమును ప్రస్తుత సమయములోని కష్టములు ఆపత్తుల నుండియు సంరక్షించు నిమిత్తమై సత్సంగులను ఇండస్ట్రీస్ లోను వ్యాపారములోను ప్రవీణులుగజేయు దివ్యేచ్ఛ ధరించి, సమస్త సంఘమునకు నవ్విధముగ మార్గ ప్రదర్శనము చేసి చూపిరి. ఇప్పుడు ఇండస్ట్రీలు వృద్ధి చేసి వస్తూత్పాదన చేయవలసిన సమయము. పరిశ్రమలను వ్యాపారములను వృద్ధిచేయు భావమును వహించనిచో నే సంఘమును సజీవముగ నుండ నేరదు. ఇప్పుడు పై నుదహరించిన వచనమును మనస్సున పెట్టుకొని ఆ

---

Note : (1) గురుగోవింద సింహగారు "గ్రంథసాహెబ్" అను పవిత్ర గ్రంథమునుండి శబ్దపాఠము చేయించుచు, ఒక బాకును అనగా ఖడ్గమును ఒక పాత్రలోని జలములో ముంచి కొంతసేపు ఉంచి ఆ తర్వాతఆ జలమును ప్రసాదముగ త్రాగించి జనులను "సింహములు"గా అనగా తన శిష్యులుగ జేసికొను ఆచారమును ప్రారంభించిరి. ఆ జలమును "ఖండేకా పాహుల్" అనగా ఖడ్గప్రసాదమని చెప్పుదురు.

దివ్యప్రభువుని ఇండస్ట్రియల్ ప్రోగ్రాముకు అవగాహన చేసికొన్న యెడల హుజూరువారి ప్రణాళిక యొక్కయు, సత్సంగముయొక్క ప్రస్తుత కార్య క్రమము యొక్కయు మహత్త్వ మహోద్దేశ్యములు గోచరమై వానిలో సత్సంగముయొక్క భావి వృద్ధి వికాసముల బీజరహస్య మంతర్గర్భితమై యున్న దని తేటపడగలదు. ఇక్కాలమున వ్యాపించు చున్న దుఃఖ క్లేశములు ఇండస్ట్రీస్ను వ్యాపారమును వృద్ధి చేయుటవలననే నశించి పోగలవని గూడ బోధపడగలదు.

## ౨౮

8 నవంబరు 1940 వ తేదీని లాహోరులో శబ్ద పాఠమైన పిదప "సచ్చే సత్సంగ సే క్యా లాభ హోతా హై" అను వచనము చదవబడినది. పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. మీరందఱు నిపుడు విన్నట్టి వచనము యొక్క సారాంశముపైన శ్రద్ధవహించి ఆలోచించుకొని యుందురని అనుకొందును. సత్సంగము చేసినందువలన జీవునికి నిర్ణయశక్తి జాగృతి నొందును. మీరు సాహబ్జీ మహారాజువారి సత్సంగమును 23, 24 సంవత్సరముల కాలము చేసుకొనిరి. అందువలన మీలో నిర్ణయశక్తి అనగా వివేచనాశక్తి మేల్కొన్నదా లేదా అను విషయమును మీరు ఇపుడు ఆలోచించుకొన వలయును. మంచి చెడ్డ విషయముల తారతమ్యము తెలిసికొనగల్గుటయే వివేచనాశక్తి మేల్కొంచినట్లు నిదర్శనము. కొన్ని విషయములలో నీ తారతమ్యము చాల సులువుగనే తెలియును. ఉదాహరణకు, మజ్జిగలోనుండి వెన్న తీయుట సులభమే కాని పాలనుండి నీరును వేరుచేయుట చాల దుష్కరము. మీరింత వరకు సత్సంగములోనుండి, ఇట్టి సూక్ష్మ విషయముల పరిశీలన నేర్చుకొన కుండినచో, మీ కిపుడైన నా సూక్ష్మము నేర్చుకొనుటకు అవకాశమున్నది. ఈ సందర్భములో మీరు జ్ఞాపక ముంచుకొనవలసిన ఒక ముఖ్యవిషయ మేమనగా, కొన్ని విషయములను దెల్పునిమిత్తమై యేర్పడిన పదములు పైపైకి చూడగా, చాల సామాన్యముగ కన్పడుచుండునే కాని, వాని అంతర్భావము చాల గూఢ గంభీరముగ నుండుచుండును. మానవుడు వానియొక్క యథార్థ భావమును అవగాహన చేసికొనుటకు ప్రయత్నించవలయును.

40

9 నవంబరు 1940 ఉదయము సత్సంగములో "గురుగోవిందసింహాకే జీవన చరిత్రమేం సే ఏక్ వర్క్" అను వచనమును చదివిరి. హుజూరువారు సత్సంగులందరిని, మీరు విశ్రమ లాలసులై యుండ గోరుదురా? మీరే స్వయముగ విశ్రమ జీవితము ననుభవించ గోరుచున్నారా, లేక రాబోవు తరముల వారికి విశ్రాంతి సుఖములు గల్గించగోరుచున్నారా, యని అడిగిరి. "గురుగోవిందసింహాజీ కే జీవన చరిత్ర కే ఏక వర్క" అను వచనములో వ్రాసినట్లు ఆ కాలములో నొక లేఖకు డెట్లు ఆలోచించెనో అట్లే నెల పదునైదు రోజుల క్రితము ప్రేమ ప్రచారక ఛీఫ్ ఎడిటరుగారు కూడ, గురుగోవింద సాహబ్ "ఖండే కా పాహుల్" అనగా ఖడ్గ ప్రసాదము నిచ్చుటకు నిశ్చయించిన విధముననే, మనముగూడ ప్రస్తుతములో నున్నట్టియు ముందు రాబోవునట్టియు పరిస్థితులను గమనించుకొని "ఇండస్ట్రీ కే పాహుల్", అనగా ఇండస్ట్రీయొక్క ప్రసాదము నిచ్చు విషయమును గుఱించి తీర్మానము చేసుకొనవలసి యున్నదని ఆలోచన చేసిరి. అట్లు ఇండస్ట్రీని వృద్ధిచేయుట ఒక్క సత్సంగులకు మాత్రమే గాక, సమస్త హిందూదేశస్థులకును గూడ అత్యావశ్యకమని వారికి ఆలోచన గలిగెను. సాహబ్జీ మహారాజు వారు దయాల్బాగులో సంవత్సరమునకు వస్త్రోత్పాదన $7\frac{1}{2}$ లక్షల రూప్యములు ఉన్న పరిస్థితిలో, దానిని 5 సంవత్సరములలో నేడాదికి ఒక కోటి రూపాయలు విలువగల వస్త్రోత్పాదనలోనికి వృద్ధిపరచవలసి యుండునని 1935 వ సంవత్సరములో సెలవిచ్చిరి. మీరు ఇతర విషయముల నన్నిటిని వెనకబెట్టి, మీ మనస్సున ముఖ్యస్థాన మీ వచనమునకే యియ్యవలసియున్నది. హుజూరు వారు సంఘము నందఱిని, "మీ కందరికి నిట్టి "పాహుల్" అనగా ప్రసాద మిష్టమేనా? అట్లు ఇష్టమైన యెడల మీరు ఏ శస్త్రమును ధరించెదరు, దేనిని ఉపయోగించెదరు?" అని ప్రశ్నించిరి.

అందరును "ఇండస్ట్రీస్ నే" అని చెప్పిరి.

41

13 నవంబరు 1940 వ తేదీని ఝుంగులో రాత్రి సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి.

బిన దర్శన మన శాంతి న ఆవే।
క్యోంకర ధీర ధరూం. ॥

(ప్రేమ విలాస శబ్ద 37)

ఈ శబ్దమును విమర్శించుచు హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఇప్పుడు చదివిన శబ్దమునుబట్టి మీ కందఱకును, మన మతములో గురువుయొక్క మహిమను గుఱించియు గురు భక్తిని గురించియు నెంత గట్టిగ బోధించబడు చున్నదో అవగాహనమై యుండవలయును. శబ్ద పాఠమైన పిదప చదివిన వచనములోని సారాంశముగూడ నిదియే. మన మతమునకు నితర మతముల కును గల గొప్ప వ్యత్యాసమిదియు. ఇతర మతములలోని గురువులు గతించి పోయిరి. ప్రస్తుతము వారు ఈ జగత్తులో లేరు. మన మతములో అట్లుగాక గురు పరంపర నిరంతరముగ నట్లే సాగిపోవుచునే యుండగలదు. సజీవ సద్గురువు లేనియెడల జీవునకు భగవంతుని యందు విశ్వాసము నిలబడి యుండుటయు పరమార్థ విషయములలో సహాయము లభించుటయు చాలకష్టము. ఏ విద్య కైనను అధ్యాపకుడు అవసరము. ఎవనికైనను వ్యాయామము చేయు విధము నేర్చుకొనవలయునన్నచో నొక డ్రిల్ మాష్టరు ఉండి తీరవలయును. అట్లే పార మార్థిక కార్యక్రమమును నేర్చుకొనుటకుగూడ గురువు అత్యావశ్యకము. కేవలము ప్రాచీన మహాపురుషుల యొక్కయు ప్రాచీన గురువుల యొక్కయు గ్రంథములను బట్టి అభ్యాస విధానమును తెలిసికొనుటయు నేర్చుకొనుటయు అసాధ్యము. పారమార్థిక కార్యములు సాధనలును అభ్యసించుటలో కూడ అనేక విధములైన ఆటంకములు విఘ్నములును గల్గుచుండును. అట్టి పరిస్థితులలో తగు సహాయము చేసి ముందు మార్గము చూపుటకు సమకాలిక సజీవ సద్గురువు అత్యవసరము.

## —2

భాయీ సాహెబ్ బ్రిజబాసీలాలు గారి మరణమును గుఱించి సాను భూతి తెల్పుటకై దయాల్బాగులో జరిగిన సమావేశములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి: భాయీ సాహబ్ బ్రిజబాసీలాలుగారి వియోగమువలన మా మనస్సునకు గల్గిన దుఃఖమును మాటలతో ప్రకటించుట సాధ్యముకాదు. మీరిప్పుడు ప్రకటించిన భావములు యుక్తమే. మీలో ఎవరికి వారు

ఒక్కొక్క ప్రత్యేక దృష్టి కోణముతో, తమ తమ కార్య కలాపమునకు సంబంధించి, భాయీసాహబ్ వారి గుణములు స్వభావమును గురించి మీ భావములను తెలియజేసిరి. బడేభాయీ సాహబ్ గారు సభలో మెంబరు. వారు పోయినందువలన, ఖాళీ అయిన సభ మెంబరు కుర్చీని ప్రేమీభాయీ జ్యోతిస్వరూపుగారు అలంకరించ వలయునని నా కోరిక. ఇంత వరకు బడేభాయీ సాహబ్ గారితో కలిసి యుండిన ప్రియమైన దయాళ్ ప్రసాద్ అక్కైనియాకు తన నెలవారీ ఆదాయము రు 50/లు అగునంత వరకు అతడు సభవద్ద నుండి నెలకు రు 25/లు చొప్పున తీసికొనుచుండుట కంగీకరించ గోరుదును.

## ౬౭

ఒకనాడు సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" 3వ భాగములోని 147, 148 నెంబర్ల వచనములను చదివిరి. 147వ వచన సారాంశమిట్లున్నది: మానవునికెన్ని బోధలు చేసినను గూడ నతడు తన మనోవాసనలకు కేవలము దాసుడై పోయినందున, ఆ బోధల నెంతమాత్రము లెక్కసేయ జాలడు. కొన్ని సమయములలో నతని బుద్ధికి ఆ బోధలు నచ్చినను గూడ అతని మనస్సతనిని ఆ ప్రకారము నడచుకొన నియ్యదు. ఆ వచనములో ముందొక నీచుడు దుర్మార్గుడునైన ఖైదీని దృష్టాంతముగ చెప్పి, చివరకిట్లు చెప్పబడినది. "సామాన్యముగా మానవుని పరిస్థితి యెట్లున్నదనగా, అతడు రాత్రింబవళ్ళెన్నియో హితబోధలను విని, బాగుగా వానిని అర్థముకూడ చేసికొనుచుండును కాని పని మాత్రము తన మనస్సు చెప్పినట్లే జరిగించు చుండును."

అందుపైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి. "జనులకు వచనములు వినవలయునను కుతూహలము మెండుగనే యున్నది కాని, ఆ ప్రకార మించుకంతగూడ నడుచుకొనుట లేదను విషయము, ఈ పై వచనము విన్న పిదప సత్సంగులకు బోధపడి యుండ వలయును. మీరందరును సాహబ్జీ మహారాజువారి వచనములను చాల విరివిగ వినియున్నారను విషయమును మీకు నేనిదివరలో నెన్నియోసార్లు చెప్పి యున్నాను. ఇప్పుడు ఇంక పని చేయవలసిన సమయము వచ్చినది. మీరు కలసి మెలసి పనిచేయుడు. మీరు వినినట్టి వచనముల ప్రకార మాచరింపుడు. ఉత్త వచనములు వినవలయునను

ఆసక్తి మాత్రమే యుండి, ఆ వచనానుసారముగ మీలో పరివర్తన గలుగ జేసి కొనకుండ నుండిపోయినచో, మీకా వచన శ్రవణము వలన లాభమే మున్నది? సత్సంగములో ప్రస్తుతము వచనములు చెప్పట లేదన్నమాట సరియే. కాని ఇచ్చట కార్యక్రమ మంతయు సాహబ్జీ మహారాజువారి వచనానుసారముగనే జరుగుచున్నది కదా! ఆ దయాళురు వేర్వేరు సమయము లందు సెలవిచ్చిన వచనములనే ఇప్పుడు కార్యరూపములో పెట్టి నడిపించు చున్నాము. మీరే చూడుడు. ఇప్పుడు దయాల్బాగులో పని అంతయు నే విధమైన చింత వ్యాకులము లేకుండ, నెంత శాంతియుతముగను ఉత్తమ విధముగను దానంతట అది జరిగిపోవు చున్నదో, మనము పెట్టు కొన్న స్వార్థ పరమార్థములకు సంబంధించిన ఆదర్శ సిద్ధికై మనమెంత యుత్తమ పద్ధతిని దినదిన ప్రవర్ధమాన వేగముతో ముందుకు పోవు చున్నామో చూడుడు. ప్రతి సంస్థయు సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞాను సారముగ చాల కష్టపడి పనిచేయుచున్నది.

సాహబ్జీ మహారాజువారి సమయములో వచనములు చెప్పుచుండెడి వారన్నమాట నిజమే. వానిని వినుటకై జను లుత్సాహ పడుచుండెడి వారు కూడ. అయినను, వారి వచనములు వినవలయునను వేడుక యెంతగలదో ఆ వచనానుసారము ప్రవర్తించ వలయునను ఆసక్తి కూడ ఆ మాత్రము లేనిచో, ఆ వచనములను కేవలము విని, వానిని శ్లాఘించినంత మాత్రమున మీ అంతర్యమున వాని కనుగుణమైన పరివర్తన గలుగజేసి కొననిచో, మీకేమి లాభము గలిగినది?

హుజూరువారు తిరిగి యీ సంభాషణ క్రమములో 148వ నెంబరు వచనముపైన నిట్లు సెలవిచ్చిరి. ఈ శిక్షణ ననుసరించి, ప్రతివ్యక్తియు ఆడుంది యాగాక లేదా మగవాడు బౌగాక, ధనికుడౌగాక లేదా పేదయాగాక, తెల్లని వాడౌగాక లేదా నల్లనివాడౌగాక– తన శారీరక మానసిక ఆధ్యాత్మిక శక్తులను తన సంఘ లాభమునకు వ్యతిరేకముగ ఉపయోగించకుండిన యెడల ఆ మూడు రకముల శక్తులను పెంపొందించుటకు సత్సంగములో నందరికి సమాన సావకాశము లభ్యమగును" అని 148వ నెంబరు వచనములో చెప్ప బడినది.

అందు పైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి. మన సంఘములో ఈ సామ్యవాదశిక్ష నిరంతరము బలపడుచు లోలోనికి ప్రవేశించుచున్నదని మీరు చూచుచునేయున్నారు కదా! సత్సంగములోని పెద్ద పెద్ద కార్యకర్తలను, ఆఫీసరులను, పెద్ద హోదాగలవారిని చూడుడు. ఇదివరలో కన్న ఇప్పుడు సత్సంగములో భేదభావము చాల తగ్గిపోయి, అందరకును సామ్యవాద శిక్షయే యెక్కువ ప్రియముగ నున్నదని మీరు ఒప్పుకొనవలసియున్నది. భేదభావమును కల్పించి, గొప్పవాడు, అల్పుడు అనెడి భేదమును పుట్టించు విషయములు పద్ధతులన్నియు చాల జోరుగ త్రోసివేయబడుచున్నవి. మనము సత్సంగము యొక్క యీ క్రొత్త శిక్షను రోమరోమముల యందును అంకితము చేసికొని సత్సంగములో ముందు రాబోయెడి పరివర్తనములతో ఏకీభవించవలసియున్నది. ఇచ్చట చేయించుచున్న వ్యాయామమును అనగా డ్రిల్లును ఆక్షేపించువారు కూడ, ఈ వ్యాయామము మూలమున జనులలో సామ్యవాదమెంత యధికముగ ప్రచారమగుచున్నదో అధమాధమము ఒప్పుకొనవలసియున్నది. పెద్దలు, పిన్నలు, ఆఫీసర్లు, నౌకర్లు నందరు నొకేచోట నిలబడి వ్యాయామము చేసినందువలన సామ్యభావము పరిశ్రమాశక్తియు మనస్సున పెంపొందగలవు. మన యీ కార్యక్రమ మంతయు సాహబ్జీ మహారాజువారి 148 నెంబరు వచనము ననుసరించియే యున్నది. కావున నీ దృష్టి కోణముతో, చూచినయెడల నెవనికైన నిదంతయు వారి వచనమును కార్యరూపములో పూర్తి చేయుటయే అని తెలియగలదు.

౬౭.

19 జనవరి 1941– ఆదివారము పిల్లల సత్సంగములో నీ క్రింది శబ్దము చదివిరి.

సమఝు మోహిం అఈ ఆజ గురు బాత్ ।

( ప్రేమ విలాస్ 120 వ శబ్దము )

శబ్దపాఠమైన పిమ్మట ఒక బాలుడిట్లు ప్రశ్నించెను, "ఈ శబ్దములో అభ్యాసముచేయవలయునని చాల నొక్కి చెప్పిరి. కాని అదృష్టము లేనిదే అభ్యాసము సాగదని కూడ చెప్పిరి కదా. హుజూర్, తమరే సెలవిండు, మా దురదృష్టమే మా చేత అభ్యాసము చేయనీయని యెడల మేము అభ్యా

సము చేయుట యెట్లు?" అందుపైన హుజూరు వారిట్లు సమాధానము చెప్పిరి. సామాన్యముగ అభ్యాసము సాగవలెనన్నచో అదృష్టము ఉండవలె నన్న మాట యుక్తమే. కాని రాధాస్వామీ దయాళురికి కర్మల ఛిద్రమును మేకులతో కప్పెట్టి కర్మల దుష్ప్రభావమును నాశనముచేసి భక్తిచేసి కొనుటకు దుష్కర్మలను అడ్డురాకుండచేసి మీచేత యథా యోగ్యముగ భక్తి చేయించగల మహాశక్తియున్నది. మీరు ఆ శబ్దము నంతను శ్రద్ధగా చదివిన యెడల, దానిలోనే యీ ప్రశ్నకు సమాధానమున్నదని మీకు తెలియగలదు. తిరిగి ఆ శబ్దమును రెండవసారి చదివించిరి. ఈ క్రింది చరణమును తీసిరి.

భాగ జగే హుఇ సురత సుహాగిన,
సత గురు ఆయ మిలే మోహిం నాథ,
అబ మైం చేత కరూం నిత కరనీ,
జామేం చాల చలేఁ దిన రాత్॥

అనగా, సద్గురువు లభించినపుడు అదృష్టము ఫలించగలదు, అభ్యాసము అప్పుడు సాగగలదు అని భావము.

ఆతర్వాత రెండవ శబ్దమును చదివిరి. అందులో నీ క్రింది చరణములను హుజూరువారు శ్రద్ధగా గమనించవలసినదని నొక్కిచెప్పిరి.

యహాఁ కే గఫలత్ బహుత సతావే,
ఫిర్ ఆగే కుఛ నహిం బన పడనా.

( సారబచన్, బచన్ 15, శబ్దము 14 )

మఱియు నిట్లు సెలవిచ్చిరి : ఈ చరణములోని మాటలు కొద్దిగనే యున్నవి కాని, అవి చాల భావ పూరితమైనవి. లభించిన సావకాశమును మనమెన్నడు కోల్పోవకూడదు. మంచి సావకాశము లభించినపుడు దానిని చేతులార జార విడచినయెడల, తిరిగి అట్టి సావకాశము రావచ్చునని ఆశించుట పొరపాటు. ఆంగ్ల భాషలో నొక సామెతయున్నది. "Time once lost is never regained" అనగా ఒక్కసారి దాటి పోయిన అవకాశము తిరిగి యెన్నడు రానేరదు అని దాని అర్థము. సత్సంగములో నెవరైతే సుఖముగ నున్నరోజులలో జాగ్రత్తగ మసలుకొనకుండ, నిర్లక్ష్యముగను

నియమ రహితముగను జీవితము గడిపివేసిరో, వారిపుడెట్టి దురవస్థలో నున్నారో మీరే చూచుచున్నారు కదా. సుఖ సమయములో మనము చాల జాగ్రత్తగ మసలుకొన వలయును. సత్సంగములో మనకు అభ్యాసము, సేవ వగైరా సావకాశములు లభించినపుడు మనము వాని లాభమును పూర్తిగ తీసికొనవలయును.

## 5

1 ఫిబ్రవరి 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ రోజు వసంత పంచమి పవిత్రదినము. అందఱి హృదయములు హర్షపూరితమై యున్నందున, మీ అందరి ప్రసన్నత జూచి నాకును ప్రసన్నతగ నున్నది. ఆంగ్ల భాషలో "One lives to learn" అనెడి సామెతయున్నది. అనగా మానవుడు జీవితమంతయు క్రొత్త క్రొత్త విషయములను ఎల్లప్పుడు నేర్చుకొనుచునే యుండును అని దాని అర్థము. ఏదైన నొక విషయము తెలిసికొనగల సావకాశము దొరికినపుడు దానిని వెంటనే తెలిసికొనవలయును. ఒక నీతిని నేర్చుకొనవలెనన్నను, ఒకశిక్షను పొందవలెనన్నను, అది వృద్ధుని వలన నైనను తెలుసుకొనవచ్చును, బాలుని వద్దనుండియైనను తెలిసికొనవచ్చు ననెడి విషయమును మీరు జ్ఞాపకముంచుకొనుడు. ఆంగ్లములో మఱొక సామెత " The child is the father of the man " అనికూడ ఉన్నది. అనగా చంటి పిల్లవాడు పెద్ద మానవునకు తండ్రి యని దాని అర్థము. దీని భావార్థము ఇంచుమించు మొదటి సామెతతో కలిసియే యున్నది. కాని దీనిని కొంత ఉత్తమ భావము వచ్చునట్లు ఈ క్రింది విధముగ నేను మార్చగోరుదును.

"The Child is the Teacher of Man" అనగా ఒక చిన్న పిల్లవాడు మానవునకు గురువుగ నుండి శిక్ష గరపగలడు అని దీని అర్థము. నేనీనాడు సాయంకాలము ప్రేమ విద్యాలయము యొక్క వసంత దీపములను చూచుటకు వెళ్ళినపుడు అచ్చటి బాలికల వద్దనుండి ఒక నీతి నేర్చుకొంటిని. ఆ పిల్లలు ఒకచిన్న ప్రార్థనను పద్యరూపమున పాడిరి. దాని భావార్థ మిట్లున్నది. జగమందంతట నిక్కాలమున దుఃఖములు బాధలును వ్యాపించిపోయినవి. ఓ దాతా, దయాళో, ఈ దుఃఖములు, కష్టములు నింతటితో నశించిపోయి, అందఱకు ప్రేమ భక్తుల దానము నిచ్చులాగున మహా దయ జూపుడు. ఇప్పుడు సత్సంగములో చదివిన వచనములో గూడ మీరు మీ

ఆచరణను వచనములలో చెప్పిన ప్రకారము మార్చుకొన్నప్పుడే, వచనములు విన్నందుకు మీకు లాభము గల్గినట్లెంచుకొన వలయునని చెప్పిరి. పరమార్థ సంబంధమైన ఆచరణ ఆచరించినపుడే పారమార్థిక మార్గమందు నడచుట కధికారము చేకూరగలదు. అందుకు సరియైన ఆచరణ నవలంబించనపుడు వచనములను శ్రవణము చేయుట నిరర్థకము. అటులనే, యుద్ధక్షేత్రములో నేమియు పని చేయలేకుండిన యుద్ధ భటునివలన కాని, అతని ఆయుధముల వలనకాని లాభమేమున్నది? కాని చదువుకొన్న విద్యాను సారముగ నడచుకొనలేకుండిన విద్వాంసుని కేవల వాచికజ్ఞానియని అందురు కదా. ఎవరైనను వచనములను విన్నపుడు, వానిని ఒక చెవితో విని రెండవ చెవిలో నుండి జారవిడిచి, తనలోలోపల నేమియు పారమార్థిక పరివర్తన గలుగకుండ నుండిపోయి, పారమార్థిక కార్యక్రమ మేమియు కూడ, జరుపకుండ నుండిపోయినచో, అతని హృదయ మెప్పటియట్ల కఠోరముగనే ఉండిపోవును. అట్టివాడు పై పైకి వచనములు విన్నట్లు చెప్పుకొన వచ్చునుగాని అతని హృదయము మాత్రము యథాప్రకారము విషయపూరితముగనే యుండిపోవును. అట్టి పనులన్నియు వ్యర్థము. వచనము లేమియు లేకపోయినను, ఒండొరులలో ప్రేమభావ ముండి మనసున రాధాస్వామీ దయాళుని కేదైన సేవ చేయవలయుననియు కుతూహలముండి, పెద్దల యెడల గౌరవభావమును, పిన్నల యెడల ప్రేమాదర భావమును ఉన్నయెడల, ఈ పరిస్థితి అంతకన్న నెక్కువ శ్రేష్ఠతరము. కావున మీరు కూడ ఈ రోజున, ప్రేమ విద్యాలయములోని చిన్నపిల్లలు వలెనే "ఓ దేవాధిదేవా! మా కందరకును మీ చరణములందు ప్రేమ భక్తులను దానము చేయుడు. మేము సత్సంగి పురుషులను మా సోదరులుగను, సత్సంగి స్త్రీలను మా సోదరీలుగను, పిల్లలనందరిని మా సొంత పిల్లలుగను భావించుకొనునంతటి మానసిక పరివర్తన మాలో కలుగజేయుడు" అని రాధాస్వామీ దయాళుని ప్రార్థన చేయుడు. ఈ విధముగ మీ హృదయములలో సమస్త జీవులయెడల, ప్రేమ, సానుభూతి భావములు బయల్దేరిన యెడల హుజూరు రాధాస్వామీ దయాళురు మనలోనీ ఉత్తమ భావములను పరిశీలించి మన యెడల ప్రసన్నులై, త్వరలోనే మనను తమ చరణముల మీదికి తీసికొన గలరని ఆశించ వచ్చును.

## 43

రిటైర్డ్ డిప్యూటీ కలెక్టరు ప్రేమీభాయీ బహాదుర్ లాల్ గారి మరణమునకై చేసిన సానుభూతి ప్రకటన సమావేశములో హుజూరువారిట్లు

సెలవిచ్చిరి. డిప్యూటీ సాహెబ్ గారితో నాకు అంత యెక్కువ పరిచయము లేదు. కాని నాకు వారి పరిచయ సావకాశము గలిగినంతలో వారి కార్య తత్పరతను పరిశ్రమ స్వభావమును చూడగ నాకు వారియందు గౌరవభావము గలిగెను. ఆయన తన కర్తవ్యములను బహు శ్రద్ధతో నెరవేర్చెడి వారు; చాల శాంత స్వభావులు; ఎవరితోను కజ్జాలు తగాదాలు పెట్టుకొనెడి వారు కారు. పైగా, ఇతరులలో తగవులు వచ్చినపుడు వారల తగవులను దీర్చెడి వారు. సత్సంగమునకు నియమముగ వచ్చెడివారు. జనవరి 31వ తేది ఉదయము ఆయన నియమ ప్రకారము వ్యాయామ స్థలమునకు వచ్చి యుండిరి. ఆయన శరీరము దౌర్బల్య స్థితిలోనున్న రోజులలో గూడ వ్యాయామ స్థలమునకు వచ్చుచుండుటలో ఆయనకు రెండు ఉద్దేశ్యములు ఉండెను. మొదటిది, కొద్ది నడక నడిచెదమనియు తేలికగా వ్యాయామము కూడ నుండుననియు. రెండవది ఇచ్చటి సమస్త ప్రేమీ సోదరులకు తమ దర్శన లాభము గలిగించెడివారు. మీరందరు ఆయనకు హుజూరు రాధాస్వామీ దయాళుని ధామమందు నివాస మివ్వవలయునని రాధాస్వామీ దయాళుని చరణములందు చేసిన ప్రార్థన విషయములో పవిత్ర గ్రంథము నుండి సూచన కావలయునన్నచో, అది శబ్దములో కనుపించు చున్నది. అనగా మీరు ప్రార్థన చేయక ముందే ఆ ప్రార్థన అంగీకరించ బడినది. నిజమునకు, డిప్యూటీ సాహెబ్ అట్టి యుత్తమ గతికి అర్హులు. అందుచే హుజూరు రాధాస్వామీ దయాళుకు ముందుగనే ఆయనకు తమ చరణ నివాసమును అనుగ్రహించిరి.

## ౪7

ఒక డిప్యూటీ కలెక్టరుగారు రోగగ్రస్తుడై యుండెను. హుజూరువారు ఆయనను తమ యెదుట కూర్చుండ బెట్టుకొని, "మీరెందు కింత వ్యాకుల పడుచున్నా"రని ఆయనను అడిగిరి. డిప్యూటీ సాహెబ్, దయాల్బాగు మీదికి ఒక గొప్ప ప్రమాదము రానై యున్నదనియు. చెట్లునీడలో నిల్చుకొనగల దిక్కు గూడ జనుల కుండదనియు నాకు భయముగ నున్నదనియు సమాధానము చెప్పెను. హుజూరువారు, ప్రమాదము వచ్చు రోజులు ప్రపంచము మీదికి వచ్చుచున్నవి. ఆ మేఘములు సత్సంగము మీదికి గూడ రావచ్చును, ఉరుములుగూడ ఉరుమవచ్చును, కాని వర్షము కురియకుండగనే వెడలిపోవును. ఇంక మీకెందుకు గాబరా? అని సెలవిచ్చిరి.

వృద్ధుండును హృదయ రోగగ్రస్తుడునైన డిప్యూటీ సాహబ్ మరొక విషయము చెప్పుకొనిరి. "సత్సంగము తాలూకు రూపాయలు ఏమైనను నా వద్దనుండి పోయినవేమో నాకు తెలియదు." హుజూరువారు, "అట్లున్నను గూడ నేను ఆ బాకీని మాఫుచేసితిని. కావున మీరీ బెంగను కూడ మనసు నుండి తొలగిపుచ్చుడు" అని సెలవిచ్చిరి. అప్పుడు తిరిగి డిప్యూటీ సాహబ్ ఆడపిల్ల పెళ్ళిని గురించిన చింత నన్ను చుట్టివేయు చున్నది'' అని చెప్పు కొనిరి. తేజః స్వరూపులైన హుజూరువారు, "అందుకు తగు యేర్పాటు కూడ మేము చేయించెద''మని సెలవిచ్చిరి. అప్పుడు డిప్యూటీ సాహబ్ హుజూరు వారిని చరణ మిమ్మనియు, ప్రేమదానము ఇప్పించు మనియు ప్రార్థించెను. "అందులకైతే సాహబ్జీ మహారాజువారిని ప్రార్థన చేయుము'' అని హుజూరువారు సెలవిచ్చిరి. ఆ తర్వాత దివ్యేచ్ఛకు శబ్దములను తీయించి చదివించిరి. యీ క్రింది శబ్దములు వచ్చినవి.

ఆజ మైం దేఖూఁ ఘట మేం తిలకో।
లగీం యే బతియాఁ ప్యారీ దిల కో॥

(సారబచన్, బచన్ 34, శబ్దము 8)

సతగురు ప్యారే నే నిభాఈ, ఖేప హమారీహో
(ప్రేమబానీ, 3వ భాగము, బచన్ 12 (4) శబ్దము 31

దేఖన చలీ బసంత అగమ ఘర్।
దేఖ దేఖ అబ్ మగన భఈ॥

(సారబచన్, బచన్ 38, శబ్దము 8)

దివ్యేచ్ఛకు తీసిన శబ్దములు చదివిన పిమ్మట హుజూరువారు డిప్యూటీ సాహబ్ ని ఇట్లు ప్రశ్నించిరి. ''ఇప్పుడు చెప్పుడు, మీ గాబరా పోయినదా, లేదా?'' డిప్యూటీసాహబ్ ''ఇప్పుడు నా మనస్సునకు చాల ధైర్య సంతోషములు గల్గినవి'' అని సమాధానము చెప్పెను. అందుపైన హుజూరువారు డిప్యూటీసాహబ్ ని నిలబెట్టి, ''మీరు సత్సంగములో నందరకు వినిపించు లాగున పెద్ద గొంతుకతో నా గాబరా అంతయు పోయినదని

బిగ్గరగ "చెప్పుడు" అని సెలవిచ్చిరి. డిప్యూటీసాహెబ్ అట్లే చెప్పిరి. హుజూరువారు మహాదయతో డిప్యూటిసాహెబ్ గారి కరపీడనము చేయదల్చిరి. కాని ఆయన హుజూరువారి చరణములను స్పృశించుటకై అనుజ్ఞ యిమ్మని పట్టు పట్టిరి. అందుపైన తేజః స్వరూపులైన హుజూరువారు, "మీతో కరము కలిపినందువలన నాకు గలుగగల సంతోషమును మీరు నాకు లేకుండ చేసిరి" అని సెలవిచ్చిరి. అప్పుడు చదివిన వచనములో, "ఈ విధముగ నెవరైనను తో్రివతప్పి మనశ్శాంతి లేకుండ బాధపడుచున్న యెడల, అందుకు కారణమేమనగా వారికి వాస్తవమైన సద్గురువు లభించలేదు, అనగా, అట్టివారు నిజమైన సద్గురుని సత్సంగములో నున్నను కూడ వారలకు సద్గురువు నందు పూర్ణ విశ్వాసము లేదని అర్థము" అని వ్రాసియున్నది. హుజూరువారు "డిప్యూటీసాహెబ్, మీకు సాహబ్జీ మహారాజు వారియందు నిజముగ సంపూర్ణ విశ్వాసముండెనా" యని ప్రశ్నించిరి. డిప్యూటీసాహెబ్ "హుజూరువారు నామీద మహాదయ జూపుచుండిరి కాని, నాకు వారిమీద విశ్వాసము అపక్వముగనే యుండెడిది." అని చెప్పుకొనిరి. హుజూరువారు "మీకు సాహబ్జీ మహారాజు వారియందు విశ్వాసము అపక్వముగ నుండినచో, నిపుడా లోపమునేల పూర్తి చేసికొనెదరు? మీకు ఇప్పుడు ఆంతర్యమున గాబరాగా ఉండుటకు కారణము మీకు ఇప్పుడుగూడ సాహబ్జీ మహారాజువారి చరణములందు విశ్వాసము పూర్తిగ లేకపోవుటయే అని సెలవిచ్చిరి. తిరిగి హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. "ఇప్పుడు వచనములు చెప్పుట లేదని జనులు అనుచున్నారు కాని నిజమేమనగా, సాహబ్జీ మహారాజువారి వచనములను మీరందరు నిన్నాళ్ళనుంచి వినుచుండినను కూడ, మీకు ఆ వచనములన్నియు నొక చెవిని ప్రవేశించి రెండవచెవి నుండి జారిపోవుచుండెడివి కాని, వాని వలన మీరేమియు లాభమును పొందలేక పోయిరి. పారమార్థిక విషయము లను అవగాహన చేసికొనగల శక్తిని గూడ సంపాదించు కొనలేక పోయిరి. మీ అందరి పైనను సాహబ్జీ మహారాజువారి వచనముల అప్పు తీరకుండగ నట్లే ఉండిపోయినది. వారి కాలములో శ్రద్ధా భక్తులతో సత్సంగము నెవరెవరు చేసికొనలేదో వారందరు వాస్తమముగ చాల అభాగ్యులు. ఇప్పుడట్టి వారందరు రిక్తహస్తులై యున్న యెడల ఆశ్చర్యమే మున్నది?"

మీరు వారి వచనములను హితోపదేశములను విని ఆ ప్రకారము నడుచుకొనక పోయినందుననే ఇప్పుడు దుర్గమ మార్గమున పడిపోవలసి వచ్చి

నది. ఇన్ని వచనములు విన్న మీదట కూడ మీ మనస్సులలో నింకను పూర్వపు విశ్వాసములు మొండి పట్లును తొలగకుండ నుండిపోయినచో, మీలో పరమార్థ సంబంధమైన పరివర్తన మేమియు గలుగలేదని స్పష్టపడుచున్నది.

ఆఖరున డిప్యూటీ సాహబ్ క్షమాపణము వేడుకొని, హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఫొటోవద్దకు వెళ్ళినిలబడి, బిగ్గరగ నరచుచు, తనకు సాహబ్జీ మహారాజువారియందు పూర్ణ విశ్వాసము వచ్చినదని మొఱపెట్టుకొనెను.

## ౭౮

19 ఫిబ్రివరి 1941 వ తేది సాయంకాలము సారబచన్ గద్యలో నుండి, యీ క్రింది భావార్థమును తెలుపు వచన మొకటి చదవబడినది: భగవంతుడు తన భక్తుల హృదయమున నివసించును. భగవంతునితో కలవవలెనని కోరు భక్తుడు భగవద్భక్తులకు సేవజేసి వారి ప్రసన్నతను సంపాదించుకొనవలయును. ఆ వచనానంతరము తేజః స్వరూపులైన హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు చదివిన వచనమును మీరు శ్రద్ధపెట్టి వినియుండవచ్చును. మీరు దానిని బాగుగ విమర్శ చేసుకొని, అందుండి మీకుపయోగకరమైన విషయమును మీరు గ్రహించుకొనవలయును. మీకు హుజూర్ రాధాస్వామీ దయాళుని ప్రేమ పాత్రులు కావలెనను కోరిక ఉన్నయెడల, వారి ప్రియభక్తుల సేవజేసి, ఆ భక్తుల యెడల ప్రేమ భావము జూపి వారికి సుఖశాంతులు గల్గించుటకన్న మరొక సహజోపాయ మెద్దియు నుండనేరదు. యథార్థమైన సత్యాన్వేషి ఈ పద్ధతిగనే ప్రవర్తించవలయును.

## ౭౯

20 మార్చి 1941 వ తేదీ రాత్రి సత్సంగములో నీ క్రింది శబ్దమును పాఠము చేసిరి.

గురు బచన కహేఁ సో సున రే
అబ్ సతసంగ మేం చిత ధర రే॥

( సారబచన్, 20 వ వచనము, 28 శబ్దము )

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : మీరు ఈ పై శబ్దమును శ్రద్ధపెట్టి వినియుండిన యెడల మీలో నెవరైనను సర్కార్ సాహెబ్ వారిని కాని సాహబ్జీ మహారాజువారిని కాని యెప్పుడైనను ప్రసన్నులుగ జేసికొని వారి దయా కటాక్షములను సంపాదించుకొన్న యెడల, వారు సెలవిచ్చిన ఆజ్ఞలను మీరు పాలించి ఆచరణలో పెట్టుట మూలముననే, వారి ప్రసన్నతను, దయా కటాక్షములను అట్లు సంపాదించుకొను సౌభాగ్యము గల్గుచుండెనను విషయమును గ్రహించుకొని యుండవలయును. వారేదైన నొక ఆజ్ఞ నిచ్చినపుడు మీరు ఆ మాట వినకుండ మీ మనస్సు పట్టిన పట్టును వదలకుండ, నట్లే యుండినపుడు మీకా బండపట్టు పట్టినందువలన నేమియు లాభము గలుగ నేరదు. మీలో మీరు పట్టుదలలు, విరోధములు పెట్టుకొన్నను అంత యెక్కువ హాని ఉండక పోవచ్చును కాని, సర్కార్ సాహెబ్, సాహబ్జీ మహారాజు వార్లతో పట్టుపట్టి, వారి మాటలను ఆజ్ఞలను పాలించకుండ నుండినచో మీరు మీకే హాని గలుగ జేసికొందురు. ఇప్పుడు సద్గురువు ఇచ్చటకు వచ్చి మీకు ఏదైన నొక ఆజ్ఞను ఇచ్చినను లేదా ఒకమాట చెప్పినను మీరు ఆ మాటను లేక ఆజ్ఞను సంతోష పూర్వకముగ శిరాసావహించవలసి యున్నది. అందువలననే మీకు శ్రేయము గలుగును. అంతట ఒక సర్దార్ జీ సాహబ్జీ మహారాజు వారుకూడ నిట్లే, సర్కార్ సాహెబ్ వారి నిజధార తమలో విరాజమానమైయుండినను గూడ, సర్కార్ సాహెబ్ వారు ఏ ఆజ్ఞ యిచ్చిన దానిని వెంటనే పాలించవలయునని సెలవిచ్చుచుండెడివారు. ఇప్పుడు హుజూరువారు కూడ అదే విధముగ ప్రతి విషయమును సాహబ్జీ మహారాజు వారిమీద ఆరోపించి చెప్పుచున్నారు. మేము ఇప్పుడు తమ ఆజ్ఞలను అనుసరించియే నడచుకోవలసి యున్నదని నాకు అర్థమగుచున్నది. నా అభిప్రాయములో ఈ వచనము మీకే వర్తించునని అనుకొనుచున్నాను అని చెప్పెను.

హుజూరువారు ఇట్లనిరి : సాహబ్జీ మహారాజువారు మీకెట్లు సెలవిచ్చిరో అట్లే మీరు ఆచరించవలెను. నేనిపుడు మీకు చెప్పునది ఏమనగా సర్కార్ సాహెబ్ సాహబ్జీ మహారాజు వార్ల కాలములో వారి దయాకటాక్షముల భాగ్యమును బడసిన వారందరును, వారి దివ్యేచ్ఛను గాని వారి ఆజ్ఞలనుగాని వారు చెప్పిన విషయములనుగాని తెలుసుకొని, ఆ యాజ్ఞలను దివ్యేచ్ఛను అనుసరించి పాలించినందువలననే అట్లువారి ప్రసన్నతను సంపాదించు కొన్నారని మాత్రమే. సాహబ్జీ మహారాజువారి మాటలు నాకెట్లు వర్తించగలవు. మీరు ఆ మాటను నాకు పట్టించను కూడదు. ఆ తర్వాత

హుజూరువారు, ఇప్పుడు చదివిన శబ్దము వలనగూడ నిదే విషయము వివరించబడినదని తిరిగి సెలవిచ్చిరి. నేనుదానినే మీకు చెప్పితిని. మీరు ఆ ప్రకారము నడుచుకొని, పరిశీలించి చూచుకొనుడు పరమార్థ లాభము మీకు గలుగుచున్నదో లేదో, సాహబ్జీ మహారాజువారు మీఆజ్ఞాపాలనము మూలమున మీ మీద దయ చూపుచున్నారో లేదో.

సర్దార్ జీ తన చిత్తమును హుజూరువారి చరణముల మీదికి తీసికొని జోడించ వలసినదని ప్రార్థించగా, హుజూరువారు మొట్ట మొదట మీరు చెప్పిన విషయమును మన్నించి హుజూరువారి ఆజ్ఞల ప్రకారము వారి దివ్యేచ్ఛ ప్రకారమును నడుచుకొనవలయును. అటుపిమ్మట భగవంతుడు మీ మీద తప్పక దయ జూపగలడు" అని సెలవిచ్చిరి.

# 50

11 ఏప్రిల్ 1941 వ తేదీ రాత్రి సత్సంగములో పెండ్లిండ్లు జరిగిన పిదప తేజః స్వరూపులైన హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : మీకు నేను పెద్ద పెద్ద ఉపన్యాసములు ఇచ్చుట అలవాటు లేదు. కాని పెండ్లిండ్లు చేసికొన్న వధూవరులు నా కన్న వయసులో చిన్నవాండ్రే కాబట్టి నేను వారికి హితోపదేశము చేయుటలో తప్పేమియు లేదు. పెండ్లి అయిన పిదప హుజూరు సాహబ్జీ మహారాజువారు వధూవరుల కిట్లు సలహా చెప్పుచుండెడివారు. మీ రెప్పుడు హుజూరు రాధాస్వామీదయాళుని సేవ చేయుచుండుడు. ఒండొరులు దెబ్బలాడవలదు. మీరు పరస్పరము ఐకమత్యముతో మసలుకొన లేక పోయినచో, అధమాధము కష్టములు దుఃఖములు వచ్చినపుడైనను మీరు ఒండొరులకు తప్పక సహాయము చేసికొనుడు. పరమార్థ విషయములో మీరు విడిపోవలదు. సేవాసత్సంగములు తప్పక చేసికొనుచుండుడు. ఈ రోజులు చాల ప్రమాదపూరితముగ నున్నవి. కావున మనము ప్రతి కార్యమును చాల జాగరూకతతో ఆలోచించుకొని చేసికొనవలయును. అనగా మీరు కాలమునుబట్టియు, మీ ఆదాయమును బట్టియు కనిపెట్టి చూచుకొని మీ ఖర్చులలో హెచ్చు తగ్గులు చేసికొనుచుండవలయును. మీ దుప్పటి పొడుగునకు మించకుండులాగున కాలు జాపుకొనవలయును. పారమార్థిక విషయములలో కాని స్వార్థ విషయములలోకాని, అన్నిసందర్భములు చక్కగ ఆలోచించి చేసికొనవలయును. గృహస్థాశ్రమములో మీరు చక్కగ చూచుకొని

నడుచుకొనవలయును. ఒక్కసారి తప్పటడుగు పడినయెడల, నది దిద్దుకొనుట దుష్కరమను విషయము జ్ఞాపక ముంచుకొనుడు. మీకు సంతోషప్రదమైన పరిస్థితి గల్గిన తరుణములో దానిలో మైమరచి మున్గిపోరాదు. కష్టసమయము వచ్చినపుడు ధైర్య సాహసములను కోల్పోవనుకూడదు. పెండ్లి అయిన తర్వాత కొంత సహన శీలతతో మసలుకొన్న యెడల అత్తకోడండ్ల మధ్యన జరిగెడి తగాయిదాలకు తావే ఉండజాలదు. అప్పుడే క్రింది శబ్దమును చదివిరి:

స్వామీ తుమ కాజ బనాయ సబన కే।

(ప్రేమవిలాస్ శబ్దము 104)

ఈ సమయమునకు సరిపోవు మంచి శబ్దమును తీసి చదువుడని హుజూరు వారు సెలవివ్వగా, యీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు వచ్చినది.

సతగురు ప్యారే నే సునాఈ, ప్రేమ్కూ బానీ హో।

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 45)

అప్పుడు హుజూరువారు మరొక విధమైన శబ్దమును తీయుడని సెలవివ్వగా, యీ క్రింది శబ్దము వచ్చినది.

గురు ధరా సీస పర్ హాథ్. మన క్యోం సోచ కరే.

(ప్రేమ బానీ భాగ్ 3, బచన్ 15. శబ్ద 3)

## 5

13 ఏప్రిల్ 1941 తేదీని హుజూర్ సర్కార్ సాహబ్ వారి భండారా దినము. ఆనాడు ఆరతి సమయములో నీ క్రింది శబ్దములు చదవబడినవి.

ఆజ మేరే ఆనంద హోత అపార్।

(సా. బ. బచన్ 8 శబ్ద 4)

సఖీ రీ మేరే దిన ప్రతి ఆనంద హోయ్।

(ప్రేమ బానీ, భాగ్, బచన్ 4, శబ్ద 6)

చల రీ సురత అబ్ నిజ ఘర్ అప్నే
కాహే కో జగ మేం సోతీ హై।

(ప్రేమ బిలాస్, శబ్ద 65)

శబ్ద పాఠానంతరము తేజఃస్వరూపులైన హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి. క్రితము సంవత్సరము వసంత పంచమి రోజున మీరు మీ ఆర్థిక కష్టములను ఇతర వ్యక్తిగత బాధలను పోగొట్ట వలయునని రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రార్థన చేసిరి. సత్సంగము యొక్క ప్రస్తుత పరిస్థితిని మీరు పరిశీలించుకొని, క్రితము సంవత్సరము కన్న నీ సంవత్సరము మీకు చింతా పరిస్థితులు క్లిష్ట పరిస్థితులును తగ్గిపోయినవో లేదో చూచుకొనుడు. దీర్ఘ వ్యాఖ్యానములు చేసినందు వలన ప్రయోజనము లేదు. అసలు విషయమును కొద్ది మాటలలోనే తెలియపరచుట యెక్కువ యుక్తముగ నుండును. ఈ సమయము కష్టపడి పనిచేయవలసిన సమయము కాని కబుర్లు చెప్పెడి సమయముకాదు. ఇట్టి పరిస్థితిలో, ఇంత సమయానుకూలముగ ప్రకటన చేయు శబ్దములు దివ్యేచ్ఛకు వచ్చినపుడు, వాని నన్నిటిని విన్న పిదప, ఎవరును మన ప్రార్థన రాధాస్వామీ దయాళుని చరణముల వద్దకు చేరలేదని కాని, అది అంగీకరింప బడలేదనికాని అనజాలరు. ఈ శబ్దములలోని విషయములను బట్టి, అందరియొక్క ఆర్థిక పరిస్థితియు ఇంతకు ముందు కన్న నిపుడెక్కువ బాగుపడు చున్నదని చెప్పవచ్చును. మొదటి శబ్దముయొక్క మొదటి చరణమును "ఆజ మేరే ఆనంద హోత అపార" తిరిగి చదవమని చెప్పి చదివించి యీ చరణము మీకు అందరకు లభించిన అభివృద్ధిని భాగ్యమును సూచించుచున్నదని సెలవిచ్చిరి. దీని తర్వాత రెండవ శబ్దము యొక్క మొదటిచరణమును-

సఖీ రీ మేరే దిన ప్రతి ఆనంద హోయ్॥

కూడ తిరిగి చదివించి, ఈ సమయ మందు మీకు గల్గిన అభివృద్ధి సౌభాగ్యములు ఎల్లప్పుడు నట్లే యుండి పోగలందులకై ప్రార్థన యీ శబ్దములో చేయబడినదని సెలవిచ్చిరి. మూడవ శబ్దము గొప్ప ధైర్యోత్సాహదాయకము. ఈ శబ్దములో, కాలకర్మల శక్తులు మిమ్ములను అనగా చాల దుర్నయముగ దోపిడి చేయుచున్నందున జీవులు మహా దుఃఖములలోను చింతా వ్యాకులత్వములోను పడియున్నారనియు, ఇచ్చట మీ కష్టములను కనుగొని మీకు సానుభూతి చూపు వారెవరును లేరనియు, ముందు తెలియజెప్పి, ఇప్పుడు మీ సంఘమునంతను హుజూరు రాధాస్వామీ దయాళురు కనిపెట్టి చూచుచు మీకు స్వార్థ పరమార్థములు రెండింటిలోను సాఫల్యము చేకూరి మీ కందరకు మోక్షము గల్గులాగున జీవితమును గడుపుకొను

విధానమును వారు స్థాపించిరనియు, అందు మూలమున సంఘములో నందరును ఇహపరముల రెండింటియొక్క ఆనందమును అనుభవించుచు, సంతోషముగ యిచ్చటి నుండి పయనముచేసి హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు చేరుకొన గలరనియు చెప్పబడినది. సంఘమునకు ప్రస్తుతము గల్గుచున్న సమృద్ధి నిరంతరము స్థాయిగ నుండిపోవునని యీ శబ్దములో నొక విధముగ సూచించ బడుచున్నది. ఏలననగా, రాధాస్వామీ దయాళురు మీ కష్టములను బాధలను కనుగొని, వానిని తొలగించుటకు ఏర్పాటు చేయుచున్నపుడు, ఆ యేర్పాటు శాశ్వతముగ నుండిపోవునట్లే చేయుదురుకదా!

# 52

13 మే నెల 1941వ తేది సాయంకాలము సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" నుండి సత్సంగ్ కీ సేవా కీ మహిమా" అను వచనము చదవబడినది.

ఆ వచనము చదివిన పిమ్మట హుజూరు వారు ఇట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు చదివిన వచనమును మీరందరును శ్రద్ధగా విన్నారని అనుకొందును. ఇందులో సేవయొక్క మహిమ వర్ణించబడినది. దయాల్బాగులో క్రొత్త కంపెనీలు పెట్టవలయు ననెడి విషయము సత్సంగులలో కొంతకాలమునుండి ప్రచారము చేయబడుచున్నది. ఈ వచనయొక్క సారాంశమును, ప్రస్తుతము కంపెనీల విషయములో జరుగుచున్న మాటలతో కలిపి అర్థముచేసికొన్న యెడల, ఏ యే జనులు ఈ కంపెనీలలో పేర్లు తీసికొందురో, లేక కంపెనీల విషయమై గవర్నమెంటు ఆఫీసులలో కాని బయటకాని, యేవిధమైన సేవ నైనను చేయుదురో, లేక ఆ కంపెనీలలో డైరెక్టర్లుగా పనిచేసి వాని లాభములను వృద్ధిచేయుదురో, అట్టి వారందరికిని హుజూర్ రాధాస్వామీ దయాళుని యొక్కయు, సత్సంగముయొక్కయు, సత్సంగులయొక్కయు సమస్తమానవజాతి యొక్కయు సేవచేయు సావకాశము సంపూర్ణముగ లభించగలదను విషయము తేటపడుచున్నది. ఈ సమయములో ఈ కంపెనీ లలో వాటాదార్లు కాని, డైరెక్టర్లుగాని ఆఫీసర్ల రూపమునగాని, లేదా కార్య కర్తలుగాకాని సేవచేయు సావకాశము లభించిన వారు ఆ సేవలను చేసి దాని లాభమును పూర్తిగా పొందినచో నిక చెప్పవలసిన దేమున్నది. కావున నిపుడు సేవచేయుట కుత్సాహమును సావకాశము నెవరెవరికి లభించినద్లో

వారందరు నీ సేవ చేయదల్చుకొన్నారో లేదో లేక ఈ తరుణమును జార విడువ దల్చుకొన్నారో ఎవరికివారు నిశ్చయించుకొనుట యుక్తము. ఈ సమయములో మీకీ సేవా సావకాశము లభించినది కావున, మీరు అందుకు తయారుగనుండి ఆ సేవను ఉత్తమ పద్ధతిని నెరవేర్చుడు. లేదా యీ అమూల్య సావకాశము మీ చేతులలోనుండి జారిపోగలదు. ఈ పని నిస్సంశయముగ కష్టపడి పనిచేయవలసినట్టి కఠినకార్యమే. కావున డైరెక్టర్లందరును ఈ కంపెనీలను జయప్రదముగ నడిపించుటకై కఠిన పరిశ్రమ చేయవలసియున్నది అట్లు కష్టపడి పరిశ్రమ చేయుటకు సంసిద్ధులై యుండవలయును. మీలో పనిచేయునిమిత్తమై ముందుకు ఎవరు వచ్చెదరో వారు దృఢ సంకల్పము చేసికొని రావలయును. పని ప్రారంభించిన తర్వాత దానిని మధ్యలో విడిచిపెట్టి పోవుటయు, అట్లు ఆటంకములు వచ్చినపుడు గాబరా పడి పోవుటయు లేదా అడ్డు ఆటంకములును కలుగజేయుటయు చాల అయుక్త కార్యము- ఒక యంత్రమున కడ్డుగ పడియున్న పెద్ద బాయిని అడ్డు లేకుండ తీసివేయవలసి వచ్చిన యెడల, దానిని పూర్తిగ అడ్డుతీసి వేయు వరకు పట్టుదలతో పనిచేయవలయునే కాని, దానిని కేవలము ఒక దొల్లు మాత్రమే దొల్లించి యూరుకొనుట గాని లేదా, సగము దూరము మాత్రమే అడ్డుతీసి విడిచి పెట్టుటగాని, లేదా చేతకాని తనము చూపుట గాని బుద్ధిమంతుని లక్షణము కాదు. ఏపనిచేసినను పూర్తిగచేసి విడువ వలయును, లేదా అసలే ముట్టుకొన కూడదు.

# 53

21 మే నెల 1941 వ తేదీని సాయంకాలము సత్సంగములో సత్సంగకే ఉపదేశ్ నుండి ఒక వచనము చదివిన పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ వచనములలో చెప్పిన లాభదాయకమైన మూడు విషయము లున్నవి. అవి పైకి వినుటలో చాల సామాన్య విషయములుగనే గన్పించును కాని, చాల భావ పూర్ణమైనవి. వానిని బట్టియే మంచి సత్సంగి యెవరో చెడ్డ సత్సంగి యెవరో తెల్పుకొనుట సులభము. వాస్తవముగ నిందులో సత్సంగి యే పద్ధతుల ననుసరించి నడచుకొనవలయునో వివరించబడినవి. మీరు ఇందలి విషయములను శ్రద్ధపెట్టి వినియుండినచో, సత్సంగి ఉత్తమ జీవితమును

గడపవలయునన్నచో, నతడు వచనములు వినుటకై ఆసక్తి ఆనందము గలవాడు కావలయునని కాని, లేదా పవిత్ర గ్రంథములోని శబ్దములను పఠించవలయునని కాని, లేదా అట్టి మరొక పని యేదైన చేయవలసి యుండునని కాని ఇందులో నెచటను బోధ పరచ బడలేదని గమనించి యుందురు. ఆంతర్య పరివర్తన కలిగించుకొనవలసి యున్నదనియే యీ వచనములో గట్టిగ బోధించబడినది. అందుచే మనము ఆ పద్ధతి నవలంబిచుట యత్యావశ్యకము. ప్రతి సత్సంగియు నీ వచనమును బాగుగ అవగాహనచేసి కొనుటకై దీనిని మరొకసారి చదువుట యవసరమని హుజూరువారు సెలవిచ్చి తిరిగి రెండవసారి ఆ వచనమును చదివించిరి. ఇట్లు సెలవిచ్చిరి: మీలో స్మరణ ధ్యాన భజనలు సరిగ చేయ లేకుంటిమని ఫిర్యాదు చేయువారికీ వచనములో చాల లాభదాయకమైన సలహాలు గలవు. ఇందులో మొట్టమొదట ప్రతి సత్సంగియు స్వకాయ కష్టముతో సంపాదించుకొన్న ఆదాయము మీద బ్రతుక వలయునని చెప్పబడినది. ఏ సత్సంగితాను స్వయముగ చెమటూడిచి కష్టపడి పనిచేసి ఇతరులచేత గూడ అట్లే శ్రమపడి చెమటూడ్చునట్లు పనిచేయించునో అతడే యీ వచనము ప్రకారము నిజమైన సత్సంగిగా లెక్క పెట్ట బడగలడు. ఇందులో మరొక బోధ మనకు చాల యుపయోగ కరమైన దున్నది. అదే మనగా, ఎవరైన నొక జీవుడు మనను విడిచి వెడలి పోవుచుండి నపుడు, మనము ఏడిచి గోలచేసి అతనిని ఆ అంతిమ క్షణములలో వ్యాకులపఱచి, ఆ విచారము దుఃఖముతో మన మనస్సును పాడుచేసికొని, అందుమూలమున మన ఆరోగ్యమును కూడ పాడుచేసికొనుట కన్న, ఆ యాత్మ మన ఆదర సంరక్షణలతో నింతవరకు ఉండినను, ఇప్పుడు మనను వీడి హుజూరు రాధాస్వామీ దయాళుని చరణముల వద్దకు చేరుకొనుచున్నందుకు సత్సంగదృష్టి కోణముతో సంతోషించవలసి యున్నది. అటుపిమ్మట మఱి ఆ యాత్మవిషయములో మనమెంత మాత్రము చింతించనే కూడదు. అందుచేత మీరు మీ యింటిలో మీ ప్రియ బంధువు లెవరైనను మరణించినపుడు విచారించకూడదు. తర్వాత హుజూరువారు అచ్చటనున్న ఆడ వారిని మగవారిని సత్సంగులనందరిని వరుసగ ఒక్కొక్కరినే మీలో మీ ప్రియ బంధువు లెవరైన మరణించినపుడు ఈ సత్సంగ లక్ష్యమును మనస్సున పెట్టుకొని విచారము దుఃఖములకు లోనుగాకుండ నుండగల మహాశూరు లెవరున్నారని ప్రశ్నించిరి. అప్పుడు అనేకమంది స్త్రీ పురుషులు చేతులెత్తి "మాకీ సత్సంగ శిక్ష బోధపడినది. మే మా ప్రకారము నడచు

కొనెదము" అని తెలియజేసిరి. అప్పుడు హుజూరు వారు మీకు యెంతయో కాలమునుండి బోధించబడుచున్న శిక్షను ఇప్పటి కైనను మీరు అవగాహన చేసికొన లేకుండి, సమయము వచ్చినపుడు అట్లాచరించ లేనిచో మీరిక సత్సంగులెట్లు అగుదురు? ఉత్త ఉపదేశము తీసికొని, భేంట్లు ఇచ్చి సత్సంగ రిజిష్టరులో మీ పేర్లు వ్రాయించుకొన్నంత మాత్రము ననే మీరు యథార్థమైన సత్సంగులు కానేరరు" అని సెలవిచ్చిరి. మీరు భేంట్లు ఇవ్వనవసరమే లేదు, మీ ప్రవర్తన యే సత్సంగ పద్ధతుల ననుసరించి ఉండవలయును. మీ ప్రవర్తన యీ సత్సంగ శిక్ష ననుసరించి ఉండనిచో మీరు చేసెడి స్మరణ ధ్యానములకును, మీ రిచ్చెడి భేంట్లకును గవ్వంత విలువ కూడ యుండజాలదు. ఆ తర్వాత హుజూరువారు తిరిగి స్త్రీ పురుషుల సందరిని "మీయొక్క సంతానము గాని, మీ భార్యలు భర్తలు లేదా మరొక ప్రియబంధువులుగాని హఠాత్తుగా చనిపోయిన యెడల, దానిని ప్రసన్న హృదయముతో సహించుకొని, ఆ దుఃఖ ప్రభావము మనస్సు మీదికి రాకుండ చేసికొనగల శూరులు మీలో యెవరున్నారని రెండవసారి ప్రశ్నించగా చాలమంది జనము చేతులెత్తిరి.

## 54

23 మేనెల 1941 తేదిని హుజూర్ సాహబ్జీ మహారాజువారి "తీన్ కారామద్ బాతే" అనువచనమును చదివిన పిమ్మట హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి. రాధాస్వామీ మతముయొక్క పారమార్థిక కార్యక్రమ మంతయు సత్సంగిలో ఆంతర్య పరివర్తనము గలుగజేయు నిమిత్తమే చేయబడుచున్నది కాని పై పై ఆడంబరము కొఱకు చేయబడుటలేదు. ఈ కార్యక్రమము మూలమున మనలో నేమియు పరమార్థ సంబంధమైన మార్పు కలుగక పోయినచో మన స్మరణ ధ్యాన భజనలు భేంట్లు వగైరా పను లన్నియు వ్యర్థమే; పైగా వాని వలన మనలో ఉత్త అహంకారము పెరుగుట తప్ప మరొక లాభమేమియు నుండదు. సత్సంగు లందరును వారి బంధువులలో మరణము వచ్చినను, లేదా జబ్బులు, లేక మరొక గొప్ప, ప్రపంచిక నష్టకష్టములు గల్గినపుడును ధైర్యము పెట్టుకొని దివ్యేచ్ఛతో అనుకూలించి నడుచుకొనుచు, అందులోనే శ్రేయము ఉన్నదను భావనతో నుండవలయును. శబ్ద పాఠము చేయుటకు ముందు హుజూరువారు పాఠకులతో

"మీరు సత్సంగులందరికి హృదయములు సంతోషపరచు నట్టి శబ్దమును తీసి పాడుడు" అని సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

శబ్ద సంగ బాంధ సురత కా ఠాట్।
బహే మత జగ కా చౌడా ఘాట్॥

(సారబచన్, బచన్ 9 శబ్ద 7)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఎవరైతే వాస్తవముగ నీ జగత్తునుండి విముక్తినొంది హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములను జేరుకొన వలయునని కోరుచున్నారో, వారీ శబ్దములో చెప్పిన పద్ధతిని యెపుడు నడుచుకుందురో, అప్పుడే ఆ గతిని పొందెదరు. అట్లు నడుచు కొన్నందువలన వారికి సాంసారిక బంధనములు మోహమును నశించి అంతిమయాత్ర చేయుట సుకరమైపోవును. ఆ తర్వాత హుజూర్ వారు ఆ శబ్దముయొక్క చరణము లను ఒక్కొక్కటే వేరుగ చదివించి వాని అర్థమును బోధించగా అందరకును చాల సంతృప్తి గలిగెను. అప్పుడు వారు ఆడవారితో సాహబ్జీ మహారాజు వారిని ధ్యానముచేసి దివ్యేచ్ఛకొక శబ్దముతీసి చదువుమని సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

మేరే ప్యారే బహిన్ ఔర్ భాఈ
క్యోం ఆపస మేం తుమ ఝగడో।
రల మిల కర సత్సంగ కరనా॥

(ప్రేమ బిలాస్, శబ్ద 92)

ఇట్లు సెలవిచ్చిరి. బంధనములు త్రెంచుకొన నక్కరలేని యెడల, రాధాస్వామీ మతములో జేరనవసరమేమున్నది? సద్గురువుని శరణుజొచ్చుట దేనికొరకు? మన ఆదర్శము ఈ జగత్తునుండి మనము శాశ్వతముక్తి నొంద వలయుననియే కదా. మనమిదే యుద్దేశ్యముతో సత్సంగములో చేరి సద్గురు శరణ్యము స్వీకరించితిమి. ఈ శబ్దములో 3,4 భాగములను హుజూరువారు తిరిగి చదివించి, పిమ్మట తిరిగి 7వ భాగమును చదివించిరి.

ఇట్లు సెలవిచ్చిరి:- మీరు ఈ శబ్దముయొక్క 3,4 భాగములను 7వ భాగముతో కలిపి చదువుకొన్న యెడల, మీరు ఏ మమకార మోహము

లను నిర్మూలించుకొని ఉద్ధారము నొందు నిమిత్తమై సత్సంగములో చేరిరో, ఆ మమకార మోహములనగ నెట్లుండునో ఆ విషయమును, సత్సంగములో జేరి యెట్టి బంధనములను త్రెంచుకొన వలయునో, ఆ బంధనముల విషయమును మీకు బోధపడగలదు. మీకు వాస్తవమైన సత్సంగము యొక్క మహిమ అవన్నియు ఖండించ బడిన పిమ్మటనే బోధపడగలదు. మన కిపుడు వ్యాకుల సంతాపములు వాని మూలముననే కల్గుచున్నవి. ఈ విషయములే మనకు రాధాస్వామీ ధామమునకు ప్రయాణము చేయు సమయములో జ్ఞాపకము నకు వచ్చి ప్రయాణమున కాటంకము గల్గించును. స్త్రీ పురుషు లిరువురు నొకే జీవితా దర్శమును, అనగా శీఘ్రాతి శీఘ్రముగ విముక్తి నొంది రాధా స్వామీ ధామము జేరుకొన వలయునను ఆదర్శమును పెట్టుకొన్నచో, ఆ యాదర్శ ప్రాప్తికై పరస్పర సహకారము చేసికొనవలసి యున్నది. రాధా స్వామీ ధామమునకు ఇరువురిలో నెవరుముందుగ ప్రయాణ సంసిద్ధులైనను లేదా, వెడలిపోవుచున్నను. రెండవవారు వారిని సంతోషముగ వెడలిపో నిచ్చుటయేగాక, ఇంటి బాధ్యతయు నితర కృత్యములను మిగత కుటుంబ స్థులు నెర వేర్చుకొన గలరని ఆ వెడలిపోవు వ్యక్తికి ధైర్యము గలిగించుదుమని వారిరువురు నొకరి కొకరు ప్రతిన చేసుకొన వలయును. ఆ విషయమై వెడలి పోవు జీవునికెట్టి వ్యాకులత్వము గలుగకుండ నతడు ధైర్యముగ నీ ప్రపం చమునుండి వెడలిపోవలయును. ఈ విధముగ నొకవ్యక్తి రెండవ వ్యక్తిని సంతోషముగ వెడలిపోనిచ్చుచు, అ త డు ధైర్యముగ వెడలిపోవునట్లు ఏర్పాటు చేయుచుండిన యెడల నెంత మహాశ్లాఘనీయముగ నుండును! మీరు పరస్పరమును ఆదర సానుభూతులు గలిగి యుండుచు నిరువురిలో నెవరికైన విముక్తి యెంత శీఘ్రాతి శీఘ్రముగ నై పోయినను శ్రేయస్క రమే యనెడి భావముతో నున్నయెడల నెంత ప్రశంస నీయము! అట్లైనచో మీ హృదయమున బంధనములెట్లు ఉండగలవు. అట్టి దృఢ విశ్వాసముతో నొకరినొకరు విడచి వెడలపోయినచో నష్టమేముండును! బినతీలో నీ క్రింది చరణములను పాడుచున్నప్పుడు:

సత జుగ త్రేతా ద్వాపర బీతా।
కాహూ న జానీ శబ్ద కీ రీతా॥
కలి జుగ మేం స్వామీ దయా బిచారీ।
పర ఘట కర కే శబ్ద పుకారీ॥

దయా ధార అపనా కర లీజే।
కాల జాల సే న్యారా కీజే॥

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. మూడు యుగములు వెడలిపోయిన పిమ్మట ఈ నాల్గవ యుగములో జీవులకు ప్రాపంచిక బంధనములను త్రెంచుకొని ముక్తి పొందు నట్లేర్పాటు చేయబడినదికదా! బంధనము లున్నంత కాలము కష్టము గల్గుచుండును. బంధనములే లేకుండినచో, ఎచ్చటికి పోవలయునన్న నచ్చటికే వెడలిపోవచ్చును. ఒక పరదేశము కానిండు, లేక మరేమైనను కానిండు, భేదము చింతయు నేమియుండదు. మనము కాలుని జాలము నుండి విడుదలపొంది, భగవంతుని దర్బారులో వారు మనలను తమ తమ ఆత్మీయులుగ జేసుకొనవలయునని ప్రార్థన చేయుచుండగ: అట్టి సమయము వచ్చి ఒకరినొకరు విడిచి వెడలి పోవలసిన పరిస్థితి గల్గినపుడు; మనము సంతోషముగ నొకరి నొకరు విడిచి వెడలిపోవలయును.

## 55

24 మే 1941 వ తేది సాయంకాలము సత్సంగములో సత్సంగ కే ఉపదేశ్ మొదటి భాగమునుండి వచనమును చదివిరి. ఆ వచనానంతరము హుజూరు వారు ఇట్లు సెలవిచ్చిరి. ఇంతవఱకు నందరి యభిప్రాయమును ఏ కర్మనైనను దానియుద్దేశ్యమును బట్టియే మంచిదని నిర్ణయించ వలయునని యున్నది. ఏపనియైనను తానంతట నదియ చెడ్డదికాదు, మంచిదికాదు, దానికర్త యొక్క యుద్దేశ్యమును చూడవలయును. ఏ పనినైనను మంచి ఉద్దేశ్యముతో చేసినపుడది మంచిపనియు, చెడ్డ ఉద్దేశ్యముతో చేసినపుడు చెడ్డది యగును. కాని యీ అభిప్రాయ మీ వచనములో, చివరకు వెడలుచున్న కొలంది చాలవఱకు, చాలవఱకే కాదు, పూర్తిగనే తారుమారు చేయబడినది. ఈ సిద్ధాంతము ననుసరించి మీరిపుడు, అభ్యాసయుక్తి నుపదేశించుటయు, వచనములను చెప్పుటయు తప్పని సరిగ మంచిపనులే అగునాయను విషయమును నిర్ణయించుడు. ఏ కృత్యము నైనను సదుద్దేశ్యముతోనే చేసినను గూడ, లాభదాయకముగ నుండ నవసరము లేదని ఈ వచనములో చెప్పబడినది. కావున ఉపదేశముల నిచ్చి వచనములను చెప్పుచుండుటవలన నెవనికైన లాభము గలుగుట ఆవశ్యకముకాదు. ఈ వచనములో ముందుకుపోగా హుజూరు సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చిన వరకు పూర్తికానిచో లాభ

మేమియు నుండ నేరదు. వారు, "సిద్ధ పురుషులు జ్ఞానులు నైన మహాత్ములు మానవుని యొక్క కర్తవ్య ధర్మములుగ హితోపదేశము చేసిన విషయము లను వారి ఆజ్ఞానుసారము శ్రద్ధా భక్తులతో నెరవేర్చిన యెడల నతనికి సుఖశాంతులు, భగవత్ప్రసన్నతయు, స్వర్గమును చేకూరగల" వని వ్రాసిరి. ఇచ్చట "జ్ఞానులు సిద్ధపురుషులు నైన మహాత్ములను పద సముదాయమునకు సాహబ్జీ మహారాజువారని అర్థము చెప్పుట అనుచితము కానేరదు. సత్సంగు లకు ఆచరణీయములని హుజూరు సాహబ్జీ మహారాజువారు నిర్ణయించిన విషయములను విడిచి యెన్నియో క్రోసులదూరము పోయినచో వచనములు ఒకటి కాదు ఏబది చెప్పినను మీకు లాభమేమియు గలుగ నేరదు. శరీరము విడిచి పెట్టుటకు ముందు రోజున, జూన్ నెల 23 వ తేదీన హుజూరు సాహబ్జీ మహారాజువారు మదరాసులో సముద్రపు టొడ్డున ఇదే విషయమును గురించి ఖచ్చితమైన సూచనజేసిరి. వారప్పుడు, నేను జీవిత ములో ఒక్క క్షణ మాత్రమైనను నా కర్తవ్యములను బాధ్యతలను నెర వేర్చుటలో లోపము చేయలేదు.'' అని సెలవిచ్చిరి. వారట్లు సెలవిచ్చినది, తమ ప్రవర్తన నిరాక్షేపమని చెప్పుటకు కాదు. ఏలనన, ఆచరణ ప్రవర్తన లను గుఱించి యెవరు నెన్నడు లోపములున్నవను ఆక్షేపణ చేయనేలేదు. మరేమనగా, వారి యీ వచనములను విని జనులందరు కూడ నదే ప్రకార మాచరించెదరను ఉద్దేశ్యముతోనే వారట్లు సెలవిచ్చిరి.

## 53

21 జూన్ 1941 తేదీని యీ క్రింది శబ్దమును చదివిరి.

సజన ప్యారే మన కీ ఘుండీ ఖోల్ ।

(ప్రేమ విలాస్, శబ్ద 128)

శబ్ద పాఠానంతరము "సత్సంగ కే ఉపదేశ్" మొదటి భాగమునుండి "సత్సంగ కీ అసలీ క్రియా గురుభక్తి హై" అను వచనము చదవబడినది. ఆ వచనము మధ్యలోనే హుజూరువారిట్లు సెలవిచ్చిరి. క్రితము వారము నేను ఈ విషయము మీదనే చర్చించి సత్సంగములో జేరి ఉత్త బాహ్యా కార్య క్రమము మాత్రము జరిపినందువలన నేమియు ప్రయోజన ముండనేరదని చెప్పితిని. ఆ లాభము పొందుటకు అంతర్యమున పరివర్తనము గలుగ వలయును. ఇపుడు చదివిన వచనము కూడ పై విషయమును మరింత ఎక్కువగ విశదపరచు చున్నది. దీనిని శ్రద్ధ పెట్టి వినుడు.

వచనము చదివిన పిమ్మట ఇట్లు సెలవిచ్చిరి:- ఈ వచనములో మనకు చాల గొప్పబోధ చేయబడినది. రేపు సాయంకాలము సత్సంగములో దీనిని తిరిగి చదివించవలయును.

# 57

5 జూన్ 1941 సాయంకాలము హుజూరువారు సత్సంగమునకు వచ్చిన తోడనే, "మీలో నిశ్శబ్దముగ కూర్చుండిన వారెవరు. సంభాషణ చేయు చుండిన వారెవరు?" అని అడిగిరి. చాలమంది మాటలు చెప్పుకొను చుండి నట్లు తేలెను. అంతట వారిట్లు సెలవిచ్చిరి. మీరిచ్చటకు వచ్చి మాటలు చెప్పుకొనుచు నున్నయెడల మీకు లాభమేమి కలుగును? మీరు ఇచ్చటకు వచ్చిన పిమ్మట నిశ్శబ్దముగ కూర్చుండి అంతర్ముఖముగ ధ్యానము చేసినపుడే మీకు సత్సంగము యొక్క అసలైన లాభము లభ్యము కాగలదు. నేను గతించిన దినములలో నీ విషయము మీదనే చర్చించుచు మనలో పార మార్థిక పరివర్తన మత్యావశ్యకమని చెప్పి యున్నాను. "సత్సంగ కే ఉపదేశ్" లోనుండినిన్న చదివిన వచనములో గూడ ఆ విషయమే చెప్ప బడినది. ఈ రోజున తిరిగి అదే వచనము చదువబడును. మీరు శ్రద్ధపెట్టి వినుడు. దాని ప్రకారము మీ ప్రవర్తన మార్చుకొనుటకు ప్రయత్నించుచు తిరిగి రేపు సత్సంగమునకు వచ్చినపుడు నిశ్శబ్దముగ కూర్చుండుడు.

# 58

8 జూన్ 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. కొద్దిరోజుల క్రితము నేను ఇచ్చటి ఆడవాండ్రను మగ వాండ్రను, "మీ యింటిలో మీ భర్తలు భార్యలు లేదా పిల్లలు లేక ఇతర ప్రియ బంధువు లెవరైనను మరణించిన యెడల మీరు ఆ కష్టమును పైకి శోకము నెక్కువ ప్రకట పఱచకుండ సహించుకొనగలరా" యని ప్రశ్నించి తిని, అప్పుడు ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా సమాధానము చెప్పిరి. ఉదాహరణకు, ఆడవాండ్రు తమకు కొంత వరకు దుఃఖము ఉండకతప్పదని చెప్పిరి. అయితే, ఇప్పుడు మరొక ప్రశ్న వేయవలసియున్నది. అదేమనగా, పిల్లలు పుట్టిన తోడనే వారిని తల్లుల వద్దనుండి వేరుగ తీసికొని పోయినచో ఆ తల్లులు ఆటంకము చేయకుండ నుందురాయను ప్రశ్న. బయట పరాయి

దేశములలో అచ్చటి ప్రజలు తమ దేశ క్షేమము ప్రజాక్షేమము కొఱకును ప్రాణముల నర్పించుచున్నారు. యుద్ధ క్షేత్రములోగాని, మరొక క్షేత్రములో గాని వారు అన్ని విధముల బలిదానమునకు తయారుగ నున్నారు. మీరు ఈ వర్తమాన మోహ బంధనములలోనే చిక్కుకొనియుండిపో గోరుచున్నారో లేక క్రొత్త సలహాలను అనుసరించి నూతన ప్రపంచమును చూడదల్చుకొన్నారో చెప్పుడు. మీరిపుడు వెంటనే సమాధానము చెప్ప లేనిచో ప్రమాద మేమియు లేదు; ఒక సంవత్సరము రెండు సంవత్సరముల వఱకు మీరు సమాధానము చెప్పకుండినను ప్రమాదము లేదు. కాని మీ రెప్పుడైన నీ ప్రశ్నకు సమాధానము చెప్పక తప్పదు. మొట్ట మొదట నీ ప్రశ్న పురుషుల నడుగుచున్నాను. వారి అభిప్రాయ మేమి? అంతట పురుషు లందరు నీ ప్రబంధము తప్పక చేయ వలసినదే యని జవాబు చెప్పిరి మీకిపుడు ఈ విషయము చెప్పగా, ఒక హాస్యాస్పద విషయముగ కన్పించవచ్చును. కాని యీ నూతన ప్రబంధము మీకు ప్రాపంచిక బంధనములును చింతలును లేకుండ జేయును. ఈ పద్ధతి యే యే దేశములలో ఆచరణలో నున్నదో ఆ యా దేశముల ప్రజలు గొప్ప దేశభక్తులుగ తయారగుచున్నారు. ఏలనన, వారి పాలన పోషణ విద్యా విషయము లన్నియు దేశము యొక్క ధనముతోనే జరిపించ బడినందువలన వారికి తల్లిదండ్రులయందు వ్యామోహములు గలుగ నేరదు. కావున వారికి తమ దేశమే తల్లిదండ్రులై పోవుచున్నది. వారి తల్లిదండ్రులకును వారిని గుఱించి యేమియు చింతయుండదు, వారికిని తల్లిదండ్రులను గురించి చింత యుండదు. తమ దేశమునకు జాతికిని సేవ చేయుటలో వారికి సంతోషము గలుగుచున్నది. వారి శిక్షా దీక్షలు పాలన పోషణల విషయములలో తమ దేశ ప్రభుత్వమును పూర్తి బాధ్యత వహించియుండుటచే, వారు తమ దేశము కొరకు ప్రాణములనిచ్చుట తమ ధర్మముగ భావించు కొనుచున్నారు. ఇప్పుడు యుద్ధము జరుగుచున్న దేశముల తాలూకు ప్రజలు వారి ప్రాణము లకును లెక్క చేయుటలేదు. వారు తమ నవయువకులను తమ దేశ సంరక్షణ నిమిత్తమును తమ జాతి సంరక్షణ నిమిత్తమును యుద్ధ క్షేత్రములో ప్రాణ ములు కోల్పోవుటకు పంపుచున్నారు. అనగా, వారలకు తమ నవయువకులను యుద్ధములో పోరాడించుటలో ఆనందము గలుగు చున్నదని దీని అర్థము కాదు. వారు అట్లు పంపుటకు కారణ మేమనగా, తామే యుద్దేశ్యమును సాధించు నిమిత్తమై యుద్ధము చేయుచున్నారో ఆ యుద్దేశ్యమే వారి కధిక

ప్రియమని తెలియుచున్నది. అట్లు చేయుటవలననే దేశమునకు జాతికిని సేవ జరుగగలదని వారి అభిప్రాయము.

ఈ కాలములో "న్యూ ఆర్డర్" (New Order అనగా "క్రొత్త విధానము") అను పదము వార్తాపత్రికలలో నెక్కువగ ఉపయోగించబడుచున్నది. ఒక రాష్ట్ర నాయకుడు తాను ఐరోపా దేశములో "న్యూ ఆర్డరు" స్థాపించుచున్నానని చెప్పుచున్నాడు. జపాను దేశమువారు తాము ఏషియా ఖండము యొక్క పూర్వ దక్షిణ భాగములలో "న్యూ ఆర్డరు" ఏర్పాటు చేసెదమని ప్రతిజ్ఞ సేయుచున్నారు. కాని సత్సంగ దృష్టికోణములో "న్యూ ఆర్డరు" స్థాపించుట కివి పద్ధతులు కావు. మనుష్యులను చంపి కొట్టి రక్తపాతము చేసి "న్యూ ఆర్డరు" స్థాపించిన నదేమి గొప్ప కార్యము? ఇతరులకు రక్తపాతము గలుగజేసి న్యూ ఆర్డరు స్థాపించుటకు బదులు మీ రక్తమే యితరులకు ఇచ్చి న్యూ ఆర్డరు ఏర్పాటు చేసిరను కొనుడు. ఈ రెండింటిలో నేపద్ధతి యెక్కువ శ్రేష్ఠమో మీరే ఆలోచించి చెప్పుడు. అది మంచిదా ఇది మంచిదా? మీ రక్తముతో పుట్టించిన పిల్లలను సంఘమునకు అప్పజెప్పుట మంచిదా, లేక మీ పిల్లలచేత యితరులకు రక్తపాతము గల్గించి న్యూ ఆర్డరు ఏర్పాటు చేయుట మంచిదా? అందుపైన కొందరు వృద్ధులు మొదటి పద్ధతియే శ్రేష్ఠతరమని నుడివిరి. హుజూరువారు, నేను నవయువకుల నడుగుచున్నాను, వారలతోనే నేను చెప్పుచున్నది, వారలనే యీ ప్రశ్న అడుగవలసియున్నదని సెలవిచ్చిరి. మీ వద్దనున్న పిల్లలు హుజూర్ రాధాస్వామీ దయాళుని పిల్లలని మీకు విశ్వాసముండి, ఆ విశ్వాసముతోనే మీరు వారిని మీతో నుంచుకొను చుండినచో, మీరు అట్లు వారిని సంతోషముగ నుంచుకొనవచ్చును. అందువలన నష్టమెద్దియు నుండజాలదు. నేనిపుడు అట్టి విశ్వాసములేని స్త్రీలనే "మీరు మీ పిల్లలను సత్సంగమునకు ఇచ్చివేయుటకు సిద్ధముగ నున్నారా లేదా?" అను ప్రశ్న అడుగుచున్నది. ఈ పద్ధతిని నడుచుకొన్న యెడల మీరు ప్రాపంచిక మోహ బంధనముల నుండి విముక్తి పొందగలరు. మరియు సత్సంగములో న్యూ ఆర్డరు అనగా నూతన వ్యవస్థను స్థాపించుటకును తోడ్పడగలరు.

## 59

10 జూన్ 1941 సాయంకాలము సత్సంగములో, "సత్సంగ్ కే ఉపదేశ్" లో "గురుగోవిందసింఘ్ కే జీవన చరిత్ర సే ఏక్ వర్క్" అను

వచనమును చదివిరి. పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఇపుడు చదివిన వచనమును మీరందరు శ్రద్ధగా విన్నారనే నమ్ముచున్నాను. కొంత మంది పెద్దమనుష్యులకు ఏదైన నొక గొప్పకార్యము చేయలేనిచో, కాలము గడుపుటయే చాలకష్టముగ నుండును. అట్టివారికి ఏదైన పెద్దపని దొరికిన యెడల కాలము చాల సులువుగ వెళ్ళిపోవును. ఈ మధ్యన మీతో, ముఖ్యముగ మీలో ఆడ వారితో నేను రెండు విషయములను గురించి సంభాషణ చేసితిని. మొదటి దేమనగా, మీలో నెవరెవరు భర్త చనిపోయినపుడు విచారము ప్రకటించకుండ నుండగలరను విషయమును ప్రశ్నించితిని. రెండవది, మీలో నెవరు తమ పిల్లలను సంతోషముగ పంపించుటకు సిద్ధముగ నున్నారని ప్రశ్న. ఈ ప్రశ్నలు రెండును అడిగి రెండురోజులైనది, ఈ విషయములను గురించి ఆలోచించుటకు మీకు, అందులో ముఖ్యముగ పైన చెప్పిన వచనమును మీరు విని, దానిని ఆమోదించుచు చేతులెత్తిన పిమ్మట రెండురోజులు గడువుచాలును. మీరీ మధ్యకాలములో ఈ విషయములను గురించి ఆలోచించుకొని యుందురని నమ్ముచున్నాను. అందుచేత, ఇప్పుడు మీ పిల్లలలో నందరికన్న శ్రేష్ఠమైన పిల్లవానిని సత్సంగ సేవకు అర్పణ చేయుటకు అందరికన్న ముందు సిద్ధముగానున్న సత్సంగి స్త్రీలు ఎవరున్నారను ప్రశ్న నేను వేయుచున్నాను. ఈ జగత్తులో అత్యధిక మహా సేవలు చేయునిమిత్తమై రాధాస్వామీ దయాళుబాగ్ సంఘము నెన్నుకొనిరని సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చియున్నారు. సూపర్మెన్ (Super man) అనగా అధిమానవ జాతి ఈ సంఘమునుండియే బయల్దేరగలదని కూడ వారు సెలవిచ్చిరి. మొన్నను మీతో నేను సంప్రదించిన స్వల్పవిధానము ప్రకారము సత్సంగి స్త్రీ పురుషులు మొదటి నుండియు తమ పిల్లలను సత్సంగమునకు అప్పజెప్పి, ఆ పిల్లలు సత్సంగ ప్రబంధములో పెరిగిన యెడల ఈ యుద్దేశ్యమును సాధించుటలో గొప్ప సహాయకరముగనుండును. పిల్లలు పుట్టినప్పటి నుండియు వారి పాలన పోషణలు శిక్షా దీక్షల విధానము సత్సంగములో నీ రీతిగ నడిపించినయెడల, పిల్లలకు వారి తల్లులతోను, తల్లులకు పిల్లలతోను పరిచయమే గలుగ నేరదు. ఈ విధముగ శిక్షణను పొందిన పిల్లవాండ్రకు సహజముగ ప్రేమ సత్సంగమందే యేర్పడును. వీరికి పాలన పోషణలు శిక్షా దీక్షలును సంఘముయొక్క ఖర్చుతోనే లభించినందువలన వీరల మనస్సున సత్సంగసేవ చేయవలయునను భావము ఉత్పన్నమగును. వీరు పెరిగి పెద్దవాండ్రయిన పిదప, (Geometric Progression) అనగా గుణోత్తర

శ్రేణిలో అంకెలు ఒకటి తర్వాత మరొకటి ద్విగుణీకృతమై 2 రెట్లు, 4 రెట్లు 8 రెట్లు చొప్పునను వరుసగ పెరిగి పోవుచుండునో, అట్లే వీరి సంతతిలో నొక తరముకన్న సంకొక తరము సంతతికి రెండు రెట్లు, ఆ తర్వాతి తరమునకు 4 రెట్లు, ఆ తర్వాత 8 రెట్లు చొప్పున సత్సంగ ప్రేమయు స్వదేశీ ప్రేమయు ద్విగుణీకృతముగ పెరిగి పోగలదు. వారందరును సత్సంగమునే తమ తల్లి దండ్రులుగ భావించుకొనుచు, దాని లాభముకొరకై సకల విధముల బలి దానము, ఆత్మ సమర్పణము సేవయు చేయ సంసిద్ధులై యుందురు. అట్టి పిల్లలలో నూటికి ఒకడైనను జనులకు లాభదాయకమైన క్రొత్త ఆవిష్కార మును చేసినను, లేక మనుష్య జాతికిని సంఘమునకును మహోపకారమైన నూతన సౌకర్యమును కనిపెట్టినను, లేదా సత్సంగముయొక్క ఆర్థిక దశ అభివృద్ధియగునట్లు చేసినను, సత్సంగములో అధిమానవజాతి (Super man tribe) ఉత్పత్తి ప్రారంభమైనదని జనులు అనెదరు. నేను చెప్పిన క్రొత్త ప్రబంధమును రాధాస్వామీ దయాళురు అంగీకరించి అట్టివారి పేర్లు అడిగిన యెడల మీ పేర్ల జాపితా వారిముందు పెట్టబడును. అప్పుడు మీకు ఉన్నత విశిష్టస్థానము లభించగలదు. ఇప్పుడు మీరు ఈ విషయమును గురించి ఆలోచించుకొని మీకీ రెండు పద్ధతులలో నెద్ది మీకెక్కువ ప్రియ ముగ నుండునో చెప్పుడు. మీరు రక్త భరితమైన ఖడ్గమును దర్శించ గోరు దురా, లేక బట్టల తానులును ఇతర సాంసారిక సామగ్రియు చూడ గోరెదరా? గురుగోవిందసింగుగారు వారి కాలములో సిక్కులకు ఖడ్గ సంస్కా రము చేసి వారిని సింహములుగ మార్చినందువలన సిఖ్ఖులు అందరు నొక సైనిక జాతికింద తయారైరను విషయమును మీరు జ్ఞాపక ముంచుకొనుడు. ఇప్పుడు ఈ సమయములో ఇండస్ట్రీస్ ( Industries) వ్యాపార పరిశ్రమల సంస్కారము నిచ్చి ఇండస్ట్రియలిస్ట్ జాతిని, అనగా వ్యాపార పారిశ్రామిక జాతిని తయారు చేయుటకు భగవంతు డిచ్ఛ యించిరి. మీరు సంతానమునకు శ్రేష్ఠ మైన ఆహార ప్రబంధముచేసి వారిని ఆరోగ్యవంతులుగను దృఢకాయులు గను చేయుడు. సేవచేయు నిమిత్తమై వారిని రాధాస్వామీ దయాళుని సమక్షమున బెట్టినపుడు వారు వారలను జూచి తమ సేవలోనికి తీసికొను లాగున చేయుడు.

పై వచనము చెప్పుచున్నప్పుడు హుజూరువారు స్త్రీల నుద్దేశించి, "మీలో నెవరెవరు మీ సంతానములో (శ్రేష్ఠతమమైన పిల్లలను సత్సంగము

నకు భేంటు క్రింద సర్పించుట కిష్టపడెదరని అడిగినపుడు అధిక సంఖ్యాకులైన స్త్రీలు అంగీకారమును ప్రకటించిరి. వెంటనే ఒక జాబితాను తయారు చేసిరి. అందులో 41 మంది స్త్రీల పేర్లు వ్రాసిన తర్వాత, ఇంచుమించు అందరు స్త్రీలును తమ పేర్లు వ్రాయించుకొనుట కిష్టపడుచున్నందున, ఆ లిస్టు వ్రాయుట అంతటితో కట్టిపెట్టిరి.

## ౩౦

23 జూన్ 1941 న తేదీని ప్రేమీ భాయీ బాబా బందగీదాస్ శరీరత్యాగము చేసినపుడు హుజూరువారి ఆజ్ఞానుసార మీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు తీయబడినది.

సూరత సరకత పార; వార త్యాగ దేహీ తజత।
ఘట కా ఘోర సునాయ్, రాత దివస లాగీ రహాత॥

(సారబచన్, బచన్ 36 శబ్ద 15)

హుజూరు వారింకొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి.
సతగురు ప్యారే నె సునాఈ, ఘట ఝున్కారీ హాో।

(ప్రేమబానీ, బచన్ 123 (4), శబ్ద 2)

పిమ్మట హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి: దయాల్బాగులో ఉండి సత్సంగులను సుఖపెట్టిన వారందరిలో బాబా బందగీదాసు పేరు సర్వ ప్రథమమున చెప్పవలయును. మనలో నుండి మరొక ఆత్మ యీ సంసార కారాగృహమునుండి దాటి భగవచ్చరణములందు జేరుకొన్నదని మాకు సంతోషముగ నున్నది.

## ౩౧

8 జూన్ 1941 సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఆంగ్లభాషలో, (An ounce of practicing is better than a ton of precept) అని ఒక సామెత గలదు, అనగా వచనములు సంభాషణయు ఒక టన్ను (ton) కన్న సదాచరణ ఒక్క అవున్సు (ounce)

అయినను చాల మెరుగు అని దాని అర్థము. దీనినిబట్టి ఒక మనుష్యుడు యథార్థమైన భక్తి రీతిని ఒక్క అవున్ను మాత్రము ఆచరణ చేసినట్లయితే ఆ యాచరణ వచనములు వినుటకన్న 35840 రెట్లెక్కువ శ్రేష్ఠమని తెలుచున్నది. 35840 వచనములలో ఒక్క వచనము ప్రకారమైనను సరిగ ఆచరించినచో అదిచాల శ్రేష్ఠమే. లేనిచో ఆ శ్రమ అంతయు వ్యర్థమే యని తెలుసుకొనవలయును. ఈ చెప్పిన సామెత పూర్వకాలము నాటి పెద్దల వలన వింటిమి. ఈ లోకోక్తి ప్రకారము మనలో నెవరెవరు ఆచరించితిమో మన మాలోచించుకొనవలయును. నేను ఈమధ్య బయటకు పదిరోజులు వెళ్ళివచ్చి నిన్న మీతో కూర్చుండి నపుడు మనలో పూర్వపు వచనముల ప్రకారమును పవిత్ర గ్రంథములలోని లిఖిత హితోపదేశముల ప్రకారమును ఆచరించుచున్న సత్సంగులు చాల తక్కువగ నున్నట్లు నాకు బోధపడినది. నాకిపుడు, మీరు నిన్న సత్సంగ సమయములో ఈ భక్తిరీతి విషయములో నేమేమి క్రొత్త సంగతులు గ్రహించుకొనిరని మిమ్ములను ప్రశ్నించుట కధికారమున్నది. నిన్నటి పరిస్థితి చూచిన మీదట నాకు కొంత ఖేదము దుఃఖమును కూడ గలిగినది. ఏలనన "సత్సంగ్ కే ఉపదేశ్" రెండవ భాగమునుండి చదివిన "భక్తి మాహాత్మ్య" అను శీర్షికగల వచనములో భక్తిమార్గమున నడుచుకొనుటకై కొన్ని ముఖ్యమైన హితోపదేశములు చెప్పబడినవి. నేనందు వలననే ఆ వచనములో కొన్ని అంశములను తిరిగి రెండవసారి చదివించితిని. మీరా వచనమును విన్నపిమ్మట నందలి హితోపదేశ ప్రకారము భక్తిరీతి ననుసరించి ఆచరణ రూపముగ నేమైన చేసితిరా యను విషయము తెలుసుకొనవలయునని నా కోరిక. నేనిపుడిదియ ప్రశ్న మిమ్ములను అడుగుచున్నాను. మీలో నెవరైన 5, 6 గురు లేచి యీ ప్రశ్నకు జవాబు చెప్పుడు. లేదా, నేనే స్వయముగ మిమ్ములను ఒక్కొక్కరినే వేరు వేరుగ అడగవలసి వచ్చును. మీరు నిన్నటి వచనమును విన్న తర్వాతకూడ భక్తిరీతి ననుసరించిన కృత్య మెద్దియు చేయని యెడల కాని, లేక, మీ కర్తవ్యముల నా వచనములోని బోధల ప్రకారము నెరవేర్చకుండినను, ఖేదము తప్ప ప్రతి ఫలము మరెద్దియు గలుగ నేరదు. సాహబ్జీ మహారాజు వారు మనలను మరెవరితోనైన కలిసికొన్నప్పుడు, మన మా యెదుటి పెద్ద మనిషిని దృష్టితో దృష్టి కలిపి చూడవలయునని సెలవిచ్చుచుండెడివారు కదా? మీరా విషయము మరచిపోయితిరా? మీరు నిన్నటి రోజున సత్సంగములో నింకొక వ్యక్తి యెట్లు ప్రవర్తించెనో శ్రద్ధగ గమనించి

యుండినయెడల, మీకీ బోధ ముందుగనే జ్ఞప్తికివచ్చి యుండెడిది. నిన్న మొదటి శబ్దములో ఒకటిన్నర చరణములు మాత్రము చదువగనే నాకు సాహబ్జీ మహారాజువారి దర్శనమునుండి నా దృష్టిని ఒక్కక్షణ మాత్రము గూడ తప్పిపోకుండ నిలపవలయుననెడి తలంపు గలిగినది. అందువలననే శబ్ద పాఠ సమయములో నేను నా దృష్టిని హుజూరువారి ఫొటోమీదనే ఏక ధాటిగా నిలిపి యుంచితిని. సత్సంగములోనికి వచ్చుటకుముందు నా కట్టి తలంపు ఎంతమాత్రము లేదు. కాని నా కిచ్చుటనే ఆ యాలోచన వారి దయ వలన గలిగినది. మీరు కూడ మీకు ఏదైన లాభదాయకమైన ఉత్తమ విషయము మరొక వ్యక్తి వలన లభించినచో, దానిని, ఆ వ్యక్తి యెంత అధమస్థితిలోని వాడైనను, వెంటనే స్వీకరించవలయును. పదిదినముల తర్వాత మిమ్ములను నేను కలుసుకొను సావకాశము లభించినపుడు మీరు మీ దృష్టిని హుజూరు సాహబ్జీ మహారాజువారి ఫొటోపైన పెట్టకుండ, మీరందరు వచ్చి వ్యర్థముగ తలవంచుటలోను సింహాసనమునకు దండ ప్రణామములు చేయు టలో నా సమయము మీ సమయము నంతను పాడు చేసిరి. దానికి పర్యవ సానముగ 15 నిమిషముల కాలములో నాతో 400 మంది మాత్రమే కలుసు కొనగల్గిరి. మనము కొంత దూరదృష్టి వహించి ఇంక ముందీ పద్ధతిని మార్చు కొన్నయెడల బుద్ధిమంతుల మనిపించుకొందుము. ఇప్పుడు మన జనసంఖ్య చాల తక్కువగ నున్నది. కాని ఇంకొక నాలుగు అయిదు ఏండ్లు గడచిన పిదప సంఖ్య పెరిగినపుడు ఇదే పద్ధతిని నడుచుకొన్నయెడల, ఈ ఒక్క పనికే 4, 5 గంటల కాలము, అనగా కూర్చుండుటకే శక్యము కానంత కాలము పట్టిపోవును. సైనిక దళము మార్చిపాస్టు ( March past ) చేయునపుడు ఇరువది లేక యేబది వేల మంది సైనికులు తమదృష్టిని మాత్రమే అఫీసరు వైపునకు త్రిప్పియుంచి సెల్యూటు చేయుచు నొక క్షణమాత్రములో నెట్లు ఆఫీసరుముందు నుంచి వెళ్ళిపోవుచున్నారో మీరు చూచియే యుందురు. డిసిప్లిన్ ( Discipline ) పద్ధతి ననుసరించి వివేకముతో పని సాగించుట వలననే ఆ కార్యక్రమమంతయు నట్లు చేయుటకు వీలయినది. బయట జను లలో నవ్విధముగ కార్యక్రమము జరిగిపోవుచున్నప్పుడు, వారికన్న నెక్కువ కాకపోయినను, అధమము వారితో సమానమైన సత్సంగులు కార్యక్రమము నట్లు జరిపించలేకపోవుట కెట్టి కారణమును కనిపించదు. కావున నికముందు నుంచి, సమయము క్రమశిక్షణ వృథాగాకుండ చేయుటకును, డిసిప్లిన్ ( Discipline ) నిలబెట్టుటకును, మీ కందరికిని, సివిక్ గార్డ్సు ( Civic

guards ) సలాము చేసెడి పద్ధతిని చూపించ వలెనని నా అభిప్రాయము. వారేవిధముగ వచ్చి సలాము చేయుదురో మీరు కన్నులార చూడవలయును. దానివలన మీరు కూడ లాభమును పొంది వారిపద్ధతి ననుకరించిన యెడల చాల సంతోష విషయము. ఊరకనే ముందుకువచ్చి తలవంచుకొనుట వలనను ప్రయోజనమేమియు లేదు. మీకు మనస్సున అహంకారము లేనపుడు, కేవలము పూర్వాచారము నవలంబించు నిమిత్తమును, పైకి ఆడంబరము చేయుట కొరకును మీరు తలవంచుకొనుట పొరపాటు, అయుక్తమును. ఇప్పుడు నీ విషయమును గురించి యెంత వివరముగ చెప్పవలయునో అంత వివరముగను చెప్పితిని. మీరు నేనిపుడు చెప్పినదంతయు అవగాహన చేసు కొని నిన్నటి కార్యక్రమమును ఆ వివేకముతో పరిశీలించనిచో, మనము నిన్న కలిసికొన్న పద్ధతి కేవల వృధా కాలక్షేపమని తోచుచున్నదో కాదో చెప్పుడు. మనమింతవరకు గతించిన సంవత్సరములలో చూచివిని చదువు కొనియు నే ఉత్తమ శిక్షణను నేర్చుకొంటిమో అదందతయు మనశరీరము యొక్క ప్రతి నరము లోను ప్రతిరక్తనాళము లోను జీర్ణమై, మనలో శుభ పరివర్తనము గలిగించినచో మనశరీరమునుండి డాక్టర్లు సూదితో పొడిచి రక్తమును దీసి పరీక్షించినపుడు ప్రతి రక్తకణములోను భక్తిరీతి దప్ప మరెద్దియు కానరాకుండుటయే దానికి నిదర్శనము. ఇన్నియేండ్లు గురు మహా రాజు వారితో సత్సంగము చేసికొనికూడ నీ మాత్రము భక్తిరీతిని సంపా దించ లేని సత్సంగులు సత్సంగమువలన లాభమేమియు పొందనట్లే చెప్ప వలయును. ఇతరులకు అట్టివారు ఆదర్శము కానేరరు. మనము చేయు ప్రతి కార్యములో ప్రతివిధానములోను ఒక్క భక్తిరీతి దప్ప మరెద్దియు నెంత మాత్రము కానరాకుండ నుండి నపుడే, మనమందరము భక్తిరీతివలన లాభా న్వితుల మైనట్లు. ఇదంతయు నేనే యుద్దేశ్యముతో చెప్పితినో మీకిపుడు బోధపడి యుండవలయును. నేను ఇదంతయు చెప్పినందువలన, దీని ప్రభా వము మీ అందరిమీద గలుగక పోయినను, కొద్దిమందిమీద నయిన పడు నని నా ఉద్దేశ్యము. అట్టివారు దీనివలన లాభము నొందెదరని ఆశించు చున్నాను.

## 32

తేజ స్వరూపులైన హుజూరువారు 25 జూలై 1941 వ తేదీని తమకు వచ్చిన స్వప్నమును గురించియు యిట్లు సెలవిచ్చిరి : నేనిపుడు ప్రస్తుత పరి

# ౩5

26 జూలై 1941 తేదీ సాయంకాలము సత్సంగములో సత్సంగులు హుజూరువారితో వర్షము కురియుట లేదని మొఱ పెట్టుకొనిరి. హుజూరువారు వర్షము కురిపించుట ఇంద్రదేవుని చేతులలో నున్న పని, మీరు ఆయనను ప్రార్థన చేయవలసియున్నదని చిరునగవు నవ్వుచు సెలవిచ్చిరి. ఈ సేవ సాహబ్జీ మహారాజూవారి కాలములో ఠాకూర్ ప్రసాదుగారి చేత చేయించెడి వారు. ఆయన చాల లావుగను పుష్టిగను ఉండెడివాడు. ప్రేమీ భాయీ ఠాకూరు ప్రసాదుగారివలెనే లావుగనున్నవారు ఇంద్రదేవునికి ప్రార్థన చేయ వలయునని నిశ్చయించిరి. ప్రేమీభాయీ ఆనందచరణ భట్టాచార్యులు, ప్రేమీభాయీ జితేంద్రనాథసేన్ గుప్త, ప్రేమీభాయీనాయుడు ప్రేమీ భాయీ మాతా దయాళ్ అనువారలు ప్రార్థన చేసిరి. డాక్టరు బ్రిజలాల్ ఈ క్రింది శబ్దముయొక్క భావార్థమును ఫ్రెంచి భాషలో చదివిరి.

కౌన సకే గున గాయ తుమ్హారే
కౌన సకే గున గాయే జీ ॥

(ప్రేమ విలాస్ శబ్దము 24)

అప్పుడు హుజూరు వారు ఈ విషయమును గురించి బడీ పోథీ (సార బచన్) లో నుండి మౌజుకు తీసి చదువవలయు నని సెలవిచ్చిరి. యీ శబ్దము వచ్చినది.

సూరత సరకత వార, పార త్యాగ దేహీ తజత॥

( సారబచన్, బచన్ 36, శబ్ద 15 )

సత్సంగము పూర్తియైన పిమ్మట నందరు నీ శబ్దములోని భవిష్య వాణి పూర్తి కొఱకై ప్రతీక్షించు చుండిరి. 27, 28 తారీఖులు గతించి పోయినవే కాని ఆకాశములో మేఘముల జాడకూడ లేకుండ, ఆకాశ మంతయు నిర్మలముగనుండెను. అయినను 27 వ తారీఖున సహింపశక్యము కానంత వేడి పూర్తిగపోయి కాలము నిస్సంశయముగ మారిపోయినది. చిట్టచివరకు 29 వ తేదీ మధ్యాహ్నము రెండు గంటలకు ఆకాశమంతయు నొక్క పెట్టున మేఘములు క్రమ్మి ముసల ధారలుగ వర్షము కురిసెను.

# 36

29 జూలై 1941 వ తేదీని సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : "ఇంద్రదేవుడు మన ప్రార్థన పైన వర్షము కురిపించెను కదా. ఇప్పుడాయనకు ధన్యవాద రూపమున నొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు." ఈ క్రింది శబ్దము వచ్చినది.

సురత మేరీ హుఈ శబ్ద రస మాతీ ।
గురు మహిమా అబ్ ఛిన ఛిన గాతీ ॥
ధన్య గురూ జిన భేద లఖా యా।
ధున అంతర మన రాతీ ॥

( సారబచన, బచన 35, శబ్ద 9 )

# 37

సాయంకాలము సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" రెండవ భాగములోనుండి యీ క్రింది భావార్థము గల వచనము చదువబడినది. సత్సంగులు క్రొత్త స్వరూపమును ఆశ్రయించినపుడు వారికి అడుగడుగునకు చిహ్నాలు సూచనలు లభించుచుండును. అందువలన వారికి విశ్వాసము కలిగి ఇతః పూర్వము వలెనే వారు క్రొత్త సద్గురువుని చరణములను పట్టుకొనెదరు. సత్సంగ సమయములోను అభ్యాససమయములోను సత్సంగులకు విశేష సహాయము ఆనంద పరిస్థితి యొక్క అనుభవమును గలుగు చుండును ఈ విధమగు సహాయమును విచిత్రాను భవములును లభించినందు వలన క్రమక్రమముగ సత్సంగులకు సర్వ సాధారణముగ సమకాలిక సద్గురువునందు విశ్వాసము ఏర్పడి, కొద్ది కాలములో కొద్ది అభాగ్యజీవులను తప్పించి, మిగిలిన సత్సంగులందరు పూర్వపు సద్గురువుని కాలములో వలెనే భక్తి విశ్వాసములతో సత్సంగమునకు సంబంధించిన ఆంతర్య బాహ్య కార్య క్రమములో నిమగ్నులై పోవుదురు. ఇక ముందు పరమార్థములో అభివృద్ధి పొందవలయునను ఆసక్తి లేని వారును పూర్వపు సద్గురువుని కాలములో ఉత్తరాధికార పదవి కొఱకై మనస్సున మలిన వాంఛ పెట్టుకొన్న వారును సత్యాన్వేషణ చేయుటయే కట్టిపెట్టి సమకాలిక సద్గురువుని యొక్క ప్రకట దయను పొందలేకుండనుండి పోవుదురు. హుజూరు మెహతాజీ మహారాజు

వారి వచనములోని కొన్ని భాగములను రెట్టించి చదివించి వాని మహత్త్వము నవగాహన జేసికొనుడని హెచ్చరించిరి.

## 38

సాయంకాలము సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" రెండవ భాగమునుండి "సత్సంగీ భాయియోం కేలియే ఏక్ జరూరీ మశ్వారా" అను వచనము చదవబడినది. తర్వాత తేజఃస్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ వచనము గొప్ప భావ పూర్ణమైనది. దీనిలో సత్సంగములో నీ భేద భావము ఎల్లకాలము నుండనేరదని సూచింపబడు చున్నది. ఈ భిన్న భావము నీ యెదురు పార్టీలును అన్నియుపోయి సత్సంగు లందఱును ఒకే గుచ్ఛములో జేరి యుండెడి పరిస్థితిని భగవంతుడు తప్పక త్వరలోనే కలుగ జేయగలడు.

హుజూరు సాహబ్జీ మహారాజువారు ఇట్లు వ్రాసిరి: "చాలాకాలము నుండి సత్సంగములో పరస్పర భేదములుండు చున్నవని అంగీకరించ వలసినదే కాని యీ పరిస్థితు లెల్లకాలము నుండ నేరవని మాకు దృఢ విశ్వాస మున్నది. హుజూరు రాధాస్వామీ దయాళురు దయజూపి ఈ భిన్నత్వమనెడి విషాంకురమును, నశింపు జేయుటకు తగిన ఉపాయమును సాధనమును నిశ్చయముగ కల్పించెదరు.

## 39

24 ఆగస్టు 1941 తేదిని సాయంకాలము సత్సంగములో సాహబ్జీ మహారాజు వారి "సేవా కీ జరూరత్" అను వచనము చదువబడినది.

ఇందులో నాల్గు సలహాలు చెప్పిరి: (1) మొట్ట మొదటిదేమనగా, సత్సంగు లందఱు పరస్పరము నిస్స్వార్థమైన యథార్థ ప్రేమభావము గల్గి యుండవలెను. (2) సత్సంగులు తమ ప్రస్తుతోపయోగమున కవసరము లేని ధనమును అందఱు నొకే స్థానమందు జమచేసి, సంఘమందరకు సంబంధించిన ప్రబంధములకై వెచ్చించ వలయును. (3) ప్రతి సత్సంగియు తన పిల్లల నేదైన నొక పరిశ్రమలోనో విద్యలోనో ప్రవీణత సంపాదించగల్గు నట్లు చేయవలయును. (4) సత్సంగుల పిల్లల పాలన పోషణలకును, విద్యాభ్యాసమునకును ప్రబంధము రాధాస్వామీ సత్సంగ సభవారికే అప్పగించ

వలయును. ఈ శుభ కార్యము సాధించుటలో ప్రతి సత్సంగి సోదరుడును తన శక్త్యనుసారము త్యాగభావము చూపి సభవారికి తోడు పడవలయును.

వచనానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు మీరు విన్న విషయమును, మీరిప్పుడు దయాల్బాగులో జరిపించుచున్న కార్యక్రమమును పై వచనము ప్రకారము ఆలోచించి చూడుడు. అట్లు చేసినచో, మీరు చేసెడి కార్యక్రమ మంతయు నూటికి నూరుపాళ్ళు యుక్తముగ నున్నట్లు తేలగలదు.

అమృత్సరులో మిల్లు తెఱచుట యెందుకని కొందఱు పూర్వ పక్షము చేయుచున్నారు. ఈ యాక్షేపకులు సాహబ్జీ మహారాజువారి యీ వచనమును శ్రద్ధగ చదివినచో వారి మనస్సున యీ ప్రశ్న నిల్వనేరదు. సంస్థ యనుపదమును మనము విశాలార్థములో నుపయోగించవలయును. ఇచట సంస్థలు అనగా, స్కూలు, కాలేజీ, ఆసుపత్రియు మాత్రమే కాదు. యంత్ర శాలలు ( కార్ఖానాలు ) గూడ సంస్థలే. ఈ వచనములో, స్పష్టముగ అమృత్సరు మిల్లును గుఱించియు, ఇకముందు ఇతర ప్రాంతములలో తెఱవ బోయెడి ఇతర యంత్రశాలలను గుఱించియు సూచన చేయఁబడినది. ఆక్షేపకులీ వచనములను తమ యాక్షేపములను దృష్టిలో నుంచుకొని చదువుదురు గాక.

వచనములోని నాల్గవ సలహా ప్రకారము, 1933 సంవత్సరములో ఎదిగిన పిల్లలకు బేసిక్ ఎడ్యుకేషన్ ( Basic Education ) ప్రారంభించితిమి. ఈ సంవత్సరము ఏప్రియల్ నెలనుండి చిన్న పిల్లలకు స్వచ్ఛమైన వాతావరణముగల స్థలములో శ్రేష్ఠమైన ఉపాధ్యాయినుల నిరీక్షణ క్రింద ఆటపాటలు జరుపుకొనుటకై మంచి మంచి ఆట వస్తువుల ప్రబంధము గూడ చేయబడినది. కాని ఆ చిన్న పిల్లల తరగతిలో హాజరగుచున్న పిల్లల సంఖ్య సంతోష ప్రదముగ లేదు. ప్రసాదము నిచ్చు రోజున చాల యెక్కువ మందియే వచ్చెదరు. కాని, ఆ తర్వాత తిరిగి సంఖ్య తగ్గి పోవుచున్నది మనము పిల్లలను ఇచ్చటకు నియమముగ పంపించవలయును.

స్థితుల యొక్క మరొక భాగమును గురించి వివరించ బోవుచున్నాను. ఇంత క్రితము నేను మాటలాడిన మాటలు ఒక డేంపరువలె ( Damper ) మీ మనస్సులపైన నిరుత్సాహ భావము గల్గించినచో, నీ విషయము విన్న పిమ్మట నది సరియై మీకు సంతోషము గలుగగలదు. వర్తమాన యుద్ధము వచ్చుటకు ముందే జగత్తుయొక్క పరిస్థితి సంతోషకరముగ లేదు. యుద్ధ మారంభమైనది లగాయతు పరిస్థితి రోజు రోజు మరింత చెడిపోవుచున్నది. ఇంత వరకు భారతదేశమునకు చాల దూరముగ నున్న యుద్ధము మెల్ల మెల్లగ దగ్గరగ వచ్చుచు, క్రమ క్రమముగ నెక్కువ భయానక రూపము దాల్చుచున్నది. ఈ రోజులలో ఇక్కాలమున నెచ్చట చూచినను గాని విమానములు బాంబుల వర్షమును గురించిన చర్చయే అనుక్షణము జరుగు చున్నది. కావున యుద్ధమే దేశములలో జరుగుచున్నదో ఆ దేశస్థులు ఆపత్తులనుండి తప్పించుకొన లేకున్నారు. ఎప్పటి కప్పుడే శత్రువు నెత్తిమీదికి వచ్చి వారల పట్టణములను పల్లెలను కాల్చి వేయునేమో అను భయమే వారిని పీడించుచున్నది. 2 జూలై నాటి గాథ చెప్పుచున్న వ్యక్తికి స్వప్న ములో యుద్ధము చూచుట తటస్థించెను. రాత్రి పన్నెండున్నరయో లేక ఒంటిగంటయో అయినది. బాంబులు వేయుటకది చాల యుక్త సమయము. ఈ కథ చెప్పుచున్నవానితో మరొకవ్యక్తి శత్రువు ఇప్పుడే వచ్చుచున్నా డని చెప్పెను. వీరిరువురును అంతవరకు నొక ఉన్నతమైన పర్వతము మీద నుండిరి. ఆ పర్వతము మీద నొక భవనము నిర్మించ బడినది. స్వప్న సమ యములో వారాయింటి క్రిందనే యున్నారు. పర్వత ప్రదేశము తడిగ నుండుటచే, వారి పాదములు తడిసి చల్లబడి పోకుండనుండుటకై వారు దళ సరియైన మేజోళ్ళను ధరించిరి. శత్రువుల దాడి మూలమున వారి హృద యములలో నేమాత్రము భయము గలుగలేదు. అందుచే భయము బెంగలు లేకుండ వారు అచ్చట ప్రశాంతముగ పరుండ దల్చిరి. తర్వాత వెంటనే ఆ స్థలము మీదినుండి శత్రువుల గాలి విమానములు, చాల విమానములు యెగిరి పోవుచున్నట్లు వారికి కనిపించెను. ఆ విమానముల అధోభాగములు దేదీప్యమానముగ ప్రకాశించు చున్నందున ఆకసమంతయు ప్రకాశమానమై పోయెను. వెంటనే ఆ గాలి విమానములనుండి మండిపోవుచున్న ఇనుప ముక్కలవలె మెఱసి పోవుచున్నట్టి, ఇంచు మించు 6 అడుగులు పొడుగు $2\frac{1}{2}$ అడుగుల వెడల్పు 2 అడుగుల దళసరిగ నున్న యెఱ్ఱని బాంబులు క్రింద

పడ నారంభించెను. అందులో చాల బాంబు లీ యిరువురికి కుడి యెడమ పార్శ్వములందును, నాలుగు ప్రక్కలను చాల దగ్గరగనె పడెను. ఒక బాంబు వారి మీదికే తిన్నగ పడిపోవుచున్నట్లు కనపడెను గాని వీరు ఇరువురు నేమియు భయపడలేదు, వారు గడ్డిపరక అంత దూరమైనను తమరి చోటు నుండి కదలలేదు. ఇంతటిలో నీ కథ చెప్పుచున్న వ్యక్తి ఎడమ ప్రక్కకు వత్తిగిలి, నిద్రనుండి మేల్కొనెను. తానపుడు దయాల్బాగులో నున్నట్లును గాలి విమానములు బాంబులు అన్నియు మాయమై పోయినట్లును దయాల్బాగులో నిర్భయముగ జీవితము గడిచిపోవుచున్న విషయమును అతనికి గోచరించెను. జూలై 3 వ తేదీని ఉదయము డాక్టరుగారు రాగా, ఈ స్వప్నముగన్న వ్యక్తి ఆ స్వప్న వృత్తాంతమును చెప్పి, ఈ రోజు ఉదయము నుండియు నిశ్చయముగ నతని ఆరోగ్యము బాగుపడుచున్నదని చెప్పెను:

# ౩౬

14 జూలై సాయంకాలము సత్సంగములో ప్రేమ విలాస్ నుండి యీ క్రింది శబ్దము పఠించబడినది :

జబ్ లగ్ జివ జగ రస చహే, సహే దుఖ బహు తాప్।
నీచ ఊంచ జోని ఫిరే, కాల కర్మ సంతాప్.॥
జబ్ జివ గురు కే సరన గహి, తజే జగత రస ఆస్।
చాఖే భక్తి ఔర్ శబ్ద రస, అమర లోక లే బాస్॥

( ప్రేమబిలాస్ శబ్ద 133 )

హుజూరువారు పై రెండు చరణములను మరొకసారి చదివించి, ఇట్లు సెలవిచ్చిరి. ఈ రెండు చరణములలోను రెండు వేర్వేరు విషయములు వ్రాయబడినవి. మొదటి చరణములో, హృదయమునందు జగదానందము లనుభవించవలె నని అనగా ప్రాపంచిక భోగముల ఆనందము ననుభవించ వలెనని అనగా ప్రాపంచిక భోగముల ఆనందము ననుభవించవలెను అను వాసనయు కోరికలును ఉన్న యెడల, అదే వాసన మరణ సమయమందు ప్రకట మగునని తేల్చబడినది. ఏలననగా, జీవిత కాలములో నే వాసన అధిక ప్రబల ముగ నుండునో ఆ వాసనయే అంతిమ సమయమందు ప్రకటమై దాని ననుస

రించియే తిరిగి జన్మ లభించగలదు. ఈ చరణములో చెప్పిన దానినిబట్టి ప్రాపంచిక భోగవాసనలు వాంఛలునున్న జీవుడు అనేక విధములైన ఉచ్చ నీచ యోనులలో బుట్టి చనిపోవుచు కాల కర్మల యొక్క శిక్షలకు పాత్రుడై బాధపడుచుండునని ప్రకటమగుచున్నది. రెండవచరణములో పై దానికి విరుద్ధముగ నే జీవుడు జగత్తు భోగానందముల ఆశను విడిచిపెట్టి సద్గురువుని శరణు పొందునో అట్టి వానికి జీవిత కాలములో భక్తి యొక్క ఆనందము శబ్ద శ్రవణానందమును రెండును లభించుననియు మరణానంతరము భగవంతుని దేశములో నివాసమును లభించుననియు వర్ణించ బడినది.

ఆ తర్వాత "సత్సంకే ఉపదేశ్" రెండవ భాగమునుండి "మజహబ్ కే సాఫ్ అసలీ తఅల్లుక్ హూనా చాహియే" అను వచనము చదవబడినది. హుజూరువారు వచనముయొక్క పూర్వ భాగమును రెండవసారి చదివించి, యిట్లు సెలవిచ్చిరి : ఈ వచనముయొక్క ప్రారంభములో మతము అనగా పరమార్థ మెంత కష్టసాధ్యమో తెల్పి నిజమైన గురువు వలనను మతము వలనను లాభము పొందవలెనన్న యెడల నిర్మలబుద్ధి గల్గియుండుట అత్యావశ్యకమని తెల్పిరి. నిర్మలబుద్ధి గల్గిన పిదప ఆ విషయము అనగా పరమార్థమును సాధించుట ముందెంత కఠినముగ నుండెనో అంత సులువై పోవును. అయితే నిర్మలబుద్ధిని సంపాదించు టెట్లు? నిర్మలబుద్ధి కావలెనని కోరు మానవుడు తన నేత్రములను శ్రోత్రములను తెఱచి యుంచుకొన వలయును. ప్రతి విషయమును విని, అందుపైన విమర్శ చేసికొని తన కవసరమైనట్టియు లాభకరమైనట్టియు విషయములను స్వీకరించి తనకు అనవసరమైనట్టి నిరుపయోగ విషయములను త్రోసిపుచ్చవలయును, అట్టివాడు ప్రతి కార్యమును చక్కగ యోచన చేసుకొని చేయవలయును. చెప్పిన విషయమును శ్రద్ధగ విని అవగాహన చేసుకొనవలయును. ఈ ప్రకారము ప్రయత్నము చేయుచు పై హితోపదేశమును మనసున నుంచుకొని నిర్మల బుద్ధిని పొందు నిమిత్తమై యత్నించుచుండినచో సాఫల్యము నొందకుండుటకు కారణ మేమియు లేదు. యథార్థమైన సత్సంగము లభ్యమైనను గూడ, నిర్మలము స్వచ్ఛము నైన బుద్ధిలేని యెడల నేమియు లాభము గలుగ నేరదు. కొందరు మనుష్యులు సాహబ్జీ మహారాజు వారు సెలవిచ్చిన మహావచనములను, కొన్నిటిని వినకుండను, విన్న వచనముల నైన నాచరణలో బెట్టుకొనకుండను ఉండిపోయిరి. అట్టివారి కా వచనములను వినుటవలన లాభ మేమైన గల్గి

యుండునేమో మీరే చెప్పుడు. వారికి నిస్సంశయముగ యథార్థమైన సత్సంగమే లభించినది. కాని వారికి నిర్మలబుద్ధి లేకుండుటచే వారు దాని లాభమును పొందలేక పోయిరి.

34

15 జూలై 1941. ఈ సంవత్సరము జూలై మూడవ వారములో గూడ దయాల్బాగులో వర్షములు కురవలేదు, 15 జూలై 1941 వ తేదీని అగ్రికల్చరు విభాగమువారు వర్షములు లేవని హుజూరువారితో చెప్పుకొనిరి. హుజూరువారు సత్సంగములోనికి దయచేసిన తోడనే "మీలో ఇంద్రుని పరిచయమున్నవారు ఆయనను వర్షము కురిపింపుమని ప్రార్థన చేయుడు" అని సెలవిచ్చిరి. దయాల్బాగులో ఈ సంవత్సరము ఇంతవఱకు వర్షము కురియకపోవుట విరుద్ధ విషయము. (ప్రేమీ భాయీ ఠాకూర్ ప్రసాదుగారు ఇచ్చట లేనందున, ఇచటనున్న వారందఱిలో నెక్కువ స్థూలకాయుడైన వ్యక్తి యీ పని చేయుటకై ముందుకు రావలయును. అందఱికిని జితేంద్రనాథ్ సేన్‌గుప్తా గారి వైపు దృష్టి తిరిగెను. హుజూరువారు చిఱునవ్వు నవ్వుచు ఆయనవైపుకు తిరిగి "ఏమండీ, మా ప్రార్థనను ఇంద్ర మహారాజున కందజేయగలరా" యని అడిగిరి. దగ్గఱగ కూర్చుండిన దయాల్బాగు భవన నిర్మాణ విభాగములో పనిచేయుచున్న ఇంజనీయరుగారు, చాల ఆవశ్యకమైన మా భవన నిర్మాణ కృత్యములు ఇపుడు జరుగుచున్నవి. ఇప్పుడు వర్షము కురిసిన యెడల మా పనికి చాల నష్టము గలుగ గలదని" అడ్డు చెప్పుకొనిరి, అపుడు హుజూరువారు "బహుశః మీ మూలముననే దయాల్బాగులో వర్షములు లేకుండ పోయినవి" అని సెలవిచ్చిరి. ఆ తర్వాత సత్సంగము అగుచుండగనే మధ్యలో ఒక్క పెట్టున పెద్ద వర్షము కురిసెను. సత్సంగ భవనము పైన వర్షము ఎంత యధికముగ కురిసె ననగా, కొంతసేపు శబ్ద పాఠము కట్టిపెట్టవలసి వచ్చెను. హుజూరువారు అటుపిమ్మట "ఈరోజు వర్షమును గుఱించి దివ్యేచ్ఛకు శబ్దమును తీసి చదువు"డని సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

అబ్ మన ఆతుర దరస పుకారే, కల నహీం పకడే ధీర న ధారే॥

(సారబచన్, బచన్ 33, శబ్ద 1)

## 7

27 ఆగస్టు 1941 వ తేదీని తేజః స్వరూపులైన హుజూరువారు సత్సంగమునకు వచ్చిన తోడనే మీలో సత్సంగమునకు వచ్చి నిశ్శబ్దముగ కూర్చుండిన వారెవరు? అని తిరిగి ప్రశ్నించిరి. ప్రాతః కాలముననైతే సామాన్యముగ నిశ్శబ్దముగనే కూర్చుందురుకాని, సాయంకాలము మాత్రము అట్లు నిశ్శబ్దముగ కూర్చుండువారు తక్కువయని తెలిసినది. అప్పుడిట్లు సెలవిచ్చిరి : మీకు సత్సంగమునకు వచ్చి నిశ్శబ్దముగ కూర్చుండుటయే అంత కష్టమని తోచుచున్నప్పుడు మీకు భజన ధ్యానములు చేయుటయు, మఱియు సఫలతతో వానిని సాగించుటయు నింక నెంత కష్టమో మీరాలోచించుకొనుడు. మీరు నిశ్శబ్దముగ కూర్చుండుట ముందు నేర్చుకొనవలయును. సాధన చేయుట ఆ తర్వాత వచ్చును.

## 7

28 ఆగస్టు 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరువారు ప్రేమీభాయీ అమరచందుగారిని హింది ప్రేమప్రచారక్ దయాల్బాగ్ హెరాల్డు పత్రికలలో ప్రకాశితమైనట్టి, ఒక ప్రత్యేక వ్యాసమును బిగ్గఱగ చదువుమని చెప్పిరి. ఆ వ్యాసములో హుజూరు సాహబ్జీ మహారాజు వారును హుజూరు మెహతాజీ మహారాజువారును ఇండస్ట్రీస్‌ను గుఱించియు వర్తక వ్యాపారమును గురించియు చెప్పిన భాషణములు వచనములనుండియు కొన్ని భాగములు తీసి వ్రాయబడినవి. ఆ వ్యాసము చదివిన పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఆ ఉద్ధృత భాగములను విన్నతరవాత వానిలో పరస్పర విరోధము పరస్పర ఖండనము ఏమైనను మీకు కనిపించినదా? ఆ లేఖలోని విషయము ముందుకు వెళ్ళుచున్న కొలది క్రమక్రమముగ పెంపు చేయబడుచున్నట్లే తెలియుచున్నది కదా. అందు ఎత్తివ్రాసిన ప్రమాణ వచనములను వేఱుగ చెప్పకుండ, ఆ లేఖను చదివినచో, అది పూర్తిగ నొకే విషయమును వివరించుచున్నట్లు తోచును. మూడు నాల్గు స్థలములలో ఒక చోట నున్న విషయము రెండవ స్థలములోను రెండవ విషయము మొదటి స్థలములోను రెట్టించి చెప్పబడినది. హుజూరు సాహబ్జీ మహారాజువారు వైశ్యజాతి కృత్యమును అభివృద్ధి చేయుచున్నామని సెలవిచ్చిరి. వైశ్య

వర్ణము యొక్క వృత్తి వ్యాపారము. ఇప్పుడు సత్సంగములో వ్యాపారమే చేయుచున్నాము. ఈ విధముగ నుండగా, ఇండస్ట్రీస్ వ్యాపారమును సాగించుట తప్పనియు, దయాల్బాగులో పరమార్థమునకు ప్రతికూలముగ పని జరుగు చున్నదనియు చెప్పుటకు సాహసమెవరికి గలుగును.

ఒక స్థలములో సాహబ్జీ మహారాజువారు నవయువకులను కార్య క్షేత్ర ములో దిగవలసి యున్నదని ప్రోత్సహించి మఱొక స్థలమందు సత్సంగము నకు మూలబంధము గట్టిపడినది కావున నిపుడు సత్సంగోద్యమము దేశ ములో బయటకు వ్యాపించి వృద్ధి పొందగలదని సెలవిచ్చిరి. మరొక స్థల ములో వారు ఇండస్ట్రియల్ ప్రోగ్రాము దయాల్బాగులో వలెనే దేశము యొక్క ఇతర ప్రాంతములలో గూడ ప్రసరింప జేయవలయునని సెలవిచ్చిరి.

ఆఖరున హుజూరువారు, సాహబ్జీ మహారాజువారు గురుగోవింద సింగు గారి చర్యను దృష్టాంతముగ జెప్పి, సత్సంగులను ఆత్మ సమర్పణ భావము తోను త్యాగ భావముతోను కార్య క్షేత్రమందు దిగవలయునని హెచ్చ రించినది, యుద్ధము చేయుటకును మనుష్యులను చంపి చావులు గల్గించుట కును కాదని సెలవిచ్చిరి. గురుగోవిందసింహుగారి కాలములో నిస్సందేహ ముగా అట్టి ఐచ్ఛిక భటులు ఆ విధముగ రక్తపాతము చేయు నిమిత్తమై అవసరముండెను. కాని ఇపుడు బిజినెస్సును ఇండస్ట్రీసును వృద్ధిచేసి సంఘము నకు సత్సంగమునకును ఆర్థిక దశను సంతోషదాయకముగ నుంచునట్లు బాగు చేయగల నవయువకు లెక్కువ అవసరమున్నది.

# 72

8 సెప్టెంబరు 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో "సత్సంగ్ కే ఉపదేశ్" మూడవ భాగమునుండి 148 నెంబరు వచనము చదువబడి నది. తేజః స్వరూపులయిన హుజూరువారు యిట్లు సెలవిచ్చిరి: రష్యాలో అంతటను నాస్తికత్వము వ్యాపించినదనియు రష్యా దేశము ఆస్తిక మతము నకు విరుద్ధమనియు చెప్పువదంతి చాల పొరపాటు మాటయని రష్యాలో గొప్ప హోదాలోనున్న వారే అనుచున్నారనియు అమెరికా దేశస్థులు ఒక సమాచారమును హిందూస్తాన్ టైమ్స్ అను పత్రికలో 2, 3 రోజుల క్రితము కాబోలు ప్రచురించిరి. అంతియగాక, అసలు విషయ మేమనగా, మతము ప్రతివ్యక్తికిని కేవలము తన సొంతవిషయము అనగా ప్రైవేటు

విషయము కాబట్టి రష్యా ప్రభుత్వము మత విషయములలో కలుగ జేసి కొనుట లేదనియు, ఏమనిషి కామనిషి తన యిష్టానుసారము మత విషయములలో విశ్వాసము పెట్టుకొనుటకు స్వతంత్రుడు కావున, మతమునకు విరుద్ధముగ మాటలాడుటకును ఉపన్యాసనము లిచ్చుటకును రష్యాలో ప్రతి వ్యక్తికిని స్వాతంత్రమున్నదనియు ప్రచురించబడినది. రష్యా దేశముకూడ భగవంతుడు ఉన్నట్లు ఒప్పుకొను చున్నదని తెలిసి మాకు సంతోషమైనది.

## 75

28 సెప్టెంబరు 1941 వ తేదీని "సత్సంగ కే ఉపదేశ్" లోని 108 వ వచనము చదువ బడినది. దాని సారాంశ మిట్లున్నది: మన సంఘ మింకను బాల్యావస్థలో నున్నది. అందుచేత, సత్సంగులలో నప్పుడప్పుడు లోపములు కనపట్టుటయు, వారు తప్పులు చేయుటయును సహజమే. ఇప్పుడు సత్సంగులందరును, ముఖ్యముగ బుద్ధిమంతులు అందరును కలిసి యీ బాలుని ఆరోగ్యము అభివృద్ధియును అడ్డి పోకుండ కాపాడుటకు గట్టి ప్రయత్నము చేయుట యత్యావశ్యక విషయము. ఈ బాలుడు తనకు యౌవనము వచ్చిన పిమ్మట మీ ఆశలకు మించిపోవునట్లుగ సేవ జేసి, మీ కందరకును సుఖశాంతులు గలిగించు బాధ్యతను తన నెత్తిని వహించ గలడు. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ వచనములో చెప్పిన దానిని బట్టి సత్సంగముయొక్క ప్రస్తుత కార్యక్రమమును పరికించిన యెడల క్రితము 3, 4 యేండ్లనుండి సత్సంగులందరు కలిసి సత్సంగోద్యమము అభివృద్ధి పొందు నిమిత్తమును, మఱి యితర విషయము నిమిత్తమును ఏ కార్యక్రమమును జరిపించుచున్నారో అదేమియు పొరపాటు కాదనియు, పైగా హుజూరు సాహబ్జీ మహారాజు వారి ఆజ్ఞలను పూర్తిగ అనుసరించియే యున్నదనియు తెలియగలదు. ఈ వచనము మన కార్యక్రమమును పూర్తిగా సమర్థించుచున్నది.

109 నెంబరు వచనము కూడా చదవబడినది. అందులో సాహబ్జీ మహారాజువారు భక్తిమార్గములో సఫలత పొంద గోరినచో రెండు విషయములను గురించి ముఖ్యముగ శ్రద్ధ వహించవలయునని సెలవిచ్చిరి: మొదటిది, ప్రతి కృత్యమును భగవంతుని ప్రసన్నతను అనుమతిని ముఖ్యముగ చూచుకొనుచు చేయవలయును. ఆ పని తనకెంత యిష్టముగను లాభదాయకముగను ఉన్నను, తన భగవంతుని యిచ్ఛకు అనుకూలము కానిచో అందు జోక్యము కలుగ జేసికొన కూడదు; మరియు ఏ కార్యమైనను వారికి ప్రియ

ముగ నుండనిచో, తన లాభ హానుల మాట ఆలోచించకుండ దానిని వెంటనే కట్టిపెట్టవలయును. లోకుల నిందాస్తుతులకు లెక్కసేయ కూడదు. రెండవది, సేవచేయునపుడు మనస్సున స్వార్థ సంబంధమైన ఆలోచనలను రానీయ కూడదు. ఎల్లప్పుడు నిష్కామ భావముతో సేవచేయవలయును. అట్లు చేసి నందుకు ఫలితము, మొట్ట మొదటి లాభము అట్టి భక్తునికి భగవంతుని దర్శనము లభించుటయు రెండవది, స్వార్థ పరమార్థ విషయకమైన ప్రయత్నములలో సంపూర్ణ సహాయము లభించుటయును. హుజూరు వారు దీనిని రెండవసారి తిరిగి చదివించి, మనము సత్సంగసేవ ఇదే స్పిరిట్‌తో, ఇదే దృష్టికోణముతో చేయవలయునని సెలవిచ్చిరి.

# 74.

29 సెప్టెంబరు 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" 3 వ భాగమునుండి 115 వ వచనము చదువబడినది. అందిట్లు చెప్పబడియున్నది. సంస్కారము జడము కావున సాంసారిక ప్రేమ యొక్క ఫలితముగా మూర్ఖతయు జడత్వమే చేకూరును. నిజమైన సద్గురువుని గుర్తు యేమనగా, వారిచరణములందు విశ్వాసము గల్గినందువలన నీ జడత్వము నశించి వివేక దృష్టి మేల్కొంచును. మానవునిలో వివేక దృష్టి వికసించి నందువలన ప్రపంచముయొక్క యథార్థ లక్షణము తెలుసుకొని తన నిజ హాని లాభము లెందుగలవో తెలిసికొనగల శక్తి మేల్కొంచును. కావున సరియైన సద్గురువుని భక్తిచేసి వారియందు ప్రేమ కల్గినచో జీవునిలో అసాధారణమైన వివేకము ఉత్పన్నమగును. ఇదియే సద్గురువుని మహిమ యొక్క చిహ్నము. హుజూరు మెహతాజీ వారిట్లు సెలవిచ్చిరి : ఈ వచనములో నిజమైన సద్గురువుని యొక్కయు నిజమైన శిష్యునియొక్కయు జ్ఞాపక చిహ్నములను సూచించిరి. అసలైన శిష్యుడు తన సద్గురువుని ప్రతివచనమును శ్రద్ధపెట్టి విని, తన ప్రవర్తనను నడవడిని ఆ ప్రకారము మార్చుకొనును. ఆ విధముగ వారి సంయోగ ప్రభావము మూలమున అతని బుద్ధి క్రమక్రమముగ నిర్మలమై పోవుచుండును. కొందరు విద్యార్థులు ముందు పాఠములను నేర్చుకొనుచు, దానితో పాటు వెనుకటి పాఠములను కూడ తిరిగి చదువుకొనుచుందురు. అట్లుగాక, మరికొందరు పాఠములు ముందుకు చదువుకొనుచు పోవుచుందురు కాని, వెనుకటి పాఠములకు తిరిగిచూడరు. వానిని జ్ఞాపకముంచుకొను యత్నమైన చేయరు. అందువలన వారు పూర్వాపు పాఠము

లను మరచిపోవుదురు. ఇపుడుమీరు ఈ రెండు తరగతులలో నే తరగతికి చెందుదురో చెప్పుడు. ఇదివరలో మీరు చదువుకొన్న పాఠములను తిరిగి చదివి జ్ఞాపకము చేసికొనుచున్నారా లేక ఇదివరకు చదువుకొన్న పాఠముల మాట తలపెట్టకుండ, క్రొత్తపాఠముల కొఱకై చూచుచున్నారా? నా అభిప్రాయములో మీరు ఇంతకుముందు వచనములను శ్రద్ధవహించి వినియుండ లేదు. కాని ఇప్పుడు సత్సంగములో చదువుచున్న వచనములను శ్రద్ధగా వినుచున్నారు. కావున వానిని మీరు తిరిగి పఠించి జ్ఞాపకము చేసుకొను చున్నట్లే యెంచుకొనవచ్చును. ఇప్పుడు మీకు మీ వివేచనా శక్తి అభివృద్ధియగుచున్నట్లు భావన కలుగుచుండిన యెడల, అంతకన్న సంతోష ప్రదమైన విషయ మేముండును. మీకిపుడు కల్గుచున్న నిర్మల పవిత్ర బుద్ధి నుపయోగించి మీరు యథార్థ సద్గురువును అన్వేషణ చేసుకొనవలయును.

ప్రేమీ భాఈ అమరచందుగా రిట్లనిరి : మన సంత్సంగులకు వివేచనా శక్తి పెరిగి నిర్మలమగుచున్న యెడల, దాని అర్థము మనకు నిజమైన సద్గురువు లభించిరనియే. మనకు వివేచనాశక్తి వృద్ధియగుట లేదన్నచో, దాని అర్థము మనకు నిజమైన సద్గురువు లభించ లేదనియే కదా!

హుజూరువారిట్లు సమాధానము చెప్పిరి : నామనస్సులో నున్న మాటనే మీరును చెప్పిరి. అందుచే మీకు వివేచనాశక్తి నిస్సంశయముగ పెరుగుచున్నదని తెలిసి నాకు సంతోషమగుచున్నది. వివేచనాశక్తి యీ విధముగ నిరంతరము వృద్ధిపొంది నిర్మలమైపోవుచుండిన యెడల ఒకానొక రోజున మనకు నిజమైన సద్గురువుకూడ లభించగలరు. మనమందరము నైక మత్యముతో నిచ్చట కూర్చుండి కలిసిమెలిసి జీవితములను గడుపుచుండిన యెడల, నిజమైన సద్గురువుకూడ నిచ్చటకే వచ్చి మనలను కలుసుకొందురు. వారిని అన్వేషించుట కొరకై మనము బయట కెక్కడికిని వెళ్ళవలసి యుండదు.

## 75

3 అక్టోబరు 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో "సత్సంగ్ కే ఉపదేశ్" 3 వ భాగమునుండి 130 వ వచనము చదివిరి. దాని సారాంశ మిట్లున్నది. ఏ సంఘమైనను తరతరములు సుఖముగనుండి జీవితము గడప వలయునన్న యెడల అది గాఢమైన ఐకమత్యము గల్గినదై దాని ఆదాయ

వ్యయముల విషయములోను జీవనోపాధి విషయములోను సంఘ సంరక్షణ విషయములోను ఉత్తమోత్తమ విధానములను అమలులో పెట్టవలయును. సత్సంగీ సోదరీ సోదరులు తమ్ము రాధాస్వామీ దయాళుని వంశమునకు చెందినవారమని యెంచుకొని ఐకమత్యముతోనుండి సంఘ క్షేమము నిమిత్తమై యేర్పాటు చేయబడిన కట్టుబాట్లను మనఃస్ఫూర్తిగ పాలించుట యుక్తము. అప్పుడు హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : మీరీ వచనమును మీ హృదయములలో బాగుగ అంకితము చేసికొనవలయును. సంఘముయొక్క ఆదాయ వ్యయములను గూర్చి సంఘ సభ్యులందరు కలిసి ఉపాయములు ఆలోచించ యునలను. సామూహిక రూపమున సంఘముయొక్క అభివృద్ధి క్షేమములకై ఉపాయములను ఆలోచించుకొని ఆ ప్రకారము నడుచుకొనవలయును. తిరిగి యిట్లు సెలవిచ్చిరి: అయిదు సంవత్సరముల క్రితము ఈ వచనమును చదువుకొన్నయెడల అప్పుడు దీని మహత్త్వము, ఇప్పుడు మనకెంత యెక్కువగ కనబట్టుచున్నదో అంత యెక్కువగ తెలిసి యుండనేరదు. ఇప్పుడు మన ఇండస్ట్రీస్‌ను, వ్యాపారమును ఉన్నతి వికాసములను పొందుచుండుటచే దేశములో సత్సంగోద్యమమునకు కల్గిన ఉన్నత దశను గమనించి మనమీ వచనమును చదివినపుడు దాని భావార్థము అతి గూఢ గంభీరమై అతి మహత్త్వ పూర్ణమైనట్లు మనకు బోధపడుచున్నది. భగవత్కృప మూలమున సత్సంగముయొక్క నలువైపుల నున్న పరిస్థితులు కలిసి ఏకమై ప్రస్తుతము ధరించిన రూపమును మనస్సున పెట్టుకొని యీ వచనమును చదివిన యెడల, ఈ వచనము ప్రస్తుత సమయమునకు వర్తించునట్టి భవిష్యవాణి యనియు, ముఖ్యముగ నీ ప్రస్తుత సమయము నుద్దేశించియే ఈ వచనము చెప్పబడినదనియు గోచరించును.

## 73

హుజూరు వారు ఢిల్లీ వెళ్ళి 3 రోజులు అచ్చటనుండి, తిరిగి వచ్చి సత్సంగములోనికి దయచేసినపుడు స్త్రీల వైపు తిరిగిచూచి, " ఈ రోజు సత్సంగములో చాల నిశ్శబ్దముగ నున్నట్లు కనిపించుచున్నది." అని సెలవిచ్చిరి : శబ్దపాఠమైన తర్వాత తిరిగి యిట్లు సెలవిచ్చిరి: ఈ నాడు చదివిన శబ్దములో "శబ్ద కో సునో బంద కర సరవణ్" అని వచ్చిన పంక్తిని మీరు వినియుందురు. అనగా మీ వద్దనున్న శ్రవణ సాధనమును బయటనుండి మూసికొని బాహ్యధ్వని వినబడకుండ జేసికొనుడని అర్థము. స్త్రీలు పిల్లలు

నొకప్రక్కను, పురుషులు పిల్లలు మరొకప్రక్కను గోల చేయుచుండగా, శ్రవణ సాధనములు తెరచుకొని యుండినచో ఇరు వైపుల ధ్వనులు రెండు చెవులలో ప్రవేశించి నపుడు ఆ రెండు ధ్వనులకును సంఘర్షణ జరిగినయెడల అంతర్యశబ్దము వినబడక పోవుట అట్లుంచి, పైన శబ్దపాఠము కూడ వినబడ నేరదు. మీరు నిశ్శబ్దముగ నుండినచో పవిత్ర గ్రంథముయొక్క శబ్దపాఠ మును బాగుగ వినిపించును; మీ చిత్తవృత్తి అంతర్యమున తగినంతగ నేకా గ్రమైనచో రచనలో స్వతస్సిద్ధముగ మ్రోగుచున్న శబ్దముకూడ మీకు స్ఫుటముగ వినిపించ గలదు. టెలిఫోనులో నెవరైన మాటలాడు చున్నపుడు చుట్టుప్రక్కల నున్నవారు కూడ మాటలాడుచుండిన యెడల, టెలిఫోనులో మాటలాడు మాటలు సరిగ వినబడవను విషయము మీకు తెలుసునుకదా, అటులనే వైర్లెస్ లోని ధ్వని కూడ పై ధ్వనుల వలన చాల కలత నొందును. ఇవన్నియు తెలిసియుండి సత్సంగములో పాఠ సమయములో గోలచేయుట యెంత గొప్ప పాపమో, హుజూరు రాధాస్వామీ దయాళుని చరణముల కెంత అపరాధము చేసినట్లో మీరు యోచించుకొనుడు.

# 77

15 అక్టోబరు 1941 వ తేదీని సత్సంగములో నీ క్రింది శబ్దము చదువ బడినది.

ఐసా కోఁ హై అనోఖా దాస, జా పై సద్గురు హుఏ హైం దయాళ రీ
(ప్రేమబానీ, 1 వ భాగము, 4వ వచనము, 5వ శబ్దము)

శబ్ద పాఠానంతరము హుజూరువారు "సద్గురువు దయా పూరితులై యెవరిపైన మహా ప్రసన్నులైరో అట్టి దాసులు మీలో నెవరైన నున్నారా? అని ప్రశ్నించిరి. అందుకు సమాధానముగ చాల కొద్దిమంది మాత్రమే చేతులెత్తిరి. ఒక పెద్దమనిషి, ఈ శబ్దమును పరమగురు హుజూరు మహారాజువారు పరమగురు మహారాజసాహబ్ వారినుద్దేశించి వ్రాసిరని పలికెను. హుజూరు మెహతాజీ మహారాజు వారప్పుడు ఒక పూర్వపు సంఘ టనను వివరించిరి: బహుశః క్రి॥ శ॥ 1915 వ సంవత్సరమునాటి వృత్తాంతము అయియుండ వచ్చును. హుజూరు సాహబ్జీ మహారాజువారు అప్పుడు హరి పర్వతము తాలూకు కోఠీలో మకాము చేయుచుండిరి. నేనుకూడ కొద్ది రోజులు సెలవు తీసికొని అచ్చటికి వెళ్ళితిని. సెలవు సమాప్త మవగనే వెళ్ళి

పోవుచుండగ, నా మనస్సున నొక్కసారి దర్శనము చేసికొనవలయునను కోరిక పుట్టినది. నేను కోటీ సమీపమునకు వెళ్ళితిని. నా అదృష్ట వశమున, హుజూరు సాహబ్జీ మహారాజువారు బయటకు దయచేసిరి. అందరును వరుసలు కట్టి నిల బడియున్నారు. హుజూరు వారు కుర్చీమీద విరాజమానులై కూర్చుండి ఒక కమండలవుతో అమృత రసమును అందఱకును ఇవ్వనారంభించిరి. నలుగు రయి దుగురికి త్రాగించిన పిదప నా వంతు వచ్చినపుడు, నేను హుజూరు వారురు కమండులువును వెనుకకు తీసికొను వరకు నా చేతిని నోటివద్ద నక్లేయుంచి త్రాగుచునే ఉండవలయును కాని, నేనే స్వయముగ ఆపివేయుట యుక్తము కాదని తలంచితిని. దివ్యేచ్ఛచే నేను నా చేతిని తీయలేదు. హుజూరు వారును నా కమండలువులోని రసమంతయు అయిపోవు వరకు కమండలువును వెనుకకు తీసివేయలేదు. నా తర్వాత వంతు వచ్చిన పెద్దమనిషి కూడ నేను చేసిన పద్ధతినే అవలంబించ దలచెను. కాని హుజూరు వారు "ఈ పద్ధతి అందరికి సరి పడదు." అనిచెప్పి కమండలువును వెనుకకు తీసివేసిరి.

హుజూరు వారు "ఈ శబ్దములో అమృత రసమును గురించి చెప్పిరి కదా. ఇప్పు డమృత రసమును ఎవరెవరికి త్రాగవలెనని ఉన్నదో చెప్పుడు" అని అందరిని అడిగిరి. చాలమంది సత్సంగులు చేతులెత్తి అమృత రసము త్రాగుట కిచ్ఛయున్నట్లు తెలియ జేసిరి. హుజూరు వారు "రేపు సాయంకాలము అంద రును అమృతరసము త్రాగుటకై గ్లాసులు తెచ్చుకొని" రండని సెలవిచ్చిరి.

# 78

14 డిసెంబరు 1941 తేదీని విద్యార్థుల సత్సంగములో నీ క్రింది మూడు శబ్దములును పఠించబడినవి.

(1) సమఝ మోహిం ఆఈ ఆజ గురుబాత్ ।
గురుకా కహనా చిత ధర సునియే, బాత కహీం గురు హితకీ ఛాంట్
కరనీ సే ముఖ కభీ న ఫేరో, జహాఁ లగ అపనీ పార బసాత॥
కరనీ కియే బినీ బల నహీం ఆవే, బిన బల కైసే పంథ చలాత్।
పంథ చలే బిన ఘర రహే దూరీ, కాల కర్మ నిత కరేఁ ఉత్పాత।

(ప్రేమ విలాస్, శబ్ద 120)

(2) గగన మేం బాజత ఆజ బధాఈ
ప్రేమ బధా కర్నీ కరవాఈ, కర్నీ కర బహు మేహార బధాఈ।
(ప్రేమబానీ భాగ్ 3, బచన్ 14, శబ్ద 3 )

(3) పీలే ప్యాలా హో మతవాలా, ప్యాలా నామ అమీరస కా రే।
బాలపనా సబ ఖేల గంవాయా, తరున భయా నారీ వసకా రే॥
(కబీర్ సాహబ్ కీ శబ్దావళి)

ఈ శబ్దముల తర్వాత హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దముల లోని పారమార్థికబోధ అట్లుంచి, వీనిని సాంసారికదృష్టి కోణముతో చూచి నను, మీకందరికిని చాల లాభదాయకమైన శిక్ష వీనిలో నున్నది. మూడవ శబ్దములో, మనము మన బాల్యదశను ఆట పాటలలో చాల నిర్లక్ష్యము గను అజాగరూకతతోను వ్యర్థపుచ్చితిమనియు ఉపయోగకరమైన కార్యము లెవ్వియు చేయలేదనియు హెచ్చరించబడినది. మొదటి శబ్దములో నందరు కలిసి ఐకమత్యముతో పనిచేయుడని సలహాయిచ్చిరి. టెక్నికల్ కాలేజీ విద్యార్థులు ముఖ్యముగ నీ శబ్దమునుండి నీతి నేర్చుకొనవలసియున్నది. ఇందులో, మన మెన్నడు నభ్యాసమునుండి అనగా కఠిన పరిశ్రమ (Manual Work) నుండి వెనుదీయకూడదని ఉపదేశించిరి. ఏలననగా మనము అభ్యాసము లేక పరిశ్రమను చేయని యెడల మనకు బలము చేకూరనేరదు. అనగా మనకు శక్తిసామర్థ్యములు, యోగ్యత, అనుభవమును కలుగనేరవు. బలము అనగా పైన చెప్పిన శక్తి, యోగ్యత అనుభవమును లేనియెడల మనము ఔన్నత్య మార్గముననను కార్య సాఫల్యమార్గముననను ముందంజ వేయజాలము. ముందంజ పడనియెడల యథాప్రకారముగనే ఉండిపోవుదుముకాని, మననిజగృహమును, అనగా మన అభీష్టస్థానమును చేరుకొనజాలము. ఈ శబ్దములో, సద్గురువు అందువలననే మన కందరికిని శ్రేయస్కర విషయము నెంచి చెప్పుచున్నారు. కావున మనము శ్రద్ధగా నా విషయమును వినవలయునని హెచ్చరించిరి. ఆ విషయ మేమనగా మీను అభ్యాసమునుండి అనగా కష్ట పరిశ్రమనుండి యెట్టి పరిస్థితిలోను వెనుదీయరాదనియే. రెండవ శబ్దములో అభ్యాసము వలన కల్గు ఫలితమును చెప్పిరి. అదేమనగా, మీరు కఠిన పరిశ్రమకు వెనుదీయకుండ, కష్టపడి శ్రద్ధ వహించి పనిచేసిన యెడల మీ ఆశయములు తప్పక సఫలమై, మీను ప్రాపంచిక విషయములలో జయము చేకూరుటయే గాక, మీరు

అంత్యమున భగవత్కృపా పాత్రులు కూడ కాగలరని చెప్పబడినది. ఈ విధముగ నీ మూడు శబ్దములను వరుసగ గమనించినచో, మనకు ఒక మహాలాభదాయకమైన శిక్ష బోధపడుచున్నది. మీరు మీ విద్యాభ్యాస కాలమును వ్యర్థముగ పోనివ్వకుండ చేసుకొనవలయు నన్నచో ఉత్సాహముతో కష్టపడి పనిచేసి యోగ్యతను, అనుభవమును సంపాదించుకొనుచు నుత్తమ రీతిగ జీవితమును గడుపుకొనుచున్న యెడల మీకు తప్పక సాఫల్యము చేకూరగలదు.

# 79

21 డిసెంబరు 1941 తేది రాత్రి సత్సంగములో నీ క్రింది మూడు శబ్దములను పఠించిరి.

1. సురత కో మిలా ఖజానహ నామ్ ।

(సారబచన, బచన 36, శబ్ద 11)

2. సహజ మేఁ పాయె గురు దర్శన్ ॥

(ప్రేమబానీ భాగ్ 1, బచన 8, శబ్ద 55)

3. చరణ గురూ మేం లాగ, సురత క్యోం సోవఈ ।

(ప్రేమ బిలాస్, శబ్ద 45)

ఈ రోజు మధ్యాహ్నము దయాల్బాగు కార్ఖానాల తాలూకు వస్తువులు, దయాల్బాగు స్టోర్సుల తాలూకు వస్తువుల యొక్కయు ప్రదర్శనము జరిగినది.

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఇండస్ట్రీస్ మూలమున జనులందరకు దయాల్బాగు పవిత్ర వాతావరణములోనికి వచ్చి సత్సంగము చేసికొను సావకాశము లభించుచున్నది. మనుష్యులు ఇండస్ట్రీస్‌లో పని చేయుటకై వచ్చిరి కాని వారికి సునాయాసముగ హుజూరు సాహెబ్జీ మహారాజువారి దర్శనము లభించినది. ఈ వాతావరణములో సత్సంగులయొక్క పరస్పర ప్రేమ ప్రీతులు చూచుచున్నప్పుడు అట్టి భావములే అందరి హృదయములలోను ఉప్పొంగుచున్నవి. ఇచ్చట ఇండస్ట్రీస్ కును, పరమార్థమునకును గల పరస్పర సమ్మేళనమును చూచినపుడు చిత్తము చాల ప్రసన్నత నొందుచున్నది. కాని యెవరైన సత్సంగములోనికి రాకుండ నుండిపోయి, ఇంటివద్ద

పవిత్ర గ్రంథములలోని శబ్దముల నెంత నియమబద్ధముగ పాఠము చేసు కొన్నను, అట్టివారికి రాధాస్వామీ దయాళుని చరణములందు అసలైన ప్రీతి ప్రతీతులు ఉత్పన్నము కానేరవు. హుజూరువారు మొదటి శబ్దము యొక్క ప్రథమ చరణమును రెండవసారి చదివించిరి.

సురత కో మిలా ఖజానహ నామ.

ఇట్లు సెలవిచ్చిరి : జీవునికి నామ ధనాగారము లభించినది. ప్రస్తుతములో ఇండస్ట్రీస్ విషయమై పని జరుగుచున్నది కాబట్టి ఈ శబ్దములోని పై చరణాముల యొక్క భావార్థము ననుసరించి వీరందరికిని ఇండస్ట్రీస్ ద్వారా నామదానము లభించుచున్నదని చెప్పుట పొరపాటు కానేరదు. సత్సంగ సంయోగము గల్గినందుకు దాని సంపూర్ణ ఫలితము కూడ వీరలకు లభించు చున్నది.

తర్వాత హుజూరు వారు ఆడ పిల్లలచేత దివ్యేచ్ఛకు శబ్దమును తీయించి చదివించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

చరణ గురూ మేం లాగ, సురత క్యోం సోవఈ

( ప్రేమ బిలాస్, శబ్దము 45 )

ఇండస్ట్రీస్ లో పనిచేయుచు, సత్సంగమునకు రాకుండ నుండి పోవుచున్న వారి కీ శబ్దములో హెచ్చరిక యున్నదని సెలవిచ్చిరి.

## 8

28 డిసెంబరు 1941 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : సర్ సాహబ్జీ మహారాజ్ ఛారిటబిల్ ట్రస్టు ఏర్పర్చ బడినది కదా. అదెట్లు పనిచేయునో ఇపుడు చూడవలయును. దివ్యేచ్ఛకు శబ్దమును తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

గురూ మోహిఁ అపనా రూప దిఖాఓ।
యహ తో రూప ధరా తుమ సరగున,
జీవ ఉబార కరాఓ॥

( సార బచన్, బచన్ 33, శబ్ద 15 )

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములోని ఒక చరణము, అనగా "యహ భీ రూప పియారా మోకో, ఇసహీ సే ఉసకో సమఝూఓ" అను చరణము సర్ సాహబ్జీ మహారాజు ట్రిస్టును సంబోధించి సభ చెప్పుచున్నట్లుగ ధ్వనించు చున్నది. ఈ శబ్దానంతరము మరొక శబ్దమును చదివిరి.

దేఖ పియారే మైం సమఝూ ఉంః, రూప హమారా న్యారా।
తేష్హారీ చింతా మైం మన ధారీ, తుమ అచింత రహ ధరో పియారా (9)
సంశయ ఛోడ కరో దృఢ ప్రీతీ, ఔర పరతీతి సంవారా (10)
యహ కర్నీ మైం ఆప కరా ఊంః ఔర పహుంచాఊం ధుర దర్బారా(11)
(సార బచన్, బచన్ 33, శబ్ద 16)

హుజూరువారు చివర చరణములను రెండవసారి తిరిగి చదివించి, యిట్లు సెలవిచ్చిరి : సంఘమునకు ఇప్పుడు ఏ మార్గము సూచించ బడినదో, మీరు దానినిబట్టి నిశ్శంకగా పోవచ్చునను సందేశము ఈచరణములలో నున్నది. మీరు వారి యందు ప్రీతి ప్రతీతులు గల్గి యుండుడు. వారే మీ కార్యములను చక్కబెట్టెదరు. ఈ యభ్యాసమును అనగా యీ ట్రిస్టు పని అంతయు వారే పూర్తిచేసెదరు. చూడుడు: ఈ ట్రిస్టును ఏర్పాటు చేయుటకై మనమేమియు గొప్ప ప్రబంధము చేయ నక్కర లేకుండ, భగవంతుని దయ కలిగిన తోడనే తగిన పరిస్థితులు వానంతట నవియే తయారై యీ పని జరిగిపోయినది.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి : ఈనాడు హుజూరు మహారాజు వారి భండారా అను విషయము జ్ఞాపకముంచుకొనుడు. వారి మహిమా గానము తప్పకుండ చేయవలసి యున్నది. ఈ క్రింది శబ్దము వచ్చినది :

సతగురు ప్యారే నే సంవారీ, మేరీ సురత నిమానీ హో ॥టేక్॥
కర సతసంగ హుఆ మన నిర్మల బఢా అనురాగ చిత్త హుఆ నిశ్చల
రోమ రోమ హరఖానీ హో ॥ (1) ॥
రాధాస్వామీ లియా మోహిం అంగ లగాఈ,
మెహర్ సే దియా సబ్ కాజ బనాఈ।
పహుంచీ అధర ఠికానీ హో ॥ (5)
(ప్రేమబానీ, భాగ 3 బచన్ 12 (4), శబ్ద 27)

దీని తర్వాత ఆడ పిల్లలు అనుజ్ఞ తీసికొని ఒక పాట పాడిరి. దానిలో నొక చరణము ఈ క్రింద వ్రాసిన ప్రకారము ఉన్నది.

" అంత మేం వాదా కియా, పూరన హో తేరీ ఆస భీ"

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : నా కిప్పుడు నా జీవితములోని ఒక సంఘటన జ్ఞాపకము వచ్చుచున్నది. ఒకసారి నేను "హుజూర్, అందరు స్మరణ ధ్యాన భజనాభ్యాసములను చాల బాగా చేసికొనుచున్నారు. నాకేమియు నభ్యాసము సాగుటలేదు. మరి నాకెట్లు ఉద్ధారము అగును?" అని ఒక ప్రార్థనను వ్రాసి హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణములవద్ద పెట్టుకొంటిని.

హుజూరు సాహబ్జీ మహారాజువారు, "He makes no distinction" అని సమాధానము చెప్పిరి. శబ్ద పాఠము అయిపోయిన తర్వాత హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు నేను చెప్పిన విషయము విన్నమీదట మీలో కొంతమంది కేదైన నపభ్రమ గలుగవచ్చును. కావున నీ విషయమై పవిత్ర గ్రంథమునే అడిగి తెలుసుకొనుట యుక్తము. దివ్యేచ్ఛకు శబ్దము తీయగా ఈ క్రింది శబ్దము వచ్చెను.

అరీ హే సహేలీ ప్యారీ, గురు కీ సరన సమ్హారో,
కాజ కరేం వే పూరా ॥ టేక్ ॥
ప్రీతి ప్రతీతి ధరో గురు చరణన్,
కరమ భరమ సబ్ కీన్హే మర్దన్

గురు బల మన హుఅ సూరా (2)
రాధాస్వామీ మేహర్ కరీ అబ్ ముఝ పర్,
సహజ పహుంచాయ దియా మోహిం ధుర ఘర।
హుఈ ఉన చరనన ధూరా హో॥ (5)

( ప్రేమ బానీ భాగ్ 3, బచన్ 12 (5) శబ్ద 20)

ఈ విధముగ సత్సంగము పదమూడు గంటలసేపు జరిగెను. చాల శబ్దములు పాడిరి, పాటలు పాడిరి, ప్రసాదములు ఎగురవేసిరి. అచ్చటనున్న వారందరు నానంద పరవశులై పోయిరి.

# 81

13 జనవరి 1942 వ తేది సాయంకాలము సత్సంగములో నొక బిహారీ సత్సంగి, తన జీవితమంతయు నిక సత్సంగములోనే గడప దల్చుకొన్నాననియు సత్సంగములోనే ఉండి సత్సంగము చేసికొన గోరుచున్నాననియు హుజూరు వారికి చెప్పుకొనెను.

హుజూరు వారిట్లు ప్రశ్నించిరి. "అదికాక నీకు మరేమియు నక్కఱ లేదా." అతడు "చిత్తము. జీవికా నిర్వాహమునకై యెండు రొట్టెయు, ధరించుటకు మోటు రకము బట్టలును ఇప్పించ గోరెదను" అని సమాధానము చెప్పెను.

హుజూరువారు ఇట్లుసెలవిచ్చిరి: ఈ పారమార్థికరూపమైన మాటలలో నంతర్గతముగనున్న అసలు విషయ మేమనగా తన జీవనోపాధి వస్త్రముల నిమిత్తమైన కోరికయే. ఈ రోజులలో నాకు పరమార్థపు విషయములను చర్చించుచు రోజునకు రెండు మూడైనను ఉత్తరములు వచ్చుచున్నవి. కాని వానిని ధ్యానము పెట్టి చదివిన యెడల, అందలి పారమార్థిక ప్రార్థనల వెనుక తమ ఆర్థిక కష్టముల విషయమే వారి ముఖ్యాశయమైనట్లుగ కన్పించును. వాస్తవముగ, సత్సంగులు ఆర్థికమైన ఇక్కట్లలో బాధపడుచున్నారు. అయినను ఆ విషయము స్పష్టముగ చెప్పుకొనక, పరమార్థమను వంకతో వారి బాధలను గురించి వ్రాసుకొను చున్నారు. అందువలన నిక్కాలమున సత్సంగములో ఇండస్ట్రీస్ బిజినెస్ వైపు యెక్కువ శ్రద్ధపెట్టి జరిగించ బడుచున్న పని అంతయు నీ సమయమునకు చాల అవశ్యక కార్యక్రమమే. ఏలననగా మానవునికి సాంసారికమైన కష్టములు చింతలును కొంత తగ్గి విశ్రాంతి యున్నప్పుడే కదా, పరమార్థ సంబంధమైన అభ్యాసములు చేయుట కవకాశము కల్గును. కావున నిక్కాలమున జరుగుచున్న దంతయు యుక్తమును, హుజూరు రాధాస్వామీ దయాళుని దివ్యేచ్ఛ ననుసరించి యునే జరుగుచున్నది.

# 32

గత వారము "సత్సంగకే ఉపదేశ్" ప్రథమ భాగములోని 10 వ వచనము, "భంవరే సే సబక్" చదవబడినది. అందులో నీ క్రింది అంశమును

"హుజూర్ రాధాస్వామీ దయాళురు మనయొక్క అశక్తతను తెలుసుకొని, మనకు సరియైన మార్గమును చూపించు నిమిత్తమై, సంఘముయొక్క ప్రాపంచికావసరములకు సంబంధించిన దుష్కర ప్రబంధమును సత్సంగ ప్రణాళికలో భాగముగ చేయుట కంగీకరించి, తమ సొంత నిరీక్షణ క్రింద వరుసగ నొక్కొక సంస్థనే స్థాపించు మహాదయను చూపించుచున్నారు."

అందులోనే ఇంకను ముందు, "రాధాస్వామీ మతము జనసామాన్యము కొరకై ఉద్దేశింపబడి, సకల జనులకును దీని ద్వారములు తెరిచియుంచవలసియున్న యెడల పిరికి తనము నిరుత్సాహమును పనికిరావు" అని వ్రాసియున్నది.

హుజూర్ మెహతాజీ మహారాజువా రిట్లు సెలవిచ్చిరి. ఈ వచనము అది వ్రాసిన సమయమునకు బహుశః సరిపడియే యుండవచ్చును. కాని మీరు సత్సంగము యొక్క ప్రస్తుత పరిస్థితిని గమనించిన యెడల, అది ఈనాటి సత్సంగ పరిస్థితికి సరిపడునంత యెక్కువగ మరొక సమయమునకు వర్తించదని తెలియగలదు. ఇప్పుడు ఒక్క కోటి రూపాయల ప్రణాళిక మాత్రమే జారీ చేయబడినది. కాని ముందు ముందు ఈపని యింకనెంతవరకు వృద్ధి చెందునో, మనము ఎంత అధిక ప్రమాణములో మన ప్రబంధమును పెంపుచేయవలసి యుండునో మనకు తెలియదు. అందుచే మన మేపని చేసినను పెద్ద పరిమాణములో జేయుచు గొప్ప ఉద్దేశ్యములను లక్ష్యముగ బెట్టుకొనవలయును. ఎంత చెప్పినను, ఈ కార్యము ఒక మానవునికిగాని, ఒక సామాన్య సంస్థకునుగాని చెందినది కాదు. జరుగుచున్న దంతయు హుజూర్ రాధాస్వామీ దయాళుని దివ్యేచ్ఛ ననుసరించి జరుగుచున్నది. కావున పని అంతయు వారి ప్రతిభకు తగినట్లు ఉండవలయును.

# 83

23 ఫిబ్రవరి 1942 తేదీని సత్సంగములో "సచ్చీ భక్తి కీ మహిమా" అను శీర్షికగల వచనము చదువబడినది. దీనిలో కొన్ని భాగములను హుజూర్ వారు తిరిగి రెండవసారి చదివించి యిట్లు సెలవిచ్చిరి. యథార్థమైన భక్తిని గురించి మీరు ఈ ముఖ్యవిషయమును బాగుగ అవగాహన చేసుకొనవలసియున్నది. భక్తి యనగా గురు మహారాజువారి పైన నేర్పైన బలవంతమ్ము

చేసి పని సాగించుటకాదు. భక్తి యనునది కేవలము ప్రేమ వశముగను సహజముగనే చేయబడును.

## 84

5 ఏప్రియల్ 1942 తేది ఉదయము దేదీప్యమాన స్వరూపులైన హుజూర్ వారు, ఆరతి అయిన పిమ్మట సంఘములో నందరిని ప్రశ్నించిన ప్రశ్నలను, సెలవిచ్చిన వచనమును ఈ క్రింద వ్రాయబడినవి.

ఇట్లు సెలవిచ్చిరి, నేనిపుడు మిమ్ములనొక ప్రశ్న వేయదల్చుకొన్నాను. మీరు దయచేసి దానికి నిస్సంకోచముగ సమాధానము చెప్పగోరెదను. మీలో లడ్డులు తినవలెనను ఆలోచన యెవరెవరి మనమున పొడముచున్నది? అంతట కొందరు చేతులెత్తిరి. "సాహబ్జీ మహారాజువారీ సమయములో సత్సంగములోనికి దయచేసిన యెడల మీరు వారి నేమి యాచించెద" రని తిరిగి అడిగిరి. హుజూరువారిని ప్రేమ భక్తుల దానమును వేడెదనని ఒకరు చెప్పిరి. ప్రేమీభాయీ లాల్తాప్రసాద్ "శాద్" గారు తమరు హుజూరు సాహబ్జీ మహారాజువా రిచ్చటకు వచ్చుటను గురించి చెప్పిన మాట, వారిచ్చట నిపుడు లేని పక్షములో సరిగ నుండును. కాని, వారిపు డిచ్చటనే యుండి మా హృదయములను కనిపెట్టుచునే యున్నారు కదా యని చెప్పిరి. హుజూరువారు ఆ మాటను పరిహాసముగ మార్చి తప్పించి, మిగత వారిని చెప్పుమని అడిగిరి. మరొకరు తనకు భగవత్ప్రేమ కావలెనని చెప్పుకొనెను. అందు పైన హుజూర్ వారు ఈ సమయంలో జగత్తులో నలువైపుల ఘోరాంధకారము వ్యాపించి యున్నది. ప్రతి స్థలములోను బాంబులు వర్షించుచున్నవి. జనులందరికిని గాబరా వ్యాకులము నెక్కువ అయిపోవుచున్నది. అన్ని చోట్ల పట్టణములు ఖాలీ చేయబడుచున్నవి. దయాల్బాగులో కూడ వృద్ధులును బలహీనులును ఇచ్చటనుండి వెడలి పోవలసినదిగ ప్రోత్సహించబడు చున్నారు. ఇట్టి పరిస్థితులలో ప్రేమదానమును కోరుట సమయోచితముగాదు,'' అని సెలవిచ్చిరి. తిరిగి హుజూరు వారిట్లనిరి : మీకు నిజముగ, యుద్ధము రోజు రోజు మరింత యెక్కువ భయంకరమై పోవుచున్నదనియు ప్రపంచమందు అంతటను ఆపత్తుల మేఘములు ఆకాశమును క్రమ్మియున్నవనియును, తోచిన యెడల రాధాస్వామీ దయాళురు అందరిని సంరక్షించి అందరికి అన్నవస్త్రములు దయచేయు ప్రబంధమేదైన జేయుదురుగాక యనెడి కోరిక మీ

మనస్సులలో బయల్దేర వలయును. ఎన్నియో చోట్ల యీ మేఘములు వర్షించుచునే యున్నవనియు ఇంక నెన్నియో చోట్ల వర్షించ బోవుచున్న వనియు మనకు కనిపించుచునే యున్నది. ఆ మేఘములు మనమీదకూడ క్రమ్మియుండి త్వరలో వర్షింప జూచుచున్నట్లు మనకు తెలియుచునే యున్నది. ఈ మేఘములు మీదికి వచ్చి వర్షించినపుడు అవి నిప్పును నిప్పుగోళములను వర్షించి నలు వైపుల నాశనము చేయునని మీకు తెలుసు కదా! మన నందరిని ఈ ఆపత్కష్టములనుండి కాపాడునట్లు హుజూరు రాధాస్వామీ దయాళురు దయ చూపవలయు ననెడి ఆలోచన మీ కెవరికిని మనమున పొడమనే లేదా? ఈ విధమగు భావము మనసున పుట్టకుండుటకు అసలు కారణమేమై యుండ గలదు? మీ మనస్సులలో నిట్టి ప్రార్థన బయల్దేరిన యెడల, నది పరమార్థ విరుద్ధమగునని మీరు తలంచుచున్నారా? అట్టి ప్రార్థనలను చేసినచో భగ వంతుని కృపాదృష్టిని పోగొట్టుకొందు మేమో యని సందేహించు చున్నారా? నేను మట్టుకు అట్లు సందేహించుటకు అంగీకరించను. నా అభి ప్రాయములో, అట్టి ప్రార్థన మన హృదయములలో జనించ కుండుట పూర్తిగ అయుక్తమే గాక, పరమార్థ విరుద్ధమును, పరమార్థమునకు హాని కరమును గూడ నగును. అయితే యీ చెప్పిన కోరికయు ప్రార్థనయు మన మనస్సున బయల్దేరుటకు ప్రధాన కారణము, మన సంతానమే సురక్షిత ముగ నుండి, వ్యక్తిగతముగ మనకే లాభము గలుగ వలయుననియు, మన సుఖశాంతుల కెట్టి ఆటంకము కలుగకుండ నుండవలయుననియు, మన ధన సంపత్తులే సర్వవిధముల సురక్షితముగ నుండవలయు ననియు స్వార్థవాంఛ యొక్కటే అయిన యెడల, నా ప్రార్థన తప్పక స్వార్థలాభము నుద్దేశించియే చేయబడినందున పరమార్థ విరుద్ధమే అగును. అట్లుగాక మన మీ ప్రార్థనను సమస్త సంఘమును సకల మానవజాతిని ఈ ఆపత్తులనుండి రక్షించవలయు నను ఉద్దేశ్యముతో భగవచ్చరణములందు చేసిన యెడల మనదృష్టి భగ వంతుని చరణములమీదికి పోవుచున్నది కాని ప్రపంచము వైపునకు పోవుట లేదు. అందుచే నా ప్రార్థన మనకు పారమార్థికముగ లాభమే కలుగ జేయును. ఇప్పుడు నేను చెప్పిన విషయము మీకు బోధపడిన యెడల మీలో నెవరెవరి మనస్సున తమ సంపత్తు, సంతానము, బ్యాంకిలో నిల్వధనమును ఏ విధమున నైన సురక్షితముగ నుండవలయు నను కోరిక బయల్దేరు చున్నదో

లేదా, దయాల్బాగు వెళ్ళిపోవుదము అచ్చట నుండిపోయినచో పై విషయము లన్నిటికి సరియైన యేర్పాట్లు జరిగిపోవున నెడి తలంపు కలుగుచున్నదో స్పష్టముగ తెలియ జెప్పుడు.

# 85

4 ఏప్రియల్ 1942 తేదీసి సభ మీటింగు అయినది. ఆనాడు ముగ్గురు నలుగురు మాటలాడిన పిమ్మట హుజూరు మెహతాజీ వారు మాటలాడిరి. సత్సంగము ద్వారాయే ఏర్పాటు చేయబడినను, అది మనకెప్పుడు లాభకర ముగనే యున్నట్లు మనకు అనుభవ రూపముగ తెలియును. కావున మన మెప్పుడు నా ప్రబంధములో సహకరించి, మన మనస్సుయొక్క ఇష్టా నిష్ట ములను లెక్కసేయ కూడదు. మీలో నెవరెవరు ఆహార పానీయములు, వస్త్రధారణము, మరియే నితర సామాన్య ప్రవర్తనకు సంబంధించిన కష్టము లను ఓర్చుకొనుట కలవాటు పడలేదో అట్టివారు ముందే మరొక సురక్షితమైన చోటుకి వెడలి పోవలయును. ఉత్త సెనగలు తినుచు, సకల విధములైన కష్టములకును దేహ పరిశ్రమకును సహించుకొనుచు నెవరుండగలరో ఇచ్చట నుండుటకు సిద్ధపడవలయును. సభా సమావేశము పూర్తియైన పిమ్మట రాజ బరారీ ఎస్టేటు మేనేజరు ప్రేమీభాయీ బంగారముగారు రాజ బరారీ తాలూకు సంతరాపండ్లను హుజూరువారికి అర్పణచేసిరి. హుజూరువారు అవి తీపిగనుండునా యని అడుగగా, ప్రేమీభాయీ బంగారముగారు తాను రుచి చూడలేదని సమాధానము చెప్పిరి. అంతట హుజూరువారు చిరునగవుతో హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఒక వచనములో ఉదహరించబడిన శాహ ఇబ్రహీంగారి దృష్టాంతమును చెప్పి ఈ తోటమాలి కూడ శాహఇబ్రహీం గారి వలెనే యీ సంతరాపండ్లను రుచిచూడలేదుట యని సెలవిచ్చిరి.

# 86

26 ఏప్రియల్ 1942 తేదీని అమృత్సర్ మిల్లు ఆవరణలో నొక శామి యానా క్రింద సత్సంగము జరిగినది. తర్వాత నొక బాలిక యే కర్మలు మంచివి యేవి చెడ్డవి అని అడిగినది. ఆ అమ్మాయి ఒక సత్సంగియొక్క కుమార్తె, శాస్త్రి క్లాసులో చదువుకొను చున్నది. హుజూరు మెహతాజీ మహారాజువారిట్లు సెలవిచ్చిరి. ఏ పని చేసినందు వలన మనము భగవంతునికి

దూరమై పోవుదుమో ఆ పని చెడ్డకర్మ, దేనివలని భగవంతుని సన్నిధిలో నుండుమో అది సత్కర్మయగును. ఈ జవాబు పరమార్థ దృష్టి ప్రధానము చేసికొని చెప్పితిమి. కాని స్వార్థదృష్టి కోణముతో పరికించినపుడు ఇందుకు సమాధానము సమయమును బట్టియు పరిస్థితుల భేదమును బట్టియు మార్పు చెందుచుండును. ఏలనన, ఒక సమయములోను ఒక పరిస్థితిలోను సత్కర్మయని చెప్పదగిన పనిమరొక సమయములోను, మరొక పరిస్థితిలోను దుష్టకర్మగ చెప్పవలసి వచ్చును.

## 87

2 జూలై 1942 తేది సాయంకాలము సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి. మీరు గతించిన మాసము రోజులును చాల ఏకాగ్రతతో సత్సంగ కార్యక్రమము జరిపించిరి. ఏలననగా ఇప్పుడు మీరు మంగళాచరణము పాడినపుడు అందరు నొకే కంఠస్వరముతో పాడిరి. నేను మీలో నేదైన నొక కంఠస్వరము వేరుగ నున్నట్లు వినిపించునేమోయని తెలుసుకొనుటకు చాల ప్రయత్నించితిని కాని అట్లు ఏమియు నాకు వినబడలేదు. అందరి కంఠములు కలసి ఏకస్వరముగ వినిపించినవి. అట్లే మన మందరము కలిసి తదేకభావముగల హృదయములతో హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రార్థన చేసిన యెడల వారు మన ప్రార్థనను తప్పక అంగీకరించెదరని పూర్తిగ ఆశించవచ్చును.

## 88

21 జూలై 1942 సాయంకాలము సత్సంగములో నీ క్రింది రెండు శబ్దములును చదువబడినవి.

గురు ప్యారే సే ప్యారీ మత కర మాన్,

(ప్రేమబానీ భాగ్ 3, బచన్ 12 (2) శబ్ద 42)

గురు ప్యారే కే మానో బాత సహీ

(ప్రేమబానీ భాగ్ 3, బచన్ 12 (2) శబ్ద 43)

రెండవ శబ్దమైన తరువాత హుజూరువారిట్లు ప్రశ్నించిరి. మీలో, హుజూర్ సాహబ్జీ మహారాజువారి వచనములను ఆ దేశములన్నిటిని, ఏ

ఒక్క విషయములో గూడ నెట్టి సందేహము పెట్టుకొనకుండ, పూర్తిగ విశ్వసించి, ఆ ప్రకారము వాని నన్నిటిని ఆజ్ఞాపాలనము చేసితిమని చెప్పగల పురుష సింహు లెవరైన నున్నారా?

చాల మంది, ఒక్కొక రొక్కొక విధముగ యేవేవో సమాధానము లను చెప్పిరి.

హుజూరువారిట్లు చెప్పిరి. మీ సమాధానములలో మీ మనస్సు గడుసుదనము బయల్పడు చున్నది. నే నడిగిన దేమనగా, మీలో నెవరైనను వారి ఆజ్ఞలలో నేయాజ్ఞను పాలించిరో, దేనిని పాలించలేదో చెప్పుమనియే.

తిరిగి అందరు తలొక విధముగ సమాధానము చెప్పిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. హుజూర్ వారి ఆజ్ఞలను మీలో నెవరు పాలించిరో మీరు చెప్పలేకపోయినచో, అధమము మీలో వారి ఆజ్ఞల నెవరు బొత్తిగ పాలించలేదో ఆ విషయమైనను చెప్పుడు. అందును గుఱించి హుజూరు వారొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి.

చేత చల జగత సే బౌరే,కపట తజ గహో గురూ సరనా,

(సారబచన్, బచన్ 15, శబ్ద 8)

ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు నేను మిమ్ములను అడిగిన ప్రశ్నకు మీరు ముందుగ సమాధానమిండు. లేదా, మీకు అట్లు సమాధానమును చెప్పుట కిష్టము లేనియెడల, మీరా ప్రశ్న నన్ను అడుగవచ్చును. నేను అందుకు సమాధాన మిచ్చుటకు తయారుగ నున్నాను. హుజూరు సాహబ్జీ మహారాజు వారు చెప్పిన విషయములలో నాకు ఎన్నడు నే విషయము గూడ సత్యము కాదనికాని సరికాదని కాని అనిపించలేదు. వానిలో నేదానియందు గూడ దోషమున్నట్లు అనుమానము కూడ నా కెన్నడు కలుగలేదు. వారి ఆజ్ఞలలో నొక్కటి కూడ నేను పాలించకుండనుండ లేదు. ఒక్క సమయమున మాత్రము వారు సెలవిచ్చిన విషయమును నేను పాలించలేక పోయితిని. అందుకు చెడు ఫలితమును బాహ్యారూపమున నే నీనాడు అనుభవించ వలసి వచ్చినది. మీరుకూడ హుజూరు సాహబ్జీ మహారాజువారు చెప్పిన యే విషయము నైనను సత్యమైనదిగను సరియైనదిగను విశ్వసించని యెడల, లేదా

వారు జరిగించిన యే కార్యక్రమము నందైన సందేహము అవిశ్వాసము మీకెన్నడైన కలిగినను మీరు దానికి శిక్ష ననుభవించ నక్కఱ లేకుండ తప్పించుకొన దల్చినచో, అధమము ఇప్పుడైన నా విషయమును సరియైనట్లు అంగీకరించుడు. వారు జరిపించిన పని దేనియందును నాకు దోషాను మానము కాని లేక యెట్టి సందేహము కాని యెన్నడు కలుగలేదు. ఆ తర్వాత హుజూరు వారొక శబ్దమును దివ్యేచ్ఛకు తీసి చదువుచునగా యీ క్రింది శబ్దము వచ్చినది,

సురతియాం సోచ కరత, కస జాఉం భౌ కే పార్

(ప్రేమబానీ భాగ్ 4, బచన్ 22, శబ్ద 14)

శబ్దము పఠించిన పిదప హుజూరు వారు తమ పూర్వ సంఘటన నొక దానిని చెప్పిరి :

బహుశః 1921 సం॥రము డిసెంబరు 7, 8 తేదీలలో నిది జరిగియుండ వచ్చును. నేను 4 మాసములు సెలవు తీసుకొని దయాల్బాగు వచ్చితిని. నేను తిరిగి వెళ్ళిపోవుటకు ముందు, వారితో ఇంటర్వ్యూ ప్రార్థించి, ఒకచీటిమీద, "హుజూర్ సత్సంగి సోదరు లందరు భజనవగైరా అభ్యాసములు చేసుకొను చున్నారు కాని నాకు భజన కాని అభ్యాసముకాని యేమియు జరుగుటలేదు. నా ఉద్ధార మెట్లు కాగలదు?" అని నా ప్రశ్నను వ్రాసి హుజూరు వారి చరణములవద్ద పెట్టుకొంటిని.

హుజూర్ సాహబ్జీ మహారాజు వారు "He makes no distinction" అని సమాధానము చెప్పిరి అనగా హుజూరు రాధాస్వామీ దయాళురు అట్టి భేద మేమియు చేయరు అని చెప్పిరి. నేను చెప్పిన ఘటనను బట్టి మీరుకూడ అభ్యాసము చేయుట మానివేయ వచ్చునని అభిప్రాయపడరాదు. నా సొంత ఘటనను గురించి ఇప్పుడు నేను చెప్పుటకు కారణమేమనగా, పై శబ్దములోని చరణమునకు ఈ ఘటనతో గాఢమైన సంబంధము ఉన్నది. ఆచరణములు ఈ ఘటన వైపు సూచించుచున్నవి. ఆ సమాధానమును సాహబ్జీ మహా రాజువారు ప్రత్యేకముగ నన్ను ఉద్దేశించియే చెప్పిరి. అందరికిని అదే వర్తించ వలయునను నిశ్చయము లేదు. మరొకరికి వారు సమాధానము మరొక విధ

## ౮౯

ఒకనాడు ఆదివారము పిల్లల సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి:

> “సరన తెరీ హామ ఆయ ప్రభూజీ.
> లాజ హామారీ తుమ కో ॥

శబ్ద పాఠమై పోయిన తర్వాత దేదీప్యమాన స్వరూపులైన హుజూరు వారు “ఆ క్రొత్త పంథ “నయా చాల” యేమిటి” అని ప్రశ్నించి వారే ఇట్లు సమాధానము చెప్పిరి. ఆ పంథకూడ ఏదనగా, సత్సంగుల పిల్లలు సరణ ఆశ్రమ ఆసుపత్రిలోనే పుట్టి, పెరిగి ఇచ్చటి నర్సరీ క్లాసులలోను, స్కూళ్ళు కాలేజీలలోను చదువుకొని, ఇచ్చటనే ఏదైన నొక సేవ యొక్క భారమును తమమీద పెట్టుకొని నెరవేర్చుచు చివరకు అంత సమయము వచ్చినప్పుడు ఇచ్చటినుండి ఆడుచు పాడుచు అంత్య ప్రయాణము చేయుటయే అని సెలవిచ్చిరి.

## ౯౦

ఆగష్టు మూడవ వారములో నొక రోజున తేజః స్వరూపులైన హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : రాధాస్వామీ దయాళురు ఈ జగత్తులోని జీవులను చౌరాసీ చక్రమునుండి తప్పించి తిన్నగ రాధాస్వామీ ధామమునకు జేర్పించు బాధ్యతను స్వయముగ వహించిరను విషయము మన మతములో ఒప్పుకొనుచున్నపుడు, మరి తమ బాధ్యతా నిర్వాహ సందర్భములో పిల్లవాడు పుట్టినది లగాయతు అతని పాలన, పోషణ, బుద్ధి వికాసములకు సంబంధించిన ప్రబంధమును వారే చేయకుండ నుందురని ఒప్పుకొనుట యెట్లు? మరియు, అతడు పెరిగి యువకుడు వృద్ధుడును అగుచున్నకొలది, ఆయా వయస్సులకు తగినట్లు అతని యావత్తు ఆవశ్యకతలను గురించియు వారాలోచించకుండ నెట్లుందురు ? అనగా, అతడు పెద్దవాడైనపు డతని జీవికానిర్వాహమునకును, అతని పెండ్లి పేరంటములకును జబ్బు చేసినపుడు మందులు వైద్యమునకును, అతని సంతానము యొక్క విద్యాభ్యాసము పాలన పోషణలకును తగిన ప్రబంధము చేయకుండ నెట్లుందురు? మరియు. ఈ విధముగ నతనిచే సేవ చేయించుకొని అతనిని అంతిమ యాత్రకు సంసిద్ధునిగ జేయకుండుట యెట్లు?

ఈ జన్మలోనే యెవని యాత్ర పూర్తియైపోవునో అతని విషయములోనిఁక చెప్పవలసిన దేమున్నది? ఎవని యాత్ర పూర్తి చేయుటకు ఇంకను కొంత ఆలస్యమున్నదో, అట్టివానికి తన అంతిమయాత్రకు తయారుచేయు నిమిత్తమె తదనుకూలమైన యేర్పాట్లు సావకాశములును వారు కలుగజేయ కుందురా? జీవులను చౌరాసీ చక్రము నుండి తప్పించి, భవసాగరము దాఁటించి, వారలకు ముక్తికలుగజేయు నిమిత్తమవసరమైన ప్రబంధములు పరివర్తనములు నన్నియు నిస్సంశయముగ వారిచే చేయబడగలవని మీరు తెలిసికొనుడు. కొందరు సత్సంగముతో విరోధించవచ్చును. ఆటంకములు కలుగజేయవచ్చును. వారేమి చేసినను ఆ విషయము లెంతమాత్రము లెక్కసేయబడవు. అయితే ఈ పై విషయములు సిద్ధించు నిమిత్తమై యే యే నియమములు సత్సంగములో యేర్పాటు చేయబడునో, వానిని మాత్రము అవశ్యము పాలించవలసి యుండును. ఈ విషయములో నింకొకమాట చెప్పవలయును. అదేమనగా, ఎవరైతే సత్సంగముతో సహకరించు చుందురో వారికా నియమములు కఠినముగ అనిపించవు. అట్టి వారు ఆ నియమములను సంతోషముగ అవలంబించు చుందురు. సత్సంగమునకు ప్రతికూలముగ ప్రవర్తించు వారికి సత్సంగ నియమములు చాల కఠినముగనే కనిపించును. వారికి ఆ నియమముల ప్రకారము నడచుకొనుటకు కూడ కష్టముగ నుండును. వారిచేత ఆ నియమములను పాలించునట్లు చేయు నిమిత్తమును సత్సంగులలో నిర్లక్ష్యభావమును తొలగించు నిమిత్తమును చెవి మెలిపెట్టి వారిచే నియమబద్ధముగ ప్రవర్తింప జేయవలసి వచ్చినపుడు వారికి ఆ నియమములు రెండు, మూడు రెట్లు లేదా నాల్గు రెట్లు కూడ దుర్భరముగ కన్పించును. ఈ మధ్యన నియమ విరుద్ధముగ నడచుకొన్న వారిని కొందరిని నియమానుసారము నడుచుకొను లాగున బలవంతము చేయుటయు, వారు ఆ బలవంతము చాల కఠినముగ నున్నదని యెంచుకొని అసంతృప్తి ప్రకటించుటయు మీకు తెలిసియే యుండును. మీ యిరుగు పొరుగులలోనే అట్టి యుదాహరణలు మీరు గమనించగలరు. ఈ నియమములను కఠినముగ నున్నవని తలంచు పెద్ద మనుష్యులు ఆ నియమములను పెట్టిన వారికి తమ యెడల నెట్టి వైరముకాని ఈర్ష్యకాని ద్వేషభావము కాని లేదనియు వారు తమ మీద కక్షకాని కసికాని తీర్చుకొను నిమిత్తమై ఆ నియమముల నేర్పాటు చేయలేదనియు బాగుగ విమర్శించు కొనవలయును. అట్లు కానపుడు వార్లు ఆ నియమములను జనులందరి యొక్క శ్రేయస్సు కోరియే చేసి

రని ఒప్పుకొనవలసి యుండును. కావున సంఘీయు లందరును ఆ నియమ నియంతలను విశాల దృష్టితో అవగాహన చేసుకొని, సంఘ శ్రేయోలాభము కొరకై అంత శ్రద్ధ వహించినందుకు వారికి కృతజ్ఞతా పూర్ణులై సంఘము నంతను ఒక ఉత్తమాదర్శము వైపునకు గొనిపోవు ఉద్దేశ్యముతోనే నియమ ములు ఏర్పరచబడినవను విశ్వాసముతో నుండవలయును. సత్సంగములో నేయే పరివర్తనములు మార్పులును గత 20, 25 సంవత్సరముల కాలములోను ప్రస్తుత సమయములోను చేయబడుచున్నవో వానిని మీరు చక్కగ విమర్శించిన యెడల అట్టి మార్పులు ఒక్క సత్సంగములోనే అగుట లేదనియు, ఇతర సంఘములలో గూడ వారి వారి పద్ధతులు దృష్టి కోణములలోను చాల మార్పులు గల్గినవనియు మీకు బోధపడగలదు. కావున యెల్లమానవులును తమ ప్రవర్తనా పద్ధతిని ఎప్పటికప్పుడు సమయాను సారముగ మార్చుకొని సరిచేసి కొనకుండ, తమ పూర్వ సంప్రదాయముల ప్రకారమే నడుచుకొను చుండిన యెడల, వారు తప్పక కష్టముల ననుభవించవలసి వచ్చును. వర్త మాన సమయమునకును భావికాలమునకును అవసరమైన విషయములను తెలుసుకొని, అందుకు తగినట్లు తమ ప్రవర్తనా పద్ధతిని మార్చుకొనుటకు యత్నించ గోరువారికి ఈ కార్యక్రమ మంతయు సులభ సాధ్య మయిపోయి, ఇట్టి నియమములను పాలించుటలో సంతోషము గలుగును. అందుచేత నేను 5, 6 రోజులు ముందుగనే మీకు ఈ విషయమును గురించి సూచన చేయుట యుక్తము. ఈ సారి సభా సమావేశములో ఈ విషయములలో ఒకటి రెండు ఆవశ్యక విషయములు విమర్శనకై పెట్టబడును. మీరందరును అప్పుడు ఉండెదరు కదా. బహుశః మీ అందరి అభిప్రాయమును సభాపతి మహాశయుడు కనుగొనగోర వచ్చును. ఈ విషయములన్ని హెచ్చు మంది అభిప్రాయము ననుసరించికాని లేదా మరొక పద్ధతినికాని తీర్మానించబడును. అప్పుడు తీర్మానించబడిన ప్రణాళికను (Scheme) తప్పక అందరు నవలం బించవలసి యుండును. ఏ వ్యక్తియైనను అట్లు అవలంబింప జాలక పోయినచో తగిన కారణమును చెప్పవలసి యుండును. ఆ విషయమును గురించి అతనిని ప్రశ్నించి సమాధానము తీసుకొన బడును. దాని పర్యవసానము నతడు అనుభవించవలసి వచ్చును.

౨

హుజూర్ సాహబ్జీ మహారాజు వారి భండారా రోజున ఆరతి సమయములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: మన సంఘము అభివృద్ధి నొంది ప్రపంచమున కొక ఉచ్చత మాదర్శమును ప్రదర్శించ గోరిన యెడల మన సంఘము సమయాను సారముగ పద్ధతులను మార్చుకొనుచు, పురాతనపు దురాచారములను తప్పుడు పద్ధతులను విడిచి పెట్టవలయును. ఇచ్చట కొంత కాలమునుంచి ఆడ మగపిల్లలయొక్క వివాహ సమస్య యోచన చేయబడు చున్నదను విషయము మీకు తెలుసుచు కదా! ఈ సందర్భములో మనము ఆడ మగపిల్లలు చెప్పుకొను విషయములను శ్రద్ధగా విని వారల ఆలోచనలను మనసున పెట్టుకొనవలయును. ఆ పిల్లల కోరికలను వారి తల్లిదండ్రులును మన్నించుటకు సిద్ధముగ నుండవలయును. అట్లు కానిచో ఈ పిల్లలు తమ యిష్టాను సారమె పనులు అన్నియు చేసికొని పోగలరు. అటు తర్వాత హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయించగా, యీ క్రింది శబ్దము వచ్చెను.

ఆజ దివస సఖి మంగల ఖానీ
మైం రాధాస్వామీ సంగ ఆరతీ ఠానీ।
(సారబచన్, బచన్ 6. శబ్ద 3 )

ఆ తర్వాత స్వరాజ్య డ్రామాలోని ప్రార్థనను వరుసగ అయిదు సార్లు చదివించిరి.

"సరన తేరీ హామ ఆయ ప్రభూజీ లాజ హామారీ తుమకో"

అప్పుడు తిరిగి హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములో నిట్లు ప్రార్థన చేయబడినది. "ఓ దయా స్వరూపా తమ పిల్లలను ఏ కష్టము లేకుండు నట్లు కాపాడుడు. ఇంతవరకు నిరుపమానమైన క్రొత్త దృష్టాంతమును మీ బాలుర ద్వారా స్థాపింప జేయుడు", రాధాస్వామీ దయాళుని కీ లోకములో నందరును పిల్లలే గనుక, ఇచ్చట "బాలురు" అనుశబ్దముచే సామాన్యముగ సత్సంగులందరు అని అర్థము చేసుకొనుచున్నాము. కాని యీ ప్రార్థనలో "బాలురు" అని చెప్పుటచే మరొక భావన కూడ గలుగుట కవకాశమున్నది.

అదేమనగా యీ ప్రార్థన చిన్న పిల్లల కొరకే చేయబడినదని కూడ భావించ వచ్చును. కావున నీ ప్రార్థనను పై భావముతో అర్థము చేసికొన్నయెడల, ఆడ వాండ్రు పురుడు పోసుకొను నిమిత్తమై పురిటి సమయమునకు కొంత కాలము ముందుగనే మెటర్నిటీ వార్డులో ప్రవేశించవలయుననియు పురుడు వచ్చిన తర్వాత కూడ అచ్చట తగినంతకాలము ఉండిపోవలయు ననియు, సత్సంగములో ఈ మధ్య కొన్ని దినముల నుండి గట్టిగ బోధించబడు విషయ మును, అట్లే వివాహములను గురించి ప్రస్తుతము నిర్ణయించబడుచున్న నూతన విషయములను,— ఈ రెండు విషయములను గూడ నీ ప్రార్థనయొక్క అంతిమ భాగములో సూచితమగుచున్నవని బోధ పడగలదు. అనగా ఈ శబ్ద ములో రాధాస్వామీ దయాళుని చరణములందు ఆ దయాళురు తమ పిల్లలను సంపూర్ణ శాంతి సుఖములు గలవారిని జేసి, వారి ద్వారా సమస్త సంఘము నకు సమస్త జగత్తునకు గూడ శ్రేయస్కరమైనట్టియు సమయాను కూలమైనట్టియు ఒక నిరుపమానమైన క్రొత్త మార్గమును ప్రపంచములో ప్రదర్శించ వలయునని ప్రార్థన చేయబడినదని చెప్ప వచ్చును. ఈ ప్రార్థనకు జవాబు రూపముగ మెటర్నిటీ వార్డు నేర్పాటుచేసియు వివాహ నియమములలో మార్పులు చేసియు సత్సంగులను రెండు గొప్ప వ్యాకులములనుండి కాపాడు యేర్పాటు చేయబడినది. ఇప్పుడు మీరీ రెండు యేర్పాట్లును నిరుపమానములైనవా, కావా, యను విషయము నాలోచిం చుడు. నా అభిప్రాయములో నీ రెండు ప్రబంధములును నిరుపమానమైనవే. ఉదాహరణకు ఒక్క ఆసుపత్రి విషయమే తీసికొని ఆలోచించుడు. మనమీ ఆసుపత్రిలో మెటర్నిటి వార్డు తెరుచుటలో నేయుద్దేశ్యములు మనసున పెట్టు కొంటిమో అట్టి ఉద్దేశ్యములు కాని, యెట్టి ఉత్తమ ఫలితములను సాధించు టకై ఆ పని జరిగించు చుంటిమో అట్టి ఫలితములు కాని, ఇతర స్థలములలో గల ఆసుపత్రులు నడిపించువారి దృష్టికోణములలో లేవు. కావున నీ ఆసు పత్రి స్థాపనయొక్క మహోద్దేశమును మనసున బెట్టుకొని చూచిన యెడల నీ ఆసుపత్రి నిరుపమానమని తెలుప పడగలదు. అటులనే వివాహ విషయములో తయారుచేసిన నియమములవంటి నియమములు కాని, వివాహ సమస్యను అతి సులభముగ పరిష్కరించి వివాహములను సుకరముగ సాగించు టకై మన మవలంభించిన నూతన పద్ధతివంటి పద్ధతిగాని, ఇతరస్థలములో కానవచ్చుట అరుదు. మీ కింకను మరొక విషయము చెప్పవలసి యున్నది. అదికూడ మీకు తెలిసిన యెడల మీరిట్టి విషయములు మరెచ్చట నుండి

జాలవని ఒప్పుకొందురు. నా అభిప్రాయములో నీ రెండు విషయములలోను మన కార్యక్రమము నిరుపమానమనియె చెప్పవలెను. ఈ కార్యక్రమము ఒక్క సత్సంగములోనేకాక ప్రపంచమంతటిలోగూడ నొకనాడు నిరుపమానము కాగలదు. ఇంతియేగాక రాధాస్వామీ సంఘమును దయాల్బాగును కూడ నిరుమానమనియె నేను చెప్పగలను. ఏలననగా, ఇతర సంఘముల వారును ఇతర దేశముల వారును దయాల్బాగు కాలనీ వంటి క్రొత్త వలసలను అనేక స్థలములలో నిర్మించుటకు విశ్వప్రయత్నములు చేసిరి, కాని సఫలము కాలేక పోయిరి.

అట్లే హుజూరు సాహబ్జీ మహారాజువారు స్థాపించి సాగించిన ఇండస్ట్రీస్ కూడ నిరుపమాన మైనవే. ఇప్పుడు వచ్చిన శబ్దముకూడ ఈ సమయమునకు నిరుపమాన మైనదే కాబట్టి ఈ సమయములో చేయబడుచున్న నిరుపమాన కార్యక్రమమునకు ప్రతిఫలముగ రాధాస్వామీ దయాళురు మన మీాద తప్పక అసాధారణమైన దయను అనుగ్రహించెదరు. పరమ పూజ్యులైన సత్సంగ సంస్థాపకులగు హుజూరు స్వామీాజీ మహారాజువారు పుట్టినరోజు జన్మాష్టమి. కావున నాదినము ధన్యము, రేపు జన్మాష్టమి. కావున మీారీ సమయమున పై రెండు ప్రబంధములకును పూర్తిగ అనుకూలించులాగున మీా పద్ధతులను మార్చుకొని ఆ ప్రకారము నడచుకొనుటకు దృఢ నిశ్చయము జేసికొన్న యెడల ఆ దయాళురు, మన సమస్త సంఘము మీాదనే కాక, సమస్త దేశమునందు, సమస్త ప్రపంచము నందు గూడ అతి త్వరితముగ తప్పక మహాదయ వర్షించగలరు. ఈ శబ్దము తర్వాత తిరిగి దివ్యేచ్ఛకు తీయగా యీా క్రింది శబ్దము వచ్చినది.

కౌన సకే గున గాయ తుమ్హారే
కౌన సకే గున గాయే జీ

(ప్రేము బిలాస్, శబ్ద 24)

శబ్ద పాఠానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఇంత క్రితము

కొంతకాలమునకు "సూపర్ బచ్చే" అనగా అధిమానవ (Super men, సంతానము గలుగగలదు. ఆ పిల్లలు ఏబదియేండ్ల తరువాత "సూపర్మేన్" అనగా అధిమానవు లయ్యెదరు. అప్పుడు ఈ ప్రార్థనా శబ్దములో ప్రార్థించి నట్లుగనే వారు రాజనీతి భక్తి రీతులను నేర్చుకొందురు. కాని ఉత్తమ పరిణామములు కావలెనన్నచో, దృఢ సంకల్పమును ఆచరణ రూపమైన కార్యక్రమమును లేనిదే సాధ్యము కాదు. అందులకై కొంతకాలము తప్పక పట్టును. కాని సమస్త సంఘమును దృఢ సంకల్పము చేసుకొని కార్య క్షేత్రము లోనికి దిగవలయును.

ఆ తర్వాత చదివిన వచనములో నీ క్రింది వాక్యము వచ్చినది. "రాధాస్వామీ దయాళురు ఒక క్రొత్త మార్గమున నడిపించు చున్నారను టకు సందేహము లేదు, కాని సత్సంగముయొక్క యీ క్రొత్త పంథను గురించి ఆక్షేపణ చేయదల్చు కొన్నవారు ముందుగ. దానియొక్క ప్రతి భాగమును చక్కగ విమర్శించి చూచుకొనవలయును." ఆఖరున హుజూర్ మెహతాజీ మహారాజువారు ఇట్లు సెలవిచ్చిరి. ఇప్పుడే నవీనమైనట్టి నిరుప మాన పంథను గురించి చర్చ జరిగినది. రాధాస్వామీ దయాళురు ఒక నవీన నిరుపమాన పంథను సత్సంగములో నడిపించు చున్నారని నేనిపుడే చెప్పితిని. నేనిపుడు చెప్పిన విషయము నే హుజూరు సాహబ్జీ మహారాజువారు ఈ వచనములో స్పష్ట రూపమున సమర్థన చేసిరి.

## 62

27 ఆగష్టు 1942 తేది సాయంకాలము సత్సంగములో, ఇంత క్రితము సభ సెక్రెటరీగాను, R. E. I. కాలేజీ ప్రిన్స్పల్గాను పనిచేసి, సాహబ్జీ మహారాజువారు గుప్తమైన పిదప చాల కాలమునుండి బర్నాలా పార్టీతో కలిసి యున్నట్టి ప్రేమీ భాఈ నారాయణదాసు సత్సంగమునకు వచ్చెను. ఆయన కొంతకాలము నుండి ఆ పార్టీతో సంబంధము చాలించుకొని ఇప్పుడు కాన్పూరులో ఉండుచున్నారు. సాహబ్జీ మహారాజువారు రాజ బరాలీలో చాల జబ్బుగ నున్నప్పుడు తమ యుత్తరాధికారిని గురించిన రహస్యము వారికి చెప్పిరి. కాని ప్రిన్సిపలుగారికి ఆ విషయము తెలిసి యుండియు, సభా సెక్రెటరీ పదవిలోనుండియు కూడ, కర్మలచే వివశుడై, దురదృష్ట వశమున గురుచరణములనుండి దూరముగ వెడలిపోయెను. ఇప్పుడు ఇంత కాలమైన

పిదప తిరిగి సత్సంగములోనికి వచ్చెను. దివ్యేచ్ఛకు రెండు శబ్దములను తీసి చదివించిరి.

1. గురు కో ఊపర ఊపర గాతా, గురు కో దిల భీతర నహిం లాతా
(సారబచన్, బచన్ 31, శబ్ద 8)

2. సతగురు ప్యారే నే లజాయే, మాయా బ్రహ్మ ఖిలాడీహో
(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 32)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ప్రిన్సిపలుగారు, మీరు సాహబ్జీ మహారాజువారు దేహస్వరూపమునుండి గుప్తమై పోయిన పిమ్మట దయాల్బాగు నుండి యేల వెడలిపోయిరి మేము దయాల్బాగువిడిచి వెళ్ళిపోలేదు ఏలననగా, సాహబ్జీ మహారాజువారు ఎక్కడున్నను కూడ, తప్పక దయాల్బాగు దయచేయుదురనియు, తమ సెక్రెటరీని కూడా తీసికొని వత్తురనియు మాకు దృఢ విశ్వాసమున్నది. సరే, ఇప్పుడు దివ్యేచ్ఛకు శబ్దమును తీసి సాహబ్జీ మహారాజు వారి విషయములో నేమందురో అడిగి తెలుసుకొనుడు. ఈ క్రిందిశబ్దము వచ్చినది.

గురు చరణ పకడ దృఢ భాఈ
గురు కా సంగ కరో బనాఈ॥
(సారబచన్, బచన్ 18, శబ్ద 4)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి :

స్కూలుతో ఉపాధ్యాయుడు, తాను చెప్పిన పాఠమును పిల్లవాండ్రకు చక్కగా జ్ఞాపకము ఉండునట్లు చేయుటకై ఆ పిల్లలచేత మరొకసారి చదివించుట యవసరమను నియమమును స్కూళ్ళలో పాటించుచున్నారు. అట్లే ఈనాడు చదివిన మూడు శబ్దములను మరొకసారి పరిశీలించి చూచినచో, అందువలన మనకు చాల లాభము గలుగును. ఈ సందర్భములో, ప్రతి వ్యక్తియు శబ్దముల భావార్థమును తనకు వర్తింప చేసికొనుచుండవలయు నను విషయము మీరు జ్ఞాపక ముంచుకొనవలయును వాని అర్థమును ఇతరుల పైన వర్తింప యత్నించరాదు. ఈ మూడు శబ్దముల భావార్థమును మనసున

బెట్టుకొని ఆలోచించగా ఒక పూల హారములోని పుష్పములనుండి యెట్లు ఒకే విధమైన సువాసన పైకి వెదజల్లుచుండునో, అట్లే యీ శబ్దములనుండి కూడ ఒకే విషయమునకు సంబంధించి సలహాల పరంపర గోచరమగుచున్నది. మొదటి శబ్దములో మనస్సుయొక్క స్వభావమును గురించి చెప్పబడినది. కొందరు జనులు మానాభి మానములకును ధనధాన్యములకును లోనై పోవుదురనియు, స్వల్ప దండన శిక్షలను కూడ సహించ లేరనియు, పైపైకి మాత్రము తమ్ముతాము దీనులుగను అల్పులుగను చెప్పకొనుచుందురనియు మొదటి శబ్దములో తెలియ జెప్పిరి. అట్టివారికి ఆ పరమ పురుషుని యొక్క దయానుగ్రహములు కల్గుటెట్లు? రెండవ శబ్దములో, సద్గురువు నెడల అహంకార పూరితముగ ప్రవర్తించు వారిని నిర్వాహము చాల కష్ట సాధ్యమనియు కాని సద్గురువుని శరణుజొచ్చిన వారిని ఆ దాత తన ఆత్మీయులుగ తీసికొందురనియు కూడ చెప్పబడినది. ఈ శబ్దము చివర ఇప్పుడైనను సద్గురువుని జాగరూకుడవై పట్టుకొనుము, నర శరీరమును వృథాగా పాడుచేసికొనకుము. రాధాస్వామి దయాళురు నిన్ను అన్నివిధముల గాపాడెదరనియు హితోపదేశము చేసిరి. మూడవ శబ్దములో జీవునికి మనస్సుయొక్క ద్రోహ స్వభావమును దుర్మార్గమును అవగాహన మైన పిదప, అతడెట్లు నడచుకొనవలయుననువిషయమును గురించిహితోపదేశము చేసిరి. ఇట్లు ఈ మూడు శబ్ద ములును క్రమబద్ధముగ నున్నవి.

ఇంకొక విషయము నేను మీకు చెప్పగోరుచున్నాను. హుజూరు సాహబ్జీ మహారాజు వారు ఒక ప్రత్యేక స్థానమున విరాజమానులై యున్నారని మీకు తెలిసినచో, మరిమీరు వారి చరణ కమలములను జారిపోకుండ గట్టిగ పట్టుకొని యుండిపోవలయును. అప్పుడు మరొకశబ్దము దివ్యేచ్ఛకు తీయించి సత్సంగము సమాప్తము చేసిరి.

## ౯౬

6 డిసెంబరు 1942 తేదీని పిల్లల సత్సంగములో తేజోమూర్తులైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈ సమయములో కాగితములకు చాల కరువు వచ్చినది. ముందు ముందు ఈ కరువు ఇంకను పెరిగిపోగలదను భయముకూడ ఉన్నది. అందుచేత వీలైనంతవరకు కాగితములు తక్కువగ వాడుకొనుటయు పరీక్షలు వగైరా సమయములలో కాగితములను ఎక్కువ ఖర్చుపెట్టకుండు

టయు నత్యావశ్యకము. కాగితము ఖర్చు చాల తగ్గించవలయు నను ఉద్దేశ్యముతో అతి శీఘ్రములో వచ్చుచున్న అర్ధసంవత్సర పరీక్షలు మాసిక ముగ కాని మరొక విధముగ కాని సాగించు నిమిత్తమై ఈ రోజులలో ఆలోచనలు జరుగుచున్నవి.

## ౧౯

24 డిసెంబరు 1942 తేదీ సత్సంగములో దివ్యేచ్ఛకు శబ్దమును తీయించగా యీక్రింది శబ్దము వచ్చెను.

ఆజ మేఘా రిమ ఝిమ బరసే, హియే పియా కే పౌర సతావే (పల్లవి)
పియా ఛాయ రహే పరదేశా, మైం పడీ కాలకే దేసా ।
మోహిం నిస దిన యహీ రే అందేసా కోఇ పియా సే ఆన మిలావే॥(1)
పపిహా జబ్ పివ్ పివ్ గావే, మోహిం పియా ప్యారే కే యాద ఆవే
బిరహా అగ్ని భడక భడకావే, పియా బిన కో తపన బుఝావే। (2)
(ప్రేమబానీ, భాగ్ 4, బచన్ 21 (1) శబ్ద 2)

హుజూరువారిట్లు ప్రశ్నించిరి :- ఈ శబ్దమును వినుచున్నపుడు మీ హృదయములలో నేమి భావము లుత్పన్నములైనవి ? ఇప్పటికి హుజూర్ సాహబ్జీ మహారాజు వారు వెళ్లి 5 సంవత్సరముల 6 మాసము లయినదను ఆలోచన మీహృదయములలో పుట్టెనా ? అట్లు ప్రశ్నించునపుడు హుజూరు వారి గొంతుక గద్గద స్వరముతో నుండెను. తర్వాత మఱొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించగా, యీ క్రింది శబ్దము వచ్చెను.

గురు కో ఊపర ఊపర గాతా, గురు కో దిల భీతర నహిం లాతా ॥
( సారబచన్, బచన్ 31 శబ్ద8 )

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము తమ ప్రియుని కొఱకు విరహాభావము లేకుండ, తమ ప్రియతముని జీవితకాలములో ఆయనతో నిష్కపటభావముతో ప్రవర్తించని వారికి వర్తించును. అట్టివారు ఈ శబ్దములోని చరణముల భావము తమకు వర్తించుచున్నదో లేదో చూచుకొని చెప్పవలయును. ఆ తర్వాత మూడవ శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి,

గురు కా మైం దామన పకడా
ఛోడూం నహీం అబ్ తో జకడా॥
(సారబచన్, బచన్ 37, శబ్ద 12)

## ౬5

31 డిసెంబరు 1942 తేదీ సాయంకాలము సత్సంగములో ఇట్లు సెల విచ్చిరి.—1942 సం॥ రము ఈ నాటితో సమాప్తమగుచున్నది. ఈ సంవత్స రారంభములో మీరు హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములందు, ఈ సంవత్సరము మొదటినుండి చివరివఱకు దుఃఖములు లేకుండ సుక్షేమముగ జరిగిపోవలయునని ప్రార్థనచేసిరి కదా! ఇప్పుడు గత వర్షములో జరిగిన విషయములన్నియు జ్ఞాపకము తెచ్చుకొని మీకు ఈ సంవత్సరములో దుఃఖ ములు కష్టములును తగ్గిపోయినవో లేదో చూచుకొనుడు. క్రితము సంవత్స రము కన్న నీ సంవత్సరము మీకు దుఃఖములు చింతలు తక్కువ అయిపోయి నవా లేదా? ఎవరికైతే అట్లు దుఃఖములు చింతలును తక్కువగ చేయబడి నవో వారు రేపటి దినము ఈ సంవత్సరము కూడ ఆ దయాళురు తమ దయా రక్షక హస్తమును ఇంతకుముందువలెనే తమపైన ఉంచవలయునని, ఇంక నెక్కువ దీనత్వముతో వారి చరణములందు ప్రార్థన చేయవచ్చును. అప్పుడు అక్కడ ఉన్నవారిని ప్రశ్నించగా వారందఱును గతించిన సంవత్స రము వారందఱికిని చాలసుఖముగను నిశ్చింతగనే జరిగెనని అంగీకరించిరి. ఇట్లు రమారమి $1\frac{1}{2}$ గంటలసేపు అందఱితో మాటలాడుచు, వారికి సలహాలను చెప్పుచు గడిచిపోయినది. ఇట్లు సెలవిచ్చిరి. ఎవనికైనను భగవత్కృపవలన రాధాస్వామీ దయాళుని పిల్లలకు సేవచేయు సౌభాగ్యము ఎవ్విధముగానైనా లభించిన యెడల అతడా సేవను హృదయపూర్వకముగ చేయవలయును. అంతియే కాదు, అతడు తన ఆ మరణాంతము నట్లు సేవచేయుచునేయుండి చివరకు తనప్రాణమును సేవచేయుచునే విడిచి పెట్టవలయును. ఏలననగా, సేవచేయునవకాశము మళ్లీ మళ్లీ కావలెనన్న లభ్యముకాదు, అది మహా భాగ్యమువలననే లభించును,

# ౬౩

సాహబ్జీ మహారాజువారి అనంతరము లుధియానా కాపురస్థులైన ప్రేమీభాయీ రాయ్ సాహబ్ చౌధరీగణేశీ లాల్ గారు దయాల్బాగునుండి వేఱయిపోయిరి. ఆయన కొంతకాలము బర్నాలాపార్టీతో కలిసిపోయిరి. కాని ఆయనకు నిజధార తనలోనే విరాజమానమై యున్నదనెడి ఒక భ్రమ కూడ ఉండెడిది.

దేదీప్యమాన స్వరూపులైన హుజూరువారికి 23 డిసెంబరు 1942 తేది సాయంకాలము సత్సంగములో రాయ్ సాహబ్ గారితో ఈ క్రింది సంభాషణ జరిగెను. తేజోరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. అందరు కలిసి దయాల్బాగులోనే ఉండవలయునని సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చుచుండెడివారు. అందువలననే నేను దయాల్బాగులోనే ఉండిపోయితిని కాని బయటకు ఎచ్చటికిని వెళ్ళలేదు. ఈ నాడు తమరుకూడా అందువలననే దయాల్బాగు వచ్చిరి. మాకు తమ దర్శనము కూడా లభించినది. రాయ సాహబ్ గారు, నాకు కూడా సాహబ్జీ మహారాజువారు దయాల్బాగు విడిచి బయటకెక్కడికిని పోనేరరనియే యెప్పుడు నమ్మక మున్నదని చెప్పిరి. హుజూరువారు, "బయటకు వెళ్ళి అన్వేషించుకొన్నప్పుడు అధమము 1/100 వంతు అయినను పొరబాటు తప్పక జరుగుట కవకాశమున్నది కాని దయాల్బాగులో ఆమాత్రము కూడ పొరబాటునకు అవకాశములేదు. అయినను కష్టమేమి వచ్చెననగా, ఇచ్చట వచనములు వగైరా లేమియు నిప్పుడు చెప్పుటలేదు" అని సెలవిచ్చిరి. రాయసాహబ్ గారు వచనములైతే వారి దివ్యేచ్ఛపైన ఆధారపడి యుండునుకదా. హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయమని చెప్పగా యీ క్రింది శబ్దము వచ్చినది.

మిలీ నర దేహ యహ తుమ కో, బనావో కాజ కుఛ అపనా,

(సారబచన్, బచన్ 15, శబ్ద 13)

మళ్ళీ మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి.

చరణ గురు తన మన క్యోం నహీం దేత్ ॥టేక్॥
ప్రీతి లాయ నిత కరో సాధ సంఘు
గురు కే బచన సునో కర హేత్ (1)

ప్రేమబానీ భాగ్ 2, బచన్ 11 (2), శబ్ద 5)

తిరిగి దివ్యేచ్ఛకు మూడవ శబ్దమును తీయించిరి.

జగత సంగ మనుఆఁ సదా మలీన్ ॥ టేక్॥
కామ క్రోధ మద నిత భరమావేం।
కుమతి సాథ కరే కిరత కమీన్॥ (1)

రాయసాహబ్ గారు తన మనస్సు మలినమైన దనియు, తాను దయాల్బాగు వచ్చి దానిని పరిశుద్ధము చేసికొన గోరుచున్నాననియు చెప్పుకొనెను. హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఆ పొరపాటు నాదే. నేను దయాల్బాగు కృషి విభాగమును మీకు అప్పగించి యుండకపోవుట నా పొరపాటు. మీరు సాహబ్జీ మహారాజువారు ఇచ్చటి కృషి విభాగము యొక్క కార్యక్రమము మీకు అప్పజెప్పిరనియు, అది మీ కిప్పించమనియు మీరు నాకు ఉత్తరము వ్రాసిరి కదా!

రాయసాహబ్ గారు నేను సేవకభావముతో అట్లు ప్రార్థన చేసితినని చెప్పుకొనిరి. హుజూరువారు:- ఇది నా రెండవ తప్పిదము. ఇప్పుడు నేను రెండు తప్పిదములకు కర్తనైతిని. రాయ సాహబ్ వారిని క్షమార్పణ కోరు విషయమై ఒక శబ్దమును తీయుడు.

అందుపైన రాయసాహబ్ గారు, తనకు పెద్ద ఆపత్తు వచ్చిపడినదని చెప్పుచు తానే క్షమార్పణ వేడుకొన సాగెను. అంతట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. నాతరపునను, మీతరపునను ఇరువురి తరపునను దివ్యేచ్ఛకు క్షమార్పణ శబ్దములను తీయవలసి యున్నది. నేను తప్పు చేసినట్లు తేలిన యెడల నేను క్షమార్పణ కోరుదును, మీది తప్పు అని తేలిన యెడల మీరు సాహబ్జీ మహారాజువారిని క్షమార్పణ కోరవలయును. ఏలననగా, మీరు దయాల్బాగు విడిచి అన్వేషణ నిమిత్తమై బయటకు వెడలి, ఆ విధముగ హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞను అతిక్రమించిరి. నేను దయాల్బాగునకు బర్నాలా పార్టీకిని మధ్య వివాదము లుండుట చేతనే ఇచ్చటకు రాలేదు అని రాయసాహబ్ గారు చెప్పిరి.

హుజూరువారిట్లనిరి. సాహబ్జీ మహారాజువారి కాలములో దయాల్బాగు స్వామీ బాగుల మధ్యన తగాదాలు ఉండలేదా? అప్పుడు మీరు ఇచ్చటకు రాకుండా కట్టిపెట్టారా? సరే ఇవి అయితే కటూక్తులు. ఇప్పుడు

హాల్వావలె తీపిగనుండు శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు. అంతట నీ క్రింది శబ్దము వచ్చినది.

గురు ప్యారే సే మిల హుఇ ఆజ నిహాల్ ॥ టేక్॥
జబ్ లగ గురు సతసంగ న పాయా
ఫంసే రహీ మాయాకే జాల (1)

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 48)

ఇట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములో 5 సం॥ 6 మాసములయిన తర్వాత నీ రోజున మాకు మీ దర్శనము లభించినదను విషయము ఈ శబ్దములో సూచించ బడినది. నిజమునకు సంతోషముయొక్క అనుభవము తియ్యగ నుండును. చాలసేపటివరకు రాయసాహబ్ గారు చేతులు మోడ్చి క్షమార్పణ కోరుచునే యుండెను.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఆడపిల్ల అత్తవారింటికి క్రొత్తగా వెళ్ళినపుడు సిగ్గుపడుచు తనకేమియు తెలియదని యనుచుండును. క్రమ క్రమముగా అత్తవారు అ పిల్లతో పరిచయము చేసికొందురు. ఏదైన నవసరము వచ్చినపుడు కాని, కష్టపరిస్థితి వచ్చినపుడు కాని నేను కూడ సాహబ్జీ మహారాజువారి చరణములవద్ద ఆ కష్టమును చెప్పుకొందును. లేనిచో నేనేమియు చేయజాలను, నాకేమియు పనిచేతను కాదు.

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములోని విషయము రాధాస్వామీ దయాళురు దయ జూపి తమదర్శనమును ప్రసాదించుటను గురించియు వర్ణన. ఆత్మ చాలకాలము పిమ్మట ఈనాడు గురు మహారాజువారిని కలుసుకొని సమస్త కష్టములనుండియు విముక్తి పొంది సంతుష్టి నొందినదనియే ఇందు చెప్పబడినది. తిరిగి యిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు రాయసాహబ్ గారికి నేను ఆదర సత్కారములు చేయవలసియున్నది. దివ్యేచ్ఛకు శబ్దము తీయగా ఈ క్రింది శబ్దము వచ్చినది.

గురు ప్యారే కీ లీలా దేఖ నఈ ॥ టేక్ ॥
దీన హోయ జో సరన ఆవే
తాకో గురు అపనాయ లఈ ॥ (1)
(ప్రేమ బానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 47)

# ౯౭

5 ఏప్రియల్ 1943 సాయంకాలము సత్సంగములో నీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు తీయబడినది.

గురు కరో మెహర కే దృష్టి, దాస పల పల దుఖ పావత।
మైం ఆరత కరూం బనాయ, రోగ సబ హీం ఘుట జావత (1)
(సారబచన్, బచన్ 33, శబ్ద 8)

శబ్ద పాఠానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఐరోపా వగైరా దేశములలో ప్రస్తుత యుద్ధము ప్రారంభమైనదిలగాయతు జనులందరికి కష్టములు అపత్తులును అధికమై పోవుచున్నందున లోకమందరు, మహా దుఃఖితులై వ్యాకులపడి పోవుచున్నారు. మన కందరకును వ్యాకుల పరిస్థితులు కష్టములును రోజు రోజు పెరిగిపోవుచున్నవి. కావున నీ మహా కష్ట పరిస్థితిలో ఇట్టి ప్రార్థనచేయుట యుక్తమే.

ఇట్లు సెలవిచ్చిరి: ఇవ్విధముగ దుఃఖ పూరితమైన హృదయముతో భగవచ్చరణములందు నిజమైన భక్తితో ప్రార్థన చేసినపుడు భగవంతుని సహాయమును ఆసరాయును లభించగలవని ఆశించుటయు సరియైనదే. హుజూరువారీ ప్రార్థనకు దివ్యేచ్ఛప్రకారము సమాధానముగ మరొకశబ్దము తీయుమని సెల వివ్వగా యీ క్రింది శబ్దము వచ్చినది.

సద్గురు ప్యారే నే బిసాఈ ఉజడీ బాడీ హో.
(ప్రేమబానీ, భాగ్ 3: బచన్ 12 (4) శబ్ద 24)

ఈ పై చరణములో ప్రపంచముయొక్క నవనిర్మాణమును (New world order) గురించి సూచన యున్నదని సెలవిచ్చిరి:

"జగ సంగ భూల గఈ సత నామా।
మన మేం బసత క్రోధ ఔర్ కామా।
దూబ రహీం సారీ హో॥ (1)

ఈ పై పంక్తులలో చెప్పినట్లు లోకమంతయు భగవంతుని పూర్తిగా మరచి పోయినందువలననే ప్రపంచములో ఆ పద్దుఃఖములు ఎక్కువగ వ్యాపించి

నవి. ఈ విషయమునే, కొద్దిగ మాటలు మార్పుజేసి, విశదీకరించినచో నీ క్రింది విధముగ కూడ అన్వయించు కొనవచ్చును. ప్రపంచములో నేయే దేశములలో ఆపత్తులు కష్టములును అధికముగ నున్నవో ఆయా దేశముల ప్రజలలో భగవంతుని మఱచి పోయిన వారి శాతము అధికముగ నున్న దనియు నేయే దేశములలో మొదటి రకము దేశములకన్న ఆపత్తులు దుఃఖములును తక్కువగనున్నవో అచట భగవంతుని మరచిపోయినవారి శాతము కూడ తక్కువగనే యుండుననియు అర్థము చెప్పవచ్చును. ఈ అర్థమును మీరు మనసున బెట్టుకొని ఆలోచించుకొన్న యెడల, భారతదేశమందు భగవంతునియందు విశ్వాసమెక్కువగ నున్నది కావున, నీ దేశములో యుద్ధమునకు సంబంధించిన బాధలు కష్టములును మిగత దేశములలో కన్న సామాన్యముగ తక్కువగనే యున్నవనియు, ఇచ్చట ప్రజలకు సంరక్షణ అందువలననే యెక్కువ గలుగుచున్నదనియు పర్యవసానము తేటపడుచున్నది. కావున సత్సంగులను భారతదేశములోని ప్రజలనందరిని సంరక్షణచేసి మనమందరిపైనను రాధాస్వామీ దయాళురు చూపిన అపార దయాకటాక్షములకై, వారి చరణములకు ధన్యవాదములు అర్పించుట సత్సంగులందరి యొక్క కర్తవ్యమై యున్నది ధన్యవాదము లర్పించుటకై ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చెను.

సతగురు ప్యారే నే జగాయీ, అచరజ భాగా హో

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 15)

ఇట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు చదివిన శబ్దముయొక్క చరణముల తాత్పర్యమును అర్థము చేసికొన్న యెడల, ఆ తాత్పర్యము ఈనాడు చదివిన ద్వితీయ శబ్దముయొక్క చరణముల అర్థముతో సరిపోలియున్నదని మీకు తెలియగలదు.

ఆ తర్వాత ఇట్లు సెలవిచ్చిరి: ఇంకొక విషయము నేను చెప్పవలసి యున్నది. అదేమనగా, దయాల్బాగు తాలూకు వారందఱును (అనగా ఒక్క దయాల్బాగు నివాసులేగాక, దయాల్బాగునకు సంబంధించిన సత్సంగులును ఇచ్చటి ఇండస్ట్రీస్, లిమిటెడ్ కంపెనీలు, స్టోర్సు మఱియు నిచ్చటి బిజినెసెతోను సంబంధించిన వారందఱును గూడ ఇందులో వత్తురు) ఇచ్చటి ఇండస్ట్రీస్ చాలా గొప్పవని నేరవేర్చినవను భావముతో నున్నారు. కాని యీ

మధ్యన మేము బయట స్థలములలో ఇండస్ట్రీస్ చూచినపుడు మాకు కండ్లు తెలచుకొని, పై వాండ్రు చేసిన పనితో పోల్చి చూడగా మనము చేసినపని యేమియు గణనకు రాదని తెలిసినది. కావున రేపు ఒక సమావేశము చేసి అందులో, "సత్సంగీ యువకులు సత్సంగముయొక్క కార్ఖానాను ఉత్త ఒక మోడల్ (Model) అనగా ఒక నమూనా యంత్రాలయముగనే ఉంచి దానిని చూచి నాట్యముచేసి గంతులువేసి సంతోషించ దల్చుకొన్నారో, లేక యే ఉద్దేశ్యముతో ఆ "మోడల్" లేక నమూనాను తయూరు చేసిరో ఆ యుద్దేశ్యమును కూడ పూర్తిచేయదల్చుకొన్నారో సత్సంగులను అడిగి తెలుసుకొనవలయును. వీరు దానిని ఒక నమూనా క్రిందనే ఉండనిచ్చి మఱొకరెవరైనను దాన్ని వృద్ధిచేయవలయునని కోరుచున్నారా? రేపటి సమావేశములో సత్సంగీ యువకులను, నవయువకులను ముందు కూర్చుండబెట్టవలయును. సత్సంగులు తమ సొంత ఆలోచనలను దూరమున బెట్టి, భారతదేశాభివృద్ధికై హుజూరు సాహబ్జీ మహారాజు వారు ఏర్పఱచిన పద్ధతిని నడుచుకొందురా లేక దానిని ఊరకనే చూచి సంతోషించుచు కూర్చుండదల్చుకొన్నారా అను ప్రశ్న యీ సమావేశములో తేల్చవలసియున్నది. అదిగాక, ఈ పని నెరవేర్చుట కిది చాలా మంచి యుక్తసమయము. కావున, వీరీ పని చేయుటకై కలిసి వచ్చుటకు సిద్ధముగనున్నారా లేదా యను ప్రశ్న కూడ నవయువకులను అడుగవలయును. ఈ పనిచేయుటకు సిద్ధముగనున్నవారి పేర్లు వ్రాసి, వారలకీ పని నెరవేర్చు నిమిత్తమై అవసరమైన సలహా లియ్యబడును. ఆర్. ఇ. ఐలో హైస్కూలు, ఇంటర్మీడియెట్ క్లాసుల పరీక్షలు ఇచ్చిన పిల్లలును, టెక్నికల్ కాలేజీ, లెదర్ వర్కింగ్ స్కూలు విద్యార్థులును రేపు ఇచ్చట కూర్చుండెదరు. కష్టపడి పనిచేయు స్త్రీలను కూడ రేపు ఇచ్చటనే కూర్చుండ బెట్టుటకై యేర్పాటు చేయబడును. పిల్లలను పనులు నేర్చుకొనుటకై బయట యంత్రశాలలకు పంపించ వలయును. వారు పనినేర్చుకొని తిరిగి వచ్చిన తర్వాత, దయాల్బాగు కార్ఖానాలలోను, ఇంకను దయాల్బాగుకు సంబంధించిన ఇండస్ట్రీలలోను, లిమిటెడ్ కంపెనీలు, స్టోరులు, ప్రొవిన్షియల్ డిపోల తాలూకు ఇండస్ట్రీలలోను వారిని పనిచేయుటకు పెట్టిన మొదల దయాల్బాగు సత్సంగము యొక్కయు ఇండస్ట్రీలు, వ్యాపారమును అభివృద్ధినొంది నిరుద్యోగులుగ నున్నట్టి వారికి - వారు సత్సంగులు అగుగాక లేదా సత్సంగేతరులగుగాక, పనికల్పించి జీవనోపాధికలుగజేసి, ఆ విధముగ దేశమంతటకు రాధాస్వామీ నామమును వ్యాపింప జేయు సావకాశము కలుగును. ఈ విధముగ

మీకును సత్సంగులకును దేశములోని సమస్తప్రజలకును పోట్టపోసికొనుటకు ప్రబంధము చేయవచ్చును.

## ౯8

22 ఏప్రియల్ 1943 తేదీ సాయంకాలము సత్సంగములో నీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు తీసిరి.

ఆజ కాజ మేరే కౌన్హే పూరే,
బాజే ఘట మేం అనహాద తూరే॥ (1)

భాగ ఉదయ ఆజ హుఏ హమారే రాధాస్వామీ చరణ సీస పర ధారే॥ (2)

దావ పడా మేరా అబ్ కే ఐసా రాధాస్వామీ చరణ ఆయ మైం పరసా॥ (5)

అబ పాయా మైం నే అజర బిలాసా క్యా కహుం మహిమా అధిక హులాసా॥ (6)

రోమ రోమ రగ రగ మేరీ చోలీ రాధాస్వామీ రాధాస్వామీ ఘుండీ ఖోలీ॥ (7)

హంసన సాధ కరూం అబ్ ఆరత ప్రేమ మగన హోయ దుఃఖ బహోవత॥ (12)

ధన ధన ధన ధన క్యా కహుం మహిమా రాధాస్వామీ 2 పల పల కహనా॥

(సారబచన్, బచన్ 34, శబ్ద 2)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దముయొక్క చరణములలో చెప్ప బడిన దానిని బట్టి చూడగా, ఈ వర్తమాన సమయము ఒక్క సత్సంగము నకే గాక ప్రాణి మాత్రులందరికిని గూడ చాల మంచిదని తేటపడుచున్నది. ప్రపంచములో నెచ్చటనైన కాఠిన్యము ప్రదర్శించ బడుచున్నను, కష్టములు ఆపత్తులును కల్గుచున్నను, అట్లే, ఒక సత్సంగిపైన, అతని ఆఫీసులో కాని మరొక సందర్భమున కాని కాఠిన్యము ప్రదర్శింప బడుచున్నచో, వారికి కష్టము బాధ గలుగజేయ వలయునను ఉద్దేశ్యముతోనే అట్లు చేయుటలేదు.

అట్లు జరిగించుటలో ఉద్దేశ్యము వారికి మంచి కలుగ వలెననియే అనగా వారికి ఉద్ధారము కలుగవలెననియే అని కూడ చెప్పవచ్చును. ఇప్పుడీక ఈస్టరు సెలవులు ప్రారంభ మగుచున్నవి. ఈ సెలవులలో రాధాస్వామీ సత్సంగ సభకు, ప్రొవిన్షియల్ అస్సోసియేషన్లకు, లిమిటెడ్ స్టోర్సులకు సంబంధించిన పెద్ద పెద్ద విషయములు చాలవటుకు నిర్ణయము చేయవలసి యున్నది. కావున మీరు మనసున ఈ ఆలోచన పెట్టుకొని శబ్దమును తిరిగి చదువుకొని దానినిబట్టి ఆ విషయముల నెట్లు నిర్ణయించ వలయునో తేల్చుకొనుడు. ఇట్లు సెలవిచ్చిరి. జనులు దైవమును క్రూరుడని దోష మెన్నుచున్నారు. ఉదాహరణార్థము, ఒక కుటుంబములో ధనార్జన చేయుచున్న మనిషి చనిపోయి మరొకరెవరును సంపాదించువారు లేక ఆ కుటుంబ పరిస్థితి హఠాత్తుగ భ్రష్టమై పోయినపుడు మానవుడు తన మూర్ఖత్వము మూలమున భగవంతునిపైన దోషారోపణ తప్పకుండ చేయుచుండును. కాని ఎప్పుడైన నొక కష్టపరిస్థితి నెత్తిమీదకు వచ్చిపడినపుడు అది మనకు లాభము శ్రేయస్సు కలుగజేయు నిమిత్తమెయే వచ్చినదికాని మనకు హాని గలిగించునదికాదు అనెడి ధృఢ విశ్వాసమున్న యెడల, అట్టి వానికి ఈ ప్రపంచము దుఃఖస్థానమని అనిపించక స్వర్గము వలెనే కన్పట్టగలదు. అయితే అట్టి విశ్వాసము కొంత ప్రయత్నము చేసిన మీదటనే అలవాటు పడగలదు. భగవంతుడు తనకు దుఃఖము కాని మరొక హానిగాని కలుగజేయు చున్నాడను తలంపు మానవుడెన్నడు మనసున రానీయ కూడదు. పైగా అట్లు జరిగినందు వలన తనకు శ్రేయోలాభము గలుగ గలదనియే యెప్పుడు తలంచ వలయును. ఇపుడీ విషయమును ప్రస్తుతము సత్సంగములోని పరిస్థితులకు వర్తింప జేసి చూచుకొన్న యెడల, మీకందరికిని, ఈ మధ్య కొన్నాళ్ళనుండి యేర్పరచబడిన కఠిన నియమముల వలన ఈ సమయమున గలుగుచున్న శుభ ఫలితములను బట్టి ఆలోచించగా, వానిలో కాఠిన్యమేమియు లేదనియు, సమస్త కార్యక్రమము సవ్య మార్గమున జరిపించవలయునను ఒకే ఉద్దేశ్యముతోనే ఆ యేర్పాట్లు చేయబడినవనియు అంగీకరించ వలసి యున్నదని మీకు బోధపడగలదు. ఇప్పుడు దేశములోని కొన్ని పట్టణములలో రాధాస్వామీ బ్యాంకులు స్థాపించ వలయునని బయట సత్సంగులు కోరుచున్నారు. కావున ఒకటి రెండు నెలలలో 3, 4 పెద్ద పట్టణములలో రాధాస్వామీ బ్యాంకులు తెరవదల్చు కొన్నాము. ఇంతవరకు రాధాస్వామీ సత్సంగ సభకు అధీనమై పని చేయుచుండిన ప్రొవిన్షియల్ అసోసియేషన్లు, ఇప్పుడు రిజిష్టరు

అయిపోయిన పిమ్మట స్వతంత్ర సంస్థలుగ మారిపోగలవు. ఈ విధముగ ప్రొవిన్షియల్ సెంట్రల్ స్టోర్లు, లిమిటెడ్ స్టోరులయొక్కయు నియమములు చట్టములలోను మార్పులు సంశోధనలును జరిగించబడును. అందులో గొప్ప లాభదాయక పరిణామము కల్గించు సంశోధనీయాంశములు ఒకటి రెండు చాల గట్టిగ ఆలోచించవలసినవి ఉన్నవి. సత్సంగము కొరకై పనిచేయు చున్న ప్లీడర్ల బుద్ధిని భగవంతుడు సునిశితముగ చేయుగాక! ఆ ప్లీడర్లును కష్ట పడి పనిచేయుదురుగాక వారు కష్టపడి ప్రయత్నించిన యెడల మన నియమ ములు చట్టములలోను ప్రస్తుతము ఉన్నట్టి లోపములు సవరింపు కాగలవు.

## ౭౭

23 ఏప్రియల్ 1943 తేది సాయంకాలము సత్సంగా నంతరము నాల్గు పెండ్లిండ్లు అయినవి. వివాహములకు ముందు దివ్యేచ్ఛకు తీయగా యీ క్రింది శబ్దము వచ్చినది.

ఆజ ఆనంద రహా మౌజ సే చహుఁ దిస ఛాఈ।
రాధాస్వామీ కీ రహే సబ్ మిల మహిమా గాఈ॥ (1)
మెహర్ సే గురు కే మిలా ఐసా సుహావన సంజోగ్।
ఖుశ హువే దేఖా కే యహా ఔసర సజ్జన ఛాఈ॥ (2)
హర తరఫ్ నారే ఖుశీ కే లగే కరనే గుంజార్॥
అర్శ సే గరజ గరజ బూంద అమీ బరసాఈ॥ (4)
ఉమంగ ఉమంగ హర కోఈ దేతా హై ముబారక బాదీ।
రాధాస్వామీ రహేం నిజ మెహర సే నిత ప్రీతి సహాఈ॥ (5)

(ప్రేమబానీ, భాగ్ 4, బచన్ 20, శబ్దగజల్ 5)

శబ్ద పాఠానంతరము తేజః స్వరూపులైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ సమయములో జరుగుచున్న వివాహములలో, ఇతర వివాహములలో కన్న నెక్కుడు సంతుష్టి గల్గించు విశేషమున్నది. ఈ విషయము ఇప్పుడు చదివిన శబ్దము వలన స్పష్టపడుచున్నది. హుజూర్ సాహబ్జీ మహారాజువారి చరణములను ధ్యానముచేసి, జనులందరి ప్రసన్నతా భావమును సూచించు

నట్టి శబ్దమును దివ్యేచ్ఛపై తీయుడని హుజూరువారు సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దమువచ్చెను.

సతగురు సంత మిలే రాధాస్వామీ
ఆరత కరనే కీ బిధి ఠానీ (1)

నిరత నామ ధున మాలా డారూం సీతల తిలక కేసరీ ధారూం (3)
బస్తర భావ ప్రీతి పహిరాఊం అమీ మూర మయ భోగ ధరాఊం (4)
తన మన నిజ మన భేంట చఢాఊం నౌ నిధి నౌ ఛావర కరవాఊం (5)
మో పర కృపా దృష్టి అబ్ కీజే దీన బంధు మోహిం సరనా దీజే (9)
దేవ ప్రసాద రహూం చరనన మేం గున గాఊం పల2 ఛిన2 మేం (21)

(సారబచన్, బచన్ 34, శబ్ద 5)

ఇట్లు సెలవిచ్చిరి: భారతదేశమునకు బయట యుద్ధము జరుగుచున్నదని అందఱు అనుచున్నారు. కాని మనకు చూడగా బయట భయంకర యుద్ధము జరుగుచుండుటయు, దయాల్బాగులో పెండ్లి ఒక్కటి మాత్రమే కాక అనేక వివాహములు జరిగిపోవుచుండుటయు కనిపించుచున్నది. దీనిని బట్టి నా అభిప్రాయములో ఇచ్చట వివాహములు జరుగుచు ఇతర దేశములలో యుద్ధము జరుగుచుండుట చూడగా భారతదేశములో ఆనందమున్నట్లును ఇతర దేశములలో వ్యాకుల పరిస్థితులున్నట్లును రుజువగు చున్నట్లు తేలుచున్నది. పెండ్లి అయిన తర్వాత హుజూరు సాహబ్జీ మహారాజువారు వధూవరులను అన్యోన్య సహకార భావముతో జీవితము గడుపుకొన వలయునని హితోపదేశము చేయుచుండెడివారు. మీరు ఒండొరులలో కలహములు తగాయిదాలు పెట్టుకొనరాదు. మీరు ఇరువురును కలిసియుండి, జబ్బులు కష్టములు వచ్చినపుడును పరమార్థ సంబంధమైన కార్యములు చేయునపుడును ఒకరికొకరు సహాయకరముగ నుండవలయును. ఈ సలహా ప్రకారము నడచుకొన్న యెడల మీరు హుజూర్ సాహబ్జీ మహారాజువారి ప్రసన్నతను సంపాదించుకొనగలరు. అట్లు నడచుకొనని యెడల బయట జనులెట్లు బాధలు కష్టములు పడుచున్నారో అట్లే మీరుకూడ దుఃఖ క్లేశము లనుభవించగలరు. ఎల్లపుడును పరమపితను జ్ఞాపకముంచుకొనుచు, బాహ్యముగ దెబ్బలాడుట కట్టిపెట్టి, ఆంతర్యమున పవిత్ర నామస్మరణ తీవ్రముగా జేసికొనుచు మనస్సుతో పోరాడవలయును, అనగా నియమబద్ధమైన జీవితము గడప వలయును,

-- ~ --

25 ఏప్రియల్ 1943 తేది పరమగురు సర్కార్ సాహెబ్ వారి భండారా దినము ప్రాతస్సత్సంగములో ప్రేమసమాచార్ లో నుండి "పరమార్థ మేం బాలస్వభావ కీ జల్దీ వ ఘబరాహట్ కీ అనజానతా" అను వచనమును చదివిరి. ఈ వచనముపైన దేదీప్యమాన తేజోమూర్తు లయిన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి :- ఈ వచనములో నొక మహా వాగ్దానము మనకు చేసిరి. ఆ వాగ్దానము చేయుటకు ముందు, సత్సంగులు తమ కార్యము అతి త్వరితముగ పూర్తి కాలేదని చింతపడి బెంగ పెట్టుకొను చుందురని వారి బాల్యావస్థ స్వభావములను గురించి వివరించి, దానిని విడిచిపెట్టి అంతకన్న శ్రేష్ఠమైన పద్ధతిని నడచుకొనుటకై బోధించిన విధానము చాలా ఉత్తమమైనది. ఆ వాగ్ధానము ఇపుడు పూర్తి కాబోవు సమయము వచ్చి, పండ్లు, పువ్వులును తయారై యున్నవి. వానిని కోయుటకు మనుష్యులు కావలెను. అట్టి మనుష్యుల లోపము కొంతకాలమునుండి కనిపించుచున్నది. అట్టి వారి కొఱకై ప్రయత్నములు సల్పుచునే యున్నాముకాని, ఈ పండ్లు, పువ్వులును కోసి సత్సంగులకు అందజేసెడి వారింత వఱకు లభించనే లేదు. ఈ విషయమై కొంతకాలము నుండి యేర్పాట్లు జరుగుచున్నవి. బయటకు సంచారము చేసినపుడెల్ల ఇందును గురించి ప్రచారము చేయుచున్నాము. జాగరూకత గల్గి కష్టపడి పనిచేయుచు బుద్ధి వివేకములు గల మనుష్యులు మాకు అవసరముగ నున్నది. అట్టివారు ఒక డజనుమంది లభించినచో, పండ్లు, పువ్వులును త్వరితముగ కోయించి సమస్తసంఘమునకు లాభము గలుగ జేయవచ్చును.

-- ~ --

24 జూన్ 1943 తేదీని సాయంకాల సత్సంగములో తేజః స్వరూపులైన హుజూరువారు వరుసగా మూడు శబ్దములను దివ్యేచ్ఛకు తీయించగా యీ క్రింది శబ్దములు వచ్చినవి.

(1) గురు గహో ఆజ మేరీ బహియాం
మైం బసూం తుమ్హారీ ఛఇయాం॥

(సారబచన్, బచన్ 33, శబ్ద 4)

(2) గురూ కే పఇయాం లాగూంగీ, చరణ గురు హీరదే ధారూంగీ ॥

(ప్రేమబానీ, భాగ్ 1, బచన్ 7 (1) శబ్ద 41)

3) తన మన కా సుస భేద, హుఆ సేవక అతి పరసన ।
సుధి బుధి గఇ బిసరాయ, గిరా సతగురు కే చరనన ॥

(ప్రేమబిలాస్, శబ్ద 71)

పాఠానంతర మిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు దివ్యేచ్ఛకు మూడు శబ్దములు పాఠము చేయబడినవి. మీరు ఈ మూడు శబ్దములను శ్రద్ధగా చదివిన యెడల ఈ శబ్దముల వరుసక్రమము చాల యుక్తముగ నున్నట్లు మీకు బోధపడగలదు. హుజూర్ సాహబ్జీ మహారాజు వారినాడు గుప్తమై పోయినందువలన సత్సంగమునకు గల్గిన మహావిపత్తును, సత్సంగి సోదరీసోదరులకు గల్గిన ఘోర విషాదాపత్తులను జ్ఞాపకముంచుకొని ఆ పరమ దయాళుని చరణములందు, "హేదాతాదయాళ్, తమరు మా హస్తమును పట్టుకొని మాకు సహాయమొనర్చుడు" అని ప్రార్థన చేయబడినది. మొదటి శబ్దములో నీ దుఃఖమును సహించుకొనగల శక్తి కొఱకును, వారి సహాయ సంరక్షణల కొరకును ప్రార్థన చేసిన మీదట, రెండవ శబ్దములో ఆ ప్రార్థనకు సమాధానముగా ఆ దయాళురు ధైర్యోత్సాహములను ప్రసాదించినట్లు చెప్పిరి. అట్లు వారు ధైర్యము గలుగజేసిన పిదప సత్సంగికి విశ్వాసము, ధైర్యోత్సాహములు అభివృద్ధియైన విషయములు వర్ణించిరి.

## ...2

హిందూదైనిక పత్రికయొక్క విలేఖరి టొంకాసీలో హుజూరువారిని కలుసుకొన్నపుడు హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ప్రస్తుతము దేశములో గల్గుచున్న ఆర్థిక కష్టములు చాల ఖేదకరముగనున్నవి. అందులో చాల కష్టములు ఈ రోజులలో యుద్ధము విషయములో పెరిగిపోవుచున్న ఆవశ్యకత లను బట్టి వచ్చుచున్నవి. ఈ రోజులలో జనులకు ధనమెక్కువ ఖర్చు అగుచు న్నందున ప్రతి కుటుంబము యుద్ధపు ఖర్చులకై కొంత ఆర్థిక సహాయము చేయుచున్నట్లే యెంచుకొనవలసి యున్నదని నాకు అనిపించుచున్నది. అయితే జనులనుభవించుచున్న కష్టములు బాధలును చాల భాగము వారు స్వాయముగ కల్పించుకొన్నవే. జనులు తమదైనికావశ్యకతలను, వాంఛలను తగ్గించు

కొని, వ్యర్థముగ పదార్థములను పాడుచేయకుండ వాడు కొన్న యెడల, జనులకు చాల వరకు కష్టములు తగ్గిపోయి, ఇప్పుడు కల్గుచున్న బాధలు లేకుండ పోవునని నిశ్చయముగ చెప్పవచ్చును. కావున జనులు అధికాధిక పరిమాణములో అన్నమును ఉత్పన్నముచేసి, వస్త్రములను తయారుచేయుటయే దీనికి ఉపాయమని నేను చాల గట్టిగ చెప్పవలెను. సకల విధములైన వస్తువులను మన దేశములో అధికాధికముగ తయారుచేసుకొనవలయును. అట్లు చేసినందు వలన దేశములో వస్తూత్పత్తి పెరిగి, అన్ని వస్తువులును చవుకగ లభ్యము కాగలవు. ఉద్యోగముకాని వృత్తికాని లేనివాళ్ళకు ఈ విధముగ జీవనోపాధి కలిగి, వారు తమ ఆవశ్యకతలకు అవసరమైన ధన సంపాదన చేసికొనగల్గుదురు.

క్రితము యుద్ధము అయిన తర్వాత మన విద్యా సంస్థలలో చెప్పెడి చదువులు మన పరిస్థితులకును మన కాలము యొక్క ఆవశ్యకతలకును ఉపయోగకరముగ నెంత మాత్రము లేవు. అందుచేత పల్లెటూళ్ళలోను చిన్న చిన్న పట్టణములలోను మిడిల్ స్టాండర్డు వరకు ఫీజు లేకుండ చదువు చెప్పవలయును. ఆ సమయములో ముఖ్యముగ పిల్లలకు ఇండస్ట్రీలలో అభిరుచి కలుగునట్లు ప్రోత్సహించవలయును. ఈ విధముగ విద్యార్థులకు పుస్తకములు చదువుకొనుటకును, చిన్న గణితపు లెక్కలు చేయుటకును శక్తి కలుగును. 14, 15 యేండ్లు వచ్చుసరికి వారు తిన్నగా ఇండస్ట్రీలలోగాని యంత్రశాలలలో గాని వెళ్ళి పనిచేయగలుగుదురు, లేదా స్వయముగ నొక చిన్న ఇండస్ట్రీ అయినను పెట్టుకొని నడిపించుకొనగల్గుదురు. విద్యాభ్యాసము కోర్సులో చేతి పరిశ్రమలు, కళలు కూడ నేర్పవలయును. పెద్ద చదువులు చదువుకొనగల బుద్ధి కుశలతయు చాతుర్యమును గలిగి, ఆ ఖర్చు భరించగలవారిని పెద్ద చదువులకు పంపవచ్చును. కాని అట్టివారికి నేను నొక్కి చెప్పునదేమనగా, వారు జీవితములో నొక గొప్ప ఉద్దేశ్యమును ఏర్పాటు చేసుకొని, అది సాధించు నిమిత్తమై ముఖ్య ప్రయత్నము చేయవలయును. దేశములో నేయే భాగములలో (ముఖ్యముగా చిన్న పల్లెలు గ్రామములలోను) విద్యాభ్యాసము చాల తక్కువగ నున్నదో, అచ్చట ప్రతి స్థానములో స్కూళ్ళు తెరచి, దేశములో శిక్షా లోపమును వీలయినంతవరకు నశింపుచేయవలయును. అందుతో బాటు, ప్రతి స్థలములోను ఆయా స్థలముల అవసరమును బట్టి బీద రోగుల సహాయార్థమై హోమియోపతి చికిత్సాలయములను కూడ పెట్టవల

యును. సమాచార విలేఖరి హుజూరువారిని కాంగ్రెస్ వారు చేయుచున్న ప్రబంధమును గురించి తమ అభిప్రాయము చెప్పుమని కోరగా, వారిట్లు సెల విచ్చిరి. ఆల్-ఇండియా- ఆర్గనైజేషన్, (All India organisation) ఏ ఉద్దేశ్యమును సాధింపబూనికొనిరో అది నిస్సంశయముగ ప్రశంసనీయమైనదే. కాని వారది సాధించు నిమిత్తమవలంబించిన పద్ధతులు మాత్రము సరిగావు.

ఎచ్చటెచ్చట ముడిసరుకులు విరివిగ లభించి, పనివాండ్రు కూడ సులువుగా లభింతురో, అచటనే వస్త్రోత్పాదన కేంద్రములను, యంత్ర శాలలను తప్పక తెరవవలయును. దేశసంచారముచేసి, ఇట్టి కేంద్రములు యంత్రశాలలును తెరచుటకు మంచి సావకాశము లెచ్చట నున్నవో చూచి తెలుసుకొని అచ్చట తెరవవలయును.

---

1 ఆగస్టు 1943 వ తేదీని పిల్లల సత్సంగము అయినది. అందు రెండు శబ్దములు చదివిరి.

(1) మైం భూలీ సతగురు స్వామీ, మైం చూకీ అంతర జామీ (1)
క్యా క్యా కహూం మైం బిథా బఖానీ।
సబ్ జగ కో పండియన కీన్హా దివానీ॥ (2)
(సారబచన్, బచన్ 22, శబ్ద 9)

(2) బాల సమాన చరణ గురు ఆఈ।
దేఖదరస అతికర హరఖాఈ॥ 1.
ఖేలూం గురు సన్ముఖ ధర ప్యారీ।
సునత రహుం గురు బానీ సార॥ 2.
ఆరత ధారూం ఉమంగ ప్రేమ సే।
జపత రహూం గురు నామ నేమ సే॥ 3.
గురుకే లీలా నిరఖ నిహార్।
బిగ సత మన ఔర్ బఢత పియార॥ 4.
రాధాస్వామీ దీనా భక్తి సాజ।
చరన సరన హియె ధారీ ఆజ॥ 5.
(ప్రేమబానీ భాగ్ 2, బచన్ 9 [3], శబ్ద 40)

ఇట్లు సెలవిచ్చిరి : గత సంవత్సరమంతయు శ్రద్ధగా చదువుకొనకుండ వ్యర్థ కాలక్షేపముచేసి, పరీక్షలలో అనుత్తీర్ణులైన వారికి మొదటి శబ్దము వర్తించును. ఆ శబ్దములో వర్ణించిన నామదానము నొందుట, నామాభ్యాసము చేయుట, నామప్రతాపముచే ముక్తిని పొందుట మొదలైన విషయములు ఆదర్శ సత్సంగియైన వానికే వర్తించును. కాని యిచ్చట విద్యార్థులను సత్సంగులుగ చేయవలయు నను నిబంధన లేదు కావున, మీరు ఈ శబ్దములో చెప్పిన ప్రకారము ఆదర్శ సత్సంగి యగుట యనగా, మీరు విద్యాభ్యాసము విషయములో పైన చెప్పిన హితోపదేశముల ప్రకారము నడుచుకొనుటయే. మీరు మీ తల్లిదండ్రుల వద్దనుండి తెప్పించుకొన్న ధనమును హానికరమైన ఆటపాటలలో ఖర్చు పఱచక, విద్యాభ్యాసము కొఱకే వ్యయపఱచుకొని, ఆ విధముగ సద్వినియోగము చేయుడు. మీరట్లు చేయనియెడల ఆదర్శ సత్సంగి కానేరరు. మఱియు, క్రితము సంవత్సరము అజాగరూకులై, చదువు పైన ధ్యానము పెట్టకుండ కాలము వ్యర్థము చేయుటవలన నెట్టి దుష్ఫలితము కలిగెనో, తిరిగి అట్టి దుష్పరిణామమే వచ్చెడి సంవత్సరము కూడ కలుగ వచ్చును. మీరిచ్చటి కే యుద్దేశ్యముతో వచ్చిరో, ఆ యుద్దేశ్యమును పూర్తిగ సాధించుకొనుటకై మీరు ఇప్పటినుండియు జాగ్రత్తపడవలయు ననియే యీ శబ్దము మీకు శైక్షిక సంవత్సర ప్రారంభములోనే ఈ హెచ్చరిక నిచ్చినది. అనుత్తీర్ణులైన విద్యార్థులు సంవత్సరారంభమునుండియు శ్రమపడి చదువుకొని ప్రతి విషయములోను నూటికి డెబ్బది మార్కులు తెచ్చుకొనవలయును. ఈమాటలు మీలో నెవరెవరికి నచ్చినవో వారు చేతు లెత్తుడు. సమస్త విద్యార్థులును చేతులెత్తి తమ అంగీకారమును తెల్పిరి.

ఈ శబ్దములోని చరణముల భావము మీ పరిస్థితికి పూర్తిగా సరిపోవును. ఈ శబ్దములోనే సరిగ "కర్మీ, దర్మీ"1 యను పదము లుదహరించబడినవి. కాలమును వ్యర్థముగ పాడుచేసుకొని పరీక్షలలో ఫెయిల్ (Fail) అయిపోవు పిల్లలనే "కర్మీ, ధర్మీ"1 అని చెప్పవచ్చును. ఎవరైతే శ్రమపడి చదువుకొందురో వారు పరీక్షలలో ప్యాసయి ఆ విధముగ విముక్తి నొందు

1. కర్మియనగా బాహ్య కర్మకాండయందు విశ్వాసము కల్గి ప్రవర్తించువాడు, ధర్మియనగా ధర్మకార్యములుచేసి మోక్షము సంపాదించగలమని నమ్మికొన్నవారు. ఈ కర్మలు ధర్మకార్యములు చేసినందు వలన మోక్షము లభించ నేరదు కావున, అవి వ్యర్థ కార్యములు. "కర్మీ, ధర్మీ" మానవులు ఆ కార్యములు చేయుటలో వారి జీవితము వ్యర్థముగ పాడు చేసుకొనుచున్నారు.

చున్నారు. అదియేవారికి ముక్తియుని చెప్పవచ్చును. తిరిగి యిట్లు సెలవిచ్చిరి. రెండవ శబ్దములో " జపత రహూం గురు నామ నేమ సే" అనివచ్చినది: నామమును నియమ ప్రకారముగ జపించుటయను విషయము మీకు వర్ణింప చేసినపుడు, మీకు స్కూలులో చెప్పిన పాఠములను తిరిగి నియమప్రకారము ఇంటివద్ద చదువుకొని జ్ఞాపకము చేసుకొనుట యని అర్థము చెప్పవలెను. ఆ తర్వాత యీ క్రింది శబ్దము మూడవది వచ్చినది.

మేరీ పకడో బాంహ హే సతగురు।
నహీం బహో ధార భవ సాగర॥ 1.
కోఈ మంత్ర సిఖాఓ ఆకరీ।
లో చరణ ఓట కిరపా కర॥ 2.
రాధాస్వామీ సరన తూ దృఢ కర।
ఫిర ఛోడన కభీ ఉమర భర॥ 10.

(సారబచన్, బచన్ 29, శబ్ద 2)

ఇట్లు సెలవిచ్చిరి : మూడవశబ్దములో కూడ చరణ శరణ్యము గ్రహించుటను గురించి చెప్పబడినది. ఏమంత్రముతో మీ చరణమును పట్టు కొనగలమో అట్టి అద్భుత మంత్రమును మాకు ఉపదేశించవలయునని ఈ శబ్దములో ప్రార్థనయున్నది. అందుకు నా సలహా యేమనగా మీరు మీ కాలమును వృథాగా పాడుచేసుకొనవలదనియే. మీకు చెప్పిన పాఠములను మీరు తిరిగి తిరిగి చదువుకొని జ్ఞాపకము చేసికొనుడు. మీ ఉపాధ్యాయుడు మీకు బోధించు పాఠములను మీరు శ్రద్ధపెట్టి వినుడు. ఆయన యే విషయ మును మీకు సిద్ధాంతముగ రుజువు చేయదల్చుకొన్నారో, ఆ నిర్ణయమెట్లు చేయుచున్నారో, ఆ నిర్ణయ మేమిటో కనిపెట్టి తెలిసికొనుడు. అట్లుచేసి నందువలన మీ ప్రయత్నములు సఫలమై మీ కోరిక లీడేరగలవు. మీకు చెప్పెడి పాఠములను చదువుకొనవలయునను ఆసక్తి శ్రద్ధయు మీ హృద యములలో నుండవలయును. మీరు మీ ప్రిన్సిపాలుగారి యెడల ఉపాధ్యా యుల యెడలను గౌరవ ప్రేమలు చూపుచు వారు చెప్పెడి ప్రతివిషయమును శ్రద్ధగా విని గ్రహించుకొనవలయును. అట్లు చేసినయెడల మీకు కష్టము లన్నియు తొలగిపోగలవు. పరీక్షాపత్రములకు సరియైన జవాబులు వ్రాయ గలుగుదురు, కొంతమందికి ఛాలకాలమునుండి తేల్చుకొనలేకుండ నుండి

పోయిన గొప్ప గొప్ప సమస్యలు వారికి నిద్రలో స్వప్నము వచ్చినపుడు పరిష్కరించబడుచున్నవను విషయము కూడ మనకందరకు అనుభవమున్నది. మీకుకూడ నీ సిద్ధాంతమువలన లాభము పొందవచ్చును. మీకు అధమాధమము పాఠములు శ్రద్ధగ చదువుకొనవలయునను పట్టుదలతో పనిచేయు మీ ఉపాధ్యాయులకు సంతోషకరమగునట్లు ప్రవర్తించినయెడల వారలకు తప్పక మీయం దభిమానము గలిగి, వారు మీకు కాలేజి సమయములోనే గాక, ఇతర సమయములలో గూడ సహాయము చేయుటకు అభ్యంతరము చెప్పరు.

చిన్న విద్యార్థులను ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయవలయునని సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సరన తేరీ హామ ఆయె ప్రభూజీ।
లాజ హామారీ తుమ కో॥

ఈ శబ్దముయొక్క ప్రథమ చరణమును హుజూరు వారు మరల చదివించిరి. తిరిగి యిట్లు సెలవిచ్చిరి. ఇపుడు సత్సంగములో నడిపించుచున్న విధానము కాని, లేదా, హుజూర్ స్వామీజీ మహారాజువారు, హుజూర్ మహారాజువారు, మహారాజసాహబ్ వారు, సర్కార్ సాహబ్ వారు, హుజూర్ సాహబ్జీ మహారాజువారును ఇక ముందు ముందు ఫలానా పనులు సత్సంగములో జరుగ గలవని భవిష్యవాణిరూపములో సెలవిచ్చిన విషయములు కాని పూర్తికానిచో వారి వచనములకు ఆక్షేపణగలిగి వారిపైన దోషారోపణ చేయుట కవకాశము గలుగును. అందుచేత సత్సంగప్రబంధము నడిపించుచున్నవారు తమ పూజ్యపూర్వాచార్యులు సెలవిచ్చిన వచనములను పూర్తిగ నెరవేర్చుట తమ కర్తవ్య ధర్మముగ నెంచుకొనవలయును. ఆ బాధ్యత వారిపైనున్నది. ఇప్పుడే కొద్దిసేపు ముందుగ మీకు చెప్పిన ఆదేశములను మీరు పాలించుచు, మీకు విద్యాభ్యాసము చేయుటకును, మీ మస్తిష్క శక్తులను వృద్ధి చేసుకొనుటకును, నిద్రాణమై యున్న మీ ఇతర శక్తులను మేల్కొల్పుకొనుటకును మీ కొసంగబడిన కాలమును వ్యర్థ పుచ్చుకొనకుండ. గూడ దాని పూర్తి లాభమును పొందుడు. పైగా

మీరొక్క క్షణము కూడ నష్టపోనివ్వకుండ మీ సమయమును పూర్తిగ సద్వినియోగము చేయుదుమని ఒక దృఢ ప్రతిజ్ఞ చేసుకొన వలయును. మీ రట్లు చేసిన యెడల మన పూర్వ సద్గురువుల వచనములలో చెప్పిన విషయములను సరిగ చేసి చూపవచ్చును. అవి అట్లు సాగించి చూపుటయే కాక, మీకు ఆవి సరిగ అట్లే కావలయు ననియు, అట్లగుటయే సత్యమనియు కూడ తెలియగలదు. కావున పూర్వ సద్గురువుల వచనములు పూర్తియగు టయు కాకపోవుటయు విద్యార్థుల పైన కూడ ఆధారపడి యున్నది. అధ్యా పకులు కాలేజీలు స్కూళ్ళ సమయములలోనే గాక ఇతర సమయములలో కూడ విద్యార్థులకు చదువు చెప్పి వారల శక్తులను పెంపొందించుటకై పూర్తి ప్రయత్నము చేయవలయునని వారికి కూడ నేను మనవి చేయుచున్నాను.

— 0 —

14 ఆగష్టు 1943 తేదీని సాయంకాల సత్సంగములో రెండు శబ్దములు దివ్యేచ్ఛకు తీసి చదివిరి.

(1) ఆజ ఆరతీ కరూం సుహావన్,
పావన భావన మన లలచావన॥ (1)
గావన లావన ప్రీతి బఢావన,
ఛావన ఉమంగ హటావన ధావన॥ (2)

(సారబచన్, బచన్ 30, శబ్ద 18)

(2) ఆజ మాంగే సురతియా గురు కా సంగ ॥ టేక॥
మోహా జాల మేం రహీ ఫంసానీ, నహీం జానే కుఛ
భక్తి ఢంగ్॥ (1)

(ప్రేమబానీ, భాగ్ 2, బచన 10 (3), శబ్ద 46)

పాఠానంతరము హుజూరువారు, ఈ రోజు మీరు ఇంత మంచి శబ్దము లను తీసి చదువుటకేదైన నొక ప్రత్యేకమైన విశేషమున్నదా యని ప్రశ్నించిరి. హుజూరువారు రెండవ శబ్దమును తిరిగి రెండవసారి చదివించి, ఈ శబ్దములో చెప్పిన ప్రకారము గురువుగారి సాంగత్యములోనే ఉండి పోవలయునను హార్దికాభిలాష మీలో యెవరికి ఉన్నది అని తిరిగి ప్రశ్నించిరి.

మీకు వాస్తవముగ గురుచరణములందే నివాసము చేయవలయునని ఉన్న యెడల మరి దయాల్బాగులో మీ యిండ్లను మీరు అట్టే యుంచుకో వలసిన అవసర మేమున్నది? ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబర్లు కూడ ఈ రోజున దయాల్బాగులోని యిండ్లన్నియు సభకు అప్పజెప్ప వలయునను విషయమునే ఆలోచించు చున్నారు. కమిటీ మెంబర్లు అందరు ఏకగ్రీవముగ నీ నిర్ణయమును అంగీకరించిరి. 10, 12 యేండ్లకు పూర్వమే హుజూరుసాహబ్జీ మహారాజువారు సత్సంగములో నీ సమస్యను గురించి చర్చించుచు, దయాల్బాగులోని యిండ్లన్నియు సభకు వశము చేయవలయునని సెలవిచ్చిరి. ఇచ్చట నుండగోరు సత్సంగులు సభవారి అనుమతి పొంది అద్దె యిచ్చుచు ఇండ్లలో ఉండ వచ్చును. అప్పుడు హుజూరువారు అందరిని తమ తమ అభిప్రాయములను చెప్పుమని అడుగగా, కొందరు దానిని సమ్మతించిరి, కొందరు నిశ్శబ్దముగ నూరకుండిరి హుజూరు మెహతాజీ మహారాజువారు, మీలో యెవరైతే హుజూరు సాహబ్జీ మహారాజువారీ వచనము సెలవిచ్చినపుడు ఉండిరో, వారు చేతులు ఎత్తుడు అని చెప్పిరి. 14, 15 మంది చేతులెత్తిరి.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి: హుజూర్ సాహబ్జీ మహారాజువారు ఆ వచనము సెలవిచ్చినపుడు, ఆ వెంటనే యీ పరివర్తన జరిపించుటకు యుక్త సమయము కాదన్నను, ఆ వచనమునుబట్టి అట్టి పరివర్తన చేయవలసిన పరిస్థితులు ముందుముందు ఎప్పటికైన నొకనాడు తప్పక రాగలవని తేటపడు చున్నది. కాబట్టి దీనివలన మనకు స్పష్టపడుచున్న విషయ మేమనగా, హుజూర్ సాహబ్జీ మహారాజువారు ఇట్టి అభిప్రాయమును అప్పుడు అందరికి తెలియ జెప్పిరి. కావున నిస్సంశయముగా వారికి అట్టి మార్పు పూర్తిగ సమ్మత మనియు, అంతియేగాక, వారి అభిప్రాయములో సంఘముయొక్క శ్రేయోలాభముల కొఱకై అట్టి మార్పు చాలా ఆవశ్యకమని వాదించు చుండిరనియు తేలుచున్నది. ఏలనన అట్లుకానిచో వారా విషయము నెన్నడు చెప్పనే చెప్పియుండరు. ఈ మధ్యన నేను మదరాసులోనున్న అడయారు కోలనీ చూచుట తటస్థించినది. ఆ కాలనీలోని యిండ్లన్నియు సంఘమందరి తరఫున కట్టబడుచున్నవి. సంఘమునకు సంబంధించిన పనులు చేయుచున్న వారికిని, లేదా సంఘలాభము నిమిత్తమై బయట పని నేర్చుకొను చున్నవారికిని మాత్రమే ఆ కాలనీలో నివసించుట కనుమతి ఇయ్యబడును. ఇపుడు హుజూర్ సాహబ్జీ మహారాజు వారికి కూడ అదే అభిప్రాయము సరియని

తోచినపుడు మీరే ఆలోచించి చెప్పుడు. అట్టి పరివర్తన జరిగించవలసిన యవసరము ఎప్పటికైన రానైయున్నదో లేదో మీలో నెవరైతే సాహబ్జీ మహారాజువారి ఈ సలహాను అనుమతించి తమ యిండ్లను సభవారి వశముచేయుటకు సిద్ధముగా నున్నారో వారు చేతులెత్తుడు. అందు పైన బహు సంఖ్యాకులు చేతులెత్తిరి.

ఇట్లు సెలవిచ్చిరి : హుజూర్ సాహబ్జీ మహారాజు వారి కాలము ఈ పరివర్తనను అమలులో పెట్టుటకు యుక్తసమయము కాదని నేనిప్పుడే చెప్పితినికదా! అయినను ముందు ఆ పరివర్తనను అమలులో పెట్టదగిన సమయము తప్పకుండ రాగలదని అందిమిడియున్నది. ఇప్పుడు మనకు ఆ సమయము వచ్చినదా లేదాయను ప్రశ్న ఒక్కటే తేల్చుకొనవలసి యున్నది. నా అభిప్రాయము ఈ సమయము అందుకు చాల యుక్తమైనదనియు, ఈ పరివర్తన మిపుడు జరిగించినచో చాల ఉపయోగ కరముగను సమయానుకూలముగను ఉండుననియే. అదికాక, ఫలానా యిల్లు మన ఆవశ్యకతలకు అనుకూలముగ నున్నది. అది మన యిష్టప్రకారము కట్టించుకొంటిమి కదా, దానినెట్లు వదిలిపెట్టగలము అను బంధనము మన మనస్సులో ఉండి మన మనస్సు ఆ గృహమును విడుచుట కిష్టపడజాలని యెడల, ఈ విధమైన బంధనము మనస్సున పెట్టుకొన్నవారు భగవచ్చరణములందు లగ్నమై, శాశ్వతముగ చరణ నివాసము పొందుట కెట్లు అధికారులగుదురో, మీరే ఆలోచించుకొనవచ్చును. ఒక మనిషికి అంటురోగ మేదైన వచ్చినప్పుడు అతనిని తనయింటినుండి దూరముగ బయటకు పంపుచుందురు కదా! అట్లు అతనిని యింటినుండి బయటకు పంపుటలో ఉద్దేశ్యము అతని కాలనీకి, అతని ఇరుగు పొరుగు వారికిని బంధువులకును లాభము కలుగచేయు నిమిత్తమైయే కదా! అట్లు సంఘలాభము నాలోచించ కుండా నెవరైనను ఇండ్లను పాడు చేయుచు, చుట్టుపక్కల అనారోగ్యము వ్యాపింప జేయుచుండిన యెడల, ఈ పై నియమానుసారము అతని చేత తన యిల్లు ఖాళీ చేయించినచో అతనికి సహజముగ కష్టమని తోచవచ్చును. ఏ మనుష్యుడైనను తానున్న ఇంటిలోనే యెల్లకాలము నుడిపోవలయునను భావముతో ఆ యింటి నెప్పటికి విడిచిపెట్ట నొల్లనియెడల. అట్టి వానికా యిల్లు ఒక గోరీయే అగునుకాని యిల్లు కానేరదు. ఏలనన అతడు తాము చనిపోవుటకు ముందు ఆ యింటి నుండి బయటకు వచ్చుట కిష్టపడడు. గృహముతో నట్టి గాఢబంధనమున్న

వారు మరణించిన పిమ్మట నెలుకలును, పిండిలోని పురుగులును అయి పుట్ట గలరు. మరణానంతరము ఉత్తమగతి పొందవలయున నెడి భక్తిమార్గము యొక్క ఉద్దేశ్యమే నాశనమై పోయినది. ఈ బంధనమును మనస్సునుండి తొలగించు కొన్నచో నిస్సందేహముగ మనకు భగవచ్ఛరణము లందు నివాసము లభించగలదు. మీలో నిచ్చట యిండ్లు కట్టుకొన్నవారు ఆ యిండ్లను ఈ సమయములో సభకు సంతోషముగ వశము చేయుటకు సిద్ధముగ నున్నారా, లేదా? అని మిమ్ములను నేను ఇపుడు అడగవలసియున్నది. అనగా మీరు సభవారు ఖాళీ చేయమని చెప్పిన యిల్లును విడిచి పెట్టుటకును, తిరిగిమీరు మీకు యిల్లు యిచ్చిన నా యింటిలోనే సంతోషముగ నివసించుటకును సిద్ధముగా నున్నారాయని అడుగవలసి యున్నది. అందుకు సిద్ధముగ నున్నవారు తమ సంతకములు సభకు పంపించి తమపేర్లను అచ్చట వ్రాయించుకొనుడు. ఇందు గురించి సాహబ్జీ మహారాజువారి ఆదేశమెట్లున్నదో ఒక శబ్దమును దివ్యేచ్ఛకు దీసి తెలిసికొనుడని హుజూరువారు సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది :-

ఖజాఁ తజ దేఖో మూల బహార
ఘూమ చల దేఖో తిలకా ద్వార॥
ఖిలా జహాఁ అజబ్ సదా గులజా
పాంచ రంగ దేఖే పాఁచోఁ సార॥
సైర వహా దేఖ తన మన వార, గురూ నే వకాజ దిఖాఈ సార॥
మెహర సే దూర హూఏ సబ్ ఖార, తజా ఫిర మన సే నిజ అహంకార॥
గురూ మిల పహుంచీ గురు దరబార్, పడీ అబ్ రాధాస్వామీ చరణ మంఝూర॥ (9)

(సారబచన్, బచన్ 35, (2) శబ్ద 26)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ సమయములో నెవరెవరు తమ యిండ్లను సభకు వశము చేయుదుమని పేర్లు వ్రాయించిరో వారందరికి నీ శబ్దములో చెప్పిన ప్రకారము చరణములందు నివాసము లభించ గలదు. ఈ శబ్దములో చూపించెదమని సూచించిన పూలతోటను వారుచూడగలరు. ఇప్పుడు రాధాస్వామీ దయాళురికి ధన్యవాదమును తెలుపునట్టి ఒకశబ్దమును తీయుడు.

మీరు మీ సంపత్తిని రాధాస్వామీ దయాళురి కర్పించిరి కదా! భగవంతుడు మీకు అట్లు చేయ గల్గుటకు శక్తిని ప్రదానముచేసిరి కావున వారికి ధన్య వాదములను అర్పించ వలసియున్నది.

ఈ క్రింది శబ్దము వచ్చినది.

రాధాస్వామీ దయా ప్రేమ ఘట ఆయా
బంధన ఛూటే భర్మ గంవాయా॥ 1.

ఉమంగా హిరదా సుధి బిసరాఈ।
తన మన ధన సబ్ భేంట చఢాఈ॥ 3.

అబ రక్షా మేరీ తుమ్హారే హాథా,
చరన తుమ్హార మోర రహే మాథా ॥ 4.

సుమిరన నామ కరూం నిస బాసర,
శబ్ద జోగ కా పాయా ఔసర॥ 5.

దేఖత రహూం రూప గురు ప్యారా,
కామ బామ కో ధర ధర మారా॥ 6.

ఆరత కరూం ప్రేమ రంగ పూరీ,
పాస రహూం గురు కే తజ దూరీ॥ 7.

భూల భర్మ దోఖా సబ్ భాగా,
రాధాస్వామీ చలన బఢా అనురాగా॥ 9.

[సారబచన్, బచన్ 6, శబ్ద 16]

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: మీరు ఈ విధముగ గృహముల బంధనము త్రెంచుకొన నిశ్చయించుకొన్న విషయము హుజూర్ సాహబ్జీ మహారాజు వారికి కబురు అందినచో, వారు మీకు ఎంత గొప్ప బహుమానము నిచ్చెదరో మీరేచూచుకొనుడు. ఇంతకాలమునుండియు బంధనములను త్రెంచుకొన్నపుడె మీకు పారమార్థి కాభివృద్ధి గలిగి భగవచ్చరణములందు నివాసము లంభించ గలదని సత్సంగములో బోధించబడుచున్న శిక్షయొక్క అసలు లాభము మీరు ఆ శిక్ష ప్రకారము నడుచుకొన్నపుడే లభించగలదు. "హే రాధాస్వామీ దయాళ్, మాకు మీ చరణములందు నివాసము ననుగ్రహించుడు" అని మీరు ఇపుడుచేసిన ప్రార్థనలో నున్న కోరికయే మీ మరణ సమయములో కూడ మీ మనస్సున ప్రబలముగ నున్నయెడల, అందువలన

మీా కెంత గొప్పలాభము కలుగగలదో మీారే ఊహించు కొనవచ్చును. ఇట్లు మీారు హృదయ పూర్వకమైన వాగ్దానము చేసిన వెంటనే రెండవవైపునుండి దాని శుభపరిణామము స్పష్టముగ కన్పించుచున్నప్పుడు, ఆ శుభ సంకల్పమును జీవితమంతయు దృఢతరముగ జేసుకొనుచు నుండినచో దాని శుభపరిణామము ఇంక నెంతగొప్పదిగ నుండునో వేరుగ చెప్ప నావశ్యకతలేదు.

## 25

16 ఆగష్టు 1943 తేదీ సాయంకాలము సత్సంగములో నీక్రింది శబ్దమును చదివిరి.

సురత సహేలీ నభ పర ఖేలీ,పరఖే మూరత జోతి నిశాన

(సారబచన్, బచన్ 35, శబ్ద 9)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ సంవత్సర ప్రారంభములో నీ నూతన వర్షము సత్సంగులకు సత్సంగమునకును శుభప్రదమగుగాక యని హుజూర్ రాధాస్వామీా దయాళుని చరణకమలములందు మనము ప్రార్థన చేసితిమి కదా. ఈ సంవత్సరములో 6 మాసములు పైగా గతించినవి, భండారా దగ్గరకు వచ్చినది. ఇప్పుడు మీారు ఈ ఆఱు మాసముల అనుభవమును బట్టి ఆలోచించుకొని మీాపై ప్రార్థన అంగీకృతమైనట్లు మీాకు తోచుచున్నదో లేదో చెప్పుడు. అందఱును తమకు ఈ మధ్య సమయములో నిస్సందేహముగ భక్తి విశ్వాసములు వృద్ధియైనవనియు, కష్ట సమయములలో గొప్పసహాయము చేకూరినదనియు చెప్పిరి. అప్పుడు హుజూరువారు ఈ యేసు శేషించిన కాలమెట్లుండినను విషయమును గుఱించి దివ్యేచ్ఛ కొరక శబ్దమును తీసి చూడుడని సెలవిచ్చిరి. ఈ క్రిందిశబ్దము వచ్చెను.

సురతియా మోహా రహీ ఆజ నిరఖ గురూ ఛబి శాన

(ప్రేమబానీ, భాగ్ 2. బచన్ 10 (2), శబ్ద 111)

ఇట్లు సెలవిచ్చిరి : మీారందరు నీ శబ్దము మీా విషయములో నేమి తెలియజేయుచున్నదని భావించుకొనుచున్నారు? దీనిని విన్నమీాదట మీాకు సంతోషము కలిగినదా లేదా? దీని తర్వాత హుజూరువారు మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సురతియా మాంగ రహీ సతగురు సే అచల సుహాగ ।

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 10 (2), శబ్ద 70)

ఇట్లు సెలవిచ్చిరి: మీలో మొదటి శబ్దము విన్నమీదట సంతోష మెవరికి కలుగలేదో, వారు ఇపుడే రెండవ శబ్దము విన్నమీదట నేమి సెలవిచ్చెదరు? శబ్దముల విషయమట్లుంచి, మీరు సంవత్సరారంభమందు చేసిన ప్రార్థన అంగీకరించబడినదా లేదా అను విషయమును ముందు ఆలోచించుకొనవలయును. ఇక ముందు కూడ ఆ ప్రార్థన అంగీకరింపబడ గలదను విశ్వాసము కలుగుచున్నదా లేదా? ఈ శబ్దములోని అంతర్యార్థము మీకు బోధపడక పోయినను, మీకు బాహ్యరూపమున చూడగ, సత్సంగములోని పరిస్థితులెట్లు కన్పించుచున్నవి? ఇది స్వామీజీ మహారాజువారి యొక్కయు సాహబ్జీ మహారాజువారి యొక్కయు సమ్మిళిత భండారా సమయముకదా! మన యీ ప్రార్థనను వారు స్వీకరించెదరని మీరనుకొను చున్నారా లేదా? ఈ సంవత్సరము యుద్ధము మూలమున జనులకెట్టి గొప్పబాధలు కష్టములును ఇంకను అనేక దుఃఖములును కలుగుచున్నవో మనము చూచుచున్నాము కదా! మన సంఘమునకు ఇతరులకన్న సంరక్షణ అధిక పరిమాణములో గల్గినదా లేదా? అందరును "నిస్సంశయముగా" అని చెప్పిరి. రాబోవు యేడు సంవత్సరములును చాలా గడ్డు సంవత్సరములని హుజూర్ సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చినపుడు మీ అభిప్రాయము ఆ యేడు వర్షములును మన సంఘమునకు మాత్రమే గడ్డుగ నుండుననియా, లేక సమస్త ప్రపంచము నకుగూడ గడ్డనియా? ("సమస్త ప్రపంచమునకును" అని అందరు జవాబు చెప్పిరి) మరియు, ఆ యేడు సంవత్సరముల కాలమును సమాప్తమైపోవు చిహ్నాలు కనబడుచున్నవా లేదా? ఈ మధ్యకాలములో సంఘమునకు కొంతలాభము గల్గినదా లేదా? ఇప్పుడు ఆరు సంవత్సరములు పూర్తియై పోయినవి. సప్తమ సంవత్సరము జరిగిపోవుచున్నది. కావున నీ మహత్త్వ పూర్ణమైన ప్రశ్న మీ యెదుట పెట్టబడినది. మీరు దీనిని బాగుగా విమర్శించి తెల్సుకొనుడు. హుజూరువారు మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించి చదివించిరి:

చరణ గురు దిన దిన బడతీ ప్రీతి ॥ టేక్॥
సమఝ గురూ గత మత అగమ అపార।
ధార రహీ మన మేం దృఢ పరతీత ॥ (1)

గురు ఛబి నిరఖ హులఆ మన మాయుల ॥
బచన సునత నిత హరఖత చీత ॥ (2)
ప్రేమ భక్తి ధారా అబ్ జాగే ॥
త్యాగ దశా మన ముఖతా రీత ॥ (5) ॥
గురు కో జానా అబ్ సచయారా ॥
జగ మేం నహిం కోఇ సచ్చా మీత ॥ (6)

(ప్రేమబానీ, భాగ 2, బచన్ (1), శబ్ద 1)

చివర చరణమును హుజూరువారు రెండవసారి తిర్గి చదివించి ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు విషయము మరింత స్పష్టమైనదో లేదో మీరు సెలవిండు. నా అభిప్రాయములో, ఈ విషయము మొదటి శబ్దములోనే పూర్తిగా స్పష్టీకృతమైనది. అందులో నేదైన స్పష్టము కాకపోయిన యెడల, రెండవ శబ్దము ఆ విషయమును స్పష్టీకరించుటలో సహాయపడు చున్నది. మూడవశబ్దము ఈ విషయమును సంపూర్ణముగ విశదీకరించు చున్నది. ఏలననగా, అందులో ఒక్క గురుమహారాజువారు తప్ప మరెవరును జీవులకు నిజమైన మిత్రముకాని సహానుభూతి చేయువారుకాని లేరని సెలవియ్యబడినది. ఇప్పుడు ఒక ప్రశ్న పొడముచున్నది. అదేమనగా, స్వామిజీ మహారాజువారును సాహబ్జీ మహారాజువారును భండారా సమయములో దయచేసి వచ్చినయెడల వారెచ్చట ఉండవచ్చును? ఇప్పుడు ఉన్న యిండ్లు అన్నియు వేర్వేరు మనుష్యులకు చెందియున్నవి. ప్రతి గృహము పైనను ఒక్కొక్క మనుష్యుని పేరు వ్రాసియున్నది. ఇప్పుడు మీరే చెప్పుడు. వారు వచ్చి ఉండగోరిన యెడల వారు ఏ గృహములో మకాము చేయవచ్చునో? గృహములన్నియు సత్సంగమునకే చెందినవైన యెడల, అవి అన్నియు వారి సొంతమే అయిపోవును. కావున, వారెవరిని గూడ అడిగిపుచ్చుకొన వలసిన అవసరముండదు. అందువలననే, మీరందరును భండారాకు ముందుగనే సమస్త గృహములను సత్సంగమునకు ఇచ్చివేసినట్లు అంగీకరించవలయుననియు, అట్లైనచో వారచ్చటకు దయచేయుటకు ఎక్కువ సౌకర్యము గలుగుననియు మేము తిరిగి మనవి చేసితిమి. ఈ కాలములో ఇచ్చటనేమి, బయటనేమి, అన్నియిండ్లు, భవనములు, హోటళ్ళు, రైలు బండ్లు కూడ

జనముతో నిండి యున్నవి. ఎచ్చటను ఖాళీయే లేదు. ఈ పరిస్థితిలో ఇండ్లు సభకే చెందియున్న యెడల ఆ దయాళురు ఈ సమయమున మన మధ్య కేతెంచెదరని ఆశించుట కవకాశమున్నది. భండారాకు ఒకరోజు ముందుగనే ఈ సమస్య పరిష్కారమైన యెడల స్వామిజీ మహారాజువారు సాహబ్జీ మహారాజువారును సత్సంగములోనికి అనశ్యముగ నేతెంచి సత్సంగమున కుత్సాహ వృద్ధి గలుగ చేయుదురని మీరు మహల్లాలకు వెళ్ళి అచ్చట నున్న వారందరికిని బోధపర్చవలయును. దీని తర్వాత స్త్రీలు యీ క్రింది శబ్ద మును చదివిరి.

సఖీ రీ మైం తో జావత హూం పియా దేశ్

(ప్రేమ బిలాస్, శబ్ద 88)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో మనలను తీసికొని వెళ్ళుటకై ఆ దయాళురు సద్గురు రూపమును ధరించి యిచ్చట కేతెంచిరని చెప్పబడినది. అందుచే ఒక ఆత్మ తాను తన ప్రియతముని దేశమునకు పోవుచున్నాననియు, తనకీ దేశములో సుఖము లభించ లేదనియు, మరొక ఆత్మతో చెప్పి, ఆ యాత్మను కూడ తనతో కలిసి రమ్మని పిలుచుచున్నది. అయితే, ఇంతకుముందే చెప్పినట్లుగ, ఆ దయాళురు భండారా సమయములో వచ్చి మనమందరము కలిసి మెలిసి కూర్చుండుట చూచి ప్రసన్నులై భోగమును స్వీకరించెదరు. వారా సమయములో దయచేసి వచ్చినప్పుడు మనము, "మహాప్రభో, తమరు అనుగ్రహించి ఇచ్చట ఉండిపొండు. ప్రపంచములో కష్టములు బాధలు చాల మెండుగ నున్నవి. వానిని పోగొట్టు నిమిత్తమై "న్యూ ఆర్డర్ ను"ను (అనగా నవీన విధానమును) స్థాపించుట అవసరమై యున్నది." అని వారితో మొరపెట్టుకొందుము.

ఇది చాల ఘనకార్యము (Great Cause), ఇందు మూలముననే మానవజాతికి అధికాధిక శ్రేయస్సును అభివృద్ధియు గలుగగలవు. ఆ తర్వాత తిరిగి దివ్యేచ్ఛకు శబ్దమును తీయించి చదివించిరి.

ఆజ మన మితా ప్రి భక్తి కమాయ్।

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 11 (2) శబ్ద 15)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దముయొక్క చరణములు ప్రస్తుత విషయమునకు సంపూర్ణముగ వర్తించును. ఏ జీవుడైనను రాధాస్వామీ దయాళుని చరణములను పొందగోరినచో మొన్నటిరాత్రి చెప్పినట్లుగ, అచ్చట జేరుకొనుటకు ఉపాయము ఇహ బంధనములను తగ్గించు కొనుటయే కదా! ఆ సూత్రమునే ఆధారము చేసుకొని గృహములను భేంటు ఇవ్వ వలయునను సమస్య మీ ముందర పరిష్కరించు నిమిత్తమై పెట్టబడినది.

ఆ తర్వాత దివ్యేచ్ఛకు తీసి ఒక వచనమును చదివిరి. ఆ వచనము ప్రస్తుత విషయమునకు సరిగసరిపోయినది.

103

22 ఆగష్టు 1943:- ఈ రోజు భండారానాడు ఆరతి సమయములో దివ్యేచ్ఛకు తీసి మూడు శబ్దములు చదివిరి.

(1) రాధాస్వామీ ధరా నర రూప జగత మేం,
గురు హోయ జీవ చితాయే।

(సారబచన్, బచన్ 1, శబ్ద 2)

(2) ఆజ ఆఈ సురతియా ఉమంగ జగాయ।

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 10 (3), శబ్ద 2)

[3] లాగ రీ మేరీ సురత సహేలీ, గురు కే చరనన మేం లాగ రీ।

[ ప్రేమ బిలాస్, శబ్ద 20 ]

శబ్దపాఠమైన పిదప తేజస్వరూపులైన హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి: హుజూర్ స్వామిజీ మహారాజు వారు, సాహబ్జీ మహారాజువారును ఈ సమయము నందు సత్సంగములోనికి దయచేయగలరని రెండు మూడు రోజుల నుండియు మనవి చేయుచుంటిని కదా. ఇప్పుడు మీలో ఈ నాటి శబ్దములను శ్రద్ధగవిన్నవారు ఆ శబ్దములలో వారి సమయములో నిచ్చటకు దయజేసిరని సూచన పొడముచున్నదో లేదో చెప్పుడు. హుజూరువారు మొదటి రెండు శబ్దముల చరణములను మరొకసారి చదివించి యిట్లు సెలవిచ్చిరి: మొదటి శబ్దములో వారి శుభాగమనమును వర్ణించిరి. రెండవ శబ్దములో ఆత్మ ఉత్సాహముతో నుప్పొంగుచు వారి శుభాగమనానంతరము వారి ఆరతి

చేయుటలో తత్పరమైయుండెను. మూడవ శబ్దములో ఒకజీవుడు మరొక జీవునితో "ఆదయాళురు దయచేసి వచ్చిరి. కావున తొందరగా వెళ్ళి నీవు కూడ వారి చరణములందు లగ్నము కమ్ము" అని వారి శుభాగమన వార్తను చెప్పుచున్నది. చివర చదివిన వచనములో నొకభాగములో ఇవ్విధముగ నున్నది. "సద్గురువుని చరణములను సేవకుడు ఒక్కసారి పట్టుకొన్న పిదప మరెన్నడు నా చరణములను విడువకుండ నుండుటయే అతని ధర్మము. ఏలనన, అతడు విడిచినను సద్గురువు అతనిని విడనాడ జాలరు. కాని సద్గురువు అతనిని పట్టుకొన్నప్పు డతనికి తప్పక కష్టముగనుండును." హుజూరు మెహతాజీ మహారాజువారు, సేవకుడు తన సద్గురువును విడనాడి పోయినచో సద్గురువు కొన్ని యేండ్లకాలము ఊరుకొని, చివరకు అతనిని తిరిగి లాగుకొందురు. కానిఅందువలన నతనికి బాధకరముగ నుండును అని సెలవిచ్చిరి. ఒక్కసారి చరణములందు లగ్నము చేసుకొన్న పిదప ఆతనిని వారి చరణములనుండి జారి పోనివ్వరు. సేవకుడు తన మూర్ఖత్వము మూలమున సత్సంగమునుండి బయటకు వెడలిపోయినను కొంతి సమయము గడిచిన పిమ్మట అంత సమయములో తిరిగి అతనిని తమ చరణములందు లగ్నము చేసికొందురు.

## [illegible]7

22 ఆగష్టు 1943 తేదీని భండారాగృిందులో అందరికి భోజన పదార్థము లన్నియు వడ్డించుట పూర్తియైన పిమ్మట దివ్యేచ్ఛకు శబ్దమును తీసి చదివిరి.

రాధాస్వామీ సేవ కరత ధర ప్యారా, బింజన అనేక కీన తైయారా॥

[ ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 18 శబ్ద 29 ]

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: మీరందరు స్వామీజీ మహారాజు, హుజూర్ సాహబ్జీ మహారాజువార్ల చరణ కమలములను ధ్యానముచేసుకొని వారి భోగమునిమిత్తమై మీ ముందర వడ్డించిన పదార్థములను వారు భోగము చేయవలయునని ప్రార్థించుచు వారి చరణములందు అర్పణ చేయుడు. ఆ దయాళురు ఈ శబ్దచరణములలో సూచించిన ప్రకారము ఈ రోజున నీ సమస్త పదార్థములను భోగముగ స్వీకరించి ప్రసాదము గావించిరి. మీరందరును వీనిని ప్రసాదము అను భావముతో తినుడు, ఆ ప్రసాదమును

కొంచెముకూడ విడిచిపెట్టవలదు. అప్పుడు ఈ ప్రసాదము వలన మీకు నిస్సంశయముగ లాభము కలుగగలదు.

భండారా అయిన పిమ్మట హుజూరువారు సత్సంగ హాలులోకి దయ చేసిరి. అచ్చట రాత్రి పదునొక్క గంట వరకు సత్సంగ విలాసములు జరుగు చుండెను.

అయిదు శబ్దములు పఠించిన పిదప హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: కొందరు ఆక్షేపకులు సత్సంగము తప్పుడు మార్గమున పోవుచున్నదని తప్పు పట్టుకొనుచున్నారు. ఈ పెద్ద మనుష్యులకు తాము సత్సంగముయొక్క వర్త మానపు నడతను గురించి చేయుచున్న ఆక్షేపణలు పూర్తిగ పొరపాటు అను విషయము తేట పర్చగలుగునట్టి శబ్దమును మీరిప్పుడు తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సుర్తి భరీ అగమ జల గగరీ।
మైం దేఖీ రాధాస్వామీ తేరీ నగరీ॥
(సారబచన్, బచన్ 37 శబ్ద 8)

అటుపిమ్మట ఆంగవాండ్రి ప్రక్కన మాటలగోల యెక్కువయ్యెను. హుజూరువారు, మీరీ సమయములో గోలనుచేసినయెడల రాధాస్వామీ దయా ళురికి మీమీద అప్రసన్నత కలుగగలదని చెప్పివారిని నిశ్శబ్దముచేసిరి. అప్పుడు ఆడవాండ్రిపైన ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి.

దరస గురు మనుఆ క్యోం న ఖిలే ॥ టేక్॥
ప్రీతి బినా కుఛ కాజ న హోఈ।
గురు సతసంగ మేం క్యోం న రలే ॥2॥
( ప్రేమబానీ, భాగ్2, బచన 11 (2), శబ్ద 3)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో స్త్రీలు చేసిన గోలను గురించి స్వామీజీ మహారాజువారి చరణములందును హుజూర్ సాహబ్జీ మహా రాజువారి చరణములందును మనవిచేయబడినది. వారితరపునుండి స్త్రీలకు బోధ కూడ చేయబడినది. ఇప్పుడు స్త్రీలవైపునుండి సమాధానమును తీయుడు. ఈ శబ్దము వచ్చెను.

చరన గహా జగసే హుజ న్యారీ ॥ టేక్॥
ఉమంగ సహిత గురు సన్ముఖ ఆఈ
వచన సునత హియే గులజారీ ॥(1)॥

( ప్రేమబాని, భాగ్ 2, బచన్ 11 (1), శబ్ద 10 )

ఇప్పుడు రాబోవు సంవత్సరము యెట్లుండునను విషయమును గురించి సంత్సంగుల నుద్దేశించి ఒక బహు శ్రేష్ఠమైన శబ్దమును తీయుడని హుజూరు వారు సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చెను.

కాయా నగర మేం ధూమ మచీ హై।
ఖేల రహీం అబ సూరత హోలీ ॥

( సారబచన్, బచన్ 39, శబ్ద 6 )

## 108

23 ఆగష్టు 1943 తేదీని సాయంకాలము సత్సంగములో దివ్యేచ్ఛకు శబ్దమును తీసి చదివిరి.

ఘూంఘట ఖోల చలీ సురత దులహిన।
దులహా శబ్ద మిలా అబ చఢ సున ॥ (1)

( సారబచన్, బచన్ 35, శబ్ద 21 )

పాఠానంతరము హుజూరువారిట్లు సెలవిచ్చిరి; భండారాసమయములో దయచేసి వచ్చియున్న స్వామిజీ మహారాజువారు, హుజూర్ సాహబ్జీ మహారాజువారును ఇప్పుడింకను మనమధ్యనే ఉన్నారా లేక తిరిగి వెడలిపోయిరా? దివ్యేచ్ఛకు శబ్దమును తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

గురు కా మైం దామన పకడా, ఛోడూం నహిం అబ తో జకడా॥

( సారబచన్, బచన్ 37, శబ్ద 12 )

ఇట్లు సెలవిచ్చిరి. నిన్న సత్సంగములో, హుజూర్ స్వామీజీ మహారాజు వారియొక్కయు హుజూరుసాహబ్జీ మహారాజువారియొక్కయు చరణములందు, వారు ఈ సమయమున ఇచ్చటకు దయచేసి రావలయుననియు, తిరిగి వెనుకకు

వెడలి పోవలదనియు ప్రార్థన చేయబడినది. ఆ ప్రార్థనకు సమాధానము ఈ శబ్దములో చాల బాగుగ రాలేదా? మీరు ఈ విషయమును స్పష్టీకరించుటకై మఱొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు. ఈ క్రింది శబ్దమువచ్చినది.

జీవ చితావన ఆయే రాధాస్వామీ
బార బార తిన కరూం ప్రణామీ ॥

( సారబచన్, బచన్ 34, శబ్ద 1 )

హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి: హుజూర్ సాహబ్జీమహారాజు వారు సత్సంగము ఇతరులతో నెప్పుడైనను, పోరాడవలసిన అవసరము వచ్చినయెడల మీలో ప్రాణమునకు తెగించి సత్సంగమునకు తోడువచ్చెడి వారెవరున్నారని ప్రశ్నించిరి. నేనిపుడదే ప్రశ్న మిమ్ములనడుగుచున్నాను. చాలామంది చేతు లెత్తి తమ అంగీకారమును తెలియజర్చిరి.

ఇట్లు సెలవిచ్చిరి: మీరింత యెక్కువమంది చేతులెత్తుటవలన, మీరు హుజూర్ సాహబ్జీ మహారాజువారితో సహకరించగోరుచున్నారని తేటపడుచున్నది. మఱి ఆ దయాళుని సత్సంగ మింకను శైశవావస్థలోనున్నది. అది పిల్లవాడుగను యువకుడుగను పెద్దయై పెరిగిన తర్వాత మానవజాతి కంతకును మీరు ఊహించుకొనలేనంత అధికసేవ చేయగలదని సెలవిచ్చిరి కదా! అట్టి పరిస్థితిలో మీరు దానిని సంరక్షించి, దాని కార్యక్రమములో సకల విధముల సహకరించుటకేల సిద్ధపడుటలేదు? మీరిప్పుడు సహకరించుటకు అంగీకరించని యెడల, కార్యభంగము కాగలదు. హుజూర్ సాహబ్జీ మహారాజువారికి ఆ విషయము తెలియదనుకొనుచున్నారా? వారికి మీలో నెవరెవరు వారి ఆదేశమును పాలించిరో, ఎవరెవరు వారి ఆదేశమును విన్నమీదట తలవంచుకొనిరో, లేక, సత్సంగమునుండి లేచి బయటకు వెడలిపోయిరో తెలియదనుకొనుచున్నారా? మీలో నింతవఱకు కూడ తమ యిండ్లను సభకువశము చేయు విషయమై దరఖాస్తు పెట్టకుండ నుండిపోయిన వారెవరైన నుండినచో వారు చేతు లెత్తి ఆవిషయము ఒప్పుకొన్న యెడల నేను వారిని మహాశూరులని చెప్పెదను. గురుగోవింద సింహ సాహబ్ గారి కాలములో, వారు సిక్కులసంఘము నుండి ఆత్మబలిదానము యివ్వగల భక్తులు అయిదుగురు కావలెనని కోరినపుడు ఆ సంఘములో పెద్ద కోలాహలమయి, కొందరు వెళ్ళి గురువుగారికి పిచ్చియెత్తిన దనియు, ఆయనకు యుక్తాయుక్తములు బోధచేయ వలసినదనియు గురువుగారి

తల్లిగారితో చెప్పుకొనిరి. అయితే మీకిపుడట్లు పిర్యాదు చేసుకొనుట కవకాశము లేదు. మీకు ఇట్టి పూర్వగాథలు విన్నపుడు హృదయములలో ఉత్సాహ సాహసములు ఉప్పొంగినచో మీరు ఇపుడు ఆ విషయముల ననుకరించరేల? అప్పుడు ఆ అయిదుగురి పేర్లను "ప్యారా" ల లిస్టులో చేర్చబడినప్పుడు ఇప్పుడు మీరు హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞలను పాలించినచో మీ పేర్లు వారి "ప్యారా"ల లిస్టులో (అనగా వారియొక్క ప్రియశిష్యుల లిస్టులో) చేర్చబడనేరవా? భగవంతుని ప్రేమించు వారి పేర్లు అన్నియు ఒక లిస్టులోను, భగవంతునిచే ప్రేమించబడు వారల పేర్లు అన్నియు మరొక లిస్టులోను వ్రాసి రెండు లిస్టులు తయారు చేయబడునని మీరు జ్ఞాపకముంచుకొనుడు. ఇప్పుడు మీ పేరు భగవంతుని ప్రేమించు వారి లిస్టులో వ్రాయించుకొనని యెడల భగవంతుడు మిమ్ములను ప్రేమించ వలసివచ్చును. భండారారోజు ఉదయ సత్సంగములో చదివిన వచనములో చెప్పినట్లుగ, సద్గురువు ఎవనినైన పట్టుకొన్నపుడు అట్లు పట్టుకొనుటలో నతనికి కొద్దిగ బాధ కలుగును. ఆ విధముగ నాలోచించుకొన్నపుడు భగవంతుడే మిమ్ముల ప్రేమించవలసి వచ్చినయెడల మీకు కష్టము కలుగును. మీరు ఉదారభావముతో ప్రవర్తించిన యెడల మీకేమియు నష్టముండ నేరదని నా అభిప్రాయము. మనమందరము నీ విషయములో నొండొరులకు ఉత్సాహమును పెంపొందించవలసి యున్నది.

— ౨౯ —

24 ఆగష్టు 1943 తేదీని సాయంకాల సత్సంగములో శబ్ద పాఠానంతరము తేజస్వరూపులగు హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఒక విషయము ఆలోచించవలసి యున్నది. మనకు వినికిడి వలనను, కొన్ని ఉత్తరములను చూచుట వలనను, జనులు చాలమంది భగవంతుని చరణములందును, హుజూర్ సాహబ్జీ మహారాజువారి చరణములందును, వివిధరకములైన ప్రార్థనలను, అనగా తమకొక పిల్లవాని నిప్పించుడని కొందరు, ఆరోగ్య మిప్పించుమని కొందరు, తమ ఉద్యోగములో అభివృద్ధి కల్గించవలయునని కొందరును, ఇత్యాదిగ రెట్టించి రెట్టించి చేసికొనిరని మనకు తెలియునుకదా! అందు పైన ఆదాతాదయాళురు వారందరికిని యుక్తవిధముగ సహాయము చేసిరి. అనగా పిల్లలను, ఆరోగ్యమును, ఉద్యోగాభివృద్ధిని, ఎవరికే సౌకర్యములు

కావలెనో అవి యిచ్చిరికదా! అది నిజముగ నట్లే అయినపుడు, అనగా జీవుల ప్రార్థనలకు సమాధానముగా, ఆ దయాళురు అట్టి యేర్పాట్లు జరిగించినప్పుడు, ఆ సౌకర్యము పూర్తిగ వారిచ్చిన వరదానమే అను విషయమును మనమెన్నడు మరువరాదు. మనము ఆ సౌకర్యము విషయములో మమకారముకాని, బంధనముకాని పెట్టుకొనను కూడదు. ఇప్పుడు దీనినే మరొక దృష్టికోణముతో చూచి పరిశీలించవచ్చును. ఆ దాతా దయాళురు తమరిచ్చిన ఆ ప్రసాదము లేక వరదానము నుండి యేదైన నొకవస్తువును వెనుకకు తీసికొన గోరినయెడల అది తిరిగి యిచ్చివేయుటకు మనమేల బాధపడవలయును. ఇప్పుడీ విషయములో మీ అభిప్రాయము మాకు చెప్పుడు. ఆటలలో నొకమనిషి బంతిని ముందుగ విసరిన పిమ్మటకదా ఆట మొదలు పెట్టును. ఇప్పుడు మేముకూడ ఈ విషయమును మీ యెదుట నదే విధముగ పెట్టితిమి కావున, మీలో నెవరైన నొకరు ఇందును గురించి తన అభిప్రాయమును చెప్ప నారంభించిన యెడల దీనిని గురించిన చర్చ ముందుకు సాగును. ఎవనికైనను ఆ విధముగ వరదానమిచ్చిన యెడల, ఇప్పుడు ఆ దానమును తిరిగి వాపసు చేయుమని వారడిగినపుడు దానిని నిచ్చివేయుటకు సంకోచించుటయు విచారించుటయు నేల? వారు దానిని తిరిగి యిమ్మని అన్నపుడు, అది ఒక మహోద్దేశ్యముతో మన శ్రేయోలాభము నిమిత్తమయ్యే అట్లు చేయుదురుకదా. మీరు బంధనమును త్రెంచుకొని ఆ పదార్థమును విడిచిపెట్టిన యెడల, ఆ దయాళురు ఆ పదార్థమును ముందుకన్న నెక్కుడు పరిమాణములో మీకైన నివ్వవచ్చును, లేదా మీ వద్దనుండి పుచ్చుకొని మరొకరికైన నివ్వవచ్చు ననుటలో వింతయేమున్నది? సేఠ్ నిహాల్ చందు గారు మాకు దీనిలోని మహోద్దేశ్యము తెలియజెప్పి, పిమ్మటనే గృహాములను వాపసు చేయమన్నచో చాల బాగుగ నుండునని యనిరి. అట్లు మీకు ముందు నచ్చచెప్పి తీసికొన్నచో అదేమి తీసుకొనుట యనిపించు కొనును? అని హుజూరువారు సెలవిచ్చిరి. హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞనే మన్నించుటకు సంకోచించు వానికి బోధచేసి ప్రయోజన మేమున్నది? జీవుడు తనంతట తాను బంధనమును తప్పక విడిపించెదరని మీరు తెలిసికొనుడు. అయితే అప్పుడు జీవునికి కొంత కష్టము కలుగును. స్వామీజీ మహారాజు

వారు "ధున ధున ధున డాలూం అబ మన కో" అను శబ్దమును రచించి సత్సంగము ముందు ముందు ఒక కాటన్ మిల్లును కొని నడిపించునని సూచించుచు భవిష్యవాణి చాలకాలము ముందే చెప్పియున్నను, ఆ భవిష్యవాణి పూర్తి యగుటకు ఇంతకాలము గడిచిపోయినది కదా! మహారాజ సాహబ్ వారు సత్సంగములో ఒక బ్యాంకు స్థాపించు విషయమును కాటన్ మిల్లు ప్రారంభించు విషయమును గురించి సెలవిచ్చి ఒక సర్క్యులర్ కూడా అందరకిని పంపించిరి కాని బహుశః ఆ దయాళుని కాలములో ఆ విషయములు పూర్తి చేయించు దివ్యేచ్ఛ లేదు కాబోలు. అవి హుజూరు సాహబ్జీ మహారాజువారి కాలములో పూర్తి చేయవలసివచ్చెను. అట్లే, హుజూర్ సాహబ్జీ మహారాజువారు గృహములను సభకిచ్చివేయు విషయమును గురించి సత్సంగములో సెలవిచ్చిన మాట ఏదో యొక మహోద్దేశ్యముచే కొంత కాలము ఆపుచేయబడినదను కారణముచే ఆ కార్యక్రమమే పూర్తిగ తోసివేయబడినదని అర్థము చెప్పనగునా? అట్లనుకొనుట గొప్ప పొరపాటు. ఆ సమయములో సెలవిచ్చిన విషయమును పూర్తి చేయుటకు యుక్త సమయము ఇప్పుడు వచ్చినదని యేలచెప్పకూడదు? కొందరు తమ జన్మభూమి నుండి తమ్ము తోలివేయుచున్నామని ఆక్షేపించు చున్నారు. అట్లు వారనుకొనుట చాల గొప్ప పొరపాటు. ఈ కార్యక్రమ మంతయు వారిని వారి అసలు జన్మభూమికి గొనిపోవు నిమిత్తమై చేయబడుచున్నది. హుజూర్ సాహబ్జీ మహారాజువారు హుజూర్ సర్కార్ సాహబ్ వారు తమరిని సత్సంగ బాధ్యతను వహించుటకు గాబరా పడవలదనియు, తాము పేరు మాత్రమునకు ఉండిన చాలుననియు, పని అంతయు మేమే స్వయముగ చేసికొందుమనియు తమతో చెప్పిరని మొదటలో 1913 సం॥రము డిసెంబరులో అంబాలాలో సెలవిచ్చిరి. వారేమి సెలవిచ్చిరో నేను కూడ నిపుడు అవే మాటలను మళ్ళీ చెప్పుచున్నానని జ్ఞాపకముంచుకొనుడు. ఈ కార్యమునకు నెపము నా మీదనే అందరు నిస్సందేహముగ వేయుచున్నారు. కాని దీనికి ప్రారంభము వారే స్వయముగ చేసిరని మీరు నమ్ముడు. ఈ విషయమును పూర్తి చేయుటలో మీకేమైన కష్టము కల్గినచో ఆ దోషము నా మీదనే వేయుడు. కాని నేను మాత్రము ఆ దయాళుని ఆజ్ఞ నెన్నటికి మరువజాలను. ఈ ప్రణాళికను అసలు జరిపినందు వలననేదైన లాభము కల్గినయెడల దానికి మెప్పు (Credit) హుజూర్ సాహబ్జీ మహారాజు వారికి ఇండు. హానియేదైన కల్గినయెడల ఆ దోషమును నా పైన పెట్టుడు. నేను ఆ దోషా

రోషణను సంతోషముగ ధరింతును. ఏలనన నీ ప్రస్తుత కార్య క్రమము మంత్రియు హుజూర్ సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞానుసారమే జరుపబడు చున్నది.

---

6 సెప్టెంబరు 1943 తేది సాయంకాల సత్సంగములో ప్రేమపత్ర ద్వితీయ భాగమునుండి 4వ నెంబరు వచనము చదువబడినది. ఆ వచనములో చర్చించిన విషయము "అహంకారము"

వచనానంతరము హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఇపుడు చదివిన వచనములో గృహములు ఆస్తిపాస్తులకును సంబంధించిన బంధనము కూడ చేరియున్నది. హుజూర్ మహారాజువారీ వచనములో నిట్టి బంధనములు స్థిరముగ నున్నంతకాలము పారమార్థికాభివృద్ధి పర్యాప్తరూపమున కలుగనేరదని సెలవిచ్చిరి. కావున సాహబ్జీ మహారాజువారు గృహములను సభకు అప్ప జెప్ప వలయునని సెలవిచ్చిన యే వచనము ననుసరించి ఇచ్చట కొంతకాలము నుండి కార్యక్రమము జరిపించ బడుచున్నదో, ఆ వచనము హుజూర్ మహారాజువారి తాలూకు పై వచనమునకు పూర్తిగ సరిపడియే యున్నది. దీనినిబట్టి ఈ విధమైన బంధనమును ఖండించుట పారమార్థికాభివృద్ధికి అత్యంతావశ్యకమని తేటపడుచున్నది. కావున నీ బంధనమును తప్పక తుంచివేయవలయును. ఇచ్చట కట్టబడిన గృహములలో, ఆ గృహమును మొదట కట్టించుకొన్న వ్యక్తియు, అతని పుత్రులు, పౌత్రులును నివసించ వచ్చునని హుజూరు సాహబ్జీ మహారాజువారు ఎవరితోనైనా చెప్పిన యెడల, అందులో తప్పులేదు. ఏలననగా, అదివారికి సంతోషము కలుగజేయు నిమిత్తమై చెప్పిరి. కావున నది యుక్తమే. సభకు ఇంటిని వశపరచిన పిదప మొదటి వ్యక్తియు అతని పిల్లలు మనుమలును ఆ యింటిలో నెట్లుండ గలరను శంకయే మిమ్ములను ఇప్పుడు బాధించుచున్నది. దీనినిబట్టి హుజూరు రాధాస్వామీ దయాళుని ప్రసన్నతను సంపాదించవలయునను బెంగకు బదులుగ పిల్లలు మనుమలయొక్కయు వసతిని గురించిన బెంగయే మీ మనమున నెక్కువ నాటుకొని యున్నదని ప్రకటమగుచున్నది. కాని పై వచనము యొక్క ప్రారంభములోనే, మనస్సుయొక్క వికారములలో ప్రవర్తించు వారికి రాధాస్వామీ దయాళురు తోడుగనుండరనియు సహాయము చేయ

జాలరనియు, రాధాస్వామీ దయాళుని వచనమైయున్నట్లు వ్రాయబడినది కదా! ఈ మాట నిజమైన ఏగృహము నందైన బంధనము పెట్టుకొనుట యుక్తమని యెట్లు చెప్పగలము? హుజూర్ సాహబ్జీ మహారాజు వారు ఏ సత్సంగితోనైనను ఒక యింటిలో అతడు, అతని పుత్రపౌత్రులును ఉండగలరని చెప్పినచో, ఆ మాట అతనికి సరిగ అవగాహనమైనదా? పునర్జన్మ సిద్ధాంతమును మీరు నమ్ముచున్నారు కదా! అట్లైతే, హుజూర్ సాహబ్జీ మహారాజువారు చెప్పినది మీ పూర్వజన్మకు సంబంధించిన పుత్రపౌత్రులను ఉద్దేశించి చెప్పిరను కొనకూడదా?మహారాజు సాహబ్ వారు డిస్కోర్సెస్ అను గ్రంథములో పునర్జన్మ సిద్ధాంతమును విస్తృతరూపమున వివరించిరి. సాహబ్జీ మహారాజువారు కూడ ఈ విషయమును గురించి చాల సార్లు బోధించిరి. హిందూమత సిద్ధాంతము ప్రకారము గూడ పునర్జన్మ ఒప్పుకొన బడుచున్నది. కావున ఇప్పుడు, ఇచ్చటకు వచ్చియుండగోరుచున్నట్టి మీ పూర్వజన్మ తాలూకు పుత్రపౌత్రులకు మీరేమి ప్రబంధము చేయుచున్నారో మీరే చెప్పుడు. ఈ విధముగ చూచినచో, ప్రస్తుతము గృహముల విషయములో జరిపించబడుచున్న కార్యక్రమమంతయు సరియైనదే అని తోచుట లేదా? గృహబంధనము పెట్టుకొన్న సత్సంగికి రాధాస్వామీ దయాళురు తోడుగనుండరను విషయము జ్ఞాపక ముంచుకొనుడు.



6 సెప్టెంబరు 1943 తేదీ సాయంకాలము దయాల్ భండారులో ఒక ఆరోగ్య వర్ధకమైన దలియాను, యవలు, సజ్జలు, జొన్నలు, పప్పు, బియ్యము, నూనె, కొబ్బరి కురిడి మొదలగు వస్తువులతో బహుస్వాదిష్టముగ తయారు చేసిరి. దానిని సత్సంగములో హుజూరువారికి అర్పించగా, హుజూరువారు దానిని అందరికి నిచ్చి, ఇవ్విధమైన భోజనమును భండారుఘర్ లో పెట్టుటకు ఏర్పాటు చేసినచో మీలో నెవరెవరు ఇంటివద్ద భోజనము చేయుట కట్టిపెట్టి భండాఘర్ లోనే భోజనముచేయుట కిష్ట పడుదురని అందరిని అడిగిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు మనము చూచుచున్న ఘోర కష్ట పరిస్థితులనుబట్టి ఆలోచించగా, బెంగాలు బీహారు రాష్ట్రములలో నీకాలమున వ్యాపించియున్న దురవస్థ వంటి దురవస్థయే యిచ్చటకూడ రేపు రానేరదని యెవరును చెప్పజాలరు. అందుచేత మనమన్ని రకముల భోజనమును తినుటకు అలవాటు చేసుకొనవలయును.

## 2

23 సెప్టెంబరు 1943 తేది సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: కలకత్తానుండి తిరిగి వచ్చునపుడు మేము ఆరా పట్టణములో ఆగుట తటస్థించెను. ఈ మధ్యన కొన్నాళ్ళనుంచి వసతి గృహములను సభకు స్వాధీనము చేయుట విషయములో మీరందరు నిచట జరిపించుచున్న కార్యక్రమమును అచ్చట నొక సోదరుడు చాల హేళనచేయుచు, దయాల్బాగు లోని యిండ్లను సభకు వశముచేసినచో సత్యలోక మెట్లులభించగలదనిఎగతాళిగ మాట్లాడెనని మాకు తెలిసెను. నేనీమాట విన్నప్పుడు, ఆరాపట్టణమునకు మనమొక అతిథి రూపమున వచ్చితిమి కావున, అచ్చటి సోదరుల నెవరిని కూడ నిందజేయుట కాని, ఎవనితోనైన తగాయిదా పెట్టుకొనుట కాని యుక్తము కాదని నిశ్చయించుకొన్నాను. అట్లు సంపూర్ణమైన దృఢనిశ్చయము చేసికొంటిని కాని అచ్చట సత్సంగము చేయుచున్నపుడు ఈ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు వచ్చెను :

చఢీ రీ సఖి అబ అగమ అటారీ
ఖోల దఈ మేరే హియే కీ పిటారీ ॥

(సారబచన్, బచన్ 24, శబ్ద 1)

ఈ శబ్దము అంతయెక్కువ సమయానుకూలముగ నుండి అచ్చటివారికి అందరికి దాని అర్థము చెప్పి విమర్శించిన యెడల చాల లాభదాయకముగ నుండునని తోచినందున, నేను మొదటలో నచ్చటి జనులకెవరికిని వ్యతిరేకముగ మాటలాడవలదని చేసుకొన్న దృఢసంకల్పమును విడిచిపెట్టుట తప్పనిసరియయ్యెను. ఈ శబ్దముయొక్క బోధననుసరించి అసలు విషయమును మీకు అవగాహన చేయు నిమిత్తమై నేను సభకు గృహములను వశపర్చుటను గురించి చెప్పబోయిన యెడల, సాహబ్జీ మహారాజువారే స్వయముగ మిమ్ము మా అనంతరము మా పుత్రపౌత్రులును యీ గృహములలో నివసించవచ్చునని సెలవిచ్చిరికదా! మీరిపుడా యిండ్లను మా వద్దనుండి యెట్లు లాగుకొనెదరని ఆక్షేపణ కొందరు చేయవొడగుదురు. అట్టి మనోవృత్తిగల వారెన్నటికిని సద్గురువుని సంపూర్ణ భక్తులని పేర్కొనబడుట కర్హులు కానేరరు. ఏలనన, సంపూర్ణ రూపమున గురుభక్తి చేయుటకు గుర్వాజ్ఞను పరిపూర్ణముగ పాలించుట యత్యావశ్యకము. దయాల్బాగు కాలనీ రాధా

స్వామీ దయాళుని ఇచ్ఛమీదనే తయారైన యెడలను, సాహబ్జీ మహారాజు వారు సద్గురు రూపమును ధరించియే, సత్సంగులు వేర్వేరు సమయములలో ప్రార్థనచేసి దయాల్బాగులో కట్టించుకొన్న యిండ్లు సత్సంగసొత్తు అయిపో వలయునని సెలవిచ్చిన యెడలను, అట్టి బహుస్పష్టమైన వారి ఆజ్ఞకు విరుద్ధ ముగనుండి, బహు సంఖ్యాకులయిన ఇతర సోదరులతో సహకరించకుండ వెడతోవను బోవువారికీ క్రింది చరణము సరిగ వర్తించకుండునా?

గురు భక్తి బిన తరే న కోఈ। బిన గురు జ్ఞాన పార నహీం హోఈ॥

అట్టివారు, వారి ఆజ్ఞను ఉల్లంఘించుచునే తాము భవసాగరమునుండి తరించి పోగలమని యెట్లాశించగలరు? అట్టివారు పై శబ్దములోను, వచనము లోను చెప్పినట్లు, రాధాస్వామీ దయాళుని ఆజ్ఞోల్లంఘన రూపమైన అప రాధము చేసినట్లగునో కాదో ఇపుడు మీరే చెప్పుడు. నేను ఈమాట దయాల్బాగులో నుండుచు తమ యిండ్లను సభకు ఎట్టి షరతులు కోరకుండ వశము చేయని వారొక్కరికే చెప్పుటలేదు. దయాల్బాగునకు బయట నివసించుచు, దయాల్బాగులో యిండ్లుకలిగి, ఆ యిండ్లను సభకు షరతులు కోరకుండ నెవరు వశము చేయలేదో వారందరికిని గూడ, సాహబ్జీ మహా రాజువారు సెలవిచ్చిన ఆజ్ఞను పాలించుట యత్యావశ్యమనియే చెప్పుచున్నాను. వారు మనకు ఇందువలన నిజమైన మహాలాభమే లేనిచో వారు అట్లేల సెలవిచ్చెదరు?

వారు మనకే విషయము చెప్పినను, లేక వారు కాని, సర్కార్ సాహబ్, హుజూర్ మహరాజ్, స్వామీజీ మహారాజు వార్లు కాని మనకేపని చేయుట కుత్తరు విచ్చినను, అవియెప్పుడు యుక్తముగనేయుండి, మన విశ్వా సమును అనుభవమును కూడ నవియెల్లపుడు మనకు శ్రేయస్కరముగను లాభదాయకముగను ఉన్నట్లే తెల్పుచున్నపుడు, వారు మనకు మరేదైన నుత్తరువు యిచ్చినచో, దాని మహాత్త్వము మన అల్పబుద్ధికి గోచరము కానందున నది మనకు అనుచితముగనే తోచినను కూడ, మనము మన పూర్వానుభవమును బట్టియు, విశ్వాసమునుబట్టియు, ఆ యాజ్ఞ ప్రకారము నడుచుకోవలయుననియె మనస్సునకు బోధపర్చుకొనవలసియున్నది. వారిచ్చిన ప్రతిశాసనము నెల్లపుడు మనకు అభివృద్ధి క్షేమములనే కలుగజేయుచున్నట్లు అనుభవ సిద్ధముగ మనము చూచుచున్నపుడు, ఇటికలు రాళ్లతో కట్టిన ఒక

యింటిపైన మన పేరును చెఱిపివేసి, ఆ యింటిని సభకు వశపర్చినందువలన నష్ట మేమి కలుగును? ఒక యింటి మీద వ్రాసియున్న పేరుగల మనుష్యుని యందు కొందరికి మోహబంధనము లున్నప్పుడు, వారికి ఆ మోహ బంధనము లను తెంచుకొనుట వారికి లాభకర మైనపుడు, ఆ బంధనములను వారేల తెంచు కొనకూడదు? మీ రిపుడు, మీ సొంత విషయమును మరచిపోయి, ఈ విషయమును కేవల సిద్ధాంతరీత్యా పరిశీలించి. మీకీ సిద్ధాంతము సరి యైనదని తోచుచున్నదో లేదో చెప్పవలయునని నా మనవి. అధిక సంఖ్యా కులు చేతులెత్తి తమ అంగీకారమును సూచించిరి. ఇందుకు ప్రతికూలాభి ప్రాయముగల వారిని కూడ తమ భావమును తెల్పవలసినదని హుజూరువారు సెలవిచ్చిరి. కాని యెవరును ప్రతికూలము చెప్పలేదు. చేతులెత్తను లేదు. ఇట్లు సెలవిచ్చిరి. సాహబ్జీ మహారాజువారు గుప్తమైనపుడు మీరు అధీరులై ఓ ప్రభో, మమ్ము గూడ తమతో తీసి కొని పొండు" అని ప్రార్థించ లేదా? ఇచ్చట ఉండి ఈ మాటలు వినుచున్నవారు కూడ ఇంకముందు ఇవ్విధముగ ప్రార్థింపకుందురా? అట్లు మీరు మొఱపెట్టు కొన్నప్పుడు, వారి ఆజ్ఞలను పవిత్రగ్రంథములో వ్రాసివ విషయములను తగు రీతిని పాలించుట కూడ యుక్తము కాదా? హుజూరువారు పై శబ్దములో నీ క్రింది చరణమును రెండవ సారి చదివించిరి.

మైఁ అప్నే సే సబ్ కహ దీనీ
ఆగే సాహబ్ మౌజ అధీనీ (॥105॥)

ఇట్లు సెలవిచ్చిరి. ఈ ప్రశ్న విషయములో నేను మీకు చెప్పవలసిన దంతయు చెప్పివేసితిని. అది మీరు అంగీకరించుటయా లేదా అనునది మీ యిష్టము, "సాహబ్ వారి కేది అంగీకారముండునో, భవిష్యములో అదియే జరుగగలదు" అని సెలవిచ్చి హుజూరు వారీ క్రింది చరణములను మరల చదివించిరి.

నానక ఔర్ కబీర బఖానా, తులసీ సాహబ్ నిజ కర జానా॥
(122)

ఉనకే బానీ పహ పద గావే, సచ్చ ఖండ సత లోక సమావే
(123)

ఇపుడీ శబ్దములో ఆరాలోని ఆక్షేపకుడు చేసిన ఆక్షేపణకు పూర్తియైన సమాధానము వచ్చినదో లేదో మీరే చెప్పుడు. నేను ఆరా పట్టణము వెళ్ళినపుడు, అచ్చటి సోదరులెవరికి మనస్సు బాధకలుగు లాగున యేమియు మాటలాడకూడదని నిశ్చయించు కొంటిని కాని, ఆ శబ్దము అంత సమయానుకూలమై, ప్రస్తుత విషయమున కంత యెక్కువ సహాయకరమై యుండుటచేత నేను నా ప్రతిజ్ఞను మార్చుకొనవలసి వచ్చెను. ఈ శబ్దము నా సంరక్షణార్థమై యుపయోగించు కొనుటకై నా చేతిలో నొకధాలుకాని కత్తిగాని పెట్టినట్లు అనిపించి దీని చరణములకు అర్థము చెప్పనియెడల అచ్చటివారి కానందముగ నుండదని యెంచితిని, అందుచే వివశుడనై నా ప్రతిన విడిచిపెట్టి మాటలాడితిని, నేను మీకు ప్రస్తుతము చెప్పిన మాటల వలన మీలో కొందఱికి మనస్సులో బాధ కలుగవచ్చును, లేదా గుండె గాయపడి యుండవచ్చును, లేదా కొందఱొక చెవినుండి లోనికి తీసికొని రెండవ చెవినుండి బయటకు పోనిచ్చి యుందురు, లేదా తమ హృదయ మస్తిష్కములందు వానిని నిలబెట్టుకొని యుండవచ్చును. నేనీ భాషణమునకై మిమ్ములను క్షమాపణ వేడుచున్నాను. నేను దీనిని నా కర్తవ్యమని యెంచియే ఈ విషయమును గుఱించి మాటలాడితిని.

చివర హుజూరువారు దివ్యేచ్ఛకీ క్రింది శబ్దమును తీయించిరి.:-

చరణ గహ జగ సే హుఇ న్యారీ ॥ టేక్॥
ఉమంగ సహిత గురు సన్ముఖ ఆఈ
వచన సునత హియే గులజారీ ॥1॥

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 11 (1), శబ్ద 10)

దివ్యేచ్ఛకు మఱొక శబ్దమును తీసిరి.

సంత మేం యార పరఘటహై
ఇ ధర ఆఓ యహాం ఢూండో॥

(ప్రేమబిలాస్, శబ్ద 84)

ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములలోని చరణములను మీరే స్వయముగ అవగాహన చేసికొనుడు. అయితే నేనొక్కమాట చెప్పవలసియున్నది. మీరు పావురముల కథ వినయుందురుకదా! ఎన్నియో పావురములు

బియ్యపుగింజల కాశపడి ఒకవేటగాని జాలములో చిక్కు గొని పోయినవి. అవి ఆ జాలము నుండి విడిపించుకొనలేకపోగా, వారి నాయకుడు, మీరొక్కొక్కరే వేలు వేలుగా పాట్లు పడినచో మీకు విడుదలకాదు, అందరు కలిసి ఒక్క పెట్టున పైకి ఎగిరిన యెడల విడుదల కలుగ గలదని వానికి సలహా యిచ్చెను కదా! అన్ని పావురములును కలిసి ఒక్క పెట్టున పైకెగిరినపుడు, వానితో పాటు ఆ వలగూడ పైకివచ్చెను. ఆ వేటకాడు వెల వెల బోయి చూచుచుండెనట. మీవలన నేదైన నొక ఘనకార్యము నెరవేరవలెనన్న యెడల మీరందరును కలిసి పనిచేయ వలయును. ఒక్కొక్కరు ఒక్కొక్క వేరు సమయములో, వేర్వేరు తీరువలుగ పనిసాగించినచో సాఫల్యము చేకూరదు. మీ రందరును కలిసి ఒక ప్రణాళిక ననుసరించి పని చేసినయెడల మీరు కోరిన పరిణామము చేకూరగలదు.

కావున సాహబ్జీ మహారాజువారు గృహముల విషయమై యిచ్చిన ఆదేశము సరియైనదని మీకు రవ్వంతయైన విశ్వాసమున్న యెడల, మరి మీరందరు నేల యేకమై పట్టుపట్టి పనిచేయరు? గృహములన్నియు సభకు స్వాధీనమైన యెడల, సత్సంగముయొక్క భవిష్యమును గురించి మహా ఘన ఫలిత మెద్దియో చేకూరునని చెప్పలేమనియే అనుకొన్ననుకూడ మనము హుజూరు సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞను పాలించితిమనియు సమస్త గృహములు సభయొక్క వశములోనికి వచ్చినవనియు హుజూరు సాహబ్జీ మహారాజు వారు చూచి నిస్సందేహముగ ప్రసన్నత జెందుదురను విషయము మనకు ధైర్యసంతోషములు గల్గించగలదు. అపుడా దయాళురు ఎచట కావలెనన్న నచ్చట నేయింటిలో నైన దయతోదిగి ఉండవచ్చును. కాబట్టి యీ విషయమును సరియైన దృష్టికోణములతో పరిశీలించి తేల్చుకొన వలయునని మీ అందరికిని, మీ ద్వారా బయట దూరముగనున్న సత్సంగులకునుకూడ నేను మనవి చేయుచున్నాను. మీరీ విషయమును తేల్చుకొనుటకు ఒకరోజు, లేదా ఒక మాసము, లేదా యింకా నెక్కువ కాలమైనను కావలెనన్న తీసికొనుడు కాని, అట్లు తేల్చుకొన్న వెంటనే యీ బంధనమును తుంచుకొనవలయును.

---

6 అక్టోబరు 1943 తేదిని సత్సంగములో శబ్దములు పఠించకముందే హుజూరు వారు ప్రేమపత్రి ద్వితీయ భాగములో, గృహములు వగైరా బంధనముల విషయమై చెప్పిన వచనమును చదివించిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : పూర్వపద్ధతి ప్రకారము వచనపాఠము శబ్దపాఠానంతరమే యెప్పుడు చేయబడుచున్నందున శబ్దగానమైన తర్వాతనే వచనమును చదువవలయునను బంధనమొకటి అందరి మనస్సున నేర్పడినది. కాని నే నీ రోజున ఆ పూర్వబంధనమును త్రెంచు నిమిత్తమై ఇప్పుడు వచనమునే ముందు చదివించితిని. ఇప్పుడిక శబ్దముల పాఠము జరుగవచ్చును.

గృహములను సభకు వశముచేయకూడదని నిశ్చయము చేసుకొన్న సోదరులతో నేనిప్పుడు మాటలాడదల్చుకొన్నాను. అట్టివారు దయచేసి చేతు లెత్తుగాక. ఒక్కరుగూడ చేతులెత్తనే లేదు. అపుడు హుజూరు వారిట్లు సెల విచ్చిరి : ఇప్పుడెవరు చేతులెత్తక పోవుటచే, సభ కింతవరకు ఇండ్లను వశపరచ కుండ నున్న వారెవరు నిచ్చట లేరని యైనను చెప్పవలెను. లేదా, మీలో కొంతమంది ఇంతవరకు నీ విషయములో మనస్సున పూర్తిగ నిశ్చయము చేసుకొనలేదని యైనను చెప్పవలసియున్నది. వాస్తవముగ నిచ్చట, గృహ ములను గుఱించి బంధన లేకపోయినను గూడ, నెవరు ఈ విషయములో నిశ్చ యము చేసికొనలేదో అట్టివారు కాని, ఇంతవరకు దీని విషయమై అసలు ఆలోచనయైన చేయనివారు కాని, లేదా ఇంకను ఆలోచన చేయుచునే యున్నవారుకాని, ఎవరున్నను అట్టివారుకూడ చేతులెత్తవలయును. అప్పుడు కూడ నెవరు చేతు లెత్తలేదు.

అప్పుడు తిరిగి ఇట్లు సెలవిచ్చిరి : నేను సత్సంగములో నీ ప్రశ్నను మాటి మాటికి అడుగుచుండుటకు కారణ మేమనగా, ఈ విషయములో, హుజూరు సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞ— ఇంతకుముందు అనేక పర్యాయ ములు కూడ నేను చెప్పియుంటిని— పరిపూర్ణ స్పష్టముగ నున్నది. వారే యీ విషయమును సత్సంగములో ముందుగ పెట్టియుండనిచో, నేను ఆ విషయ మును సత్సంగములో పెట్టుటకు అందరికన్న నెక్కువ వెనుదీయువాడను. నేనీ విషయమును తిరిగితిరిగి సత్సంగములో చెప్పుట మీలో నెవరికైన అనుచితము గను లేక అప్రియముగను తోచినయెడల వారు చేతులెత్తినయెడల నాకు

ఈ విషయము తెలియ గలదు. దయాల్బాగులో ఇండ్లుగల వారు కావచ్చును, లేనివారైనను కావచ్చును. ఎవరైనను కూడ ఈ విషయములో చర్చించదల్చుకొన్నచో లేదా వారి సందేహములను తెలియజెప్ప గోరినచో వారు సంతోషముగ వచ్చి చెప్పుకొనవచ్చును. అందు కేమియు అభ్యంతరము లేదు. అట్లు హుజూరువారు సెలవిచ్చిన పిదపకూడ నెవరును ఈ విషయములో చర్చచేయుటకుగాని సందేహములు తెలియపర్చుటకు గాని లేవ లేదు.

ఇంతవరకు తమ యిండ్లను సభకు స్వాధీనము చేయకుండనున్న వారిచ్చట నిజముగ నుండికూడ నిశ్శబ్దముగా కూర్చుండినచో అందుకు అర్థమేమై యుండవచ్చును? దాని అర్థము వారు తమ యిండ్లలోనివారికి గల సొంత హక్కులను వదలుకొన్నట్లేకాదా? ఇండ్లలో సంపూర్ణ స్వతంత్రి హక్కు గలిగియుండి ఆ హక్కును తాను సభకు ఇంతవరకు వదిలిపెట్టకుండ నున్న వ్యక్తి యెవరైనను ఇచటనుండి మాటిమాటికి మేము ప్రశ్నించి అడుగుచున్నను మాటలాడకుండ కూర్చుండియున్నచో, దానికి అర్థము "మౌనము అర్థాంగీకారమే" అను లోకోక్తి ప్రకారము, అతడు తనకా యింటిలోగల సంపూర్ణస్వతంత్రి హక్కును కండిషన్లు యేమియు పెట్టకుండ సభకు విడచిపెట్టివేసినట్లే చెప్పవలదా? అంతట 2,3 గురు పెద్దమనుష్యులు లేచి, తమ యిండ్లను సభకు వశము చేయుటకు తమ అభ్యంతరములను చెప్పుకొనిరి. వారికి పూర్తిగా ధైర్యము కలుగువిధమున బోధించగా వారు తమ యిండ్లను సభకు స్వాధీనము చేయుట కంగీకరించిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ విషయములో మీరు స్వేచ్ఛగ మీ అభిప్రాయములను చెప్పుకొనుటలో ప్రమాదమేమియు లేదు. మీరు ఈ విషయములో నిస్సంకోచముగ చర్చ సాగించుడు. మీరిచ్చట యిండ్లు కట్టించుకొన్న పిదప వానిలో సర్వాధికారపు హక్కు మీకు గలదని మీరు భావించినప్పుడు ప్రమాదము వచ్చినదికాని ఇప్పుడు ఆ హక్కును సభకు విడిచిపెట్టినందు వలన ఇకముందు లాభము క్షేమమేగాని ప్రమాద ముండదు. ఇందులో గల లాభక్షేమములను తెలియజెప్ప వచ్చును. కాని మేము తరుచుగా నిన్ని సార్లు ప్రశ్నించి అడిగినను ఎవరైతే ఇంతవరకు చేతులెత్తకుండ, తమ కష్టములను, సంశయములను చెప్పుకొనకుండ నుండిపోయిరో, వారి విషయములో వారు తమ సంపూర్ణ స్వతంత్రి హక్కులను వదులుకొని సభకు సంపూర్ణాధి

కారము ఇచ్చివేసి రనెడి పర్యవసానము తేలుచున్నది. అట్టివారిలో నేవ రైన నొక మహావీరుడు లేక ఉదారహృదయుడు కాని తన అభ్యంతరములను సందేహములను ఈ సమయమున తెలియజేసినచో నాకు చాల సంతోష ముగ నుండును. ఏలననగా, నేను అట్టివాని కొఱకై హుజూరు సాహెబ్జీ మహారాజువారి చరణములందు ప్రార్థనజేసి దివ్యేచ్ఛకు శబ్దము తీయించె దను. ఆ శబ్దమున కర్థమేమియగును విషయమును తెల్పుటకు మీకే అధి కార మిత్తును. ఆ శబ్దము నా ప్రార్థనకు ప్రతికూలముగను, గృహముల నివ్వవలదను వారి కనుకూలముగను వచ్చినయెడల నేనీ విషయముపైన నికముందెన్నడు మాటలాడను. లేక ఆ శబ్దము నా పక్షమే పలికినచో, అట్టివారు ఇంక తమ యిండ్లను సభకు యిచ్చివేయుటయే యుక్తము.

నేను పైన చెప్పిన సలహా ప్రకారము చేయుటకు అట్టివారికి ఒప్పన్న మైనచో వారు చేతులెత్తిన యెడల ఆ ప్రకారము చేయించెదను. కాని ఇంత అధికముగ చెప్పి మాటిమాటికి ప్రశ్నించినను వారు మాటలాడకుండ ఊరకొన్నచో భగవంతుడు వారి మీద దయానుగ్రహములు చూపవలయు నని ప్రార్థించుటదప్ప మరేమి చేయగలను. కాని భగవంతుడు దయాను గ్రహములు చేయు పద్ధతులు గూడ చాల విధములుగ నుండునని జ్ఞాపక ముంచుకొనుడు. ఆ దయానుగ్రహములు కాలుని ద్వారా చేయవచ్చును. డాక్టర్ల ద్వారాను చేయవచ్చును. ఈ విధముగనే దయానుగ్రహములు జూపు పద్ధతులు ఇవిగాక ఇంకను మరికొన్ని గూడ ఉన్నవి. దయాల్బాగులోని యిండ్లు సభకిచ్చినందువలన సత్యలోకములో నివాసమెట్లు కల్గునని ఆరాలో ఎగతాళిచేసిన మనుష్యుడు నివసించుచున్న యింటిలో దొంగలుపడి దోచు కొనిపోయిరని మాకు తెలిసి ఖేదపడితిమి. ఆ తర్వాత నతడు ఇంకను రెండు గృహములు మారెను కాని అతడే యింటికి వెళ్ళిన నా యింటిలోనే దొంగలు పడుచు, ఇప్పటికి మూడు నాల్గుసార్లు దొంగతనములు జరిగినవట. ఇంకను ముందేమి కావలసియున్నదో తెలియదు. ఇంతవరకు యిండ్లు సభకు వశము చేయకుండ నున్నవారు ఇచ్చట కూర్చుండి యున్నారని తలంచి వారు చెప్ప దల్చుకొన్న విషయమును వారి తరపున నేనే చెప్పబోవుచున్నాను. వారు చెప్పున దేమనగా, సాహెబ్జీ మహారాజువారు మాకు ఈ యిండ్లను ప్రసా దముగ ఇచ్చిరి కదా, ఇచ్చిన ప్రసాదమును తిరిగి వెనుకకెట్లు తీసుకొనెదరని అనుచున్నారు. దానికి నా సమాధానమిది. మొదటలో ఈ గృహదానముగ

వారు కొద్ది ప్రసాదము నిచ్చిరి కాని వీరల మనస్సులో దానియందు బంధన మేర్పడి, వీరి పారమార్థి కాభివృద్ధికి అది భంగము కలిగించుచున్నందువలన వారు ఇపుడు ఆ బంధనమును తొలిగింప బూనుకొనిరి. కొద్ది రోజులు తరువాత నీ బంధనము నశించిన పిమ్మట మీకు తిరిగి నింతకన్న నెక్కువ, మీరు ఊహించుకొన లేనంత అధికముగ ప్రసాదము నిచ్చెదరు. మీకీ బంధన అట్లే ఉండిపోయి నందువలన నష్టము గలుగకుండ చేయవలయుననియే వారి అభిప్రాయము. అందువలననే వారీ బంధమును తెగగొట్టవలయునని పట్టు పట్టుచున్నారు. హుజూరువారు ఈ విషయముపైన తిరిగి దివ్యేచ్ఛనొక శబ్దము తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

జాంచ కర త్యాగో భోగ అసార్ ॥ టేక్ ॥

మాయా నే సబ్ భోగ రచాయే అమృత సంగ మిలాయా ఖార॥ (1)
జీవ అజాన ఫంసె ఆయ ఇన మేం ఫిర ఫిర బరమేం జాగ కీ లార॥ (2)
బిమల ప్రేమ రస చాఖా చాహో సతగురు సంగ కరో ధర ప్యార॥ (3)
రాధాస్వామీ దీన దయాళ మెహర్ సే సహజ ఉతారేం భవ జల పార॥ (5)

(ప్రేమ బానీ, భాగ్ 2 బచన్ 11 (2) శబ్ద 22)

ఇట్లు సెలవిచ్చిరి:— ఇండ్లు ఇవ్వకుండ నున్నవారి తరపునుండి నేను మాటలాడుచున్నాను కావున, వారి పరిస్థితిని గురించి తెలుపుచున్న యీ శబ్దార్థమును నేను చెప్పుట యుక్తము కాదు. దీని అర్థమును మరెవరైనను చెప్పవలయును. ప్రేమీభాయీ ద్వారకా బాసీగారు దాని అర్థమును చెప్పిరి.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి. నేను మొదటి చరణమున కిట్లు అర్థము చెప్పుదును. దయాల్బాగులోని యిండ్లు మాకు నిజప్రసాదము రూపముగ ఇచ్చిరి. మేం మా ప్రసాదము నెట్లు తిరిగి యిత్తుము అని కొందఱనుచున్నారు కదా, ఈ చరణములో అందు విషయముమై ఇట్లు హితబోధ చేయబడినది. ఏమనగా, మీకు గృహరూపముగ నిచ్చిన ప్రసాదము లేక భోగమును మీరు పరికించుకొని, అది మీ మెడకొక బలవత్తర బంధనమైపోయి మిమ్ములను సత్యవస్తువు నుండి దూరము చేసినదని తెలుసుకొని (ప్రసాదము బంధన

ములను తెగగొట్టును. గృహము బంధనమును బలపర్చును. కావున ఇప్పుడది ప్రసాదమని యెంచబడజాలదు.) భోగానందమును విడిచిపెట్టి విమలమైన ప్రేమానందము యొక్క దానమును తీసికొనుడు అని చెప్పుచున్నది. ఈ విధముగ నీ శబ్దము మేము పైన వివరించిన విషయమునే సమర్థించుచున్నది. ఈ పరిస్థితిలో హుజూర్ సాహబ్జీ మహారాజువారికీ విషయము ప్రియమై యుండగా దీని విషయములో వారు మన కిచ్చిన సలహాకూడ పూర్తిగ యుక్తమై యున్నప్పుడు, నే నీ విషయమును మీకు మాటి మాటికి చెప్పుటయు, ఆ దయాళుని హితబోధ ప్రకారము నడచుకొనుడని మీకు జ్ఞాపకము చేయుటయు సమంజస మగునో కాదో మీరే చెప్పుడు. మీలో నెవరికైనను ఈ పద్ధతి యుక్తము కాదని తోచిన యెడల వారు అట్లు తెల్పగోరెదను. శబ్దము చదువక ముందు ఈ విషయము సరి కాదని అనిపించియు, శబ్దపాఠమైన పిదప ఇప్పుడు నే నీ విషయమును గురించి రెట్టించి చెప్పుట యుక్తమే అని యెవరికైనను తోచిన యడల వారు కూడ చేతులెత్త గోరుదును.

ఇదంతయు చెప్పుటలో నా ఉద్దేశ్యము, మొదటిలో కన్న నిపుడెవరి హృదయములలో నీ విషయములో అభిప్రాయ భేదము కలిగినదో, మేము ప్రస్తుతము గృహముల విషయములో జరుపుచున్న పద్ధతి వారికి నచ్చినట్లున్నదా లేదాయని ప్రశ్నించి తెలుసుకొన వలయుననియే. దయాల్బాగులోని ఇండ్లలో సంపూర్ణ నివాసపు హక్కులు గల్గియున్న వారిలో నెవరైతే రాధాస్వామీ దయాళుని చరణములందు ఈ విషయమును చెప్పుకొని అందు విషయములో వారి ఆజ్ఞను దివ్యేచ్ఛయు నెట్లున్నదో అవగాహన మైన పిమ్మటకూడ వారి హక్కులను సభకు స్వాధీనము చేయుటకు సిద్ధము కాకుండ నుండి వారి మనస్సులోని అభిప్రాయములోకూడ మార్పేమియు గలుగకుండిన వారును, తమ సందేహములను చెప్పుకొనుటకు సావకాశమిచ్చి, ఈ విషయమును గురించి వారి అభిప్రాయమును చెప్పుకొండని అడిగినను కూడ మాటలాడకుండ కూర్చుండిన వారును, ప్రస్తుత కార్యక్రమము వలన కొద్దిగకూడ ప్రభావితము గాకుండ నున్న వారును వీరందరును నా అభిప్రాయములో మృతక సత్సంగులనియే పేర్కొనబడ తగుదురు. కాని సజీవ సత్సంగులని అనిపించుకొన నర్హులు కారు. ఏలననగా వారిలో జీవిత లక్షణమేమియు కనబడుటయే లేదు. మీ వద్దనుండి మీ గృహమును బలాత్కారముగ నెవరు లాగుకొనిన నపుడు మీరు మీ అభిప్రాయమును

చెప్పుకొనుట కేల భయపడెదరు? ఈ విషయమును హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణములవద్ద పెట్టి దివ్యేచ్ఛకు శబ్దముతీసి ఆ దయాళుని ఆజ్ఞ యెట్లున్నదో తెలిసికొనుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది :

పరఖ కర ఛోడో మాయా ధార ॥ టేక్ ॥

భోగన కా ఇన జాల బిఛాయా జీవ బహే సబ్ ఇన కీ లార్ ॥ (1)
బిన సతగురు కోఇ బచన న పావే ఉన కీ ఓటా గహో సమ్హార ॥ (2)
సత్సంగ కర ధారో ఉన ధ్యానా హిర దే మేం ఉన రూప నిహార॥ (3)
రాధాస్వామీ చరణ అబ హియే బసాఓ మెహర్ సే లేవేం జీవ ఉబార ॥ (5)

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 11 (2), శబ్ద 24)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దముయొక్క భావార్థమును బట్టి రాధాస్వామీ దయాళురు అట్టి సత్సంగులకు వారి అపమార్గమును తెలియజేయుచు మరొకసారి హెచ్చరించు చున్నారని తెలియుచున్నది. కావున నేను నా ప్రథమ విన్నపమును తిరిగి హుజూరు సాహబ్జీ మహారాజు వారి చరణములవద్ద చెప్పుకొని, వారి దివ్యేచ్ఛను మనకందరికి తెలియజేయుడని ప్రార్థించెదను. నేనిందు విషయములో మీరు ఆ దయాళుని మీకు దర్శన మనుగ్రహించి, దర్శనమిచ్చినపుడు వారి దివ్యేచ్ఛ యిండ్ల విషయములో నెట్లున్నదో తెలియజేయుడని వారి చరణములందు ప్రార్థన చేయుడని మీకొకసారి సలహా చెప్పియుంటిని. కాని వారు రాత్రివేళ స్వప్నములో దర్శన మిచ్చినపుడు పొరపాట్లు అనుమానములును గలుగుట కవకాశమున్నది. ఒకటి, ఆ దయాళురు అంధకార సమయములో దర్శన మిచ్చుటకు వచ్చును కావున మీరున్న చీకటిగదిలో చీకటిగ నున్నదని చూచి, వారు మరొక వెలుతురు గదిలోనికి దయచేయవచ్చును. అప్పుడా మనిషికి దర్శనము లభించక పోవును. లేదా దర్శనాభిలాషి చీకటిలో మరొకరి నెవరనోచూచి, ఆయనయే హుజూర్ సాహబ్జీ మహారాజువారని తప్పుటభిప్రాయము పడ వచ్చును. మూడవదిది ఆదర్శన మిచ్చినపుడు వారు ఏమి సెలవిచ్చిరో మనకు తెల్పుటకు మరొక సాక్షి ఉండడుగనుక, మనకు ఆ విషయమును గురించి యదార్థముగ నేమిజరిగినదో తెలుసుకొనుటకు వీలుండదు. ఆ దర్శనము చేసుకొను మనిషి ఆ సమయములో నన్ను బిలిచినయెడల నేను అప్పుడేమి

సంభాషణ జరిగెనో, వారేమి ఆజ్ఞయిచ్చిరో మీకు వచ్చి చెప్పగలను. అందుచే (అనగా యీ పొరపాట్లు, అనుమానములును లేకుండు నిమిత్తమై) ఉత్తమపద్ధతి యేమనగా ఈనాడిప్పుడే, ఇచ్చట వెల్తురుగ నున్నదికావున, హుజూరు సాహబ్జీ మహారాజువారి పెద్దఫొటో మన కెదురుగా నున్నందున, నీ విషయమును వారి చరణములవద్ద చెప్పుకొందము. అటు పిమ్మట హుజూరు వారు సత్సంగహాలులో ఎలక్ట్రిక్ బల్బుల నన్నిటిని వెలిగించుడని ఆనతిచ్చి, ఈ సమయములో మితవ్యయ పరామర్శ దాతమాట మరచిపోయి దీపములను విరివిగ వెలిగించుడని సెలవిచ్చిరి. వెంటనే సత్సంగ పెండాలు అంతయు దేదీప్యమానముగ నైపోయెను. అప్పుడు తిరిగి వారిట్లు సెలవిచ్చిరి. "హే సాహబ్జీ మహారాజ్! ఈ రోజున మామూలుకన్న హెచ్చుగ సత్సంగ హాలులో దీపములను వెలిగించితిమి. తమకు చిన్నచిన్న చీకటి గదులలోనికి వెళ్ళుట కష్టముగ నుండెనేని, ఏ సత్సంగ పెండాలులో తాము చాలయేండ్లు విరాజిల్లి తమ గద్యపద్యాత్మక ప్రవచనములచే భక్తుల నానందపర వశులను చేయుచుండిరో, అట్టి దీప ప్రకాశముతో తనరారు చున్న యీ విశాల విస్తృతమైన హాలులోనికి తాము దయచేసి వచ్చి తమ రిదివటిలో చెప్పుచుండిన విధముగనే, గృహములకు సంబంధించిన ఈ కఠిన సమస్యను మాకు విశదమగునట్లు పరిష్కరింపుడు. ఆ తర్వాత హుజూరువారు, సాహబ్జీ మహారాజువారి ఆజ్ఞను మనకు బోధపర్చునట్టి శబ్ద దివ్యేచ్ఛకు తీయుడనిమును సెలవిచ్చిరి: ఈ క్రింది శబ్దము వచ్చెను.

మాన మదీ త్యాగ కరో గురు సంగ్ ॥ టేక్ ॥

జబ్ లగ సజనీ మాన న త్యాగో, తబ్ లగ రహో తుమ తంగ్॥ (1)

కర్మ భర్మ జబ లగ నహీం ఛూటే నహీం ధారో గురు రంగ్ (2)

వైర ఈర్షా నిత్త సతావే కరత రహో తుమ సబ సే జంగ్॥ (3)

యా తే కహనా మాన పియారి, సీఖో భక్తీ ఢంగ్॥ న ॥ (4)

గురుభక్తీ కీ రీతి సమాలో , ధున మేం సురత లగా ఓ ఉమంగ॥ (6)

రాధాస్వామీ మెహర సే సురత చడావేం, హోయఁ కర్మ సబ్ భంగ్॥ (8)

((ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 11 (1), శబ్ద 3)

ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో, అహంకారమును విడిచిపెట్టి సద్గురువు యొక్క సాంగత్యము చేయుమని హితోపదేశము చేసిరి. మీరు కర్మలు, భ్రమలను విడిచిపెట్టనంత కాలము సద్గురువుని రంగు, (అనగా సద్గురువు నందు ప్రేమ) మీపైన నెక్కదు. అంతకాలము మీరు ఇక్కట్లకు లోనై యుండి పోవుదురు. ఈ శబ్దములో "సజనీ" అనియు "ఆప్" అనియు పిలుపులు గృహముల బంధనము గలవారి నుద్దేశించబడినవి. దీని తాత్పర్య మేమనగా, వీరు ఈ బంధనమును అహంభావమును పూర్తిగ విడుచు వరకు, నేను ఈ బంధనమును విచ్ఛిత్తి చేసికొనుడని మాటి మాటికి చెప్పుచుండుట వారికి బాధ పెట్టుచున్నట్లే అనిపించి వారి మనస్సునకు వ్యాకులము కలుగ జేయును.

ఇట్లు సెలవిచ్చిరి: దీని తర్వాత చరణమును సమస్త సోదరులును జాగ్రత్తగ చెవియొగ్గి వినుడు.

"యాతే కహనా మాన పియారీ, సీఖో భక్తీ ఢంగ"

ఈ చరణములో చెప్పిన "భక్తీ ఢంగ్" అనగ నెట్టిది? "భక్తీఢంగ్" అనగా, సాహబ్జీ మహారాజువారు మిమ్ములను ఈవల ప్రక్కకు వెళ్లు మన్నప్పుడు మీరు ఆవలి ప్రక్కకు పోవుటకాదు; తగ్గించి భోజనము చేయుడు అని సెలవిచ్చినపుడు సేవకుడు మామూలు కన్న నెక్కువగ మెక్కుటయు కాదు; లేదా సేవకుడు తన మనస్సునకు తోచినట్లే చేయుటకు తనకు స్వతంత్రమివ్వ వలసినదని కోరుటయు కాదు; తన మనస్సున కిష్టము లేని పని చెప్పినప్పుడు "హుజూరు మీతో నాకేమియు సంబంధము లేద"ని చెప్పుచు ఆ ఆజ్ఞను అతిక్రమించుటయును కాదు. అట్లు వారితో తనకు సంబంధము లేనట్లు చెప్పినచో అది అసత్యము కూడ పలికినట్లు అగును. ఏలననగా, జీవుడు వారితో సంబంధము త్రెంచుకొన్నను, సద్గురువు అట్లు త్రెంచనేరరు. భక్తియనగా వారేమి సెలవిచ్చిన నాయాజ్ఞను పాలించుటయే.

ఈ విషయమై మఱొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి.

ఆజ తుమ చేత కరో గురు సంగ, ధార లేవ హియరే భక్తీ ఢంగ్॥ (1)
చతురతా అప్నీ దేవ బిసార। దీనతా సాంచీ లేవ సంభార॥ (2)
అరే మన సాంచీ జియరే జాన సమఝు తేరీ కినకే మాహిం రహాన (4)

గురూ గతి అగమ అపార అనామ । బుద్ధి సే కైసే కోఇ పతియామ॥ (౮)

[ప్రేమ బిలాస్, శబ్ద 81 ]

పాఠానంతర మిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దముయొక్క తాత్పర్యమును వేఱుగ వివరించి చెప్పనవసర మే లేదు. ఈ శబ్దముద్వారా మనకు బోధ పర్చిన ఆదేశ మేమనగా, "నీవు భక్తిరీతి నవలంబించుము. కుర్చీమీద కూర్చుండిన పురుషుని వద్దకు దీనత్వముతో వెళ్ళుము" అనియే. కాని ఇందలి కష్టమెద్దియనగ, మనస్సు ఈ శిక్షను స్వీకరించనొల్లదు. ఇప్పుడు నీవు నడుచు కొనుచున్న ప్రవర్తనయు, పద్ధతియు భక్తిరీతి కాదు. ఇందులో అహంకారము కలిసియున్నది. కావున నీ పద్ధతిని విడిచిపెట్టి భక్తిరీతి నవలంభించ వలయును. మూడు రోజుల క్రిత మిచ్చటికి వచ్చియున్న ఒక సత్సంగేతరుని హుజూరువారు ఈ విషయమును గుఱించి ఆయనయొక్క అభిప్రాయమును చెప్పుమనిరి. ఆయన గృహములను సభకు వశపర్చు ప్రబంధమును చాల మెచ్చుకొనిరి.

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : దయాల్బాగు వచ్చి మూడురోజులు మాత్రమే యిచ్చట నుండుట తటస్థించినను, ఇచ్చటి పద్ధతులను కార్యక్రమ విధానమును తక్షణమే మెచ్చుకొను వారు కొందఱు ఒకప్రక్కన కనిపించుచు న్నారు మరొకప్రక్కన చూడగా 15,16 సంవత్సరముల కాలము ఇచ్చటనే నివ సించియు మఱికొందరు తమబంధనములు భావములలో నెట్టిమార్పు కలుగకుండ యథాప్రకారము అట్లే యుండిపోవుచున్నారు. ఈ యిఱువిధముల వారిలో భక్తి చేయగలవారెవరు ఎవరి ఆత్మలకు సద్గురుని రంగు అంటగలదు, భవసాగ రమును దాటి పోగల వారెవరని చెప్పవచ్చును? ఒక ప్రక్కన, రెండు మూడు రోజులు మాత్రమిచ్చట నున్నంతనే తమ అభిప్రాయములు, భావము లలోను ప్రియ పరివర్తనము కల్గిపోవుచున్నది. రెండవప్రక్కన ఇచ్చటనే 15, 16 వర్షములనుండి నివసించుచున్న వారు మరికొందరున్నారు. కాని వారి హృదయములలో భక్తిమార్గమున నడుచుకొను నిమిత్త మొకించుక యైనను చలనమే కానరాకున్నది. ఇట్టి పరిస్థితిలో అట్టివారు ఇంత కాలము నుండి చేయుచుండిన పారమార్థిక కార్యక్రమ మంతయు వ్యర్థమనియు, వారు విన్నట్టి వచనములు పవిత్రగ్రంథములు కూడ నిరర్థకమే అనియు చెప్పిన నది ఘోరపాటు కానేరదు. మీరు ముందరకు వచ్చి వారి శంకలను మూకు తెలియు

జేసి చర్చించినయెడల నెంత చక్కగనుండును? వారట్లు చేసినయెడల, దాని పరిణామము వారికిని, మాకు నుభయులకు లాభదాయకముగ నుండును. ఏలననగా, ఒక నదిలో మునిగిపోవుచున్న భూమిని, కష్టపడి పనిచేసి తిరిగి ఫలవంతము చేయవచ్చును కదా! సముద్రములో మునిగి పోవుచున్న ఓడలుగూడ శ్రమపడి గట్టి ప్రయత్నము చేసి బయటకు తీసికొని రాబడ గలవు. అటులనే యీ సజ్జనులు మాతో సహకరించిన యెడల శ్రేయస్కర మైన పరిణామము సేకూరగలదు. పిమ్మట నొక శబ్దమును దివ్యేచ్ఛకు తీసి చదివిరి :-

సురతియా ప్రేమ సహిత అబ కరతీ గురు సతసంగ ॥ (1)
బాలీ భోలీ సరనా ఆఈ ధార గరీదీ అంగ॥ (2)
రాధాస్వామీ నామ సుమిరతీ హిత సే మన కీ శోక తరంగ॥ (3)
సతసంగ బచన ధారతీ హియమేం హోవత సంశయ భంగ ॥ (4)
రాధాస్వామీ దయాళ మెహర సే అపనీ మోహిం సిఖాయా
భక్తి ఢంగ ॥ (7)

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 10 (2), శబ్ద 72)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దమును విన్న మీాదట ఆశాకిర ణములు ఉత్పన్నమగు చున్నట్లు కనిపించుచున్నది. వీరికి ఈనాడు కానిచో రేపుకాని, రేపుకానిచో ఆ మరునాడైనను, సుమతి తప్పక కలుగగలదని ప్రతీతి కలుగుచున్నది. ఇపుడున్న ప్రశ్న ఒక్క వ్యవధిని గురించి మాత్రమే కాని త్వరలోనే భగవంతుడు వీరు ఈ విషయముయొక్క మహత్త్వమును వాస్తవత్వమును తెలుసుకొని, సంతోషముగ తమ యిండ్లను సభకు వశపర్చు లాగున వీరికి జ్ఞానోదయము కలిగించగలడు. వీరి భ్రమలు సంశయములును నశించ నారంభించినవనియు, వీరి మనస్సులుకూడ దినదినము నిర్మలమగు చున్నవనియు, రాధాస్వామీ దయాళురు వీరికి భక్తిరీతిని మహాదయతో నేర్పుచున్నారనియు నీ శబ్దము చెప్పుచున్నది. ఈ శబ్దము నిస్సందేహముగ ఉత్సాహ వర్ధకమై యున్నది. కావున ఇట్టి సోదరులకు శుభ పరివర్తన కలిగి శ్రేయస్సు కలుగ గలదను ఆశ పొడము చున్నది.

-- 4 --

7 అక్టోబరు 1943 తేది సాయంకాలము సత్సంగములో తేజఃస్వరూపు లయిన హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఉత్తమ లోకముల ఆత్మలిచ్చట సత్సంగములోనికి వచ్చుటకై నిరీక్షించు చున్నవనియు, వారికి యోగ్యమైన వాతావరణము నిచ్చట తయారు చేయవలసి యున్నదనియు, హుజూరు సాహబ్జీ మహారాజువారు 3,4 సార్లు సత్సంగములో సెలవిచ్చిరను విషయము మీలో చాలమందికి జ్ఞాపకముండి యుండును. ఈ మాట వారన్నట్లు జ్ఞాపకమున్నవారు దయచేసి చేతులెత్త గోరెదను. చాలమంది చేతులెత్తి ఆ విషయమును సమర్థించిరి.

ఇట్లు సెలవిచ్చిరి : సాహబ్జీ మహారాజువారి యీ వచనము మీకు జ్ఞాపకమున్నపుడు, మీరిపుడు మీ గుండెమీద చేయి పెట్టుకొని, ఆ దయాళుని యీ ఆజ్ఞను పాలించు నిమిత్తమై మీరేమి చేసిరో నిజముగ చెప్పుడు. హుజూరువారు, ఈ విషయము ముఖ్యముగ స్త్రీలకు సంబంధించినది కావున సాహబ్జీ మహారాజువారి యీ ఆజ్ఞను పాలించు సందర్భములో మీరేమి చేసిరని, స్త్రీలను ప్రత్యేకించి ప్రశ్నించిరి.

మీరు కేకలువేయుచు గోలచేయుట తగ్గించు కొనిరా? మీ పిల్లలకు బుద్ధిగను శాంతముగను కూర్చుండుట నేర్పిరా? ఇప్పుడు మీ పిల్లలు చేయు చున్నగోల అల్లరికేకల వలన మీరట్లు నేర్పలేదని సూచించ బడుచున్నది కదా! అట్లైనచో, మీ మధ్యకు ఉన్నత లోకముల ఆత్మలెట్లు రాగలవో మీరే చెప్పుడు. దీనినిబట్టి మీకు ఊరక వచనములను వినుటయందు మాత్రమే ఆసక్తి యున్నదికాని, ఆ వచనాను సారము నడచుకొనుట విషయములో శ్రద్ధలేదని స్పష్ట పడుచున్నది. సాలుకు, లేదా నెలకుగాని, భండారా సమయములలో గాని దర్శనము లభించవలెనను కోరికను మీలో యెవరైతే పెట్టుకొన్నారో, వారే తామీ యాజ్ఞను పాలించు నిమిత్తమై యేమి ప్రయత్నము చేసిరో చెప్పగోరుచున్నాను. ఏ స్త్రీలు వచనములు చదువుకొనుచు, తమకు సాహబ్జీ మహారాజువారు రోజునకు ఒకటి రెండు సార్లు దర్శనమిచ్చుచున్నారని చెప్పుచున్నారో, నే నిపుడీ ప్రశ్న వారినే అడుగుచున్నాను. వారు కటాక్షించి మాకీ ప్రశ్నకు సమాధానము చెప్ప గోరుదును. ఈ విషయమును ఇపుడు మీ ముందర పెట్టితిని. మీరు ఇందును

గుఱించి మీ అభిప్రాయములను తెల్పినచో చర్చముందుకు సాగును. ఒక సత్సంగిని తాను రాధాస్వామీ దయాళునికి ఉన్నత లోకముల ఆత్మల నిచ్చుటకు పంపించు లాగున కటాక్షించ గోరుచూ తరుచు ప్రార్థన చేయుచున్నానని చెప్పెను. ఇట్లు సెలవిచ్చిరి. అసలేమియు చేయక నూరకుండుట కన్న నే కొంచమైనను చేయుట మెఱుగే కాని ఆ ప్రకారము పని జరిగించుట కూడ అవసరము. మనము ఇట్టి మహావచనముల నొక సమయములో పూర్తిగ మరచిపోయి ఆ వచనములను వినవలెనను బంధనము కూడ మన చిత్తమున లేకుండ నుంటిమను కొనుడు. కాని అట్లున్నను, మన కార్యక్రమ మంతయు వారి దివ్య వచనములలోని ఆ దేశానుసారముగనే మనము జరిగించు చుంటిమను కొనుడు. అప్పుడు ఈ ఉభయ పరిస్థితులలో నెద్ది శ్రేష్టమో మీరే చెప్పుడు. నా మతములో మనకేమైన వచనములు జ్ఞాపకమున్నను లేకపోయినను కూడ, మనము మనసా వాచా కర్మణా పరమార్థ విరుద్ధమైన కృత్యమెద్దియు చేయకూడదు. అట్లు కావలెనన్నప్పుడు, మన స్వభావమే, మనము చేసెడి ప్రతి కృత్యమును అప్రయత్నముగ వారి ఆజ్ఞల ననుసరించి జరిగిపోవు చుండునట్లుగ మారిపోవలసి యున్నది. మీ రెట్లు చేసుకొన్న నదంతయు మీ యిష్టములో నున్నది. మీకు రెండు పద్ధతులలో నెద్ది యుక్తమని తోచిన నట్లే నడుచుకొనుడు. పిమ్మట నీ పద్ధతి నాచరించి నందువలన మీ కెట్టి ఫలితము గల్గునో చూచుకొనుడు.

## --5

29 అక్టోబరు 1943 తేదీ సాయంకాలము సత్సంగములో నీ క్రింది శబ్దమొక్కటే పఠించిరి.

"హే విద్యా తూ బడీ అవిద్యా సంతన కీ తైం కదర న జానీ"1

(సారబచన్, బచన్ 24, శబ్ద 3)

పాఠానంతరము హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దమును దివ్యేచ్ఛకు తీయలేదుకాని ప్రస్తుత విషయమునకు ఇది చాల సహాయకరముగ నున్నది. "గృహమును సభకు స్వాధీనపర్చినచో సత్యలోకమెట్లు లభించును" అని ప్రశ్నించిన ఆరాపట్టణపు సోదరుడు 2, 3 రోజుల క్రితము ఆగ్రావచ్చి

నట్లు తెలిసినది. ఆయన అస్సిటికన్న ముందు, 1915వ సంవత్సరములో సాహబ్జీ మహారాజువారు మకాము చేసిన మార్టిన్ కోఠికి వెళ్ళెనట. ఆ తర్వాత ఇచ్చటి సోదరుడొకరితో కలుసుకొని, "మీ యిల్లు సభకు వెడలి పోయినది. మరి దయాల్బాగులో పొలములలో సస్యపు కోతలు, గడ్డిపీకుటయు కాల్వలు బాగుచేయుటయు తప్ప, పరమార్థమునకు రూపురేఖలే లేకుండ పోయినదికదా! ఇంతకన్న మీరు జోదపురము నాతో వచ్చి అచ్చట అసలైన పరమార్థ లాభమును పొందినచో మెఱుగుగ నుండును" అని చెప్పెనట. నా అభిప్రాయములో నతడొక్క సోదరుని మాత్రమేగాక దయాల్బాగు నివాసుల నందరిని జోదపురము రమ్మని పిలువవలసినది. అచ్చట అంతమందికి ఉండుటకు చోటు ఉన్నదా అని ఆయనను అడగవలయును. ఈ సందర్భమును గురించి హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును దీయించిరి.

దయాలా మోహిం లీజై తారీ।

(ప్రేమబానీ, భాగ్ 2, బచన్ 11 (3), శబ్ద 4)

దయాల్బాగులోని వారందఱు సత్సంగము కొఱకై జోదపురము వెడలిపోయినచో, దయాల్బాగు పూర్తిగ ఖాలీ అయిపోవుననియు, అట్టితరుణములో తనయొక్కయు తన గురువుయొక్కయు, దయాల్బాగులో ప్రవేశించవలయు ననెడి పురాణ వాంఛ యీడేరుటకు మంచి సావకాశము కలుగునని బహుశా ఆయన ఆలోచించుకొని యుండును. అయినను ఆ పరిస్థితిలో మిగిలిన యిండ్లన్నియు ఖాలీగనే యుండినను, తేజ్‌పుంజ్ గృహము మాత్రమింకను అడ్డువచ్చుననియు, ఖాలీ కానేరదనియు, ఆయనకు తెలిసియే యుండవలసినది. భగవంతుని సేవయను భావముతో నిచ్చట జనులు చేయుచున్న గడ్డి పీకుటయు, కాలవలు బాగుచేయుటయు మొదలగు పనులను తప్పుడు పనులని యీ పెద్ద మనుష్యు లనుకొనుచున్నారు. ఈ పనులన్నియు సేవాభావముతో చేయుచున్నప్పుడు, ఆ సేవకూడ రాధాస్వామీ దయాళు రొక్కరికనియేగాక, వారి భక్తులను, ప్రేమీ జీవులకు, మానవ మాత్రులందఱికి నుద్దేశించి, కాదు, అంతియకాక, తమ బాధలను చెప్పుకొనజాలని నోరులేని పశువులకు గూడ ఉద్దేశించి చేయబడుచున్నప్పుడు, అవి చెడ్డపను లెట్లగును? ఇచ్చటనున్న స్త్రీ పురుషులు బాలురును కలిసి కష్టపడి తమ సమయమును వెచ్చించి యిచ్చటి పశువులకు ఆహార ప్రబంధమును చేయు

దర్ద దుఖీ మైం బిరహిన భారీ।
దర్శన కీ మోహిం ప్యాస ఘనేరీ॥ 1.

నిర్ధన నిర్బల కోధిన మానీ।
మైం గున ఆప్నే అబ్ పహిచానీ॥ 4.

స్వామీ దీన దయాళ్ హమారే।
మోసీ అధమ కో లీన్హా ఉబారే॥ 5,

(సారబచన్, బచన్ 27, శబ్ద 2 )

హుజూరు వారీ శబ్దము మీ భావములను సరిగ ప్రకటించు చున్నదాయని ప్రశ్నించిరి. ఈ శబ్దములో నా పరిస్థితి సంపూర్ణముగ వివరించ బడినదని జడ్జిగారు సమాధానము చెప్పిరి.

ఇందులో ఏ చరణము మీ పరిస్థితికి పూర్తిగ సరిగ వర్తించు చున్నది అని హుజూరువారు అడిగిరి. ఈ క్రింది చరణము అని సమాధానము చెప్పిరి :

మైం జిద్దిన దమ దమ హఠ కరతీ
మాజ హుకుమ మేం చిత నహిం ధరతీ॥

నేను చాలదూరమున పడియుంటిని. కావున నీ క్రింది చరణము కూడ నాకు సరిగ వర్తించు చున్నదని కూడ చెప్పిరి.

దర్ద దుఖీ మైం బిరహిన భారీ॥
దర్శనకీ మోహిం ప్యాస కరారీ॥

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు విరోధముతో నున్న రెండవ పార్టీని గురించి ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు. ఈక్రింది శబ్దము వచ్చెను.

గురు కరో మెహర కీ దృష్టి దాస పల పల దుఖ పావత॥
మైం ఆరత కరూం బినాయ రోగ సబహీ ఘట జావత॥

(సారబచన, బచన 33, శబ్ద 8:

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము ఆ పార్టీ వారి దశను వర్ణించుచున్నది. వారు మహా దుఃఖములలోను ఆపత్తులలోను చిక్కుకొని వ్యాకుల చిత్తులై యున్నారు. తమ మనస్సులయొక్క అవగుణములు పాపములను తల్చుకొని వారు చాల గాబరాపడి పోవుచున్నారు. కామక్రోధములు ప్రబలమై వారిని అణగద్రొక్కి వేయుచున్నవి. కాలుడు వారిని భ్రమింపచేయు చున్నాడు. ఆ పాట్లలోపడి వారు కొట్టుకొనుచున్నారు. అందుచే వారు ఆకాల క్లేశములనుండి త్వరితముగ విముక్తి కావలెనని ప్రార్థన చేయు చున్నారు. సమస్త మానవకోటికిని ఉన్నతి శ్రేయస్సులు గల్గునట్లు ప్రార్థన గల శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చెను :

కరూఁ ఆరతీ నానా బిధి సే, దేఖో స్వామీ మెహర బెహాద సే॥

(సారబచన, బచన 35, శబ్ద 1)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములో ఆ దయాళురు సమస్త సృష్టి మీదను అపారమైన దయా కటాక్షములు చూపవలయునని ప్రార్థన చేయుచు ఆరతి చేయఁబడుచున్నది. ఆ ఆరతి చేయుటకూడ, ఒకటి, రెండు, మూడు విధములుగను మాత్రమే చేయబడుటలేదు, వివిధానేక పద్ధతులుగ చేయబడుచున్నది. అందేదైన నొకవిధమైన ఆరతి మూలముననైనను వారు సుప్రసన్నులయి, వారి దయాదృష్టి ప్రపంచము మీదికి తిరిగి యీ ప్రపంచములోని జీవుల కష్టములు నశించగలవను ఆశ పెట్టుకొంటిమి.

## 123

ప్రేమీభాయీ మురళీ ధరముద్గలుగారు కలకత్తాలో క్షామపీడితులకు సహాయముచేసి వెనుకకు తిరిగివచ్చిరి. హుజూరువా రాయనను "మీరు వెళ్ళుటకుముందు, మీకు బెంగాలులో నేమియు నిబ్బంది కలుగకుండ వలయు నని చేసికొన్న ప్రార్థన పూర్తిగా యీడేరినదా" అని ప్రశ్నించిరి. ముద్గలు గారు తనకు కష్టమేమియు గలుగ లేదని చెప్పి హుజూరు రాధాస్వామీ దయాళురి కనేక ధన్యవాదములు చేయుచు, తనకు అడుగడుగునను భగవత్స హాయము సేకూరుచుండెననియు, కార్యమంతయు సఫలముగ నెరవేర్చినదనియు మనవి చేసుకొనిరి.

హుజూరువారు ఆయనను గురించి దివ్యేచ్ఛకు శబ్దమును తీయించగా యీ క్రింది శబ్దము వచ్చెను.

సురతియా న్హాయ రహీ హంసన సంగ సరవర తీర్ ॥

(ప్రేమబానీ, భాగ 2, బచన 10 (2), శబ్ద 125)

హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి : బుద్ధిలుగారితో కలిసి ప్రేమీ భాయీ ధన్నాసింహ, ప్రే. భా. హుకుమ్ సింహ కూడ కలకత్తా వెళ్ళిరికదా వారల నిమిత్తమైకూడా ఒక శబ్దమును తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చెను.

సురతియా హంస హంస గావత నిత్త,
గురూ కీ ఆరత ప్రేమ భరీ ॥టేక్॥

(ప్రేమబిలాస, శబ్ద 90)

సేవ యెవరి కొఱకు చేయబడినదో అట్టివారి నిమిత్తము కూడ ఒక శబ్దము తీయుడని హుజూరువారు ఆనతిచ్చిరి.

సతగురు మేరీ సునో పుకార,
మైం టేరత బారుం బార ॥

(సారబచన, బచన 33, శబ్ద 9)

హుజూరువారు ఈ శబ్దము వారల విషయములో బహుయుక్తముగ నున్నదని సెలవిచ్చిరి. బట్టలు రూపాయలు వగైరా సహాయము చేసి సేవచేసిన వారి విషయములో దివ్యేచ్ఛకొఱక శబ్దమును తీయుడు. క్రింది శబ్దము వచ్చెను.

కాతిక మాస పాంచవాఁ చలా।
సురత శబ్ద గురుచేలా మిలా॥

(సారబచన, బచన 38, కాతిక మాస పాంచవాః)

బట్టలుకొని కుట్టి తయారుచేసి, బెంగాలు క్షామ పీడితులకు పంపించిన స్త్రీల విషయములో కూడ, ఒక శబ్దమును తీయుడు. క్రిఁది శబ్దము వచ్చెను.

గురు ప్రేమ బఢా అబ్ మన మేం।
సుర్త లగీ జాయ చరనన మేం॥

(ప్రేమబానీ, భాగ్ 1, బచన్ 7 (1), శబ్ద 29)

## 7

26 డిసెంబరు 1943 తేది అపరాహ్ణమున తేజఃస్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి:- మీ ప్రాంతము లన్నిటినిలోను వేలు వేలుగా రాధాస్వామీ ఛారిటబుల్ సొసైటీ మీటింగులు జరుగుట చూచినపుడు నాకు హుజూర్ సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చిన మాట జ్ఞాపకము వచ్చుచున్నది. అదేమనగా, వారు సత్సంగము యొక్క వృక్షములు బయల్దేరుటకే తాము విత్తనములను నాటితిమనియు, ఆ బీజములు ముందు ముందు మొక్కలు మొలచి పెద్ద పెద్ద వృక్షములుగ నైపో గలవనియు వారు సెలవిచ్చిరి. ఇప్పుడా బీజములు అన్ని స్థలములలోను ఈ సొసైటీల రూపమున మొక్కలు మొలుచుచున్నవి. కాన, మన మందఱము కనులార ఆ వచనము పూర్తి అగుటను చూచుచున్నాము. ఇప్పుడీ మొక్కలు పెరిగి పెద్ద వృక్షముల రూపము ధరింపగలవు. ఇంక ముందు ముందు ఈ వృక్షముల నుండి మరెన్ని మొలకలు బయల్దేరునో మీరు ఆలోచించుకొనుడు.

## 8

26 డిసెంబరు 1943 సాయంకాలము, సివిల్ మేరేజ్ ఆక్టు ప్రకారము ఆనాడు మధ్యాహ్నము పెండ్లిండు చేసుకొన్న ఆరుగురు మగపిల్లలు ఆడపిల్లలను, సత్సంగములోనికి వచ్చిరి. అందరు వధూవరులకును హుజూరువారు పుష్ప హారములనిచ్చి ప్లేట్లలో ప్రసాదము పెట్టి యిచ్చిరి. అప్పుడీ క్రింది శబ్దమును దివ్యేచ్ఛకు తీసి చదివిరి.

సాహబ్ ఇతనీ బినతీ మోరీ, లాగ రహే దృఢ డోరీ।

(ప్రేమబిలాస్, శబ్ద3)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ బినతి ఈ ఆరుగురు మగపిల్లలు ఆడపిల్లల తరఫునను చదువబడినది. వీరు రాధాస్వామీ దయాళుని తమ కెల్లప్పుడు తోడుగ నుండవలయునని, అనగా, తమకు సత్సంగముతో సంబంధము ఎడతెగకుండ నెల్లప్పుడు నుండవలయునని ప్రార్థించుచున్నారు.

ఈ సందర్భములో, మీరొక విషయమును, అనగా మీరే స్వయముగ నీ సంబంధ సూత్రమును తెగింపుకొనకుండ నుండిరేని, మీకు

సత్సంగముతో సంబంధ మెడతెగ కుండనట్లే యుండిపోవునను విషయమును జ్ఞాపక ముంచుకొనుడు. మీ తరఫున నీ ప్రార్థన చేయుటయు, మీ హృదయములలో సత్సంగముతో నెడబాటు లేకుండ సంబంధము స్థిరముగ నుంచుకొనవలయునను అభిలాషను తృష్ణమః చేయుటయును ఒక మహోత్తమ పవిత్ర విషయము. ఇందుతోపాటు మరొక ప్రార్థన కూడ, అనగా యీ ఆడ మగపిల్లల మధ్యన ఇప్పుడే క్రొత్తగనే యేర్పడిన సంబంధము చాల బాగుగ స్థిరమై యుండు లాగునను వీరలమధ్య నెన్నటికి అప్రియ పరిస్థితి కలుగకుండునట్లును చేయువలయునని కూడ, రాధాస్వామీ దయాళుని చరణములందు చేయవలయును.

— — ౯

27 డిసెంబరు 1943 ఉదయము ఆరతి అయిన పిదప హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఈ రోజు హుజూర్ మహారాజు వారి భండారా కదా! హుజూర్ మహారాజువారు హుజూర్ స్వామీజీ మహారాజు వారిని సమస్త జగత్తున కుద్ధారము కలుగజేయవలయునని ప్రార్థన చేసిరని మీకు తెలిసియున్నది. స్వామీజీ మహారాజువారు జగత్తు నుద్ధారము గావించుటకై యే ప్రపంచమునకు విచ్చేసిరి. స్వామీజీ మహారాజువారు తమను సేవచేయు సావకాశమును హుజూరు మహారాజువారికి అనుగ్రహించిరి. వారును సంపూర్ణోత్సాహముతో సేవచేసి, మనకందరకు అనుకరణార్థమై గురుభక్తి గురుసేవలయొక్క ఉచ్చతమైన ఉదాహరణనుచూపిరి. ఈ సంఘమును రాధాస్వామీ దయాళురు సమస్త ప్రపంచమునకును సమస్త జీవులకును సేవచేయు నిమిత్తమై యెంచుకొనిరని హుజూరు సాహబ్జీ మహారాజువారు ఘోషించిరను విషయము కూడ మీకు బాగుగ జ్ఞాపకముండియుండును. కావున నిపుడు రాధాస్వామీ దయాళుని మహనీయ రాజసభ యొక్క స్తంభ రూపమున నున్న మనసుందరమును, పై మూడు విషయములను దృష్టిలోనుంచుకొని, మనకు ఆ దయాళుని ఆజ్ఞలనిగాని, వారి దివ్య కార్యమనికాని, లేదా వారి ఘోషణయని కాని బోధపడియున్నట్టి విషయములను గురించి, ఆ దయాళుని చరణకమలములవద్ద నొక ప్రార్థన, అనగా, ఆ దాతా దయాళురు సత్సంగ సంఘమునకు వారి ఆజ్ఞలను, దివ్యకార్యమును, ఘోషణను పూర్తిగ పాలించి అమలులో పెట్టగల శక్తి సామర్థ్యములను

యోగ్యతను అనుగ్రహించవలయునని ప్రార్థన చేయుటయే మనకు యుక్తమును మనయోగ్యతకు అనురూపముగను ఉండునని తేటపడుచున్నది. సత్సంఘసంఘీయులందఱికి నా దయాళురు జగత్తంతకును సేవచేయుటకు తగిన సాహసోత్సాహములను ఇచ్చి అట్టి అవకాశమును కూడ అనుగ్రహించి మనచే మహా ఘనపరిమాణములో నట్టి సేవచేయించుకొనుగాక! ఏయే సమయములలో నెట్టి అవసరమైన సేవచేయవలసి యున్నను, లేక నే స్థలమున సేవచేయవలసినట్లు వారి దివ్యేచ్ఛయు ఆదేశము నున్నను, ఆ ఆదేశము, దివ్యేచ్ఛ, అవసరముల ననుసరించియే మా చేత సేవ చేయించుకొన ప్రార్థించుచున్నాము. మన మందరము నా ప్రకారము సేవచేయుటకు సిద్ధముగ నుండవలయును. మేము సేవ ఒక ప్రత్యేకవిధముగ మాకు నచ్చినట్లే చేసెదముకాని మఱొక విధముగ చేయజాల మనియెడి తిరుగుపాటు తలంపు మనసున నొక నిమేషకాలము కూడ నుత్పన్నము గాకూడదు.

## 2

30 డిసెంబరు 1943 వ తేది ఉదయ సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ సంవత్సరము త్వరలో సమాప్తమై పోవనున్నది. ఇప్పుడు ఈ రోజు, రేపును రెండు రోజులు మాత్రమే ఈ సంవత్సరమునకు మిగిలి యున్నవి. ఈ యేడు పూర్తి యగుటకు ముందే మీరీ సంవత్సరమంతయు జరిపించిన కార్యకలాపమును పరిశీలన చేసుకొని, మీరు సద్గురువునకు, సత్సంగమునకు, సంఘమునకు, మానవజాతికంతకును ఏమి సేవ జేయగల్గితో చూచుకొనుడు. మీరు ఈ యేడు ఎంతసామాను కొన్నారో, ఎంత అమ్మకము చేసిరో, మీకీ సంవత్సరము ఆర్డర్లు కావలసినన్ని వచ్చినవో లేదో అను విషయములను గుఱించి కూడ మఱొకసారి పరిశీలించుకొనుడు. ఈ యేడు మీకు కావలసినన్ని ఆర్డర్లు రానియెడల మీరు రేపటి నుండియు ఆర్డర్ల మొత్తములను హెచ్చించుటకు ప్రయత్నించుడు. ఎవనికైనను మీరు బాకీ పడియున్నచో, ఆ బాకీ వెంటనే తీర్చివేయుడు. మృత్యువు హఠాత్తుగా వచ్చిన యెడల ఈ అప్పు తీర్చుటకై మీరు తిరిగి జన్మ మెత్తవలసిన అవసరము గలుగకుండ చూచుకొనుడు, రాబోవు సంవత్సరముయొక్క మీ కార్య ప్రణాళికను ఇప్పటినుండియు తయారు చేసుకొనవలయును. వచ్చెడి సంవత్సరములో రాధాస్వామీ దయాళురికి, సత్సంగమునకు, సంఘమునకు, మానవజాతికిని

యేమి సేవలు, యెంత పరిమాణములో చేయగలరో నిశ్చయించుకోన వల యును. ఆగామి వర్షములో మీరెంత సామానుకొనగలరో ఎంత అమ్మ గలరో కూడ తేల్చుకొనవలయును. మీరు చారిటబిల్ సొసైటీల కెంతయివ్వగలరు? అభిప్రాయమేమనగా మీరు మీ పరివారమునకు మీ సంస్థలకును ఏయే సేవలు ఎంతెంత చేయగలరు అనెడి విషయములను గురించి ప్రోగ్రాము అంతయు ఇప్పటినుండియు తయారు చేసుకొనవలయును, ప్రేమప్రచారక్ యొక్క గత పత్రికలో మొదటి పేజీలో "స్వార్థ ఔర్ పరమార్థ" అను విషయమును గురించి వ్రాసిన అభి ప్రాయములతో నేను పూర్తిగ ఏకీభవించుచున్నాను. కాని మీరు స్వార్థ పరమార్థముల మధ్యన విభజనచేయు గీతను గీయదల్చుకొన్న యెడల అది చాలా కష్టసాధ్యము. ఏలనన, మీరు చేయునట్టి యేకృత్యమునకు గాని. మీకు ఈ ప్రపంచముతో సంబంధించిన యేపదార్థమునకుగాని, స్వార్థవిషయ మని కాని, పరమార్థ విషయమని కాని నామకరణము చేయుట, దాని విషయ ములో మీ మనస్సున నెట్టి యుద్దేశ్యము, నెట్టి తలంపునున్నదో అందుపైన నాధారపడియుండును. మీరే యుద్దేశ్యము లేక ఆదర్శముతో నేదేని పని చేయుచున్నారో, ఆ యుద్దేశ్యము లేక ఆదర్శము మీదనే అది స్వార్థమా పర మార్థమాయను ప్రశ్నకు సమాధానము తేల్చవలసియుండును. పైకిచూడగనే దేనిపని పూర్తిగా స్వార్థవిషయముగనే కనిపించుచున్నను గూడ, అది మన పరమ పూజ్యాచార్యులైన స్వామీజీ మహారాజువారు కాని, లేక హుజూర్ మహారాజువారు, మహారాజుసాహెబ్ వారు, సర్కార్‌సాహెబ్, హుజూర్ సాహెబ్జీ మహారాజు వార్లలో నెవరియొక్క ఆజ్ఞనైనను పాలనచేయు సందర్భ ములో జరిగించబడిన యెడల, ఆ పని పారమార్థికమే అగును దాని ఫలితము గూడ పరమార్థమే అగును.

## 2

31 డిసెంబరు 1943 ఉదయము సత్సంగములో దివ్యేచ్ఛ కొరకు శబ్దము తీయబడినది.

గురు ప్యారే కే సంగ చలో ఘర కీ ఓర ॥ టేక్ ॥

ఇస నగర మేం సుఖ నహీం చైనా, భాగ చలో సబ బంధన తోడ ॥(1)

జగ జీవన కీ ప్రీతి హై కాంచీ, తూ సతగురుసే నాతా జోడ॥ (2)
వో హీ హైం సచ్చే హితకారీ, వో హీ హైం తేరే బందీ ఛోడ॥ (3)
రాధాస్వామీ మేహర సే జాయ భౌ పారా,
కాల కరమ కా మాథా ఫోడ ॥ (5)

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 24 )

ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో జీవునికి జగత్తుయొక్క బంధనములను తెగ్రించుకొని, ఈ దుఃఖపూరితమైన దేశమును విడిచిపెట్టి, సద్గురువుతో కూడ వెడలిపొమ్మని హితబోధ చేయబడినది. ఈ రోజు 31 డిసెంబరు. ఈ సాలునకు ఆఖరిరోజు కావున నెవన్నికైనను అక్కౌంటు తేల్చు విషయములో గాని, సేవలోకాని, తన కర్తవ్యపాలన విషయములోగాని యేమైనను చేయవలసినది ఉండిపోయిన యెడల ఆ పని ఈ రోజురాత్రి 11 గంటల లోపున పూర్తిచేసుకొనవలయును. ఉదాహరణకై ఎవరైతే ఇంతవఱకు తమయిండ్లను సభకు స్వాధీనము చెయ్యకుండ ఆ బంధనమును తెంపుకొనలేక, సత్సంగ ప్రోగ్రాములో కలిసిరాకుండ ప్రవర్తించుచున్నారో, వారి కీ శబ్దము సరిగ వర్తించును. దయాళ్బాగులోని యిండ్లవిషయములో నే సత్సంగియు సంతకము చేయుట అవసరమే లేదని కూడ నేను మీకు తెలియజేయుచున్నాను. ఈనాడు రాత్రి 11 గంటలలోపున ఈ పెద్ద మనుష్యులందఱును తమ సకల విధములైన అక్కౌంట్లు లెక్క తేల్చికొన వలయుననియు, సకల బంధనములను విచ్ఛిత్తి చేసికొన వలయుననియు నేను అనేక విధముల సలహా యిచ్చుచున్నాను. సాక్షాత్తు రాధాస్వామీ దయాళునికే, తమ నిజాంశమైన సురతు (ఆత్మ)ల యెడల దయాకటాక్షము లనెడి బంధన మున్నందువలన వారు స్వయముగ నిచ్చటికిదిగి రావలసి వచ్చిన అవసరముగలిగినపుడు మీకెవరికైనను అక్కౌంటు బాకీ ఎంత స్వల్పపరిమాణములో నైనను తీర్చకుండ మిగిలిపోయిన యెడల, మీరు రాధాస్వామి ధామము జేరుకొనుట విషయము అట్లుండనిండు, మార్గ మధ్యములోనే కాలకర్మముల శక్తులు మిమ్ములను క్రిందికి త్రోసి వేయగలవను విషయము మీరు తెలిసికొనుడు. రాధాస్వామీ దయాళుని మహాశక్తి తనకు విరుద్ధమైన పదార్థములను మహా తీవ్ర వేగముతో క్రిందికి త్రోసివేయును. కావున వీరందఱును అధికాధికత్వరితముగ భారరహితులుగనైపోయి అనుక్షణము నిచ్చటనుండి ప్రయాణమై వెడలిపోవుటకు సిద్ధముగ నుండవలయును.

# 122

29 జనవరి 1944 సాయంకాల సత్సంగములో హుజూరు వారిట్లు సెల విచ్చిరి: భండారాసమయములలో బయటనుండి చాలమంది సత్సంగులు ఇచ్చటకు వచ్చుచుందురు. దయాల్బాగులో కూడ జనాభా యెక్కువగనే యున్నది. కావున నట్టి సమయములలో సంబంధములు సులువుగ నిశ్చయము చేసికొన వీలగును. అంతకుముందే సంబంధ నిశ్చయమై పోయిన పక్షములో ఈ సమయమందు వివాహ కార్యక్రమము జరిపించుకొన వచ్చును. మీరు నా సలహాను అంగీకరించినయెడల ఆ కార్యక్రమమిట్లు జరిగించ గోరెదను. మొదటిరోజున వివాహనిశ్చయమై రెండవరోజుననే వివాహకార్యము జరిగించవలయును. సంబంధము పూర్తిగ నిశ్చయము అయిన పిదప మీ అందరి అనుజ్ఞతో నీ దాసుడు వధూవరు లిరువురికిని తిలకము పెట్టును. ఇట్లు జరిగినయెడల అందరికి నెక్కువ సౌకర్యముగను సౌఖ్యముగను ఉండును. వివాహ పంచాయతీ యొక్క క్రితము సమావేశములో తమ పేర్ల నేకారణము వలననైన వ్రాయించుకొనుటకు వీలుగాక ఉండిపోయిన మగపిల్లలు ఆడపిల్లలును చాలమంది యిప్పుడిచ్చట నుండియుందురు. వారు ఇప్పుడు తమ పేర్లను వ్రాయించుకొన వచ్చును. మొట్టమొదట మాటలాడుకొని నిశ్చయము చేసికొనవలయుననియు, ఆ తర్వాత వధూవరులకు తిలకము పెట్టుట జరుగుననియు నేను పైన చెప్పియుంటిని కదా. వివాహ సమస్య విషయములో ప్రెసిడెంటు గారు ఒక క్రొత్తమార్పు చేయదల్చుకొన్నారు. ఏమనగా డాక్టరుగారి సలహా తీసికొని సెక్రెటరీగారు వధూవరు లిరువురికిని, వారిరువురును తమ స్వాస్థ్యమును గూర్చియు, వయస్సును గూర్చియు అవసరమైన వివరములు వ్రాసి తెలుపు నిమిత్తమై, ఒక అచ్చు ఫారమును (కాగితమును) ఇవ్వవలయును.

వివాహసమస్య విషయమే గాకుండ, మరొక ప్రస్తావముగూడ మీతో చేయదల్చుకొన్నాను. దయాల్బాగు మెడికల్ రిలీఫ్ సొసయిటీ, పాట్నా యొక్క ప్రెసిడెంటుగారు బహుకృపాళురు. శరణాశ్రమ ఆసుపత్రి మెటర్నిటీ వార్డులో జేరునట్టి ప్రసవస్త్రీల ప్రవేశ నియమములలో అట్టి స్త్రీల కెక్కువ సౌకర్యములు గలిగించునట్లుగ మార్పులు చేయవలయునని ఆయన హృదయమున కొన్నిరోజుల నుండి ఉత్కంఠ గలుగుచున్నట్లు వినికిడి

వచ్చినది. ఇప్పుడు ప్రసవస్త్రీలు యిచ్చుట్లకు నిర్ణయించిన చందా డబ్బు అధికముగ నుండుటచేత కాబోలు, చాలమంది నిర్ధనజనులు తమ యింటి ఆడవాండ్రను ప్రసవమునకై మెటర్నిటీ వార్డులో ప్రవేశపెట్టుట లేదు. అందుచే వారి అభిప్రాయము మెటర్నిటీ వార్డులో జేరిన స్త్రీలు అచ్చట నియమములను పూర్తిగ అనుసరించిన యెడల వారివ్వ వలసిన చందా తగ్గించి సగము చేయువలయునని యున్నది. ప్రస్తుతము రూ 40 లు చందా జమకట్టవలసి యున్నది. అందులో సగము మొత్తము వారు ఆ వార్డు నియమములను పూర్తిగ పాటించినచో, వారికి తిరిగి యిచ్చివేయబడును. మిగత రూ 20 లును చందాల పద్దులో జమకట్టెదరు. కాని ఇప్పుడు క్రొత్త నియమముల ప్రకారము రూ 40 లకు బదులు రూ 20 లు మాత్రమే తీసికొని, అందులో తిరిగి రూ 10 లు ఆ నియమములను పాలించు షరతుకు లోబడి నడచుకొన్న యెడల ప్రసవానంతరము ఆ స్త్రీకి వాపసు చేయబడును. ఇట్లు రూ 10 లు మాత్రమే చందా యిచ్చినట్లు అగును. ప్రెసిడెంటుగారు ప్రవేశపెట్టిన యీ క్రొత్త సౌకర్యము వలన మీరందరు లాభము దీసికొన గలరని ఆశించుచున్నాను.

ఆ తర్వాత హుజూరువారు వివాహకార్యమును ఒక్క తిలకము మాత్రముతో పూర్తిచేసిన నెట్లుండునను విషయముపైన అందరి అభిప్రాయమును అడిగిరి. పురుషులలో చాలమంది అందుకు అంగీకారము ప్రకటించిరికాని స్త్రీలలో అధికసంఖ్య ఇందుకు అంగీకరించ లేదు. హుజూరువారు, జనులు ఇంక నిందుకు తయారుగ లేరని సెలవిచ్చిరి. ఇట్టి సంస్కరణ కింకను సమయము బహుశః రాలేదు కాబోలు. అందుచే దీనిని ఇప్పుడు ఆపు చేయుదము. దీని తర్వాత ఆడ వాండ్రనొక శబ్దముతీసి చదువుమనిరి. ఈ క్రింది శబ్దము వచ్చెను.

మన సోచ సమఝు రే భాఈ, తేరే హిత కీ కహూం బుఝాఈ॥

(ప్రేమబిలాస్, శబ్ద 125)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము ఆడవారి తరపునుండి చదవబడినది కదా! ఈ శబ్దమును బట్టి వీరి కార్యము, ఇదే ప్రస్తావ ప్రకారము నడుచు

కొన్ని యెడల నెరవేరగలదని తేటపడు చున్నది. నేనీ విషయమును ఒక సంభాషణ సందర్భములో మీకు చెప్పితిని. కాని ఈ సమయములో వచ్చిన శబ్దముయొక్క సూచనను బట్టి చూడగా, ఈ విషయము ఒక మహాత్త్వ పూర్ణమైన వచన రూపమును ధరించుచున్నది. మాటలనేకదా వచన మని అందురు. అల్పమానవుని మాటలను సాధారణముగ మాటలు అని అందురుకాని గొప్ప మానవుల మాటలను సమ్మాన పూర్వకముగ వచనమని చెప్పుదురు. వచన మను శబ్దము విషయములో జనులకు చాల భ్రమాత్మకబుద్ధి యున్నది. వచనము అనగ మాట కాదని యెక్కడ వ్రాసియున్నది? ఏ శబ్దకోశములో చూచినను ఇందుకు వ్యతిరేకమైన అర్థమును చెప్పలేదు. వచనము చెప్పుట యనగా కేవలము సంభాషించుట యొక్కటే కాదుకూడ. చూడవలసినదే మనగా ఎవరైనను ఏ విషయము గురించియైనను మాట్లాడుచున్నపుడు అతని యుద్దేశ్యము జనులకు అభివృద్ధియు శ్రేయస్సును కల్గించవలయుననియా కాదా అను విషయము నాలోచించ వలయును. “ఉధార్” అను మాటకు రెండర్థములున్నవి. (1) మీరు అర్థము చేసుకొనుచున్నట్లు (2) బిజినెస్ సెక్రిటరీగారి అర్థము ఇంకొకటి. కాని ఇచ్చట మాత్రము అంతయు నగదు వ్యాపారమే. ఈ శబ్దములో ఒక ప్రక్కనుండి అందరును సేవ, ప్రేమ ప్రీతులు, దీనత, అధీనతా లక్షణములు ధరించవలసిన దనియు, రెండవప్రక్క నుండి అందుకు బహుమానముగ వారి పడవ గట్టున జేరుననియు చెప్పబడు చున్నది. మీతో మేము, మీ సంతానముయొక్క ఆరోగ్యమును జాగ్రత్తగ చూచుకొనుడని కాని, లేదా పిల్లలను సత్సంగము యొక్క విద్యాలయములలోజేర్పించి చదివించుడని కాని, లేదా మీ బాలురను సంతోషప్రదమై పచ్చగనున్న లాన్ మీదనున్న నర్సరీ స్కూలులో జేర్చి, అచ్చట ఆట పాటలలో పాల్గొననిండని కాని, లేదా వారిని మురికి సందు గొందులలోను, బూడిద బురదలలో తిరగనివ్వవద్దని కాని, లేదా మీకు జబ్బులు లేకుండుటకై, మన డెయిరీలోని వెన్న పాలు ఉపయోగించుడని కాని, లేదా, భండారా సమయములలో మీ ఆడ మగపిల్లలకు వివాహ ప్రధానకార్యము చేసికొని, ఆపై భండారాకి పెండ్లి చేసుకొనుడని కాని, చెప్పినపుడు, అవన్నియు మీ లాభము మీ శ్రేయస్సు కొరకే గదా చెప్పుచున్నది! మీరు ఆలోచించుకొని చూచుకొన్న యడల, మేము మీకేమి చెప్పినను అది మీకే గాక బయటవారికి గూడ లాభదాయకముగ నుండగలదని మీకు బోధపడ గలదు. నిస్సంశయముగ నీ మాట ఢొక్కపు బేరముగాని అప్పు బేరము

కాను. ఒక చేతితో ఖరీదు కట్టివేయుడు, రెండవ చేతితో వస్తువును తీసికొని పొందు. అనగా మేము చెప్పిన విషయమును అంగీకరించుడు, మీకు దానిలో గల లాభము వెంటనే చేతికి లభించిపోవును. మీకు "ఉధార్ కా సౌదా" అనగా "అప్పు బేరమే" కావలెనన్న యెడల మరణ సమయము వరకు దానికొరకై వేచియుండవలయును. మీ ఋణము మరణ సమయమునకైనను తీరిపోయి అప్పుడు మీకు దర్శనము లభ్యమైనచో దర్శనము చేసికొనుడు. అంతవరకు మీరు ప్రతీక్షించుచునే యుండి పోవలసి యుండును. కాని ఇచ్చట బేరము రొక్కపు బేరమే. అసలైన రొక్కపు బేరమనగా నెత్తిమీద నెక్కి చేయునదే. హుజూరువారు మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించగా, ఈ క్రింది శబ్దము వచ్చినది.

హోలీ ఖేలన ఆయే సతగురు జగ మేం
హిల మిల కే అబ సరన పడో రీ ॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16, శబ్ద 9)

ఇట్లు సెలవిచ్చిరి. రాయసాహబ్ గారు నాతో వచనము చెప్పుమని యెన్నియోసార్లు చెప్పిరి కాని వారికి, "మీరు నాకన్న పెద్దలుకదా కావున తమరే వచనము సెలవిడని నేను సమాధానము చెప్పుచుంటిని. నేను తక్కువ వయసు గలవాడను కాబట్టి నేను మాటలే చెప్పుదును కాని వచనము చెప్పను. కాని ఒక చిన్న మాటవలన గూఢ కార్యము సాగిపోగలదని యిప్పుడు తెలిసినది. నా వలన నేదైన మాట మీరు వినగోరినచో, నేనది మీకు చెప్పుదును. మీకు వచనము వినవలెనని యున్న యెడల నా మీద అట్టి ఆశ పెట్టుకొనవలదు. ఈ శబ్దములో గూడ వచన శ్రవణమును గురించియు, కలిసి మెలిసి శరణు పొందుటను గూర్చియు వర్ణన యున్నది. ఒకసారి రాత్రి అంతయు పూర్తిగ సత్సంగము జరుగుచునే యుండెను. ఆ రాత్రి బహుశః 47 శబ్దములు దివ్యేచ్ఛకు తీసి చదవబడినవి. ప్రతి శబ్దము చదువుటకు ముందుగ అనేక భిన్న భిన్న విషయములను గురించి కొద్ది మాటలు జరుగుచుండెడివి. ఏ విషయము పైన మాటలు జరిగినవో అదే విషయముపైన దివ్యేచ్ఛా శబ్దములు తీయించబడుచుండెను. శబ్దము లన్నియు బహు సమయానుకూలముగను, విషయమునకు ఉపయుక్తముగను వచ్చుచుండెడివి. ఆ రాత్రి సత్సంగములోనుండిన వారు నేను

చెప్పిన పై విషయమును సమర్థించెదరు, మిస్టర్ కృపలానీగారు కూడ ఆ రాత్రి సత్సంగములో నుండిరి. ఆయనకు, ఆ రాత్రి శబ్దపాఠము, ఆయన తన పరివార సమేతముగ ఆ రాత్రి అంతయు అచ్చటనే ఆగిపోవునంత మహాప్రియముగ నుండెను. ఆయన, "ఆ రాత్రి మీకు ఈ ఘట్టములో (Plane) గాక, మరొక ఉన్నత ఘట్టమున (Higher plane) నుండి మాటలాడుచున్నట్లు అనిపించినది. ఆ రాత్రి సత్సంగము నా మీద మహా ప్రభావము గల్గించిన" దని నాతో చెప్పదొడగెను. నేను ఇట్లు చెప్పుటలో నా అభిప్రాయమేమనగా, ఏమాటయైనను ఇతరుల లాభము శ్రేయస్సును మనమున నుంచుకొని మాటలాడినపుడు ఆ మాట వచనముల శ్రేణిలోనికి వచ్చును. వచనము, మాటలు అను శబ్దములకు అర్థము ఒక్కటేకాని వేరు వేరు అర్థములు లేవు. పిమ్మట దివ్యేచ్ఛకు ఒకశబ్దమును తీసి చదివిరి :

జగత బిచ భూల పడీ, జివ కైసే కే ఉతరే పార్।
మన మాయా కా జూర ఘనేరా, జీవ నిబల కస కరేం సమ్హార్॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 13 (5), శబ్ద 6)

## 29

29 జనవరి 1944 రాత్రి సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: మీలో నెవరెవరు స్వామీజీ మహారాజువారిని వసంత పంచమీ దినమున ఇచ్చటకు దయచేయగోరుచు వారి చరణములందు ప్రార్థన చేసిరి? (కొద్దిమంది మాత్రమే చేతులెత్తిరి.) ఇట్లు సెలవిచ్చిరి : సరే ఇపుడు రేపు వసంత పంచమీ సుదినమున స్వామీజీ మహారాజువారు ఇచ్చటకు దయచేయవలయునని మీలో నెవరెవరు ప్రార్థన చేసెదరో చెప్పుడు. అందరు సోదరీ సోదరులును చేతులెత్తిరి. తిరిగి యిట్లు సెలవిచ్చిరి: రేపు వసంత పంచమీనాడు స్వామీజీ మహారాజువారు దయాల్బాగు దయచేసిన యెడల మీరు వారినేమి ప్రార్థించెదరు? అందరు ననేక విధములుగ సమాధానములు చెప్పిన పిమ్మట హుజూరువారు, "తమరెల్లప్పుడు దయాల్బాగులో దయచేసి ఉండిపొండని ఒక చిన్నమాటతో వారి చరణములందేల ప్రార్థించరాదు? ఈ ప్రార్థనలోనే మిగత ప్రార్థన లన్నియు నిమిడియున్నవి." అని సెలవిచ్చిరి.

30 జనవరి 1944 : ఈ సాయంకాలము సత్సంగములో విధవా స్త్రీల యొక్కయు విధుర పురుషుల యొక్కయు పునర్వివాహ విషయమును గురించి మాటలు జరిగినవి. హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి : ఈ విషయము చాల ముఖ్యమైనది. ఏలనన సమస్త సంఘముయొక్క క్షేమలాభములును ఇందున్నవి. ఒక పురుషుని స్త్రీ చనిపోయినను, ఒక ఆడపిల్లకు భర్త చనిపోయినను వారిరువురికిని తిరిగి వివాహము చేయనియెడల వారు జీవితమంతయు చాల కష్టపడవలసి యుండునుకదా, విధవా స్త్రీల విషయములో కొన్ని స్థలములలో పునర్వివాహ మనగనే జనులు చాల నీచముగ నెంచుచుందురు. అది చాల ఖేదకరమైన విషయము. నేను రెండుసార్లు బెంగాలు రాష్ట్రమునకు వెళ్ళుట తటస్థించెను. అచ్చట విధవా స్త్రీలపరిస్థితి చాల దయనీయముగను, శోచనీయముగను ఉన్నది. విధవా స్త్రీలను బెంగాలీలు చాలమంది యిండ్లనుండి బయటకు తోలి వేయుచుందురు. అందువలననే వారణాసిలో వందలకొలది బెంగాలీ విధవా స్త్రీలు దిక్కులేకుండ వీధులలోపడి తిరుగుచున్నారు. అట్లే హరిద్వార్‌లో గూడ స్త్రీలు అనేక దుఃఖములు కష్టములను అనుభవించుచున్నారు. చాలమంది పురుషులు విధురులైన పిదప జీవితము నేదోవిధముగ అనేక కష్టములు పడుచు గడుపుకొనుచున్నారు, లేదా చెడు త్రోవలు త్రొక్కుచున్నారు, ఇతర మతములలోనైతే, ఆడుది చనిపోయిన పిదప పురుషులు, ముఖ్యముగ, వార్ధక్యములో నుండిన యెడల, జీవితమును సుఖశాంతులతో గడుపుకొను నిమిత్తమై తిరిగి వివాహము చేసికొనుచున్నారు. కావున మనము కూడ అందరు పడుచున్న కష్టములు బాధలను గమనించి యీ విషయమును గురించి గట్టిగ ఆలోచించవలసి యున్నది. ఇంతకుముందు ఈ విషయమును గురించి విమర్శ పూర్వకమైన చర్చ సత్సంగులలో సామూహికముగ జరగలే నట్లగుపించుచున్నది. ఈ విధముగ పెండ్లిండ్లు జరిగినయెడల, స్త్రీ పురుషు లిరువురికిని, జీవితములో తోడు లభించి, వారొండొరుల క్షేమము కనిపెట్టుకొనుచు నుండి అన్యోన్యము సౌఖ్యము గల్గించుకొందురు. సత్సంగ సంఘములో నివ్విధమైన వివాహ ప్రచారము సాగించుటకు మీరందరు నంగీకరింతురో లేదో చెప్పగోరుదును. విధవలకు పునర్వివాహము చేయ వలయునను పక్షమువారు చేతులెత్తుడు. (అందుపైన చాలమంది చేతులెత్తిరి). ఈ ప్రస్తావమునకు ప్రతికూల పక్షమువారి

అభిప్రాయమును గూడ చెప్పుమనిరి. (ఇద్దరు ముగ్గురు మాత్రమే ప్రతికూలముగ నుండిరి) హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

గురు కరో మెహర కీ దృష్టి, దాస పల పల దుఖ పావత॥
మైం ఆరత కరూం బనాయ రోగ సబ హీ ఘుట జావత॥

(సారబచన్, బచన్ 33, శబ్ద 8)

తిరిగి దివ్యేచ్ఛకు మరొక శబ్దమును తీయించిరి :

గుమత చడీ మన బరజతీ, కాల అటక తుడవాయ।
గురు పాసా అద్భుత లియా, గతి మతి కహీ న జాయ॥

(సారబచన్, బచన 36, శబ్ద 16)

ఇట్లు సెలవిచ్చిరి : గురు మహారాజువారు ఈ విధమైన దుఃఖ పీడితులకు రక్షణ యిచ్చి వారు పడుచున్న ఇక్కట్లను నశింపచేసి వారికి కష్టము కలిగించు పరిస్థితులను తప్పించి వేసిరని యీ శబ్దము స్పష్టముగ చెప్పుచున్నది. మీ అందరి అభిప్రాయములను అడిగిన పిమ్మట నీ విషయమును పవిత్ర గ్రంథమును అడిగితిమి. ఈ రెండు శబ్దములను బట్టి మీరే భగవంతుని ఆజ్ఞ యెట్లున్నదో తెలిసికొన గల్గుదురు. ఇప్పుడీ రెండు శబ్దముల అర్థమును బట్టి మీరు తిరిగి యీ ప్రస్తావమును గురించి ఆలోచించి మీ సమ్మతిని తెలియజేయుడు.

(విధవా వివాహము, విధుర వివాహమును అను రెండు ప్రస్తావములను పురుషులు స్త్రీలును అందరు నేకగ్రీవముగా సమర్థన చేయుచున్నట్లు తమ సమ్మతిని తెలియజేసిరి)

ప్రతి విధవాస్త్రీయు, ప్రతీ విధుర పురుషుడును కూడ ఈ ప్రకారము తప్పక వివాహము చేసికొన నవసరములేదు. వివాహము చేసికొనకుండా నుండి పోగల్గినవారు అట్లే సంతోషముగ నుండవచ్చును. కాని పునర్వివాహము చేసుకొనగోరు వారి నిమిత్తమే ఇప్పుడు నియమములు చేయబడుచున్నవి. పునర్వివాహము చేసుకొన గోరువారు వివాహము చేసుకొనుటకు తగినంత ముందుగనే తమ యుద్దేశ్యమును మేరేజ్ పంచాయతీకి తెలుప వల

యును. సత్సంగములో గాక బయటనే వివాహము నిశ్చితమై పోయినచో ఆ విషయమును వివాహము చేసికొనుటకు చాల ముందుగనే దయాల్బాగు మేరేజ్ పంచాయితీకి తెలుపవలయును. పంచాయతీవారు వారిరువురి యొక్క వయస్సులు, ఆరోగ్యము, ఆదాయ విషయములను పూర్తిగ విమర్శించి వారి కినచ్చిన యెడల వివాహము చేసికొనుట కనుజ్ఞ యిత్తురు. పంచాయతీవారు అన్ని విషయములు విమర్శించి ఎవరెవరికి ఎట్టి పరిస్థితులలో పునర్వివాహము చేసికొనుట యుక్తమో, ఎట్టి పరిస్థితులలో అయుక్తమో అను విషయములను నిర్ణయించుదురు. మరియు అట్టివారికి విధవా స్త్రీలతో మాత్రమే వివాహము చేసుకొనుట కనుమతి ఇయ్యబడును కాని, కన్నె పిల్లలతో వివాహమాడుట కనుజ్ఞ ఉండదు. వయస్సును గురించి షరతు పెట్టని యెడల ఆడవాండ్రకు తప్పకుండ చాల కష్టమై పోవును. ఈ విషయములో ఆండవాండ్రతో గూడ సలహా చేయవలసి యుండును. తిరిగి యిట్లు సెలవిచ్చిరి : పూర్వ వివాహము వలన గల్గిన సంతానము యొక్క పాలన పోషణల విషయములో పూర్తిగ తృప్తికరమైన ప్రబంధము చేయునంత వరకు, పునర్వివాహమున కనుజ్ఞ యియ్యబడదు. ప్రథమ వివాహ సంతానముయొక్క క్షేమము సుఖశాంతుల విషయములో తాము పరిపూర్ణ శ్రద్ధ తీసికొనగలమని స్త్రీ పురుషు లిరువురి వద్దనుండి ప్రతిజ్ఞా పత్రములు వ్రాయించి తీసుకొనబడుటయే గాక, వివాహానంతరము పిల్లల కిబ్బంది లేకుండ జేయు నిమిత్తమై వారల పాలన పోషణలకు విద్యాభ్యాసమునకు ధనరూపముగ సెక్యూరిటీ లేక జామీను కూడ తీసికొన బడవలయును. పురుషుడు పునర్వివాహము జరిగించుకొనుటకు పూర్వము క్రొత్తగ పెండ్లాడబోయెడు స్త్రీ పేర జీవన భీమా చేయించుట యుక్తముగ నుండును. వయస్సు విషయములో మహిళా అస్సోసియేషన్‌కు పంపించి వారిఅభిప్రాయము తీసికొనవలయును. ఆ తర్వాత దివ్యేచ్ఛకొక శబ్దమును తీసిరి:

హే సహేలీ ప్యారీ మౌజ కరీ అబ భారీ।
చరణ కమల ప్రీతమ జియా ధారీ॥

(సారబచన్, బచన్ 35, శబ్ద 3)

# -25

30 జనవరి 1944- ఈనాడు వసంత పంచమీ సాయంకాలము సత్సంగములో డాక్టరు బ్రిజ్‌లాలుగారి సుపుత్రిక సద్గురుదేఈకి ప్రేమీభాఈ చాందప్రసాదుతో సగాఈ (ప్రధానము) జరిగినది. ప్రసాదము చేయించుటకు మిఠాయి పట్టుకొని వచ్చినపుడు హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: తినుటకేదైన పదార్థము ముందుపెట్టినపుడు దానిని తినుటకు ముందుగా, రాధాస్వామీ దయాళురికి భోగార్థమై అర్పించవలయును. ఆ దయాళురు ఈ భోగమును స్వీకరించెదరో లేదో మనకు బోధపడునట్లు ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుదుము:

సతగురు ప్యారే నే ఖిలాయా నిజ పరశాద నివాలా హో,

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4) శబ్ద10)

ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దమును బట్టి మనకు బోధపడుచున్నట్లే, ఇప్పుడు అర్పణ చేయబడిన మిఠాయిని స్వామీజీ మహారాజువారు భోగముగ స్వీకరించిరని మనము విశ్వసించినచో, వారు అట్లు ప్రసాదము స్వీకరించుటకు ముందే ఇచ్చుటకు దయచేసి యీ పెండ్లి ప్రధాన కార్యమును చూడలేదని యనుకొనుటకు సావకాశము లేదు. ఈ ప్రధానము మంగళప్రదముగనున్నట్లు తెల్పుట కొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుదుము. ఈ క్రింది శబ్దము వచ్చినది.

ఆజ ఆనంద రహా మౌజ సే చహుం దిస ఛాఈ

(ప్రేమ బానీ, భాగ్ 4, బచన్ 20, గజల్ 5)

ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దమువలన ఈ సంబంధము చాల శ్రేష్ఠమైనట్లు స్పష్టపడుచున్నది. ప్రసాదము పంచిపెట్టుచున్నప్పుడు స్త్రీల వైపున చాలగోల అయ్యెను. అపుడిట్లు సెలవిచ్చిరి: మీరిపుడు చాల గోల చేయుచున్నారు. దీనినిబట్టి మీకు తిండి ఆశ చాల యెక్కువగ నున్నట్లు కనపట్టుచున్నది. మీరీ విధముగ గోలచేయుటచే మీ చిత్తవృత్తి అంతర్ముఖముగ నుండుటకు బదులు, బహిర్గతమైపోయి, అనుచితవిధముగ వ్యయమైపోవును. మీరు మీ చిత్తవృత్తిని అంతర్ముఖముగ నుంచుకొని మనస్సును వశమున

నుంచుకొను స్వభావము నలవర్చుకొనవలయును. మీవద్ద పెట్టిన పదార్థ మును శాంతముగ నోరిమితో స్వీకరించవలయును. ఇవ్విధముగ అల్లరిగోల చేసినందు వలన నెద్దియు లాభముండదు. సరే ఈ విషయముపైన పవిత్ర గ్రంథమును ప్రశ్నించుడు.

గురు ప్యారే కే సంగ మన మాంజో ఆయ్ ॥టేక్॥

మాయా సంగ భులానా భారీ, విషయన మేం రహా అధిక ఫంసాయ॥ (1)

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 54)

ఇట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు నేను చెప్పిన విషయమును గుఱించి యీ శబ్ద మేమి చెప్పుచున్నది? ఈ శబ్దమును విన్న తర్వాత మీరు గోలచేయుదు రేమో చెప్పుడు. ఈ మిఠాయి పంపకమునకు ముందు మీరు ప్రయత్నించి మీ చిత్తవృత్తి నేకాగ్రము చేసికొన్నందువలన మీకు సేకూరిన ఫలితమంతయు నిపుడు అల్లరిగోల చేయుటచే నష్టమై పోయినది. అందువలన మీరు పడిన శ్రమంతయు వ్యర్థమైపోయినది. కావున మీరు బయట అల్లరి గోలచేయుట కట్టిపెట్టి చిత్తవృత్తి నెల్లప్పుడు నంతర్ముఖముగ నుంచుకొనవలయును. సర్క సులో గుఱ్ఱముయొక్క కళ్ళెము నెప్పుడు బిగించిలాగుచున్న నే అది లోంగు పాటులో నుండి రౌతు చెప్పినట్లు ఆటపాటలు చేయుచుండును కాని, కళ్ళెము కొంచెము వదులు చేయగనే వశములోనుండి తప్పిపోయి, తిరిగి దానిని వశములోనికి తెచ్చుకొనుట కష్టమైపోవునుకదా. మీ శ్రద్ధ యొక్కయు చిత్తవృత్తియొక్కయు పరిస్థితికూడ నట్టిదే. ఈ చిత్తవృత్తి ఒక్కసారి అంతర్ముఖత్వమునుండి తప్పి బహిర్ముఖమైనచో, దానిని తిరిగి వశములోనికి తెచ్చుకొనుట యసాధ్యమగునంత యెక్కువగ నది చంచలమై పోవును. అందుచేత మీ యెదుట మిఠాయి రానిండు, శబ్దపాఠము చేయనిండు. యేమై నను కానిండు, కాని, మీరు నిశ్శబ్దముగను ప్రశాంతముగను ఉండి, చిత్త వృత్తిని పూర్తిగ వశములో నుంచుకొనవలెను. తర్వాత హుజూరు వారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయించిరి.

గురు ప్యారే కీ జుగత కమాఓ
మన ధర కర ప్యార ॥టేక్॥

(ప్రేమ బానీ, భాగ్ 3, బచన్ 12 (3) శబ్ద 15)

ఇట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములో శ్రద్ధను లేక మనస్సును వెనుకకు లాగుకొని ఏకాగ్రము నిశ్చలము చేసికొనుడని నేను ఇప్పుడు చెప్పిన విషయమునే చెప్పిరి. అట్లు చేసినందువలన నెట్టి లాభము గల్గునో అందరకు తెలుపునట్టి శబ్దమును ఇపుడు తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సోఇ తో సురత పియా కీ ప్యారీ జో భీంజ రహీ గురూ రంగ సారీ॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16, శబ్ద 27)

ఇట్లు సెలవిచ్చిరి. మీరు ధ్యానముచేసి, ఉద్ధారము అగుట విషయములో దివ్యేచ్ఛకు శబ్దమునుదీసి ప్రశ్నించుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

చహుం దిస ధూమ మచీ, సతగురు అబ ఆయే
జగ జీవ జగాయే ఉన లియా అపనాఈ రే॥

రాధాస్వామీ, రాధాస్వామీ, రాధాస్వామీ ప్యారే రాధాస్వామీ రే॥ (1)

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 13 (2), శబ్ద 4)

ఆ తర్వాత సమస్త సభ్యులకు సంతోషము పుట్టించులాగున మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడని చెప్పి తీయించిరి.

సతగురు ప్యారే నే ఖులాయా, ఘుట ప్రేమ ఖజానా హో॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 42)

ఇట్లు సెలవిచ్చిరి. ఈ రోజు వసంతోత్సవ దినము. కాని మీరు వసంత పంచమి మాటయే మఱచిపోయిరేమో యనునట్లు వసంత శబ్ద మెద్దియు నిపుడు చదువనేలేదు. హుజూరు సాహబ్జీ మహారాజువారు మీ యెదుట సప్తవర్షీయ ప్రణాళికను ఇప్పుడు ఆలోచించు నిమిత్తమై ప్రస్తుత పరచుచున్నామనియు, నీ సప్త వర్షములును చాల గడ్డుకాల మనియు సెలవిచ్చిన మాట మీకు జ్ఞప్తియుండి యుండును. ఆ యుత్తరువు యొక్క భావమును దివ్యేచ్ఛ నడిగి తెలుసుకొనుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

మేరే హిరదే జగీ హై ఉమంగ నఈ, ఆజ ఆఈ బహార బసంత్ ॥ టేక్॥
ప్రేమ భక్తి కే ఫూల ఖిలానే, జగ జీవన కా భాగ బఢంత్
ప్రేమీ జన సబ్ జుడ మిల గావేం హర్ష హర్ష మన రాగ
బఢంత్ ॥ (1)

(ప్రేమ బిలాస్, శబ్ద 135)

## 23

30 జనవరి 1944 రాత్రి (వసంతపంచమి) ఒంటిగంటవరకు సత్సంగము జరిగెను. అప్పుడు హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ వసంత పంచమినాడు ఇప్పుడు స్వామీజీ మహారాజు వారిచ్చటకు దయచేసి, "దయాల్బాగులో నీ కాల మేమిజరుగు చున్నది, ఇచ్చటి వారందరు నేమి చేయుచున్నారు" అని అడగిన-చో మీారేమి జవాబు చెప్పెదరు?

దీనికి జవాబు ఇప్పుడు దివ్యేచ్ఛకు చదివిన శబ్దముయొక్క ఈ చరణము, " ప్రేమ భక్తి కే ఫూల ఖిలానే జగ జీవన కా భాగ బఢంత" లో నున్నది. స్వామీజీ మహారాజువారికి ఈ వసంత పంచమి నాడిచ్చటకు దయ చేయవలయునని మీారు అందరు కలిసి నిన్న చేసిన ప్రార్థనను వారు విని, అందుకు అంగీకరించి, ఇప్పుడు వారిచ్చటకు దయచేసి. మన సంభాషణను బహుశః వినుచున్నారేమో! "ఈ కాలములో సత్సంగ మెట్టి పరిస్థితిలో నున్నది, సత్సంగులేమి చేయుచున్నారనియు" మేము శరీరమును మార్చు కొన్నది లగాయతు నింతవరకు సత్సంగ పరిస్థితులెట్లు ఉండుచున్నవనియు వారు మిమ్ములను అడిగిన యెడల మీారేమి సమాధానము చెప్పెదరు? స్వామీజీ వారెన్ని యేండ్లయి శరీర త్యాగము చేసినను, మన నమ్మకము ప్రకారము, వారు శరీరమునైతే మార్చుకొనిరికాని, మనను విడిచి మరెచ్చటికిని వెడలిపోలేదు. ఇప్పుడు వారు, "స్వామీబాగు, హుజూరీబాగు లాడో బాగులలోను, పీపల్మండి, పన్నీగల్లీలలోను ఇంతకాలము నేమేమి విశేషములు జరిగినవి, సత్సంగ మెట్లున్నది" అని మిమ్ముల నడిగినచో మీారేమి చెప్పెదరు? ఇంతకాలము జరిగిన సత్సంగము యొక్క పూర్వ చరిత్ర నంతను మీారెట్లు చెప్పగల్గుదురు? వారునన్ను అడిగినయెడల నేనిట్లు చెప్పుదును "హే స్వామీజీ మహారాజ్, తమ కాలములో హుజూర్ మహారాజు వారికి తాము అత్యుత్తమ విధమున సేవాభక్తులు చేయు విధానమును నేర్పి

యుండుటచే, వారు అద్భుత విధమున, మహాప్రేమ ప్రీతులతోను బహు శ్రద్ధా భక్తులతోను తమకు సంపూర్ణమైన సేవాభక్తులు చేసి తరువాతి తరముల వారందరికిని నిరుపమానమైన ఆదర్శమును ప్రదర్శించిరి. అందువలన సమస్త సత్సంగులకును సేవాభక్తులు చేయు పద్ధతి బోధపడి వివేకము గలిగెను. తర్వాత మహారాజ సాహబ్ వారి కాలములో సత్సంగము అభివృద్ధి నొందుచున్న కొలది సత్సంగమునకు కంట్రోలు (Control) క్రమశిక్షణ (Discipline) వ్యవస్థయు నత్యావసరమగు చున్నదని వారు కనిపెట్టి అట్లు నడిపించదల్చిరి కాని, అప్పటిలో, సత్సంగులకు, అందలి దూరాలోచన కాని, అట్లు జరిగించినందు వలన తమకును సమస్త సంఘమునకును గూడ చాల శ్రేయస్కరముగ నుండునను విషయము కాని బోధపడలేదు. అందుకు పరిణామముగ, మహారాజ సాహబ్ వారి అనంతరము, వారి అజ్ఞల ననుసరించి నూతన నియమములను ఏర్పాటుచేసి కార్యక్రమమును జరిపించగా, కొంత మంది సత్సంగమును విడిచి వెడలిపోవ నారంభించిరి. ఆ పెద్ద మనుష్యులు సత్సంగములో మహా ఘోరమైన అన్యాయ ప్రచారమును చేసి సత్సంగులకు తప్పుడు బోధలుచేసి, పెద్ద గడబిడ చేసి సత్సంగులను అపమార్గమున బెట్టిరి. అందువలన సత్సంగపద్ధతిని మార్చివేయ వలసివచ్చెను. ఆప్రకారము, సత్సంగాభివృద్ధి కొఱకై వేర్వేరు సమయములందు, స్వామీజీ మహారాజువారు, హుజూర్ మహారాజువారు, మహారాజసాహబ్ వారు, సర్కార్ సాహబ్ వారును ఇచ్చియున్న ఆజ్ఞలను పూర్తిచేయుచు ముందంజ వేయు ప్రయత్నములో నుంటిమి. స్వామీజీ మహారాజువారి చరణములవద్ద నొకమనవికూడ, అనగా తమయొక్క ఆజ్ఞలనుబట్టి సత్సంగములో ఇండస్ట్రీస్‌ని వృద్ధిచేయ వలయునని ప్రకటన మయినందున, ఆ యాజ్ఞాపాలనము నిమిత్తమై 1915 సంవత్సరములో హుజూరు సాహబ్జీ మహారాజువారి పథ ప్రదర్శనము క్రింద, దయాల్బాగులో అందుకు పునాది రూపమున నొక కార్యక్రమము నారంభించితిమని మనవి చేసుకొన వచ్చును. మా అందరికిని అనుకరణార్థమై హుజూరు మహారాజువారు ప్రదర్శించిన సేవాభక్తుల ఉచ్చత మాదర్శమును మేము మనసున జ్ఞాపకముంచుకొని, ఆ విధముగనే పని సాగించుచుంటిమి. హుజూరు సాహబ్జీ మహారాజువారు నిస్వార్థ జీవితమును గడుపుచు, అహోరాత్రము లొకే విధముగ కష్టపడి, వారు స్వయముగ పనిచేయుచు, సత్సంగులచేత గూడ నదే విధముగ పని చేయించిరి. అట్లే, సత్సంగములో ఇండస్ట్రీలు స్థాపించ వలయునను ఆజ్ఞ గాకుండ, మహారాజ సాహబ్ వారు

సత్సంగములో సత్సంగ యూనివర్శిటీ స్థాపించవలయునని మరొక ఆజ్ఞ జారీ చేయించిరి. ఆ యాజ్ఞను కూడ పాలించు సందర్భములో మొదటి అడుగు క్రింద దయాల్బాగులో మిడిల్ స్కూలు స్థాపించబడినది. ఆ స్కూలు క్రమక్రమముగ అభివృద్ధి నొందుచు ప్రస్తుతము ఆర్. ఇ. ఐ కాలేజీ అయినది. ఆ యాజ్ఞనే పురస్కరించుకొని ఇచ్చట టెక్నికల్ కాలేజీ ఒకటి, బాలికలకు ప్రేమ విద్యాలయమను మరొక స్కూలును పెట్టితిమి. మహా రాజ సాహెబ్ వారు సత్సంగ బ్యాంకును ప్రారంభము చేసిరి కావున ఆ కార్యమునే పెంపుజేసి రాధాస్వామీ బ్యాంకు స్థాపించబడినది. ఇంతియే గాక సత్సంగాభివృద్ధికై తాము అనేక బీజములను నాటిరికదా! వానిని సత్సంగులు ఇన్ని యేండ్లు నీటితో తడుపుచు రాగా ఇపుడు అవి పచ్చని ఆకులతో నలరారు మొక్కలుగనే గాక, అచ్చటచ్చట వృక్షములుగ కూడ తయారై పండ్లు పువ్వులు కాచుచున్నవి. ఇపుడా ఫలములు పుష్పములును దయాల్బాగు కాకుండా ఇతర ప్రాంతములకు గూడ చేరుకొనుచున్నవి. అందు వలన అచ్చట నీ ఫలములు ఆసుపత్రులు స్కూళ్ళు బ్యాంకుల రూపములను దాల్చుచున్నవి. ఈ సందర్భములో స్వామీజీ మహారాజు వారితో నీ విషయము, అనగా సభ మాత్రమే గాక సత్సంగులు అంతికన్న నెక్కువగ నీ కార్యక్రమమును సాధించుటలో చాల పాటుపడిరని తప్పక చెప్పుటలో అయుక్త మేమియులేదు.

ఇప్పుడు సభతో పాటు ఇంక నితరమైన అసోసియేషన్లు, సొసయిటీలు గూడ తయారైనవి. అవి ఇంకను బాల్యావస్థలోనే యున్నవి. కాని వానికి కూడ సభతో సమానముగ పని జరిపించు సావకాశము లభించిన యెడల వానిద్వారాకూడ గొప్ప ఉత్సాహకర పరిణామములు సాగించ వచ్చును. ఈ విధముగ మహారాజ సాహెబ్ వారు వేర్వేరు సమయములలో సెలవిచ్చిన ఆజ్ఞలను వారి అనంతరము నుండియు కార్యరూపములోనికి తెచ్చుట ప్రారంభమై ఇప్పుడు ఆ యాజ్ఞా పాలనరూపమున భిన్నభిన్న సంస్థలు దయాల్బాగులోను బయటనుగూడ వ్యాపించియున్నవి. అయితే సత్సంగులకు పీపల్మండీలో లభించుచుండెడి విధముగా రోజునకు 3, 4 సార్లు రబడీ, మాల్పూరీ, ఇమర్తి జిలేబీలును ఇప్పుడు ఇచ్చట దొరుకుటలేదు. అవి మాకులేవు, అల్లే మహారాజు సాహెబ్ వారి కాలములో అలహా బాదులో సాయంకాలము నాలుగు గంటలకు పూరీలు మోగరాలు

లభ్యమగుచుండెడివి. అవికూడ ఇప్పుడు మాకులేవు. హుజూరు సర్కార్ సాహబ్‌వారు సెలవిచ్చుచుండెడి శాస్త్ర విచారముతో కూడిన వచనములు కూడమాకు లభించుటలేదు. హుజూర్ సాహబ్జీ మహారాజుగారు వారి కాలములో సెలవివ్వబడుచుండెడి జ్ఞానోద్దీపక మహా వచనములు గూడ ఇప్పుడు మాకు లభించుటలేదు. కాని హే స్వామీజీ మహారాజ్, తమరును తమ తర్వాత తమ స్థానాపన్నులైన ఇతర సద్గురువులును వేర్వేఱు సమయములందు జారీ చేయించిన ఆజ్ఞలను క్రియాత్మక రూపమున పూర్తి చేయుటకై హుజూర్ మహారాజువారు, మహారాజు సాహబ్ వారు, వారి తర్వాత మిగత మహాపురుషులును వరుసగ కార్యక్రమము జరిపించిరి. ఇప్పుడుకూడ ఆ కార్యక్రమము సాగించబడుచునే యున్నది. పూర్వసద్గురువుల ఆజ్ఞలు యథాశక్తిగా సక్రమముగ నిపుడు పాలించబడుచునే యున్నవి. ఇదికాక మఱొక ప్రార్థన స్వామీజీ మహారాజ్ వారి చరణములందు చేయవలసియున్నది. అదేమనగా, మేము జరిపించెడి కార్యకలాపములో నేదైన లోపము, పొరపాటు కాని ఉన్నయెడల మాకు సెలవిచ్చి, సుమతి దానమిప్పించి, మాకు సరియైన ఆజ్ఞ ఇచ్చి సత్యమార్గము సూచించినయెడల మేము తప్పుడు మార్గమును విడిచి, మీ ఆజ్ఞానుసారముగ సత్యమైన మార్గమున నడచుకొందుము. తమరు మహాదయ చూపి, మా మధ్యన శాశ్వతముగ విరాజమానులు కావలయును. తమ చరణముల వద్ద ఒకటికాదు వెయ్యి సింహాసనములను అర్పించెదము. కాని తమరు మాత్రము ఎల్లప్పుడు మామధ్యనే యుండి పోవలయును. తమ పథప్రదర్శనము మాకు అనుక్షణము కావలసియున్నది. మేమిదియె ప్రార్థన తమ చరణములందు చేసికొనుచున్నాము.

ఇప్పుడు మనము చేయుచున్న ప్రార్థనను విన్నపమును ఆ దయాళురు వినుచున్నారో లేదో పవిత్రగ్రంథము నడిగి తెలిసికొనుడని హుజూరువారు సెలవిచ్చిరి.

తడపత రహీం బేహాల్ దర్స బిన మన నహిం మానే
కాసే కహూం బిథాయ, దర్ద మేరా కోఈ నహిం జానే॥ (1)

(ప్రేమబానీ, భాగ్ 4 బచన్ 17, శబ్ద 3)

# 27

24 ఫిబ్రవరి 1944 రాత్రి సత్సంగమునకు ప్రసిద్ధ ఇండస్ట్రియలిస్టు అయిన మల్లిక్ గారు వచ్చిరి. వారికి సత్సంగబోధ తెలుసుకొనవలయునను కోరికయున్నది. వారినిమిత్తమై హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది :

సతగురు సంత మిలే రాధాస్వామీ,
ఆరత కరనే కీ బిధి తానీ॥ 1.

మైం అతి దీన అధమ తుమ దాసా, ఆరత దేఖన ఉపజీ ఆసా 7.
దూర దేశ సే ఆయా అబ్ హీ, ఆరత కరూం రిఝావూం
గురు హీ 8.
మోపర కృపా దృష్టి అబ్ కీజే, దీన బంధు మోహి సరనా లీజే 9.
[సారబచన్, బచన్ 34, శబ్ద 5]

హుజూర్ వారీ శబ్దమును తిరిగి రెండవసారి చదివించి దాని తాత్పర్యమును మల్లిక్ గారికి ఆంగ్లభాషలో చెప్పిరి. మల్లిక్ గారు, ఈ శబ్దములోని భావము లేత మనసున గూడ నుప్పతిల్లుచున్నవని చెప్పిరి. హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము పరమపితను ధ్యానముచేసి తీయబడినది. శబ్దము తీసెడి సమయములో మఱొక ఆలోచన వారల మనస్సున లేదు. ఈ శబ్దములో భగవంతుని దివ్యేచ్ఛ ప్రకటితమై యున్నది. మఱొక శబ్దమును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సతగురు ప్యారే నే లజామె, మాను బ్రహ్మా ఖిలాడీ హో॥
(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 32)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : మీరు మొదటి శబ్దమును శ్రద్ధ పెట్టి వినిన యెడల, దానిలో భక్తుడు భగవంతునికి ఆరతి చేయు విధము లన్నిటి వర్ణనయు నున్నది. రెండవ శబ్దము మొదటి శబ్దములో దీనతా పూర్వకముగ చేసిన ఆరతిని సూచించుచు ఆ ఆరతిని పూర్తి చేసినది. మల్లిక్ గారు ఒప్పుకొనిరి. హుజూరువారు దివ్యేచ్ఛకు మూడవ శబ్దమును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

జాగ చల సూరత సోఈ బహుత, కాహే కో పూంజీ అపనీ ఖోత।

(సారబచన్, బచన్ 14, శబ్ద 3)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో భగవంతుడు జీవుని కీ విధముగ ఆమంత్రిణ మిచ్చుచున్నాడు. "ఓ జీవుడా, నీవు సంసారము నుండి వేరై భగవంతుని వైపునకు దగ్గఱగ జేరుకొనుము. నీవు త్వరగ సద్గురువుని శరణు పొందుము. పవిత్ర నామ సహాయముతో మనస్సు యొక్క పామరత్వమును వికారములను పరిహరించుకొనుము." మల్లిక్ గారు దీన భావము ప్రకటించుచు, తనకిచ్చట జరిగినంత సమ్మానమునకు తానర్హుడను కానని చెప్పుకొనిరి. హుజూరువారు వినువారికి జీర్ణశక్తి వృద్ధి చేయునట్టియు ఉత్తమమైన హితోపదేశము చేయునట్టియు మఱొక శబ్దమును తీయుమని సెలవిచ్చిరి: ఈ క్రింది శబ్దము వచ్చినది.

కరో రీ కోఈ సతసంగ ఆజ బనాయ ॥టేక్॥
నర దేహీ తుమ దుర్లభ పాఈ,
అస ఔసర ఫిర మిలే న ఆయ.॥

(సారబచన్, బచన్ 14, శబ్ద 4)

ఇట్లు సెలవిచ్చిరి:- ఈ శబ్దములో జీవునికి గాబరా గల్గించు లాగున వెగటు కాని ఉప్పనిచేదు కాని యేమియు లేదు. మల్లిక్ గారు ఈ శబ్దమును చాల కొనియాడిరి. హుజూరువారు జితేంద్రనాథ్ సేన్ గుప్తాతో ఇట్లు సెలవిచ్చిరి. మీరు మల్లిక్ గారికీ శబ్దముల తాత్పర్యమును బెంగాలీ భాషలో వివరించి చెప్పుడు. ఆ తర్వాత స్త్రీలవైపు నుండి ఒక శబ్దమును తీసి చదువుమనిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

హై కోఈ ఐసే సురత శిరోమణ।
అటల సుహాగ జిన పానా హై॥

(ప్రేమ విలాస్, శబ్ద 62)

## 28

9 మార్చి 1944 తేదీ సాయంకాలము సత్సంగమునకు మిస్టర్ హుడ్లికరు, మిస్టర్ గోవింద దేశముఖు, మిస్టర్ లాల్చంద నవల్ రాయ్ దయచేసిరి,

వారందరిని గురించి హుజూరువారు దివ్యేచ్ఛకు శబ్దమును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

జాగో రీ సురత అబ్ దేరన కరో,
చాలో రీ సురత అబ్ గగన చఢో॥
భాగో రీ సురత అబ్ పియా సే మిలో
లాగో రీ సురత అబ్ శబ్ద రలో॥

(సారబచన్, బచన్ 20,శబ్ద 2)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి:- ఈ శబ్దమును మీ కొరకై భగవంతుని ధ్యానము చేసి తీసిరి. దాని అభిప్రాయ మేమనగా ఈ శబ్దములో చెప్పిన హితబోధయు, మేలుకొల్పును భగవంతుడు చెప్పినట్లు అర్థము చేసుకొనవలయును. మీ కొరకై యే ప్రత్యేకముగ తీయబడినందున, దీ ని లో నీ విషయములు మీ కొరకే ఉద్దేశించ బడినవి. కావున నీ శబ్దములోని భావమును మీకు వర్తింపచేసుకొని, అది మీ పరిస్థితికి ఎంతవరకు సరిపోవునో చూచుకొనుడు.

తిరిగి హుజూరువారిట్లు సెలవిచ్చిరి:- మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడు కాని శబ్దము దివ్యేచ్ఛ వలననే వచ్చినది. కాని మనుష్యుని ప్రయత్నము వలన కాదని వీరికి బోధపడునట్లుగా పవిత్ర గ్రంథమును చేతిలో పట్టుకొని, శబ్దమును తీయుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

దేఖ జగ కా వ్యోహార అసార కర్తత రహో మన మేం నిత్త బిచార।
కౌన ఘర సే యహ జివ ఆయా, కౌన యాహి జగ మేం భరమాయా॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 18, శబ్ద 8)

ఇట్లు సెలవిచ్చిరి:- ప్రథమ శబ్దములో చేసిన మేల్కొల్పు బోధ యొక్క ప్రభావము శ్రోతయొక్క చిత్తముపైన పడి, ఆ శ్రోతకు ఈ ప్రాపంచిక వ్యవహారమంతయు నిరర్థకమును, సారహీనమునని తెలిసి, అతడిట్లు విచారించ దొడగెను. నేను ప్రపంచమున కెచ్చటినుండి వచ్చితిని? నన్ను

ఇచటకు పంపి బంధనములలో కట్టిపెట్టిన వారెవరు? మరణానంతరము నే నెచ్చటికి పోవుదును? నేనే స్వయముగ కార్యములన్నియు చేయుచుంటినా, లేక, భగవంతుని శక్తి నా లోపలనుండి నన్నిట్లు ప్రేరేపణ చేసి చేయుచున్నదా? ఆ యథార్థమైన కర్త యెవరు, ఎచ్చట నున్నారు? నే నెవరను, నా స్వస్వరూప మెద్ది? ఈ విషయ మంతయు రహస్య పూరితముగ నున్నట్లు తెలిసి నా మనస్సు చాల కాలమునుండి వైరాగ్య భావముతో నిండిపోయినది. భగవత్కృప వలన, భక్తజనుల ద్వారా నా కీరోజున సత్సంగమునకు వచ్చు సావకాశము గల్గినందున నేను మహోత్సాహ పూరితుడనై యిచ్చటకు వచ్చి యుంటిని. ఇప్పుడు నా ఆత్మను మనస్సును కాపాడి రక్షించవలయునని నేను తిరిగి తిరిగి ప్రార్థించు చున్నాను. పంచదూతలును అహోరాత్రములు నన్ను వ్యాకుల పరచుచున్నవి. మీరు నాయందు దయయుంచి మనోమాయల జాలమును త్రెంచివైచి నా కిచ్చటనుండి విముక్తి దయచేయుడు. అప్పుడు హుజూరువారు, ఈ భావములు మీలో నెవరికైనను సరిగ వర్తించుచున్నవా యని ఆ సజ్జనుల నడిగిరి. ఈ శబ్దము దివ్యేచ్ఛకు తీయబడినదగుటచే, దీనిలో చెప్పిన విషయములు మీలో నొక్కరి మనస్సు యొక్క పరిస్థితికైనను తప్పక సరిపడి యుండవచ్చునని మాకు విశ్వాసమున్నది.

వారిలో నొకరు, మొదటి శబ్దమైన తర్వాత రెండవ శబ్దములో చెప్పిన భావములన్నియు నా మనస్సున నిస్సంశయముగ బయల్దేరిన వని నుడివెను.

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. మీరు అనుజ్ఞ ఇచ్చినయెడల ఇంకొక అడుగు ముందుకు వెడలి, రెండవ శబ్దములో మీయొక్క కాపుదల సంరక్షణలకై చేసిన ప్రార్థనకు రాధాస్వామీ దయాళురు సమాధానమేమి యిత్తురో కూడ చూతము. హుజూరు వారు మఱొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి. ఈక్రింది శబ్దము వచ్చినది.

హోలీ ఖేలన ఆయే సతగురు జగ మేం।
 హిల మిల కే అబ్ సరన పడో రీ॥
నర దేహీ తుమ దుర్లభ పాఈ।
 జైసే బనే తైసే కాజ కరో రీ॥

[ ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16 (2), శబ్ద 9 ]

ఇట్లు సెలవిచ్చిరి: రెండవ శబ్దములో మీ తరుపున వేసిన ప్రశ్నకును చేసిన ప్రార్థనకును సమాధానము ఈ శబ్దములో నున్నది. మీరు మీ ఆత్మను అంతర్యమున ఆరోహింపజేయుమని కదా ప్రార్థించిరి. దానికి సమాధానము "నిర్మల హోయ చఢో ఊంచే కో" నిర్మలమై నీవు పైకెక్కుము అను సలహా నిచ్చిరి. ఈ శబ్దములో పైకారోహించుటకు యుక్తి అనగా ఉపాయమేమియు చెప్పలేదు, కాని మీ చిత్తము నిర్మలమైనపుడు, మీలో ఆధ్యాత్మిక అభివృద్ధికొఱకై ఇచ్ఛపుట్టును, అప్పుడే అభ్యాసము నేర్చుకొనవలయునను కోరికయు బయల్దేరును.

ఒకరు ఇట్లు అనిరి: ఈ విషయము కఠినము కాదా? రెండవ సజ్జనుడిట్లనెను: ఈ పరిస్థితి జనింపజేయుటకు సద్గురువు వద్దకు వెళ్ళుట అవసరము.

మూడవవారు ఇట్లనిరి: ఈ పని కొఱకై సద్గురువుని చరణముల వద్ద కూర్చుండుటకు మాలో అర్హత ఉన్నదా?

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు పైకి అగుపించుచున్న మీ మనస్సు యొక్క ప్రవృత్తిని బట్టియు, మీ మనోభావములు ఇప్పుడు చదివిన శబ్దభావములతో సరిపోవునట్లున్నవని మీరు మాటలలో చెప్పిన దానిని బట్టియు, మీకీ పని కష్టము కానేరదని తేటపడుచున్నది. అధమపక్షము మా గురుమహారాజువారి వచనము అట్లు చెప్పుచున్నది.

అంతటి వారిలో నొక పెద్దమనిషి, ఏ వ్యక్తియైనను తన జీవితమును న్యాయబుద్ధితోను ధారాళముగను గడుపుకొనుచు తన కాలమును చాల వరకు జనులకు సేవచేయుటలో వెచ్చించుచున్న యెడల ఆ పనులు గూడ సత్కార్యములే కదా? అట్లు చేసినందువలన గూడ మా ఆత్మకు విముక్తి గలుగనేరదా?

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: మీ మాట నా కంగీకారమే. ఒక మనిషి యెవరైనను తన ముక్తి సంపాదించుకొను నిమిత్తమేదో ఒక మార్గమును పట్టినచో, అదొక్కటే ముక్తిమార్గమని కాని, అదియు సరియైన మార్గమని కాని చెప్పుట సరికాదు. కావున సత్యాన్వేషణ చేయుట అవసరము. అన్వేషణ చేయగా, అంతకన్న సరియైనట్టి శ్రేష్ఠమార్గము, అంతకన్న సుగమమైనది కూడ లభించవచ్చును. అయితే మీరు వివరించు

చున్న విషయము లన్నియు తారతమ్య జ్ఞానమునకు ( Relative Value ) సంబంధించినవి. వానిని సత్యము యథార్థ జ్ఞానము ననియు చెప్పలేము. నే చెప్పున దేమనగా లోకములో మంచి పనులెన్ని యున్నవో వానిని గురించియు వానిలోని మంచిచెడ్డలను గురించియు వివేకము గలుగవలె నన్నచో, వానికి విరుద్ధ పరిస్థితుల అనుభవము అవసరము. ఒక విషయము ఒకప్పుడు యుక్తము అని తోచినను మఱొక పరిస్థితిలో అది అయుక్తముగ నే కనుపట్టవచ్చును. అందుచేత గురుమహారాజువారి చరణముల నాశ్రయించుట ఆవశ్యకము. వారివలననే సత్యవిషయ మేమి? జీవునికి నిజమైన ఉపకార మనగ నేమి యను విషయములు తెలియగలవు.

ఒక పెద్దమనిషి ఇట్లనెను: తమరు మాపై ఇంత అధిక ధ్యానము పెట్టుచున్నారు. సత్సంగ కార్యక్రమమునకు అందువలన విఘ్నము గల్గు చున్నందున ఇచ్చటి జనులకు ఈ విషయము అప్రియముగ నుండునేమో.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దముల వలన మీ కేమైన లాభము గల్గినట్లు వీరందఱికి తెలిసిన యెడల వారు సంతోషింతురు అప్పుడు హుజూరువారు ఈ విషయమును ఇంకొక అడుగు ముందుకు తీసికొనిపోవు నిమిత్తమై మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడని సెలవిచ్చిరి. ఈ శబ్దము వచ్చినది :

> అహో మేరే ప్యారే సతగురు, అమృత ధార బహా దో,
> తన మన సుచిత భీంజే ॥ టేక్ ॥
> ప్రేమ బినా సబ కర్నీ ఫీకీ॥
> నేక హు మోహిఁ న లాగే నీకీ।
> ఘట ధున రస దీజే ॥ (1)

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (5) శబ్ద 6)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : విశ్వాసనీయ పద్ధతిని అనగా కేవలము న్యాయ విధముగ పనిచేసినంత మాత్రమే ననే ముక్తి లభ్యమగునని మీరు ఇంతక్రితము చెప్పినమాటకు సమాధానము ఈ శబ్దములో "ప్రేమ బినా సబ కర్నీ ఫీకీ" అను వాక్యములో ఉన్నది. అనగా యేకృత్యము చేసినను భగవత్ప్రేమతో చేయవలయునని చెప్పబడినది. ప్రేమ లేకుండ, అనగా

ఉత్సాహము ఆసక్తియు లేకుండ చేసినపని చప్పగను రసహీనముగను ఉండును. దానికి భగవద్దర్శనమను ఫలము లభించనేరదు.

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దముయొక్క ఆఖరు చరణములను విన్న పుడు, తనతోటి వారికిగూడ నిజమైన భగవంతుని శరణ్యము లభించవలయు ననెడి భావము మీలో నొకరికి తప్పక పుట్టియుండ వలయును. అట్లడుగగా వారిలో నొకరు భక్తుడనియు, బహు శ్రద్ధా భక్తులతో తన గురువునకు సేవచేయు చుండుననియు తెలిసినది. ఈ శబ్దము అతని హృదయమున భక్తి భావమును పుట్టించి నందున అతడు అందఱికిని భక్తిదానము లభించవలయు నని కోరుకొన నారంభించెనట.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : మీరిపుడు చదివిన శబ్దములను వరుసగ శ్రద్ధ పెట్టి వినియుండినచో, మీకు ఈనాటి విషయము యొక్క వివరణ వీనిలో వరుసగ నెట్లు విస్తరించి చెప్పబడినదో మీకు సంతోషము గల్గునట్లు తెలిసియుండ గలదు.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ పెద్ద మనుష్యులిచ్చట గౌరవ నీయమైన అతిథుల హోదాలో నున్నారు. వీరికి సేవచేయుట మన ధర్మము. ఇంకొక శబ్దమును తీసి వీరిసేవ చేయుడు. ఈ క్రింది శబ్దము వచ్చెను.

గురు ప్యారే కే చరణోం కీ హో జా ధూర్ ॥ టేక్ ॥
దీన హోయ గురు సన్ముఖ ఆఓ॥
జగ పరమారథ జానో కూడ ॥ 1 ॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 28)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములో లోకములో ప్రసిద్ధమైన దేవులను దేవతలను, ఉత్తకొమ్మలుగ చెప్పి వారియందు భావము పెట్టుకొనకుండ, అనగా వారలను విడిచిపెట్టి అసలు మూలమును పట్టుకొన వలయుననియు, ప్రాపంచిక జీవులు దేనిని పరమార్థమని భావించుచున్నారో అది ఉత్త చెత్త యని తెలుసుకొన వలయు ననియు బోధచేయ బడినది. మీకు దయాళువైన సద్గురువు మహా కటాక్షము చూపి జగత్తునుండి విముక్తి పొందు అభ్యాస మును దయచేసిరి. మీరు రాధాస్వామీ దయాళుని చరణములను దృఢ

ముగ పట్టుకొన వలయును. వారు మీమీద సంపూర్ణదయ ననుగ్రహించెదరు.

## - 29

10 మార్చి 1944 ప్రాతఃకాల సత్సంగములో నీ క్రింది శబ్దములను పఠించిరి :

1) ఆజ్ రీ సఖి జుడ హోలీ గావేం, కర కర ఆరత పురుష మనావే॥
(సారబచన్, బచన్ 39, శబ్ద 12)

2) ఖేలత ఫాగ్ అపార పియారే (ఆజ)
ఆకహ అపార అనంత ధామ సే, ఆయె పురుష ఆపారే॥
(ప్రేమసమాచార్, శబ్ద 1)

3) సతగురు ప్యారే నే మచాఈ, జగబిచ హోరీ హో॥
(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 30)

శబ్దపాఠానంతరము దేదీప్యమాన స్వరూపులైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ హోలీనాడు ఈ శబ్దములకు విశేష మహాత్మ్యమున్నది. చివర రెండు శబ్దములలోను పంచదూతలను చంపి క్రిందపగ్గవైచితి మనియు, కాలకర్మముల బలమునుగూడ ముక్కలు చేసితిమనియు వర్ణించబడినది. ఆ పంచదూతలనగా నెవ్వి? కామ, క్రోధ, లోభ, మోహ, అహంకారములే. కర్మలు అందరికిని అంటిపెట్టుకొనియే ఉన్నవికదా. ఆ కర్మలనగా మానవులు పూర్వము చేసి యున్నట్టివియు, ప్రస్తుతము చేయుచున్నట్టి నికముందు కూడ చేయబోవునట్టియు కర్మలు అని అభిప్రాయము. ఇంక కాలుని విషయము ఎక్కువగ చెప్పనవసరమే లేదు. పైగా, ఎంత తక్కువ చెప్పిన నంత మేలు. ప్రస్తుతములో కాలుడు అనేక రూపములు ధరించు చున్నాడనుట నిస్సంశయము. పైన వివరించిన విషయములను ఈ రోజున వర్ణించుటలో గొప్ప శుభ సూచనయున్నది. కాల కర్మముల బలము సంఘమునుండి కొట్టివేయు సమయము చాల దగ్గరకు వచ్చినదని యిందులో సూచితమగు చున్నది. ఈ సందర్భములో "రాధాస్వామీ సోషల్ సెక్యూరిటీ అండ్ సర్వీస్ కార్పొరేషను" అను కంపెనీ రిజిష్టరయినదను సంతోష

వార్త మీకు తెలియచేయు చున్నాను. ఇంతకుముందు కూడ నెన్నియో కంపెనీలు రిజిస్టరయినవి. దయాల్బాగులోను, బయటను కూడ ఇంతవరకు రిజిస్టరయిన మిగత అన్ని కంపెనీలకన్న నీ కంపెనీయొక్క రీతి నిరుపమానమైనది. ఈ కంపెనీ రిజిస్టరయినట్లు వార్త యీ సమయములో తెలియుటవలన నీ పండుగకు మహాత్త్వమెక్కువైనది, ఈ కంపెనీయొక్క నామమునకు అర్థమేమనగా, ఇది రాధాస్వామీ సంఘమునకు (అనగా సొసైటీ) సంరక్షణ చేసి సేవచేయుటకై యేర్పడిన కంపెనీ అని. ఈ కంపెనీ పేరులోనే దీని యొక్క ఉద్దేశ్యములు సూచించ బడుచున్నవి. ఈ కంపెనీ మెమోరేండము (Memorandum) లో ఈ ఉద్దేశ్యములు వ్రాయబడినవి. ఒక సంఘమునకైనైన ఆ పత్తులు కష్టములును రాగలవనెడి భయము గల్గినపుడు, ఆ సంఘములోని నాయకులును, బుద్ధి శాలురును, ఆ సంఘీయు లందరును ఏయే పద్ధతుల ననుసరించి నడుచుకొన్న సంఘమునకు రక్షణ గల్గునో, ఆ విషయములను పద్ధతులను సంక్షేపముగ ప్రభావ పూరితమైన శైలిలో విశదపర్చి లేఖ బద్ధము చేయుచుందురు. ఇట్లు ఒక సంవత్సరము నుండియు దేశము యొక్క సోషల్ సెక్యూరిటీ స్కీమును గురించి సమాచార పత్రికలలో వ్రాయబడుచున్న వివిధ ప్రస్తావముల విషయమై, అనగా దారిద్ర్య నాశనము భయోత్పాతములు ఆపత్తుల యొక్కయు నివారణ ప్రబంధము, మత విశ్వాసస్వేచ్ఛ, రోగనివృత్తి నిరక్షరతా నిర్మూలనము, వగైరా విషయములను గురించి మన సంఘము ఇంతకు ముందుగనే అల్ప పరిమాణములో తగు బందోబస్తు చేయుచునే యున్నదికాని మనమికముందునుంచి యీ కార్పోరేషను స్థాపించినందువలన ఇంకను గొప్ప పరిమాణములో నేర్పాట్లు జారీ చేయగల్గుదుము. పైన చెప్పిన విషయములన్నిటిలో అవసరమైన సౌకర్యములు, ఉపశాంతులును జనులకు అందజేయు నిమిత్తమై యీ కంపెనీలో పరిపూర్ణమైన జాగ్రత్త తీసికొనబడినది.

సాయంకాలము సత్సంగములో నీ క్రింది శబ్దము దివ్యేచ్ఛకు తీయబడినది.

ఆనంద మంగళ ఆజ సాజ సబ ఆరత లాఈ
రాధాస్వామీ హుఏ హైం దయాళ, కాల డర దూర బహాఈ॥

(సారబచన్, బచన్ 6, శబ్ద 6)

ఇట్లు సెలవిచ్చిరి. నిన్నను ఈ రోజు ఉదయమునను, ఇప్పుడును చదివిన శబ్దములలో, కాల కర్మముల బలనాశనము, కామక్రోధాది మనోవికార నాశనమును గురించియు చాల సార్లు చెప్పబడినది. దీనినిబట్టి సంఘముపైన కొన్ని యేండ్ల నుండి వ్యాపించియున్న కాలకర్మల ప్రభావము తొలగి పోయినదని కాని, లేదా కొద్ది రోజులలో తొలగిపోనై యున్నదని కాని అనుకొనుట అయుక్తము కానేరదు. హుజూరు వారు తిరిగి దివ్యేచ్ఛకు శబ్ద మును తీయించిరి. ఈ క్రింది శబ్దము వచ్చెను.

సఖే రీ ఐసీ హోలీ ఖేల, జా మేం ప్రేమ కా రంగ బహే రీ॥
సద్గురు దయా ఖోడ నభ ద్వారా, జోతి సరూప లఖే రీ॥
(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16 (2), శబ్ద 5)

ఇట్లు సెలవిచ్చిరి:- మూడేండ్ల నుంచియు వసంత పంచమీ ఉత్సవ మును, అయిదేండ్ల నుంచి హోలీపండుగ ఆటలను జరిపించుటకు అవకాశమే గలుగలేదని యే మనిషియైన చెప్పినను చెప్పవచ్చును. ఈ పండుగలు రస హీనముగనే వెళ్ళిపోయినవని అనవచ్చును. ఉత్త కబుర్లు మాత్రమే ఉండి, హస్తగతమైన వస్తువేమియు లేనట్టి యీ పాడిపాడి శబ్దముల నెంతకాలము వినుట? అందరి చింతలు నశించి అందరికి సంతోషము గల్గించునట్టి శబ్దము ఒక దానిని తీసి చదువుడు. ఈ క్రింది శబ్దము వచ్చినది.

సతగురు ప్యారే నే నిభాఈ ఖేప హమారీ హో॥
నైయా మేరీ బహుత మంఝధారా।
గురు బిన కౌన లగావే పారా
వహీ జీవ హితకారీ హో॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 31)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : మీరు నిస్సందేహముగ ఈ శబ్దమును గొప్ప ఉచ్చైస్స్వరముతో, ప్రేమభావముతోనే పాడిరి కాని అంతమాత్రముచే జనులకుశాంతి చేకూరదు. ఇప్పుడు కండ్లనుండి నీటిధారలు ప్రవహింపజేయు శబ్ధమును తీయుడు. ఈ క్రింది శబ్ధము వచ్చెను.

గురునైన రసీలే నిరఖే, మేరే సిమట గయే మన ప్రాణ్॥
పురుష అంస మేరీ నిరమల సూరత, బసీ కాల ఘర ఆన్॥
(ప్రేమబానీ, భాగ్ 3 బచన్ 18, శబ్ద 16)

— 2 —

27 మార్చి 1944 తేదిని మేరేజ్ పంచాయత్, వార్షిక యెన్నికల సమయములలో దివ్యేచ్ఛకు చదివిన శబ్దములో కొన్ని చరణముల నీ క్రింద పొందుపరచుచున్నాము:

గురు మిలే పరమ పద దానీ క్యా గత మత ఉన్ కీ కరూం బఖానీ 1.
మైం అజాన మహిమా నహిం జానీ బినా మేహర్ క్యోం కర పహిచానీ 2.
సురత శబ్ద మారగ మోహిం దీన్హా కిరపా కర అప్నా కర లీన్హా 8.
సతగురు మేరే పరమ దయాలా కరూం ఆరతీ హోఉం నిహాలా 10.
భక్తి భావ సే ఆరత కీనీ పద సతగురు జల మెం భఇ మీనీ 12.
యహ ఆరత సబ్ పూరన భఈ ఆగే కుఛ కహనీ నహిం రహీ 13.
(సారచబచన్, బచన్ 8, శబ్ద 2)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడిచట వివాహముల విషయములో కొందరు వారి వారి భావ విచారములను ప్రకటించి చెప్పిరి. అవి మనోరంజకము గనే యున్నవి. దీనినిబట్టి దయాల్బాగు మేరేజ్ పంచాయత్ కృత్యములలో జనులు అభిరుచి తీసికొనుచున్నారని తెలియుచున్నది. ఈ సందర్భములో నా మనవి ఇంతమాత్రమే. మహారాజు సాహబ్ వారు ఏ విత్తనములను నాటిరో, వానిని, ఆ తదనంతర మందు హుజూరు సాహబ్జీ మహారాజువారు నీరు పోసిపెంచిరి. హుజూరు సాహబ్జీ మహారాజువారు కొన్ని బీజములను క్రొత్తగ నాటి, వానిని, క్రొత్తగ మొలకలెత్తిన పాత విత్తనములను కూడ అభివృద్ధి చేసిరి. అందులో కొన్ని పెరిగి పెద్దవై సత్సంగ మనెడి తోటకు శోభ నిచ్చుచున్నవి. యీ తోటను శోభాయమానముగ నుంచ దల్చిన యెడల యీ మొక్కలకు మనము నీరు పోయుచుండుట మన కర్తవ్యము. అట్లు చేసినయెడల నవిపెరిగి ఫలముల నియ్యగలవు. ఈ ఉద్దేశ్యము

తోనే దయాల్బాగు మేరేజ్ పంచాయత్ ఏర్పాటు చేయబడినది, మాటి మాటికి వివాహ విధానము యొక్క సంస్కరణ విషయములో యోచనలు మీ వద్ద పెట్టుటలో కూడ ఇదియ ఉద్దేశ్యము, మహారాజసాహెబ్ వారు వారి కుమారుని వివాహమును ఒక బెంగాలీ కుటుంబములో, సత్సంగి బృందములోనే జరిగించిరి ఆ వివాహము ఇంటర్మేరేజ్ నాదృష్టిలో, వారు భవిష్య కాలములో సత్సంగముయొక్క అవశ్యకతలను గమనించి, ఆ యావశ్యకతలను ఆ వివాహమూలమున సంఘమంతకును ప్రకట పర్చిరని తోచుచున్నది. భవిష్య కాలములో సత్సంగ వివాహము లెట్లుండవలెనో వాగ్రూపమున తెల్పుటకు బదులు క్రియాత్మ రూపములో బోధపర్చిరి. అట్లే హుజూర్ సాహెబ్జీ మహారాజువారు, అందరిని ఆ విధమైన పెండ్లిండ్లకు సిద్ధమై యుండునట్లు చేయు నుద్దేశ్యముతో, అట్టి ఇంటర్మేరిజీలు సత్సంగములో చేయించి ఆ విషయమును రెట్టించిరి, ఇప్పుడు మీరు ఆ విషయమును మరిచి పోకుండనుండుటయేగాక, ఈ విషయములో మీరిదివరలో కన్న నెక్కువ జోరుగ ముందడుగు వేయవలయునను ఉద్దేశ్యముతో దానిని తిరిగి నేను మీయెదుట పెట్టుచున్నాను. ఇప్పుడు వివాహ సమస్యను గురించి మాటలాడిన వారిలో కొందరు ప్రాచీన కాలపు ఆచారములు అలవాట్లను గురించి చెప్పిరి. కొందరు వర్తమానములో జరుగుచున్న నూతన పద్ధతులను గురించి చెప్పిరి. నా అభిప్రాయములో. ఈ రెండింటిని కూడ త్రోసిపుచ్చి మహారాజ సాహెబ్ వారు భవిష్యములో నేది ఆవశ్యకమని చెప్పిరో ఆ పద్ధతినే అవలంబించ వలయును. సంఘముయొక్క భావ్యవసరములను కనిపెట్టి అందుకు తగినట్లు పథప్రదర్శనము చేయుపురుషుడే సంతసద్గురువు. అదికాక మిగత మాటలన్నియు తుక్కమాటలే? త్రోవలో ఎన్ని ఆటంకములు వచ్చినను వానిని దాటి తిన్నగా ఈదుకు పోగలిగినది ఒక్క వ్యాఘ్రమే. పెద్దపులి ఆటంకములకు లెక్క చేయకుండా నిర్భయముగ నన్నిటిని దాటి ముందుకుపోవును. ఇతరులు లేనిపోని ఆటంకములను లెక్క పెట్టుచు నుండిపోవుదురు. మీలో కొందరిపుడు హిందూ ధర్మపద్ధతిని మెచ్చుకొనిరి. కొందరు సిఖ్ఖుమత పద్ధతులను, మరికొందరింక నితర మతపద్ధతులను కొనియాడుచుండిరి, కాని భావికాలమున కనుగుణముగ నెవరు పథ ప్రదర్శనము చేయునో అతడే నిజమైన మహా శూరుడని నా అభిప్రాయము. అట్టివాడు తాను చెప్పిన మార్గము నందరు ఒప్పుకొనక పోయినను, తన మార్గము నతడు విడువకుండ, పట్టుదల, ఓరిమియు

వహించి ఇతరులను ఆ మార్గము నవలంబించు లాగున ప్రోత్సహించుచు, సకలజనులు తన మార్గమును అవలంబించునట్లు చేయువఱకు విడిచిపెట్టడు.

-3-

23 మార్చి 1944 తేదీని దేదీప్యమాన స్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ సత్సంగము పెరిగి పెద్ద వృక్షరూపముగ నైనపుడు దీనినుండి క్రొత్త మొలకలు బయలుదేర గలవని హుజూర్ సాహబ్జీ మహా రాజువారు తరుచు సెలవిచ్చుచుండెడి వారు. వారు సత్సంగ సమయములో అనేక పర్యాయములు ఇవ్విధముగ సెలవిచ్చు చుండెడివారు. ప్రేమ ప్రచారక్ లో కూడ నీ భావనలు ప్రకటించబడు చుండెడివి. ప్రస్తుతము కూడా, ప్రేమ ప్రచారక్ లో నిదే విధమైన లేఖలు సత్సంగ వృక్షము క్రొత్త క్రొత్త మొలకలను ఇప్పుడు పెట్టుట ప్రారంభించినదని చెప్పుచు వ్రాయబడు చున్నవి. అట్లు సూచించ బడిన మొలక లనగ నెవ్వి? నా అభిప్రాయములో ఈ మధ్యన కొన్ని సంవత్సరములనుండి, దయాల్బాగులోను, భారత వర్షము లోను అనేక స్థలములలో స్థాపించ బడుచు దేశమంతటను వ్యాపించు చున్నట్టి దయాల్బాగు రిజిస్టర్డు స్టోర్సులు, రాధాస్వామీ రిజిస్టర్డు బ్యాంకులు, ప్రావిన్షియల్ అస్సోసియేషన్లు, ప్రాంతీయ డిపోలు, చారిటబుల్ సొసయిటీలు, జిల్లా సత్సంగములు వగైరా సంస్థలే. సత్సంగ వృక్షమునుండి బయల్వెడలుచున్న మొలకలు. మొదటలో రాధాస్వామీ సత్సంగ సభయను సంస్థ ఒక్కటే సత్సంగములో ఉండెడిది. దానికి లోబడియే దయాల్బాగులో ఇతర సంస్థలు కొన్ని యేర్పడినవి. తర్వాత లీగ్ ఆఫ్ సర్వీస్ను, దయాల్బాగు ఓల్డు బాయాస్ అసోసియేషనును స్థాపించబడినవి. ఆదే ప్రకారముగ నిపుడు దయాల్బాగు మహిళా అస్సోసియేషను, మహిళా సంఘమును స్థాపించబడినవి. మహిళాస్టోర్సు కూడ తెరచితిమి. అరవ దేశములో నొక ప్రావిన్షియల్ డిపో పెట్టిరి. మధ్య ప్రదేశములో నొక క్రొత్తడిపో త్వరలోనే స్థాపించ బోవుచున్నారు. ముందుగ నిపుడు మూడు చారిటబుల్ సొసయిటీలు రిజిస్టరు అయిపోయినవి. మిగిలినవి కూడ త్వరలో రిజిస్టరు కాబోవుచున్నవి. ఆంధ్ర ప్రదేశములో కూడ అచ్చటి సత్సంగులు ఆంధ్రాయూత్ లీగును (Andhra Youth League) కాకినాడలో స్థాపించిరి. అట్లే దయాల్బాగు మహిళా అస్సోసియేషను వలెనే కాకినాడలో కాకినాడ మహిళా అస్సోసి

యేమను స్థాపించిరి. వాస్తవముగ, సత్సంగ వృక్షమునుండి బయల్వెడలి పెరుగుచున్న క్రొత్త మొలకలనగ నివియే. ఈ చిన్నచిన్న మొలకలు అనగా, దేశములోని వివిధ భాగములలో స్థాపితమగుచున్న యీ సంస్థలు కొంతకాలము పాలనపోషణలను పొందిన పిదప నవికూడ ఇచ్చటి వృక్షము వలెనే వికాశమునొంది, తమంతటనవి దృఢముగ నిలబడునంత వృద్ధి నొంద గలవు. కొద్దికాలము వఱకు వానిని కనిపెట్టి చూచుట మాత్రము అవసరమై యున్నది.

చారిటబుల్ ట్రస్టు, చారిటబుల్ సోసయిటీయు స్థాపించిన ఆసుపత్రులు, స్కూళ్ళు మొదలగు కొన్ని సంస్థలు ప్రస్తుతము చాల మంచి పరిస్థితిలో నున్నవి. మనము సత్సంగ కార్యకలాపమును ఈ విధమైన దృష్టితో చూడవలయును.

## 232

25 జూన్ 1944 సాయంకాలము హుజూరువారిట్లు సెలవిచ్చిరి:- నేను నిన్న సాయంకాలము సత్సంగముయొక్క పంచవర్షీయ ప్రణాళికను గురించి చెప్పుచు జనులందరును గత సప్తవత్సరములలోను హుజూరువారి ఆజ్ఞలను పాలించి కార్యకలాపము జరిగించు విషయములో చేసిన సేవను చెప్పి, మీరు కార్యనిర్వాహకులమైన మాయందు నమ్మకము లేనియెడల నిర్వాహక వర్గములో మార్పులు చేయుటకు మీరు పూర్తి అధికార మున్నదని మనవి చేసితిని. ఆ విషయమింకను అసమాప్తముగనే యున్నందున నేను తిరిగి యిప్పుడు దానినే సంప్రదించు చున్నాను. ఏ సోదరునికిగాని సోదరికి గాని ఈ విషయములో తన భావములను చెప్పుకొనవలసి యున్నయెడల, వారిచ్చటకు వచ్చి చెప్పుకొన వచ్చును. సభయొక్క కార్యకర్తలు చేసిన పొరపాట్లను అట్టివారెవరైన నిచ్చటకు వచ్చి నిర్భయముగ చెప్పుకొనుటకు సంపూర్ణమైన హక్కు ఉన్నది. ఆ పొరపాట్లు అనుచితమై ఆ లోపములను పూర్తిచేయుట కూడ అసాధ్యమైన యెడల, అట్టి కార్యకర్తలను తొలగించుట కేమియు సంకోచ మవసరము లేదు. నేను సభలో సదస్యుడను కాననుట నిస్సంశయమేకాని, వారి పనులకు ఉత్తర దాయిత్వమును నేను వహించు చున్నాను. ఆ కార్యకర్తలను తొలగించవలసి వచ్చినపుడు నేనుకూడ వారితో పాటు తొలగిపోవుటకు సిద్ధముగ నున్నాను.

మీ వద్దనుండి గృహములను తీసికొనుట విషయములోగాని, మరేదైన మీకు కష్టము కలిగించిన విషయములో గాని, మీకు చెప్పుకొన వలసిన దున్న యెడల ఇప్పుడు మీరు చెప్పుకొనవచ్చును. అందుపైన నొక సోదరుడు, ప్రస్తుతము జరుగుచున్న ప్రబంధములో నతని కేమియు ఆక్షేపణీయ విషయము లేదుగాని, ప్రస్తుతము ఆర్థిక పరిస్థితులు చాల కఠినముగ నున్నందున, మా కందఱకును పరిపూర్ణ సంరక్షణయిచ్చి, కడుపునిండ తిండికి లోటు లేకుండునట్లు అనుగ్రహించవలయునని మాత్రము తన ప్రార్థన యని చెప్పుకొనెను. తేజః స్వరూపులైన హుజూరువారు, నేను ఈ ప్రార్థనకు హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణములవద్ద 1934 వ సంవత్సరములో ప్రతిదినము ఉదయాస్తమయములు రెండుసార్లు చేయుచుంటినని సెలవిచ్చిరి: మీరైతే యీ ప్రార్థనను యీనాడే, అనగా 10 సంవత్సరములు ఆలస్యముగ చేయుచున్నారు. మఱొక పెద్దమనిషి "హుజూరు సాహబ్జీ మహారాజువారు మా యెదుటనే తమ నూతన రూపములో విరాజమానమై యున్నప్పుడు వారికొఱకైన అన్వేషణను గురించి కాని వారి కార్యకర్తలలో మార్పు చేయు విషయమును గురించి కాని ప్రశ్నయే చేయుట కవకాశము లేదు. మా ప్రార్థన యేమనగా, ఆ దయాళుని రక్షక హస్త మెల్లప్పుడు మాపైన నుండవలెననియు, మా జీవితము సుఖశాంతులతో గడచి పోవలయుననియు మాత్రమే అని చెప్పుకొనెను. హుజూరువారిట్లు సెలవిచ్చిరి: మహారాజసాహబ్ వారు గుప్తమైన పిదప సర్కార్ సాహబ్ వారే ప్రకటమగుటలో ఆలస్యమేమియు కాలేదు. వారు ఆఱు సంవత్సరముల మూడు నెలలు మాత్రమే శారీరకకోశములో నుండి వారి పాదచ్ఛాయలో మనల నుంచుకొనిరి. వారి అనంతరము హుజూరు సాహబ్జీ మహారాజువారితో మనకు సంయోగము గలిగినది. ఆ దయాళురు ఇప్పుడు శరీరరూపములో గుప్తమై యేడేండ్లయినది. కాని వారి నూతన స్వరూపమును గురించి మనకింకను సూచన లభించలేదు. కావున నేను మొదటలో మీ యెదుట పెట్టిన ప్రశ్న ఉత్తహాస్యపు మాట క్రింద త్రోసివేయరాదు. వారి ముఖారవిందమునుండి మనమెట్టి పారమార్థిక చర్చలను వచనములను వినుచుండెడివారమో అట్టి వచనములను విమర్శలను గత సప్తవర్షములలో నొక్కసారియైనను మనము తిరిగి వినుట పడలేదను విషయమును మీరే ఒప్పుకొన వలసి యున్నది. మీరు ఇప్పుడు మార్పు చేయకుండిన యెడల నీ యేడేండ్లు నెట్లు రసహీనముగ గడిచిపోయినవో, ముందు కాలము గూడ నట్లే రసహీనముగనే గడపవలసిరాదా?

పిమ్మట రెండు శబ్దములను పఠించిరి.

1. సజనవా జాయ ఛిపే కాసే ఓర్।

(ప్రేమ విలాస్, శబ్ద 55)

2. గురు దయాల అబ్ సుధి లేవ మేరీ।

(ప్రేమవిలాస్, శబ్ద 121)

పాఠానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ రెండు శబ్దములలో వ్యక్తపఱిచిన భావములను మీరు శ్రద్ధగ విన్నారుకదా. మీలో నెవరెవరి మనోభావము ఈ రెండు శబ్దములద్వారా ప్రకటితమైనవో వారు చేతులెత్తుదురుగాక. (కొందరు చేతులెత్తిరి). ఆ తర్వాత దివ్యేచ్ఛను ఈ క్రింది శబ్దము తీయబడినది:-

హే సహేలీ ఆలీ మౌజ కరీ అబ్ భారీ।
చరణ కమల ప్రీతమ జియా ధారీ॥ (1)

[సారబచన్, బచన్ 35, శబ్ద 3]

పాఠానంతర మిట్లు సెలవిచ్చిరి : మఱొక విషయమిపుడు జ్ఞాపకము వచ్చినది. అదేమనగా, ప్రపంచములోని సమస్త దేశములు జాతులలోను రెండు సంవత్సరముల నుండి, తాము ఈ యుద్ధానంతరము సుక్షేమముగ నుండి నిరంతరాభివృద్ధి నొందు నిమిత్తమై చేసుకొనవలసిన కార్యము లెవ్వి, తమలో నెట్టి పరివర్తనలను చేసుకొనవలసి యుండునని డి కఠిన ప్రశ్న బయల్దేరినది అందు నిమిత్తమై యిప్పటి నుండియు చాలమంది ప్రభుత్వములవారును, జాతులును ముందుకు ప్రోగ్రాములు వేయుచు పథకములను తయారుచేసికొనుచున్నారు. ప్రతిదేశములోను ఆ యాలోచనలే జరుగుచున్నవి. యుద్ధానంతర మందు నిర్మాణాత్మకముగ నడిపించవలసిన స్కీములను తయారుచేసికొనుచున్నారు. కాని వారు జరిగించెడి యీ కార్యక్రమమంతయు ఉత్త మనః కల్పనయే. ఇంతవరకు నేదైన స్కీమును పూర్తిగ తయారు చేసుకొన్నట్టి దేశములు చాల తక్కువగనున్నవి. నా అభిప్రాయములో, యుద్ధానంతరమందు ఈ సమస్యను గురించి ఆలోచన ప్రారంభించి, అప్పుడు స్కీములు తయారుచేయ నారంభించ దల్చుకొన్న దేశములు ప్రజలును అందరికన్న నెక్కువ మూర్ఖులు, యుద్ధపు రోజులలోనే, ఈ సమస్యను గురించి

ఆలోచించి, స్కీములు తయారు చేయనారంభించిన వారు అంతకన్న తక్కువ మూర్ఖులు. యుద్ధము రాకముందే యీ సమస్య విషయములో ఆలోచించుకొని, ఆచరణలో పెట్ట నారంభించినవారు అందరికన్న తక్కువ మూర్ఖులు. అనగా వారిని దూరదృష్టిగల బుద్ధిమంతులని చెప్పవచ్చును. యీ సమస్యపైన ఆచరణ రూపమైన కార్యక్రమమును యుద్ధారంభమునకు ముందే ప్రారంభించి, అందులో అధిక భాగమును యుద్ధపు రోజులలోనే తమకు యుక్తమని తోచిన పథకము ననుసరించి పూర్తి చేసుకొన్న దేశములు జాతులును అంతకన్న నెక్కువ దూరదృష్టిగల బుద్ధిమంతులు. మనము ఈ కార్యక్రమమును యుద్ధమునకు ముందే ప్రారంభించితిమని తెలుసుకొని సంతోషించవలసి యున్నది. ఇంతవరకు మన మవలంబించిన కార్యక్రమమును బట్టియు, చేసిన పరివర్తనలను బట్టియు, మనకు ఇప్పుడు చేకూరిన సుయోగ్య పరిస్థితి యెంత తృప్తి కరముగ నున్నదనగా, ఈ యుద్ధానంతరము మనము మన వర్తమాన కార్యక్రమము నొక్కసారి పునర్విమర్శన మాత్రము చేసుకొని, చాల కొద్ది మార్పుతో మాత్రమే యథాప్రకారము జరిగించుకొనవచ్చు నన్నట్లున్నది. మనమీ సమస్త కార్యక్రమమునకు, సేఠ్ అండ్ కో వారికిని, ఎగ్జిక్యూటివ్ కమిటీలోని అనుభవ శాలురైన యితర యోగ్యతమ సభ్యులకును, ఇతర ఆఫీసర్లకును, వారి ఉత్తమ సేవయు ఉత్తమ యోగ్యతల మూలముననే మన మందరము నీ కార్యము నింత హెచ్చు పరిస్థితివరకు సాగించ గలిగి నందువలన, కృతజ్ఞులమై యుండవలసి యున్నది. వాస్తవముగ వీరందరు పెద్దలును కార్యక్రమమును ఉత్తమ విధముగనే నెరవేర్చిరి. కాని నేను చెప్పు మాటకు ఈ కార్య కర్తలకు అప్రసన్నత గలుగని యెడల, నీ కార్య మంతయు నొక్క ఆఫీసర్లే చేయలేదు, మీరందరును కలిసియే చేసిరని చెప్పుదును. అందుచే, హుజూర్ సాహబ్జీ మహారాజువారు గుప్తమైన తోడనే, సంఘముయొక్క లోపములను సవరించుకొని దాని సంరక్షణ అభివృద్ధులను గురించిన కార్యక్రమమును సమస్త సంఘము కలిసియే చేయ నారంభించెనని చెప్పుట చాల యుక్తముగ నుండును. మన అడుగు రోజు రోజుకు ముందుకే సాగిపోవుచుండునని సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చుచుండెడివారు. ఆ మాట ఇప్పుడు నిస్సంశయముగ సరియని కనిపించుచున్నది. కొంతమందికైతే యీ ప్రశ్న కఠినమై పోయినది. ఏలననగా, వారు మాకు వచనములే కావలెను. మాకు అవియే చెప్పవలయుననియు అను చుందురు. కాని వచనముల విషయము నట్లుంచి, సంఘము సామూహిక రూపముగ

నెట్లున్నదని చూచినచో, సంఘము అభివృద్ధి మార్గమున నగ్రసరముగ నున్నట్లు తెలియగలదు. ఈ పవిత్ర సేవలో పాల్గొనిన ఆఫీసర్లకు కార్యకర్తలకును నేను, మీరందరు ననుజ్ఞ యిచ్చినయెడల, వారి సేవకై పుష్పహారముల నర్పించెదను.

(హుజూరువారు దయతో ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యు లందఱికి పుష్పహారముల నిచ్చిరి.)

## [illegible]

9 జూలై 1944 తేదీ పిల్లల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి:- నేను మీకు కొన్ని లాభదాయక విషయములను చెప్పబోవుచున్నాను. మీరు వాని వలన లాభాన్వితు లగుదురని నమ్ముచున్నాను. మీరు క్లాసులో కూర్చుండినపుడు వంగి కూర్చుండకూడదు. నడుము ఎప్పుడు నిట్టనిలువుగ నుండునట్లు కూర్చుండవలయును. నడిచినపుడుకూడ వంగినడుచుటకు అలవాటు పడకూడదు. దిగజారిపోవుచున్నట్లుకాని వంగిపోవుచున్నట్లుగాని యెన్నడు నడవకూడదు, ఉషారుగను నిలువుగనే నడవ వలయును. చదువుచున్నపు డెన్నడు పరుండి చదువకూడదు. కుర్చీమీదకాని స్టూలు బల్లమీదగాని కూర్చుండి చదువుకొన వలయును. మీరు మీ శరీరమును, మనస్సును, మెదడును, బట్టలను, నివాస స్థలమును ఎప్పుడు స్వచ్ఛముగను నిర్మలముగను ఉంచుకొన వలయును. మెదడును నిర్మలముగ నుంచుకొనుట యనగా, వ్యర్థమైన చెడు ఆలోచనలు మెదడులోనికి రానీయకుండుట, హృదయము నిర్మలముగ నుంచుకొనుట యనగా మీ మనస్సులో నెవరి విషయములోను ఈర్ష్య గాని మరొక మలిన భావమునుకాని రానీయకుండుట, భోజనము ఎప్పుడు సకాలమునకు చేయుచుండవలయును. కావలసిన దానికన్న కొద్దిగ తక్కువ తినుచుండ వలయును. కుళ్ళి చెడిపోయిన పదార్థములను తినకూడదు, అవి ఆరోగ్యమును పాడుచేయును. మీరు మనసా వాచా కర్మణా చెడ్డపని యెన్నడు చెయ్యకూడదు. మీరు ఎట్టి వస్తువును, బట్టనుకాని కాగితములు కాని, స్టేషనరీకాని, ఆహారపదార్థములనుకాని, ఏదైనను సరే, వ్యర్థముగా వ్యయ పర్చకూడదు. మీ ఆలోచనలను గూడ అపవ్యయము చెయ్యరాదు. ప్రస్తుతములో కాగితము ఖరీదు హెచ్చుగానున్నది కావున, రెండు ప్రక్కలను వ్రాయుచుండ వలయును. మార్జిను తక్కువగ నుంచవలెను. మీ కాపీ

పుస్తకములలో నుండి కాగితములను చించవలదు. మీ పైకమును బ్యాంకిలో వేసుకొనుడు, లేదా ఆఫీసులో జమకట్టుడు కాని, మీ హాస్టలులోను మీ చొక్కా జేబులలోను పెట్టుకొనవలదు. ప్రతి దినము ఉదయము ప్రక్కనుండి లేచిన తోడనే తప్పక వ్యాయామము చేయుచుండుడు. మీ మెస్సు సెక్రిటరీ మీ డబ్బును మీ ఆహార పానీయముల నిమిత్తమె సరిగ ఖర్చు పెట్టు చున్నాడో లేదో చక్కగ కనిపెట్టి చూచుకొనుడు. మీ రిచ్చటకే యుద్దేశ్య ముతో వచ్చిరో యెల్లప్పుడు జ్ఞాపక ముంచుకొనుచు, అందుకు తగినట్లుగ ప్రోగ్రాము వేసుకొని, మీ కాలములో అధికాధిక భాగమును ఆ ప్రకారము వెచ్చించుకొనుడు. పైకి చూడగా ఇదంతయు చాల సులువైన పనియే అని తోచవచ్చును. కాని మీరట్లు చేయుటకై గట్టి ప్రయత్నము చేయవలసి యుండును. నా అభిప్రాయ మేమనగా మీ ఆటల సమయముగాక మిగిలిన సమయ మంతయు మీరు చదువుకొను చుండవలయునని సినిమాధి మోటర్లు, వీధులలో ఉత్త సంచారములు వగైరా వ్యర్థ విషయములలో కాలము నెన్నడుపాడుచేసి కొనగూడదు. సినిమాల కెన్నడు వెళ్ళకూడదు. సినిమాలకు వెళ్ళెడి పిల్లల పేర్లు నియమప్రకారము నోట్ చేయబడు చుండును. మీరిచ్చట తయారైన వస్త్రములనే ధరించి, ఇచ్చటి పదార్థములనే వాడుకొనచుండ వలయును. ఇట్లు చెప్పుటలో ఇచ్చటి వస్తువుల విక్రయము కావలయునని మాత్రమే కాక మన తలంపులు, సంభాషణ, దుస్తులు, పద్ధతులును ఒకే విధముగనున్న యెడలనే, మన పరివర్తన యొక్క ప్రభావము ఇతరుల పైన గలుగునని కూడ నా అభిప్రాయము. ఈ విషయము లన్నియు నందరు నొకే విధమైన దుస్తులు ధరించనిచో సిద్ధించ నేరవు.

## -34-

23 ఆగష్టు 1944 తేదీ సాయంకాల సత్సంగములో మనస్సును ఆత్మ చైతన్యమును ఏకాగ్రము చేయుటయొక్క ఆవశ్యకతను నొక్కి చెప్పిన వచనమును ప్రేమపత్రి నుండి చదివిరి. హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ కారణము వలననే మితవ్యయ పరుడవు కమ్మనియు, ప్రతికృత్యమును సంయ మముతోను పొదుపుగను చేసికొనుమనియు సత్సంగములో అనేక పర్యాయ ములు హితబోధ చేయబడుచున్నది. వాస్తవముగ మితవ్యయ పరత్వము

మీకు అలవడిన యెడల, సాంసారిక పదార్థముల ఉపయోగములో మిత వ్యయము సంయమము అవలంబించుటతో పాటు మీ చిత్తవృత్తిని వ్యయ పఱచుటలో గూడ మీరు సంయమమితవ్యయముల నవలంబించగలరు. అట్లు చేసినందువలన చిత్తవృత్తి బహిర్గతమగుట తగ్గిపోవును. మితవ్యయ పరుల మైన కారణమున మనము ఈ శక్తిని తిరిగితిరిగి ఏకాగ్రము చేసుకొని దాని నభివృద్ధి చేయుటకు ప్రయత్నించుచుందుము. అప్పుడు చిత్తవృత్తి అంత ర్ముఖ మగుట ప్రారంభించును. మితవ్యయ పరత్వ మీ విధముగ మనకు సంతుమతము యొక్క అసలైన ఉత్తమ గతికి తోవచూపును. ఇందు వలననే మిమ్ములను మితవ్యయ పరులు కమ్మని మాటిమాటికి హితభోధ చేయుచున్నాము.

## ౹౬5

2 నవంబరు 1944 తేదీని రాజమండ్రిలో సాయంకాలము సత్సంగ ములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : మీరందరును యథాశక్తిగా మీ జీవితములో ప్రతి విభాగములోను మితవ్యయ సిద్ధాంతము ప్రకారము నడుచు కొనవలయును. పైకమును నష్టము కానివ్వకూడదు. మీ శక్తిని, సమయ మును, మీ చిత్తవృత్తిని వ్యర్థకార్యములలో నష్టపెట్టకూడదు. మీరు మీ శక్తిని చేతనైనంత వరకు సురక్షితముగ నుంచుకొని మానవ జీవితముయొక్క సర్వోత్తమ లాభము కొఱకై ఉపయోగించుకొనుడు. మీరు కాఫీ, పొగాకును వాడుట కట్టిపెట్టుడు. సినీమాలకు వెళ్ళవద్దు. ప్రతి దినము నేదోయొక వ్యాయామము తప్పక చేయవలయును. వివాహ యోగ్యమైన విధవా స్త్రీలు విధుర పురుషులును తప్పక వివాహము చేసికొనుడు. మన సంఘీయులందరును సంఘములోని సమస్త విధవాస్త్రీలకు వివాహములయి పోవునట్లు చూచుట తమ కర్తవ్య ధర్మముగ చేసికొనవలయును. స్త్రీల హృదయము కోమలముగను కరుణార్ద్రముగను ఉండును. కావుననే వారు తమ జీవితమును ఇతరులకు సేవచేయుటలో గడుపుకొనుచుందురు. చిన్న వయసులోనున్న విధవా స్త్రీలకు కష్టపూరితమైన జీవితము గడుపుట యుక్తము కాదు. ఆ తర్వాత హుజూరువారు భీమా చేసినందువలన గలుగు లాభములను వివరించి చెప్పిరి. నలుబది మంది భీమా చేయించుకొనుటకు పేర్లు ఇచ్చిరి.

## ౬౩

26 నవంబరు 1944 తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి. ఈ కాలములో ప్రపంచములోని అన్ని దేశములలోను వ్యాపారమును అభివృద్ధి చేసుకొనుటకై ఒండొరులు పోటీలు పెట్టుకొని వ్యాపారమును పెంచుకొనుచున్నారు. అది మంచిదే. ఏలననగా, ఈ సమయములోనే జాతికాని, దేశముగాని ముందుకుపోవునో దానికే జగత్తులో గౌరవ ప్రతిష్ఠలు లభించునుకదా! వస్తువులను తయారుచేసి అమ్మకము నిమిత్తమై బజారుకు తీసికొనిపోవుట సులువేకాని, అవి పోటీలో నిలబడి అమ్మకమగుట కఠిన విషయము. మన వ్యవహార సరళియు, మన ప్రవర్తన సరళియు (Manners) సరిగ లేకపోయినను, మన సేల్సుమెన్ (Salesmen) యోగ్యులు అనుభవశాలురును కాక పోయినను వస్తువు లెంత యెక్కువ ప్రశస్తమైనవైనను బజారులో అమ్ముడగుట చాల కష్టము. అందుచేత సేల్సుమెన్ చేయవలసిన దేమనగా, దుకాణములోని కెవరైన గ్రాహకుడు రాగనే, అతనికి కావలసిన వస్తువును చూపించి, బయట నున్న ఆ రకము వస్తువులలో దోషముల నెన్నుటకు బదులుగ, తన వస్తువు యొక్క ఉత్తమ లక్షణములను చక్కగ చెప్పుకొనవలయును. గ్రాహకుడు ఆ వస్తువును తీసికొన్నప్పుడు ఆ సమయమునకు ఆ ఋతువునకు అనుగుణముగ గాని, ఆ గ్రాహకుని అభిరుచులు ఆవశ్యకతల ననుసరించిగాని ఉపయోగించ తగిన ఇతర వస్తువులను తన దుకాణము నుండి తీసి వాని శ్రేష్ఠతను చెప్పి వానికి చూపించవలయును. ఆ వస్తువులను తీసి చూపించిన పిదప గ్రాహకుడు వానిని తీసికొనక పోయినను, లేదా వానిని అతనికి ఒక్కసారి కొద్ది తగ్గింపు ధరకు ఇచ్చివేసినను గూడ, అందువలన నష్టములేదు. గ్రాహకుడు తృప్తిపొందుటయే ముఖ్యము. ఆ తర్వాత నతడెప్పుడు నా దుకాణమునకే వస్తువులకొనుగోలు నిమిత్తమై వచ్చుచుండును. అతనికి ఈ సేల్సుమేన్ యొక్క విశ్వాస పాత్రత, సహానుభూతి భావము, యోగ్యతను గురించి మంచి అభిప్రాయము గల్గిన యెడల అతడా దుకాణమునకు స్థాయిగా గ్రాహకుడై పోవును. అతడు తన మిత్రులకు, పరిచితులకును గూడ ఆ దుకాణమును గురించి పొగిడి చెప్పును. ఈమధ్యన కాకినాడలో నే నొక లేఖను చదివితిని. అందులో ఇక్కాలమున ఇంగ్లాండు అమెరికా దేశముల మధ్య జరుగుచున్న వ్యాపార విషయమైన ప్రతిస్పర్థను గురించి వ్రాయబడినది. ఆ దేశస్థులు తమ మేనేజర్లు

సేల్సుమెన్, కాన్వాసర్సు ద్వారానే తమ వ్యాపారముయొక్క ఉత్తమ లక్షణములను గురించి ఇతర దేశములలో మంచి అభిప్రాయము గల్గించి, వారికి సంతుష్టి కలుగజేయుచున్నారు. సేల్సుమెన్సు, కాన్వాసర్లును, యోగ్యులు సమర్థులు నైనయెడల, వారు తాము పని చేయుచున్న స్థలములలో నున్న వారికి అవసరమైన పదార్థములను అందజేసి వారొక్కరికే సేవచేయుటగాకుండ తమ స్వదేశమునకును, తమ దేశప్రభుత్వమునకు గూడ మంచి సేవ చేయగలరు. ప్రస్తుతకాలములో ప్రభావశాలిగనున్న దేశములన్నియు నీ సిద్ధాంతముననుసరించియే తమ వ్యాపారము నభివృద్ధి చేసుకొనుచున్నవి. గ్రాహకులు సంతుష్టులైనపుడు, అతిత్వరలోనే అమ్మకములు అధిక పరిమాణములో నైపోవును. ఈ మధ్యన విజయనగరములో విక్రయము లిదే సిద్ధాంతము పైన నడుచుకొన్నందున మూడుగంటలలోనే బహు తృప్తికరముగ నైపోయినవి. అక్కడ కొంతసరుకు చాలకాలముగుండి నిల్వగనుండిపోయినది. దాని ఖరీదు కొంత తగ్గించి అమ్మగా అదంతయు చూచుచుండగనే కొద్ది సేపటిలో అమ్ముడై పోయెను. ఈ విషయమును గురించి యీ విధముగ పరికించి చూచినపుడు, మీకు సత్సంగము యొక్క యీ సమస్త కార్యక్రమము జరిగించుటలో కేవలము మనము మన పరివారముయొక్కయు కుక్షింభరణమొక్కటే యుద్దేశ్యముగాక, సమస్తసంఘము జాతియొక్కయు, దేశముయొక్కయు సేవయు లాభమును గూడ అంతర్గర్భితమైనట్లు విశదము కాగలదు. ఇందు మూలముగ నంతర్ రాష్ట్రీయ సేవ చేయవచ్చును. యుద్ధానంతరము దయల్బాగు స్టోర్సు మనదేశమునకు బయటకూడ స్థాపించుటకు అవకాశము లేకపోలేదు. కావున సత్సంగసేవయందాసక్తిగల వ్యక్తి, మొట్టమొదట నొక చిన్న స్టోర్సులో పనిచేయుట మొదలుపెట్టి. పిమ్మట క్రమక్రమముగ నభివృద్ధి నొందుచు, ప్రావిన్షియల్ స్టోర్సులలో, సెంట్రల్ స్టోర్సులలోను, చివరకు అంతర్దేశీయ స్టోర్సులలోను, ఈవిధముగ చివరకు వెళ్లుటకవకాశమున్నది. సేవచేయువానికి సేవచేయవలయునను తీవ్రాభిలాషయుండి తన సంఘము, తన దేశమునకునే గాక, మానవజాతి కంతకు సేవచేయవలెనను ఉత్సాహమున్న యెడల, సత్సంగములో అట్టి అభివృద్ధి పొందుటకు సంపూర్ణ సావకాశమున్నది.

## 227

1944 డిసెంబరులో ఒక రోజు సాయంకాల సత్సంగములో వివాహ ముఖు చేయు సమయములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి: మీరనుజ్ఞ యిచ్చినయెడల ఒకచిన్నవిషయము మీకు చెప్పదల్చుకొన్నాను: మీరు ఒండొరులకెట్లు దండము వేసుకొనిరో, ఏ విధముగ మీరిప్పుడు పరస్పర సంబంధము కలుగ జేసికొనిరో, ఇప్పుడు చదివిన శబ్దములో ( సరన గురు ధార రీ ధర దృఢ పరతీత్ ) నెట్లు చెప్పబడినదో అట్లే మీరు భావి జీవితములో ప్రవర్తించవలయును. మీరు జీవితములో మైమఱచి కాలము వెళ్ళపుచ్చకుండ, పరస్పర బాధ్యతలను పూచీలను నెఱవేర్చుకొనుచుండ వలయును. పరస్పర సహానుభూతితో స్వార్థ పరమార్థకృత్యములలో సహకారము చేసికొనుచుండవలయును. మీకు స్వార్థ విషయములలో నెప్పుడైన నొకప్పుడు భిన్నభావము ఉన్నను ఉండవచ్చును కాని మీరొకరికొరకు పారమార్థిక కృత్యములలో నెన్నడు ఆటంకము కలుగచేయకూడదు. మీకు సుఖములున్న కాలములో మీరు సంయమముతో ప్రవర్తించ వలయును. మీకు కష్టములు ఆపత్తులును వచ్చినప్పుడు మొట్టమొదట కష్ట నివారణకొరకై రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రార్థన చేసికొనుడు. ఆ తర్వాత నిరువురును కలిసి సంప్రతించుకొని, మీరు నిశ్చయించుకొన్న ప్రకారము ఆ కష్ట నివారణకై ఉపాయము చేసికొనుడు. అట్లు చేసినందువలన మీ కెల్లప్పుడు సంతుష్టిగ నుండును.

## 228

17 జనవరి 1945 తేది సాయంకాల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి. గురుగోవింద సాహెబ్ గారిని గురించిన వచనమును చదివిన నాడు నాకు ఆనందపురము తాలూకు గాఢ జ్ఞాపకము వచ్చుచుండును. దేశములోని ఇతర ప్రాంతములలో కూడ దయాల్బాగువంటి వలస పట్టణములను స్థాపించదల్చుకొన్న యెడల పనులు చేయుటకు స్వయం సేవకులు అవసరమై యుండునని నేను 25 డిసెంబరు 1944 తేదీని మనవిచేసి యుంటినికదా! నేనీనాడు కూడ ఆ విషయమును మీకు జ్ఞాపకము చేయగోరుచున్నాను. పై వచనములో చెప్పినట్లు, గురుసాహెబ్ వారు తన ఆజ్ఞానుసారము నడుచుకొనుచు ఆత్మసమర్పణ చేయుటకు సిద్ధముగనున్న "పాంచ ప్యారాలు", అనగా

అయిదుగురు ప్రియభక్తులు సిక్కులలో నుండి కావలయునని యెట్లడిగిరో, అట్లే నేనుకూడ, నేనొక సామాన్య మానవుడనే అయినను, అట్టికోరిక మిమ్ముల నుండి కోరుట అయుక్తము కాదు. కారణ మేమనగా, ఇప్పుడు పని చాల పెరిగిపోయినందున పది చేతులు లేనిదే పని సాగనేరదు. ఒక్క దయాల్బాగు వారేకాక బయటవారు కూడ చాలమంది ముందుకు వచ్చి యీ పనిలో పాల్గొని వారి సహకార సహాయముల నిచ్చిన యెడలనే దయాల్బాగు నమూనాలో వలసలు ప్రతి ప్రాంతమునను తయారు కాగలవు. నేనీ సందర్భములో, ఈ విధమైన పని జరిగించుటకు అనువుగనున్న 4, 5 స్థానములను గురించి క్రిస్టమస్ వారములో చెప్పి యున్నాను. ఈ మధ్యన మూడు నాలుగు ఇతర స్థలములనుండి ఇందును గురించి వార్తలు వచ్చినవి. ఆ స్థలములవారు అచ్చట దయాల్బాగు నమూనాలో వలస యేర్పాటు నిమిత్తము పనివెంటనే ప్రారంభించ వలసినదని కూడ కోరుచున్నారు. దీనిని బట్టి ఒక్క సత్సంగులకే గాక ఇతరులకుగూడ దయాల్బాగువంటి కాలనీలు అన్ని స్థలములలో తయారై అచ్చట జనులు పరిశ్రమలు సాగించ వలయునను అభిలాష యున్నట్లు విశదపడుచున్నది. సత్సంగు లేమి, సత్సంగేతరులేమి, అందరును, అట్టి కోరికను, ప్రార్థనను ప్రకటించు చున్నప్పుడు మనము వారి కోరికలను నివేదనలను త్రోసిపుచ్చి తోకముడిచి కార్యక్షేత్రమునుండి పారిపోయి నిశ్శబ్దముగ నుండిపోవుట సమంజసముగ నుండదు. అట్లుగాక వారి ప్రార్థనలను మన్నించి దృఢ సంకల్పము చేసుకొని ముందడుగు వేయుటయే యుక్తము. అట్లు మనము ముందడుగువేసి పని ప్రారంభించిన యెడల ఆ పని యిప్పుడున్నట్లే గాక ఇంతకన్న రెండు, మూడు, లేదా నాల్గురెట్లు కూడ అధికముగ నైపోగలదు. ఆ రోజున నేను మిమ్ములను ఆ రాత్రి యింటికి వెళ్ళి, మొట్ట మొదట భగవద్ధ్యానము చేసుకొని, మనమీ పనిలో దిగవలయునా లేదా యని మీలోమీరు ప్రశ్నించుకొని తేల్చుకొన వలయునని మీకు సలహా చెప్పియుంటిని. మీకు అట్టి సూచనగాని, ఆజ్ఞగాని అంతరంగమున గోచరించిన యెడల మీరు స్వయం సేవకులుగ నుండు నిమిత్తమై సంతోషముగ ముందుకు రావచ్చును. మీలో పై ప్రకారము యెవరెవరు ఆచరించిరో తెలియదు. ఆ రోజున అట్లు అంతర్యమున ప్రశ్నించుకొనని వారు, ఈనాడు రాత్రి నిద్రపోక ముందు భగవంతుని ధ్యానము చేసికొని, మీకీ విషయములో పథ ప్రదర్శనము చేయగోరుచు భగవంతుని ప్రార్థించుడు. రేపు వసంతపంచమి సుదినము. కావున, ఈ విషయములో

ఆంతర్యమున నెవరెవరికి ఆజ్ఞ లేక సూచన గలుగునో, వారు రేపు వసంత పంచమి రోజుననే వచ్చి తమ పేర్లను స్వయం సేవకుల పట్టీలో వ్రాయించుకొని, వర్తమానములో ప్రజల కష్టక్లేశములను తొలగించు నిమిత్తమైన యీ పవిత్ర కార్యక్రమములో పాల్గొనుట చాల యుక్తముగ నుండును. మనవలన నీ కార్యక్రమము అల్పముగనే సాగి అందువలన కొద్దిమందికే కష్టక్లేశ రాహిత్యము గల్గినను మనకు సౌభాగ్యమే. వాస్తవములో ఈ సావకాశము గల్గినందుకు మీరు మహా దృష్టవంతుల మయితిమని సంతోషించ వలసి యున్నది. ఈ రాత్రి మీరందరు నింటికివెళ్ళి ఇందుకొరకై తప్పక ప్రార్థన చేసికొనుడు.

## ౩౮

24 జనవరి 1945 తేదీని సత్సంగములో "సత్సంగ కే ఉపదేశ్" రెండవ భాగము నుండి "ఏగ్ ఖ్వాబ్ సే సబక్" అను శీర్షిక గల 8వ నెంబరు వచనమును చదివిరి. అందులో హుజూర్ సాహబ్జీ మహారాజువారు తమకు వచ్చిన ఒక స్వప్నమును గురించి వ్రాసిరి. ఆ దయాళువు ఒకనాడురాత్రి, సత్సంగముయొక్క పురోభివృద్ధికి గల్గుచున్న విఘ్నములు, ఆటంకముల మూలమున నిరుత్సాహముగ చింతాగ్రస్థులై యుండగ నిద్దురవచ్చెను. అప్పుడు వారికి స్వప్నములో నొక వృద్ధ మహాత్ముడగుపడి, నీ కిపుడే యీ స్వప్నములో నీ వ్యాకుల పరిస్థితుల విషయములో సమాధానము వచ్చునని చెప్పెను. ఆ స్వప్నములో సాహబ్జీ మహారాజువారికి ఎదురుగ కొద్ది దూరములో నొక చిన్నమొక్క భూమిలోనుండి పైకి లేచినది. దానికి ధగ ధగ మెరిసిపోవు చున్నట్టియు మనోహరమైనట్టియు మూడు ఆకులు ఉన్నవి. వెంటనే తమ లోపలనుండి యెవరోవ్యక్తి "నీ వ్యాకుల పరిస్థితి కిదియ సమాధాన"మని యనుచు బిగ్గరగ నరచు చున్నట్లు వినపడెను. అప్పుడు వారు నిద్దరనుండిలేచి, తమలో నాలోచించుకొనగా, వారికిట్లు తోచినది. ఈ ప్రపంచము ఒక మహావనము. ఈ వనములోనున్న ఇతర మహావృక్షములతో మనము పోటీచేయుట నిరుపయోగము. మన మొక్కను పాతినవారు సాక్షాత్తు రాధాస్వామీ దయాళురేకదా! వారే దీనిని సంరక్షించి కాపాడెదరు. ఈ చిన్నమొక్క ఒకానొకనాడు తప్పక మహావృక్ష మైపోగలదు.

వచనానంతరము హుజూరు మెహతాజీ మహారాజువారిట్లు సెల విచ్చిరి : సత్సంగమునకు సంపూర్ణమైన అభివృద్ధి కావలెనన్నను, లేదా త్వరలోనే అట్టి అభివృద్ధి కావలయునన్నను, కేవలము సత్సంగ పద్ధతిని నడుచుకొన్నందు వలన నట్లు సిద్ధించ నేరదని యీ వచనమును బట్టి తేట పడుచున్నది. సత్సంగము యొక్క పురోభివృద్ధియు, పురోగమనమునకును, మూడు విషయములు కలిసి ముందుకు సాగుచుండ వలయును అనియే యీ వచనములో సంకేతము చేయబడినది. ఆ మూడు నెవ్వియనగ (1) సత్సంగము (2) చారిటబుల్ సొసైటీలు (ధార్మిక సంస్థలు) (3) ఇండస్ట్రీసును (పరిశ్రమలు). ఈ మూడు కృత్యములు కలిసి ఉన్నత దశకు వచ్చుచుండిన యెడలనే సత్సంగముగూడ ఉన్నతి దశకు రాగలదు. మొట్టమొదటి విషయము ఒక్కదాని వలననే, అనగా సత్సంగ మొక్కదాని వలననే జనులకు విశ్వాసము గలిగించి సత్సంగమున కాకర్షించుట కష్టసాధ్యము. చెప్పుడు మాటలపైన విశ్వాసము పుట్టుట యెట్లు సాధ్యమగును. కాని చారిటబుల్ సొసైటీలు, ఇండస్ట్రీల వలన ప్రభావ మందరికి పైనను పడును. స్వప్నములో జరిగిన విషయమును బట్టికూడ ఈ ముత్త్రివిధములైన సంస్థల సహకారము వలననే సత్సంగమునకు ఔన్నత్యము గలుగ గలదని తేటపడుచున్నది. ఆ కారణముననే హుజూర్ సాహబ్జీ మహారాజువారు మోడల్ ఇండస్ట్రీస్, రాధాస్వామీ ఎడ్యుకేషనల్ ఇన్స్టిట్యూట్, శరణాశ్రమ హాస్పిటలును స్థాపించి, సత్సంగమే గాకుండ మిగత రెండు కార్యములను గూడ ఆరంభము చేసిరి. ఇప్పుడు ఆ రెండింటికీ సంబంధించియే బయటవారు అందరును వచ్చుచున్నారు. అనగా నా అభిప్రాయము వారు మన ఇండస్ట్రీస్‌లోను, కార్ఖానాలలోను తయారైన వస్తువులను కొనుగోలు చేయుచున్నారు. వారల ఆడ మగ పిల్లలను చదువుల నిమిత్తమై మన స్కూళ్ళు కాలేజీల లోనికి పంపుచున్నారు. జబ్బులు చేసినప్పుడు చికిత్సకై మన ఆసుపత్రికిని వచ్చుచున్నారు. ఈ విధముగ సమస్త ప్రజలు చారిటబుల్ సొసయిటీల తోను, ఇండస్ట్రీస్ తోను ఏదో విధముగ సంపర్కము లోనికి వచ్చుచు, వాని కార్యక్రమములో పాల్గొనుచున్నారు. ఒక్క సత్సంగ ప్రచారము మాత్రమే చేయుచుండిన యెడల, సత్సంగములో నున్నవారికి మాత్రమే లాభము సేకూరును. కాని మిగత వారెవరికిని దాని లాభ ముండ నేరదు. కాని మిగత రెండు విభాగములతోను ప్రజలు ఈనాడు కాకపోయిన రేపు, రేపు కాకపోయిన నెల్లుండికాని తప్పకుండ నేదోయొక రోజున సంపర్కము

లోనికి వచ్చి, ఆ విధముగ వారికి సత్సంగముతో సంబంధము కలుగ గలదు. అందుచేత నిదియ సర్వోత్తమ పద్ధతియగును. చెప్పదల్చుకొన్న దేమనగా, సత్సంగముయొక్క ప్రస్తుత పద్ధతి దూరదృష్టితో కూడినదనియు అనుభవ సిద్ధమైనదియు ననియే.

— 4 —

26 ఫిబ్రవరి 1955 హోలీరోజు సాయంకాలము సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి : ఈనాడు హోలీరోజు అని బహుశః మీకు తెలిసియేయుండును. ఒకవేళ యెవరికైనను తెలియని యెడల ఇతరుల నడిగి తెలుసుకొనవచ్చును. ఈనాడు హోలీ అని చెప్పినంత మాత్రముననే మనకెట్లు తృప్తియై పోవును. మనమిట్లేల భావించుకొనరాదు. "గతించిన యేండ్లలో మనకు గల్గుచున్న యుద్ధ బాధలు ఇప్పుడు పూర్తి అయిపోయినవి. మరియు, రాబోయెడి కాలము శోభావహముగ నుండును. మన మీ సంవత్సరములో కష్టపడి పనిచేయుచు నందరము కలిసిమెలసి యుండుచు, పూర్వపు చెడు అలవాట్లను అనగా పూర్వపు నిర్లక్ష్యము, అజాగ్రత్త, సోమరితనములను విడిచిపెట్టుదము. కాలముయొక్క విలువను తెలుసుకొని మసలుకొందము. ఇక ముందునుంచి దృఢసంకల్పముతోను ఐకమత్య భావముతోను అందరము కలసిమెలసి పని చేయుచు, ముందు రాబోవు వసంతకాలము కొరకెదురు చూచుచుందము." కావున హోలీ అని కేవలము అనుటయే సరిపోవునా, లేక కొన్ని శుభకామనలు పెట్టుకొని వానిని పూర్తిచేసుకొనుటకై ప్రయత్నములు సల్పుట కూడా అవసరమా?

— 4 —

ప్రేమీభాయీ దేవకీనందన ముఖ్తారు (బీహారుమనిషి) బర్నాలా సత్సంగమునకు వెళ్ళుటకై చాల కుతూహలముతో నుండెను. ఆయన ఒకసారి దయాల్బాగు వచ్చెను. హుజూరువారు ఆయనను దగ్గరకు పిలిచి కూర్చుండబెట్టుకొనిరి. ఆయన కొరకై ఒక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి. ఈక్రింది శబ్దము వచ్చినది.

గురు ప్యారే సే ప్యారీ మత కర మాన్ ॥ టేక్ ॥

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 42)

శబ్ద పాఠానంతరము హుజూరువారు ఆయనను ఆ శబ్దములోని చరణముల కర్థము అవగాహన మైనదా యని ప్రశ్నించిరి.

సమాధానము : చిత్తము. అర్థమైనది.

హుజూరు వారిట్లు తిరిగి పశ్నించిరి : "సత్సంగుల నందరిని, దయాల్బాగును తమ స్వగృహమని యెంచుకొనవలయునని సాహబ్జీ మహారాజువారు సెలవివ్వలేదా ? మఱియు అందరు దయాల్బాగు హెడ్ క్వార్టర్సుకువచ్చి రాధాస్వామీ దయాళుని రాకకై యిచ్చటనే ప్రతీక్షించవలయుననియు, ఆ దయాళు రెచ్చట ప్రకటమైనను, ఇచ్చటికే తప్పక రాగలరనియు కూడ వారు సెలవివ్వలేదా ?"

దీనికి మీరేమి సమాధానము చెప్పెదరని ప్రేమీభాఈ దేవకీనందన ప్రసాదుగారి నడిగిరి. ఇచ్చట కూర్చుండియున్న ఇంతమంది సత్సంగుల విషయమును వారికి జ్ఞాపకము ఉండకుండపోవునా? వారు వీరినందరి నెట్లు విడిచిపోవుదురు? మీరు ఆ వైపు పోదలచుకొనుటకు ముఖ్య కారణమేమి? సమాధానము : అక్కడ వచనములు చెప్పుచున్నారు. అచ్చట చెప్పెడి వచనములు ఏమిటని హుజూరువారు ప్రశ్నించిరి.

సమాధానము :— దయాల్బాగులో స్టోర్లు, ఇండస్ట్రీస్ ఉన్నవి కాని పరమార్థము పూర్తిగ సమాప్తమై పోయిన దనియె. హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: పరమార్థమును కొంతకాలము వెనుకకు పెట్టి స్వార్థవిషయముల అభివృద్ధికై సత్సంగములో ప్రాధాన్యమిచ్చినను, దానిలో తప్పిదము ఏమియు లేదని సాహబ్జీ మహారాజువారే స్వయముగ "సత్సంగకే ఉపదేశ్" లో వ్రాసియున్నారు. అట్టిపని భావికాలములో సత్సంగాభివృద్ధికి సహాయకము కాగలదు. తిరిగి మీరు చూడుడు: సాహబ్జీ మహారాజువారు స్కూలును కార్ఖానాలను స్థాపించిరి కదా. అందుమూలమున సత్సంగులు, తమ పిల్లలను స్కూలులో జేర్చుటకును, కార్ఖానాలో పని నేర్చుకొనుటకై పంపించుటకును తరుచుగ సత్సంగమునకు వచ్చుచు, సత్సంగ లాభమును పొందుచుండిరి. ఈ కార్యక్రమము ఆ కాలములో యుక్తము కాగలిగినపుడు, ఇప్పుడు స్టోర్లను

కార్ఖానాలను తెఱచి, అందులో సత్సంగులచే పెట్టుబడి పెట్టించి, ఈ కృత్యముల మూలముగ వారిని తఱచు సత్సంగమునకు పిలిపించి దానిలో పాల్గొనునట్లు జరిగించుచున్న కార్యక్రమముకూడ యుక్తమనియే తీర్మానించవలసియుండును కదా. మొత్తము మీద అభిప్రాయ మేమనగా, ఏదోయొక విధముగ సత్సంగులకు తఱుచు సత్సంగములోనికి వచ్చుచుండు సావకాశము కల్పించవలయుననియే. ఈ విధముగ వారికి సత్సంగము లభించుచుండినచో అది చాల ఉత్తమమే కదా: ఇంక మిగిలినది మీకు వచనములు వినవలయుననెడి ఆసక్తియొక్క ప్రశ్న యొక్కటే. ఇందు విషయమై నేనొక మాట చెప్పవలసియున్నది. మీరు ఇంతకాలము సాహబ్జీ మహారాజువారి మహావచనములను వింటిరి. కాని వానిని మీరు మఱచిపోయితిమని ఒప్పుకొనిరి కదా. మఱి మీరు ఈ 7½ సంవత్సరములలో విన్నట్టి వచనములను ముందు కాలములో జ్ఞాపకముంచుకొందురని గారంటీ యేమున్నది? వానిని కూడ మీరు అట్లే మరచిపోయి యెప్పటి వలెనే శూన్యముగ నుండిపోవుదురేమో! ఈ విధముగ మీరు ఒక్కరే మోసపోవుటగాక, మీ గురువును కూడ మోసపుచ్చి మీ సమయమంతయు వ్యర్థపుచ్చుకొనిరి. యథార్థములో, మీకు ఉత్త కబుర్లు వినుటయె సరదా. కాని పని యేమియు చేయుటకిష్టము లేదు.

హుజూరు వారిట్లు మరల సెలవిచ్చిరి : సాహబ్జీ మహారాజు వారు సత్సంగుల నందరిని దయాల్బాగువచ్చి అందరు కలిసి సత్సంగము చేసుకొని అందఱును కలిసి ఆలోచించుకొని విషయము తేల్చుకొనవలయుననియు, దయాల్బాగులో సద్గురువుని కొఱకై ప్రతీక్షించుచు నుండుమనియు, తాము బయట కెక్కడికి వెళ్ళము, ఇచ్చటనే ఉండెదమనియు, సెలవిచ్చి యున్నారు కదా! అట్లున్నప్పుడు మీరు ఒక్కసారి ఇటు, ఒకసారి అటు ఊగిసలాడుట ఆ దయాళుని పై ఆజ్ఞకు పూర్తిగ విరుద్ధముగ నున్నది. చివరకు ప్రేమీభాఈ ప్రభూదయాళు వకీలుగారు ప్రేమీభాఈ దేవకి నందనప్రసాదుగారి తరఫున క్షమాపణ వేడుకొనిరి. తర్వాత దేవకీ నందన ప్రసాదుకూడ క్షమాపణ వేడుకొనెను.

## 42

1945 ఏప్రియల్ మొదటివారములో నొకరోజు ఉదయము సత్సంగములో నీ క్రింది శబ్దము చదివిరి :

అరీ హే సహేలీ ప్యారీ గురు సంగ ఫాగ రచాటీ
మిలా ఔసర భారీ ॥ టేక్ ॥

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 12 (5), శబ్ద 8 )

పాఠానంతరము హుజూరువారు ప్రేమీభాయీ జంగేరీ సింహాతో నిట్లు సెలవిచ్చిరి: క్రితముసారి మీరు కేవలము అభ్యాసము చేయుటవలననే పరమార్థ లాభము కలుగగలదని చెప్పిరికదా. అప్పుడు నేను పరమార్థము ఒక్క అభ్యాసము చేయుటవలననే కాదు, సేవ చేయుట వలన కూడ లభ్యమగునని సమాధానము చెప్పితిని. అభ్యాసము కన్న సేవ చేసి సంపాదించుకొనుట యెక్కువ సులభము. ఈ శబ్దములో ఆ విషయమే చెప్పి ఆ మాటకే సమర్థనము చేసిరి. ఈ విషయములో నిపుడు మీ అభిప్రాయ మేమి? ఇట్లు సెలవిచ్చిరి: భగవంతుని కలిసికొనుటకు సేవచేయుట కూడ ఒక సాధనమే. కావున మనము గురుమహారాజు వారికిని ప్రాణి మాత్రమునకు కూడ సేవ చేయువలయును. సేవ భగవంతునికి కానిమ్ము లేదా వారి అంశరూపులయిన మానవజాతికి కానిమ్ము, యెవరికి చేసినను, భగవత్ప్రసన్నత కొఱకై ఆ సేవ చేసినపుడే వారు ప్రసన్ను లగుదురు. భగవంతుడు ప్రసన్నులైనపుడు వారు సేవకుని ఆత్మను మనస్సును పైకి ఆకర్షించెదరు. అప్పుడు జీవు డే శ్రమయు పడనక్కఱ లేకుండ పైకి ఆరోపించును. కావున ఆ విధముగ సేవకునికి భగచ్చరణములతో కూడిక లభించును. కాని అభ్యాసము ద్వారా క్రిందనుంచి బలవంతముగ సురతును పైకి ఆరోపింపజేయుటకు ప్రయత్నించిన యెడల, మొట్టమొదట విషయము ఆపనిస్వతః చాల కఠినము. రెండవది ఆ దయాళురే స్వయముగ నా సురతును పైకి ఆకర్షించి అచ్చట నిలబెట్టుటకు దివ్యేచ్ఛను ధరించిన పరిస్థితిలోనే అది పైకెక్కి వారి చరణములను అంటుకొని ఉండిపోగలదు. అందుకొఱకై వారిని ప్రసన్నము చేసికొని మీ వైపునకు వారి దయాదృష్టిని త్రిప్పుకొనుట ఆవశ్యకము. ఒక ప్రక్కనుండి అభ్యాసము ద్వారా సురతును పైకెక్కించు ప్రయత్నము చేయుచున్నపుడు రెండవ ప్రక్కనుండి ఆ దయాళురు ఆ సురతు వైపు దృష్టి పెట్టకుండినను, లేదా ఆ సురతును ఒక త్రోవ తోసినను ఆ యాత్మ వశము తప్పిపోయి క్రిందికి పడిపోవును. చెప్పవచ్చినమాట యేమనగా, వారి దయాకటాక్షములు లేనిదే ఊర్ధ్వముగ ఆరోపించుట కఠినము. ఆ భగవంతుడే మిమ్ములను ఆత్మీయులుగ చేసుకొనువరకు నేమియు లభ్యము కాదు.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి: సత్సంగ మనగ నర్థమేమి? సద్గురువుని దగ్గఱ కూర్చుండి శబ్దపాఠమును వినుచుండినచో, నంత మాత్రమున నే అది సత్సంగము అనిపించుకొనదు. పూర్తి శ్రద్ధ వహించనిచో నూఱేండ్లు సత్సంగములో కూర్చుండి శబ్దపాఠము వినుచు నుండిపోయినను, ముఖ్యమైన ఫలితము చేకూరనేరదు. అట్టి సత్సంగిని భగవంతుడు తన ఆత్మీయునిగ చేసికొనజాలడు. కాని మీరు మీ సద్గురువునికి వారి పిల్లలకు సేవ జేసి వారికి సుఖశాంతులు చేకూర్చి వారి కష్టములను నివారించిననాడు వారు మీ సేవకు ప్రసన్నులైన యెడల వారి దయా కటాక్షములు మీపైన బడును. అప్పుడు వారు మిమ్ము తమ ఆత్మీయునిగ చేసుకొందురు. మీకు కార్యసాఫల్యమప్పుడు చేకూరి, సంపూర్ణ పరమార్థము లభించును. అదియ ముఖ్యమైన సత్సంగము. అట్లుగాక మీరు సత్సంగములో కూర్చుండి యుండుచున్నను, మీ శ్రద్ధాధార గృహ విషయములు సాంసారిక విషయములను గురించి ఆలోచించుచు నుండిపోయిన యెడల, మీ కట్టి సత్సంగము వలన నేమియు ఫలితము గలుగనేరదు.

హుజూరువారు పై శబ్దమును తిరిగి చదివించిరి. ఇట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో, వ్రాసియున్న దేమనగా, మీ కిపుడు సద్గురువు లభించి, వారి సేవజేయు సావకాశము గూడ చేకూరినది. కావున మీరీ ప్రపంచిక భయములను దూరముగ నుంచి సంపూర్ణ భక్తితో వారి సేవ చేసి వారు మీపైన ప్రసన్నులగునట్లు చేసికొనుడు. ఈ శబ్ద చరణములలో నెక్కడను ఒక మూల కూర్చుండి అభ్యాసము చేయుమని వ్రాయబడ లేదు. మనము ఏ కృత్యము సులువుగ చేయగలమో దానిని ఏల అంగీకరించరాదు? అభ్యాసము కన్న సేవచేయుట నిస్సంశయముగ సులభమును, అందరికి చేతనైన పనియును. వారే పద్ధతిని కాని లేక యే సాధనము కాని చెప్పుదురో దానినే చేయవలసియున్నది. దానివలననే వారు ప్రసన్నులు కాగలరు. దానివలననే లాభము చేకూరును. వారి మాట ప్రకారము నడుచుకున్నందు వలన లాభ ముండును; మీ యిష్టము వచ్చినట్లు గాని, మీ మనస్సు చెప్పినట్లుగాని నడుచుకొన్నందువలన లాభ ముండదు. అప్పుడు హుజూరు వారీ క్రింది శబ్దమును చదివించిరి!

సతగురు సే కరూం పుకారీ సంతన మత కీజే జారీ।
జీవన కా హోయ ఉధారీ మైం దేఖూం యహీ బహారీ।
(సారబచన్, బచన్ 33, శబ్ద 19)

ఇట్లు సెలవిచ్చిరి : హుజూర్ మహారాజువారు స్వామీజీ మహారాజు వారి చరణములందు సంతు మతమును సకల జనులకు సులభ సాధ్యమగునట్లు వ్యాపింపజేసి సమస్త జీవులకు జీవకల్యాణము గావింపుడని ప్రార్థన చేసిరి. సకల ప్రాణులకును సేవ చేసి, వారి ఉద్ధారము నొనవేరు కార్యము సాగు చుండు నటుల జూచుటయే వారికి ఆనందదాయక మగుటచేతనే వారట్లు ప్రార్థన చేసిరి. ఆ ప్రార్థన చూచి, సకల ప్రాణులకు నదియ శ్రేయస్కర మగుటచే, స్వామీజీ మహారాజువారు సుప్రసన్నులై, వారి ప్రార్థనకు పూర్తిగ అంగీకరించి సార్వజనికమైన సత్సంగమును జారీచేయించిరి. ఇప్పుడు మీరే చెప్పుడు. హుజూర్ మహారాజువారు చేసిన ప్రాణిమాత్ర సేవకును, ప్రాణి మాత్రోద్ధారముయొక్క ప్రార్థనకును, వారి కార్యక్రమమునకును స్వామీజీ మహారాజువారు సంతోషించినపుడు మీరు మేమును ప్రాణి మాత్ర సేవచేసినచో గురుమహారాజు వారు అనగా రాధాస్వామీ దయా ళురు అందువలన ప్రసన్నము కారా ? తప్పక ప్రసన్నులగుదురు. ఆ సేవా కార్యముచే వారు ప్రసన్నులగుచున్నప్పుడు, మీరా సేవచేయుట కేల వెనుదీయుచున్నారు?

ప్రేమీభాఈ జంగీరీసింహ యిట్లనెను.

ఐసీ దివానీ దునియా భక్తి భావ నహిం బూఝే జీ,
కోఈ ఆవే తో బేటా మాంగే, భేంటు రుపయ్యా లీజే జీ ఇత్యాది॥

హుజూరువారిట్లు సెలవిచ్చిరి:- ఇవన్నియు కబీర్ సాహబ్ వారి ఉత్తమ భావములు. లోకములో నందరికి నట్టి భావములులేవు. కబీర్ సాహబ్ వారు, తులసీసాహబ్ వారు మొదలగు సాధుసంతులు చేతివ్రేళ్ళతో లెక్కించ గల్గినంత మందికూడ కనుపించుట కష్టము. జనసామాన్య మంద రును ఆకలి దప్పికలు దారిద్ర్యముతోను అనేక కష్టములు పడుచు, ఆ బాధల నివారణకై ఉత్తరములు కూడ వ్రాయుచునే యున్నారు. ఇప్పుడు మీరాలోచించుకొనుడు. ఈ విధమైన కష్టనివారణకై నా వద్దకు ఉత్తరములు వచ్చుచున్నప్పుడు నే నేమియు చేయకుండ చల్లగ కూర్చుండిన యెడల నట్టి

పని యుచితముగ నెంచబడునా? ఇట్లు అయుక్తవిధముగ నెవరైన ప్రవర్తించి నచో భగవంతు డతని యెడల ప్రసన్నులగుదురా? ఆ జీవులలో భగవంతుడు లేడా? వారి ముఖముల మీద భగవన్ముద్రవేసి యుండలేదా? వారినికూడ భగవంతుడు తన రూపములో నుత్పన్నము చేయలేదా? వారి హృదయములను భగవంతుడే ప్రేరేపణ జేయుటలేదా? ఈ విషయములన్నియు సరియైనచో, మరి ఇప్పుడు మీరే చెప్పుడు. పది పండ్రెండు పవిత్ర గ్రంథములలో పై విధముగ వ్రాసిన బోధలను, కొద్ది మహా పురుషులు ఆయా సమయముల కనుగుణముగ చెప్పిన మహా వచనములను మన్నించి ఆ ప్రకారము ఊరుకొని యుండనా?. లేక వేలకొలది క్షుధార్తులు, రోగగ్రస్తులు ఆపద్గ్రస్తులు నయిన జనుల ఆవేదనములను విని వారల కష్టములను నివారించ బూనుకొన వలయునా? అభ్యాసముచేసి రాధాస్వామీ ధామమును చేరుకొన్నామనియె అనుకొనుడు. అచ్చట హుజూరు రాధాస్వామీ దయాళురు, లోకములో నింత మంది క్షుధార్తులు, రోగగ్రస్తులు, అనాథులు దుఃఖితులు నున్నారుకదా, వారి కష్టములను పోగొట్టుటకై నీవేమి ప్రయత్నము చేసితివని యడుగుదురుకదా! ఫలానా మనుష్యుడు, దుఃఖార్తుల మొరలు వినకుండ చెవులు మూసుకొని తన ముక్తియు తన ఉద్ధారమును సంపాదించుకొను నిమిత్తమెయే నిరంతరము నభ్యాసము చేసికొనుచు నుండెను. కాని భగవంతుని పిల్లల దుఃఖములను నివారణచేయ యత్నించలేదని వారికి తెలిసిన యెడల వారు నిస్సందేహముగ అప్రసన్ను లయ్యెదరు. వారి ధామమునం దట్టివానికి స్థాన మివ్వరు. రాధాస్వామీ దయాళురు ఈ ప్రపంచమునకు జీవుల దుఃఖములను బాపుసేయు నిమిత్తమై స్వయముగ వేంచేసి యుండగ, వారు వీరి కష్టములు, బాధలగాథ వినకుండ చెవులు ఎట్లు మూసుకొందురు? వారట్లు చేసినచో వారిచ్చటకు దయజేసిన ఉద్దేశ్యమునకే భంగము కల్గును. వారి పిల్లల కష్టనివారణకై యెవరైన ప్రయత్నము సాగించిన యెడల నది ఒక విధముగ వారి అవతారోద్దేశ్యము పూర్తి చేయుటకు సహాయకరముగ నెంచబడును. కావున వారట్టి మానవుని సేవాకార్యము వలన నెట్లు ప్రసన్నులగుదురు? ఆ సేవా కార్యము నెఱవేర్చు నిమిత్తమై వారు వచ్చినపుడు, జీవులకు గూడ ఆ సేవ చేయు పాఠమునే నేర్పుదురు.

సర్దార్ జీగారు, భగవంతుడే మన పడవను గట్టున జేర్చవలయును కాని మఱెవరు నట్లు చేయలేరని మీరు చెప్పిన మాట పూర్తిగ సరియే,

ఆ మాటకెవరు నెదురు చెప్పలేరు. కాని నేను చెప్పునదేమనగా, జీవుడు స్వయముగ ఆచరణాత్మకమైన సాధన చేసి తనలో ఉద్ధారమున కధికారము నుత్పన్నము చేసికొన్నప్పుడే భగవంతుడు అతనిని ఉత్తీర్ణుడుగ చేయును. అట్టి అర్హత తనలో పుట్టించుకొన నంతవరకు నతని కుద్ధారము కానేరదు. ఇఁక భగవంతుడే అందరికిని సేవ చేయుచున్నాడని మీరు సేవవిషయములో చేసిన ఆక్షేపణను నేనొక ప్రశ్నమాత్రము వేసెదను. తల్లి పిల్లవానికి పాలు త్రాగించు చున్నప్పుడు రాధాస్వామీ దయాళురే పాలు త్రాగించు చున్నారా? పుండుపడిన రోగికి పుండుమీద మందు అంటించి, పైన కట్టు కట్టినవారు డాక్టరుగారా, లేక ఆ పని అంతయు రాధాస్వామీ దయాళురే చేసిరా? పిల్లవానికి తల్లి పాలివ్వని యెడలను రోగికి డాక్టరు కట్టు కట్టకుండ నుండిపోయినను, ఆ యిరువురును దుఃఖితులుగ నుందురు కదా! భగవంతుడు వచ్చి వారికి సేవా సహాయములను చేయజాలడు. మన మిపుడు స్థూల ఘట్టము మీద నున్నాము. కావున నేను స్థూల ఘట్టము నకు సంబంధించి మాటలాడు చున్నాను. మనలో గల లోపములు దోషము లను గురించియే వివరించితిని. జనుల స్వార్థ సంబంధ మయిన అవసరములు తీరిపోయి వారి లోపములు దోషములు నశించిపోయి నపుడే వారికి పారమా ర్థిక కార్యములో సహాయము లభించి పరమార్థము వైపు ఆకర్షించ బడుదురు. కావున నీ స్వార్థ కృత్యములన్నియు ముందుముందు పారమార్థిక కార్యక్రమము నకు సహాయకమైనపుడు ఈ కార్యక్రమ మంతయు సేవక్రింద లెక్కించ బడును. ఈ వచనము సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చినదే కాని నా చే మియు కాదు.

ప్రేమీభా:ఈ జంగీరీ సింహ శబ్దమునందు ప్రేమ పర్వమునంత వరకు పని నెరవేర లేదనియే.

మహారాజువా రిట్లు సెలవిచ్చిరి : ఎవనికైన యథార్థమయిన సద్గురువుని దర్శన మొక్కసారి అయినను లభించినచో నతని కుద్ధారమై పోయినది. అనగా దీనిని బట్టి మన మప్పుడే రాధాస్వామీ ధామమును జేరుకొంటిమని చెప్పుట సరియేనా? ఇట్టి పంక్తులను బాహ్యదృష్టితో చదివి అర్థము చెప్పుట అనుచితము పొరపాటును అగును. మనము వాని లోతు గ్రహించ వలయును. ఏ సమయమున నే పద్ధతి మార్గమును చెప్పుదురో దానిని జీర్ణము చేసికొని ఆ ప్రకారము నడుచుకొను వరకు భగవంతుని ప్రసన్నతయు

చేకూరదు. జీవ కార్యమును నెరవేరదు. మీరు సమయాను సారముగ పరివర్తించ కుండ యేబది యేండ్లు ఆసనము వేసికొని కూర్చుండి స్మరణ భజనలు చేసినను, మీ కేమియు లాభము కలుగదు.

243

7 ఏప్రియల్ 1945 సాయంకాల సత్సంగములో క్లాసులో వెనుక పడినట్టి మందబుద్ధి గల విద్యార్థులను వారి వారి సంరక్షకులతో కలిసి రమ్మని పిలిపించిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ కాలనీలోని నివాసులకును, విద్యార్థులకును కలుగజేయ బడుచున్న సౌకర్యములకు ప్రత్యామ్నాయముగా వారు ఆవశ్యకముగ పాలించవలసిన కర్తవ్యములు కొన్నియున్నవని మీరు తెలుసుకొన వలయును. వారు ఆ కర్తవ్య పాలనములో లోపము చేసిన యెడల, వారికి ఆ సౌకర్యములను తీసివేయ వలసివచ్చును. అప్పుడు వారు అవి లేక కష్టపడ వలసివచ్చును. ఏలననగా ఈ పనులలో సంపూర్ణ సహకారము ప్రదర్శించుచు, కాలనీకిని సంఘమునకు లాభము కలుగజేయు నిమిత్తమై చెప్పిన పద్ధతులను సంతోషముగ నవలంబించుటకు అందరు నంగీకరించు నంతవరకు నిచ్చటి ప్రబంధము సరిగ నడవను జాలదు. ఈ సౌకర్యములను వారికి శాశ్వతముగ కలుగజేయ సాధ్యమును కాదు. చదువు కొనుటకు అయోగ్యులగు విద్యార్థు లేదైన నొక ఉపయోగ కరమైన ఇండస్ట్రీలో పనిచేయుటకై స్వయంసేవకులుగ చేరవలయును. వారి సంరక్షకులు ఆ పిల్లల నట్లు చేయుటకై ప్రోత్సహించ వలయును. దయాల్బాగులో కార్ఖానాలు తెరచినపుడు అందులో పనిచేయుటకై పనివాండ్రి నిచ్చట నుండియే తీసుకొని ఆ పనిలో పెట్టెదము. పనివాండ్రను బయట నుండియే తీసికొని రానక్కరలేదు. సంఘ శ్రేయస్సు కొరకై ఈ కార్ఖానాలను నడిపించుట అవసరమైనపుడు వానికి పనివాండ్రు ఈ కాలనీలో నుండియే రావలయును. అప్పుడే పని సాగగలదు. మన ఉద్దేశ్యము కూడ పూర్తి కాగలదు. స్వామీజీ మహారాజువారు సర్వసామాన్యమైన సత్సంగమును జారీ చేయించబూని నపుడు వారు అచ్చట ఇరుగుపొరుగులలో నున్నవారినే సత్సంగములో జేర్చుకొనిరి. అందులకై సత్సంగులను ఆకసమునుండి పిల్చి తీసికొని రాలేదు. సాహబ్జీ మహారాజువారు కార్ఖానా తెరచినపుడు,

అపుడు దయాల్బాగులో వచ్చి నివసించుచున్న వారినే యెక్కువ మందిని అందులో పనిచేయుటకు పెట్టిరి. ఇప్పుడు కూడ పరిస్థితి అట్టిదే. ఇపుడు విద్యా వ్యాసంగమును విడిచి కళలు చేతిపనులు నేర్చుకొనుటకు అంగీకరించిన పిల్లలు అవలంబించిన పద్ధతి ప్రశంసనీయము. అప్పుడు హుజూరువారు దివ్యేచ్ఛకొక శబ్దమును తీయించిరి.

కరో రీ సురత గురు చరణ అధారా॥

(ప్రేమబానీ, బచన్ 13 (3), శబ్ద 6)

హుజూరువారు శబ్ద పాఠమైన తర్వాత నిట్లు సెలవిచ్చిరి : మీరు ఉద్ధారము కావలెనని కోరుచున్నారు. అయితే స్వామిజీ మహారాజువారు, హుజూరు మహారాజువారు, మహారాజ సాహబ్ వారు, సర్కారు సాహబ్ వారును ఇండస్ట్రీలను స్థాపించి, వానిలో పనిచేయుడు. మీకు వాని వలననే ఉద్ధారము కాగలదని ఆనతి యిచ్చినయెడల మీరు ఆ ఆనతిని మన్నించెదరా లేదా? అటు పిమ్మట హుజూరు సాహబ్జీ మహారాజువారు దయాల్బాగులో హెడ్ క్వార్టర్స్ స్థాపించి, ఇచ్చట ఇండస్ట్రీలను పెట్టి సత్సంగులయొక్క ఆవశ్యకతలను పూర్తిచేసి, వారి కష్టములను తగ్గించి, వారికి సుఖశాంతులను సేవాసత్సంగ సావకాశములను కల్గించిరి. అయితే యిప్పుడు మీరే చెప్పుడు, వారుచేసిన ఈ పని అంతయు ప్రశంస నీయ మగునో కాదో వారు సమస్త జీవుల ఉద్ధారము గావించవలయునను ఉద్దేశ్యముతోనే నిజధామము నుండి యిచ్చటికి వేంచేసిరనియు, అందు నిమిత్తమెయే మనను తమ చరణములందు లగ్నము చేసికొని, సంభాషణ ప్రవర్తనల విషయములోను, కార్యకారిత్వములోను మనకువారు నేర్పు, యుక్త విధానము, క్రియా కౌశలమును నేర్పి, మనకు భవిష్యకాలములో అవసర మగు రాబోయెడి వస్తుసామగ్రిని గుఱించియు, రాబోవు పరిస్థితులను గుఱించియు ముందు సూచనలిచ్చి. అందుకు సిద్ధముగ నుండునట్లు చేయు చుండిరనియు అంగీకరించబడినయెడల, వారి ఆజ్ఞలను మన్నించి ఆ ప్రకారము నడుచుకొన్న సేవక సత్సంగుల క్రియాకలాపమంతయు పొరపాటని కాని, వారికి పరమార్థ లాభ మేమియు కలుగనే లేదని కాని చెప్పుటకు వీలున్నదా? సాహబ్జీ మహారాజు వారును మన ఇతర పూర్వాచార్యుల వారును నిజమైన సద్గురువులు అయినపుడు వారి ఆజ్ఞల ప్రకారము నడుచుకొన్న వారందరికి నుద్ధా

రము ఆవశ్యముగ కావలసినదే. నేను ఇంతమట్టుకు దృఢముగ చెప్పగలను. ఏమనగా ఇండస్ట్రీలు జారీ చేయించినది వారి ఆజ్ఞమీదనే. కావున, ఇండస్ట్రీస్ వలననే యిక్కాలమున ఉద్ధారము లభించగలదు. కొందరు పిల్లలు వారి అధ్యాపకుల అభిప్రాయము ప్రకారము చదువులు కట్టిపెట్టి ఇండస్ట్రీలలో పని నేర్చుకొనుటయే వారికి మంచిదని సలహా చెప్పినను, అట్లు చేయుట లేదు. అట్టి పిల్లలను గురించి దివ్యేచ్ఛకు శబ్దము తీయుడు, ఈక్రింది శబ్దము వచ్చినది.

గురు ప్యారే సే మిలనా ఉమంగ ఉమంగ ॥ టేక్ ॥
చిత దే సునో గురూ కే బచనా సీఖో ఉన సే భక్తీ ఢంగ్ ॥1॥
కరమ భరమ సబ్ దూర నికాలో ఛోడో సబ హీ కుసంగ్ ॥2॥
గురు కా బల లే చఢో గగన కో కాల కరమ రహే దంగ్ ॥4॥
దీన హీన మోహిం చీన్హా దయా సే, రాధాస్వామీ మిలాయా
అప్నే అంగ్ ॥5॥

(ప్రేమబానీ బాగ్ 3, బచన్ 12 (2), శబ్ద 30)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ విద్యార్థులకే గురువు ప్రియముగ నుండునో, ఆ గురువు వద్దకే వారు వెళ్ళి, ఆయన దగ్గఱనుండి భక్తి విధానము నేర్చుకొందురుగాక. వీరితో మాకేమి సంబంధము? వీరు సాహబ్జీ మహారాజు వారిని వెళ్లి అడిగినచో వారుకూడ ఈమాటనే అనగా డైరెక్టరు ఇండస్ట్రీస్ వద్దకువెళ్లి ఆయన చెప్పిన ప్రకారము నడుచుకొనుమనియె సెలవిచ్చెదరు. వీరు కట్టకడకి దేవపద్ధతికి రావలసియుండును. ఈ పిల్లలు చదువుకొని ఒకానొకనాడు మహారాజులమై పోగలమని, అనుకొనుచున్నారు. వారి కుటుంబములోని వారును, వారి సలహాదార్లును కూడ వారి కట్టిమాటలే చెప్పుచున్నారు. వారి కొఱకై యీ శబ్దములో, "ఛోడో సబ హీ కుసంగ" అని, అనగా, "మీకు సేవామార్గమున పోకుండ అడ్డుచెప్పుచున్నట్టి సహవాసులను వెంటనే విడిచిపెట్టుడు, వారి సలహాలను లెక్కపెట్టవలదు" అని హితోపదేశము చేయబడినది. ఈ విషయములో మీకు ప్రెసిడెంటుగారును డైరెక్టరు ఇండస్ట్రీస్‌ను లిఖితరూపమునగాని మూజువానీగాకాని యిచ్చెడి ఆజ్ఞలను మీరు పూర్తిగా పాలించవలసియుండునని మీరు జ్ఞాపకముంచుకొనవలయును. ఇప్పుడు పేర్లు ఇచ్చిన విద్యార్థులకు సమస్త సౌకర్యములను పొందుటకు అధికారమున్నది.

వెనకనుండిపోయినవారు సౌకర్యములు పొందుట విషయములో గూడ వెనక పడవలసి వచ్చును.

-44-

22 ఏప్రియల్ 1945 సాయంకాల సత్సంగములో హుజూరువారు చరఖామీద నూలువడుకుటలో పోటీల సందర్భములో నిట్లు సెలవిచ్చిరి: ఇంతకుముందు వందలకొలది స్త్రీలు గతించిన మూడు నాలుగేండ్లలో లేడీస్ హోజియరీ ఇన్స్టిట్యూటులో అనేకరకముల పనులు చేయుచుండెడివారు. ఇప్పుడా పని తగ్గిపోయినది. కాని గతించిన మూడేండ్లలో ఈ స్త్రీలు హోజియరీ పనిచేసి తమ స్వభావమును పనిచేసెడి తత్త్వముగలదిగ, నెట్లు చేసికొనిరో, అట్లేవారు తమ స్వభావమును మరింత వికసింప జేసికొని ఇంక నెక్కువ పని చేయుచుండినచో యుక్తముగ నుండును. ఈ స్త్రీలు ఇంత యెక్కువ పరిశ్రమ ప్రయత్నము చేసి తమలో జనింపచేసుకొన్నట్టి ఉత్తమ స్వభావము, కొంతకాలము పనిలేకుండ చేతులు కట్టుకొని కూర్చుండి నందు వలన నశించి పోకుండుగాక. వీరి కీ యుత్సాహము ఈ విధమున నుండుటయే గాక దినదినాభివృద్ధి నొందునట్లు భగవంతు డనుగ్రహించుగాక, ఇచ్చటి స్త్రీలలో నీ విధమైన పనిచేయు స్వభావము సర్వసాధారణమైనయెడల నీకాలనీ ఒక ఆదర్శకాలనీ అయిపోగలదు. బయటనుండి పెద్ద మనుష్యు లెప్పుడైనను వచ్చి ఇచ్చటి స్త్రీ పురుషులు బాల బాలికలును ఏదో యొక పనిచేయుచు సొంతముగ ధనోపార్జన చేసుకొనుట చూచినపుడు వారు చాల యెక్కువగ ప్రభావితులు కాగలరు. ఈ కాలనీ స్థాపించుటలో నొక ముఖ్యోద్దేశ్యము కూడ ఇచ్చటనుండు వారందరు పరిశ్రమీజీవులుగ నుండవలెననియెడు విషయము. ఈ స్త్రీలకు అవగాహనమై వారు ఆ విశ్వాసముతో పనిచేయుచుండిన యెడల ఇచ్చటి పరిస్థితియే పూర్తిగ మారిపోగలదు. ఇచ్చట నుండునట్టి ప్రతివ్యక్తియు నా యుద్దేశ్యమును తెలుసుకొని, కార్య రూపములో బెట్టి ఆ ఆదర్శప్రాప్తికై గట్టి ప్రయత్నము చేయుచుండుట యుక్తము. ఇప్పుడు హోజియరీఫాక్టరీ, టెక్స్టైల్ ఫాక్టరీ, జనరల్ ఫాక్టరీలలోను, మెషీన్ల పైనను, పని చేయుటకును ఇంక నితర కృత్యములు చేయుటకును పనివాండ్రు అవసరముగ నున్నది. అందులో కొన్నిపనులు కార్ఖానాలోనే చేయవలసియుండును, కొన్నిపనులు యిండ్లవద్ద నుండియే చేసుకొనవచ్చును. చర్ఖీలకు

దారముచుట్టుట, మగ్గముమీద పడుగుదారము పఱచుట. మేజోళ్ళు వగైరాలు మెషీన్లపైన అల్లుట, జోళ్ళ త్రాళ్ళు మెషీనుమీద తయారుచేయుట, దారము కడిగి రంగువేయుట, కుట్టుపని, చినిగిన పాతబట్టలను కట్టి బాగు చేయుట, హోజియరీ సామాను ఇస్త్రీచేయుట, ఆ వస్తువుల అడుగు భాగము లను కలిపి ముళ్ళువేయుట, బొత్తాములను అట్టలకు కుట్టి పెట్టెలలో నమర్చుట వగైరా పనులు ఇప్పుడు 200 మంది ఆడవాండ్రకు సరిపడినన్ని యున్నవి. రెండు మాసములు పనినేర్చుకొన్న పిదప నెలకు రు 20/లు సంపాదించుకొనగల యోగ్యత వారికి గలుగును. మొట్ట మొదట కొన్నాళ్ళు బెదురుగనే ఉండ గలదు. కాని కొన్ని రోజులు అలవాటుపడిన తర్వాత స్త్రీలు మామూలుగా కార్ఖానాకు వెళ్ళి పని చేయగలరు. సత్సంగ సంస్థలలో పనిచేయవలయునను ఉత్సాహము హృదయమున నుంచుకొని పని ఆరంభించి చేయుచున్న యెడల, జబ్బుస్త్రీలకు కూడ జబ్బులు దరిజేరనేరవు. పని చేయుటవలన వారికి చిత్తము సంతుష్టముగ నుండి శరీరము గూడ చురుకుగ నుండును. వారు బుద్ధి సూక్ష్మముగ నుండి, తాము ఉన్నతి నొందుచున్నట్లును తెలుసుకొందురు. చిట్టచివర, వారిలో నెవరెవరు పనిచేయుటకు ఉద్యుక్తులై యున్నారని హుజూరువారు ప్రశ్నించిరి. రమారమీ నలువదిమంది స్త్రీలు చేతులెత్తిరి.

## 245

8 జూలై 1945 .ఆదివారమునాడు పిల్లల సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి:- మీరు దయాల్బాగులో నిచ్చట నియమములను పాటించుచు నుండిన యెడల మీకెప్పుడు శాంతిగనే యుండును. మీకు ఇక్కడ ఉన్న సమయములో నేదైన కష్టమున్న యెడల మీలోమీరు కలిసి దానిని నివారించుకొన యత్నించుడు. అట్లు నివారణ కానియెడల మీరు మీ ఉపాధ్యాయులతో గాని, వార్డెనుతో కాని చెప్పుకొనవచ్చును. మీకు తృప్తి గలుగని యెడల ప్రిన్సిపాలుగారితో కూడ చెప్పుకొనవచ్చును. ఆదివారము నాడు మీరిచ్చటికి వచ్చినపుడు ఇచ్చటకూడ మీరు చెప్పుకొనవచ్చును. మీరు ఇచ్చటనున్నపుడు మీ ధ్యానమెప్పుడు చదువుమీదనే పెట్టుకొని మీ కాలముయొక్క విలువను గమనించుట నేర్చుకొనుడు. వ్యాయామముచేసి

మీ శరీరారోగ్యమును సరిగ నుంచుకొనుడు. మీ సమయమును ధనమును వ్యర్థ విషయములలో వెచ్చించరాదు. అట్లు చేసినందువలన మీరెప్పుడు సంతోషముగ నుందురు. జీవితములో సాఫల్యము చేకూరగలదు. మీరు ఇచ్చటి విద్యాలయముల నుండి సంపూర్ణలాభము నొందగలరు.

143

కొంతమంది సిఖ్ఖులు జిజ్ఞాసువులుగ వచ్చి, సత్సంగములో కూర్చుండిరి. ఉదయ సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి:

అరే సుమిరన కర లే మూఢ జనా క్యోం జగసంగ భూల భులానా రే!

(ప్రేమ బిలాస్, శబ్ద 60)

పాఠానంతరము, హుజూరువారు ఆ సిఖ్ఖులను, మీరీ శబ్దమును శ్రద్ధగా విని దాని తాత్పర్యమును అర్థము చేసుకొన్నారా అని ప్రశ్నించిరి.

ఒక సిఖ్ఖు శబ్దముయొక్క అర్థమును సరిగా సంతులు ఒక్కరే తెలుసుకొనగలరు. మే మందరము చీకటిలోపడి తిరుగుచున్నాము. మీకు గురువు ఉన్నారుకదా! మీరు ఆ గురువుని భక్తులు గనుక మీకు త్రోవతప్పి తిరుగుటయేమి, అని హుజూరువారు సెలవిచ్చిన మీదట వారిలో నొక సిఖ్ఖు "నిజమే మాకు గురువుగారు ఉన్నారు. వారు మాకు పథ ప్రదర్శనము చేయుచున్నారు. అయితే నేను అంధకారములో పడి త్రోవ తెన్ను తెలియకుండ తిరుగుచున్నానని నా అవస్థను చెప్పుకొన్నా"నని సమాధానము చెప్పెను. హుజూరువారు మీరు చెప్పినమాట వాస్తవమే. సంతులు లభించుట చాల కఠినము.

మేము మీ దర్శనము చేసుకొని సుఖమును పొందుదమని వచ్చితిమని ఆ సిఖ్ఖు చెప్పిన మీదట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: అదియే మీరు చేసిన గొప్ప పొరపాటు. నిజమునకు మీ దర్శనము లభించుట మా యొక్క భాగ్యమే. కాని మీరు గ్రంథ సాహెబ్ ని గురువుగ మన్నింతురు కదా. ఇంక మీకుగురువు అవసర మేమున్నది? ఒక సిఖ్ఖు యిట్లు సమాధానము చెప్పెను:

నిజముగ గురుగ్రంథ సాహెబ్ మా గురువు. మాకు ఆవశ్యకమైన హితోప దేశము లందున్నవి. కాని అది ఒక తాళము వేసిన కోశాగారము వలె నున్నది. దాని తాళముచెవి సజీవసంతుల వద్ద నున్నది. వారే దానిని తెరువగలరు. అందుండి ధనమును పైకి తీయగలరు. మాకు అట్టి యోగ్యత లేదు.

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి! ప్రాచీన కాలములో నుండి ఇప్పుడు లేకుండ నున్న వారినే సంతులని అందరు నిక్కాలమున మన్నించుచున్నారు. లేదా కాషాయవస్త్రములు ధరించి దేశ దిమ్మరులై తిరుగులాడు వారినైన సంతులని అందురు. సర్వద్రష్ట, సర్వవ్యాపకుడు నైన పురుషుడే గురువు. గ్రంథ సాహెబ్‌ని అవగాహన చేసుకొనుటకు అట్టి సజీవ సద్గురువు కావలెను. అట్టి పురుషుని సహాయము లేనిదే ముందున కెంతమాత్రము వెడలిపోజాలము.

సిక్కు-సోదరుడు ఇట్లు సమాధానము చెప్పెను. దాని తాళముచెవి తమవంటి మహా పురుషుల చేతిలో నున్నది. ఆ కోశాగారమును తమరే తెరవగలరు. గ్రంథసాహెబ్ మాకు గురువే, ఎప్పుడుకూడ మా గురువే. పరమావధి స్థానము మీకు మాకును గూడ నొక్కటే. శబ్దమును పట్టుకొన కుండ ఆ గమ్యస్థానము నెవరు జేరుకొన జాలరు. గురుగ్రంథ సాహెబ్‌లో శబ్దముయొక్క రహస్యము వ్రాసియున్నది. కాని సజీవులైన సద్గురువే ఆ శబ్దముతో జీవుని కలపగలరు. సద్గురు చరణముల సన్నిధిని కూర్చుండియే శబ్దముయొక్క రహస్యము పొంద శక్యమగును. హుజూరువారు ఆ సమాధానము విని చాల సంతోషించిరి. మీకట్టి అభిప్రాయ మున్నట్లయితే మీరు నిజముగ సిక్కులే. ఆ భావములో నేనుకూడ సిక్కునే. ఎవరైతే తన గురువునకు నిజమైన శిష్యుడో, అతడే సిక్కు. నా అభిప్రాయములో, ఇచ్చటి సంఘములోకూడ ఈ పై అర్థము ప్రకారము తమ్ము సిక్కులుగా చెప్పుకొనువారు చాలమంది ఉందురు. (హుజూరువారు చెయ్యి ఎత్తగనే చాలమంది వారి మాటను సమర్థించుచు చేతులెత్తిరి.)

సిక్కు-సోదరుడు : అట్లు అనుట తమ మహత్తుయొక్క లక్షణము.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : సిక్కులకు తమ గురువులయందు సంపూర్ణ భక్తిశ్రద్ధలున్నవి. కావున ఆ అర్థములో వారు నిజమైన సిక్కులు,

-- ౭ --

18 సెప్టెంబరు 1945 సాయంకాలము సత్సంగములో హుజూరువారి కుర్చీకి ఇరువైపులను పదునాల్గు అడుగులు పొడుగైన పశువుల మేత మొక్కలను, రెండు మొక్కలను నిలబెట్టిరి.

శబ్ద పాఠానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఎన్నియో యేండ్లనుండి దయాల్బాగ్ ఇండస్ట్రీస్ డైరెక్టరుగారు దయాల్బాగు శ్రమ జీవులెంత పరిశ్రమ జేయుచున్నారో మీకు తెల్పుటకై, వారు తయారు చేసిన వస్తుసామగ్రిని ఏడాదికి 4,5 సార్లు భండారాల సమయములలో మీ యెదుట ప్రదర్శించు చున్నారు. ఈ రోజున దయాల్బాగు పొలములలో కర్షకులు ఉత్పన్నము చేసిన రెండు పశువులమేత మొక్కలు మీ యెదుట పెట్టబడినవి. ఇంతవరకు ఈ పశువుల మేత మొక్కలు 5, 6 అడుగుల పొడవుగ నుండుట తెలుసును. కాని మీ యెదుట పెట్టిన మొక్కలవలె 14, 15 అడుగుల యెత్తు చూడలేదు. వినలేదు. ఇచ్చటి పశుగ్రాసపు మొక్కలు 5, 6 అడుగుల పొడవునకు బదులు 15, 16 అడుగుల పొడవు, అనగా యీ పెండాలు చూరునకు కొద్దిగ తక్కువ యెత్తువరకు పెరుగుట గతించిన రెండు మూడేండ్లు నుండియు ఇచ్చటి కర్షకులు కష్టపడి చేసిన పరిశ్రమ యొక్క ఉజ్వల పరిణామమే అని నిశ్చయముగ చెప్పవచ్చును. ఈ కర్షకుల పరిశ్రమకు రెండవ ఉదాహరణ ఈ రబీ పంట ముఖ్యముగ గోధుమలు బహు సంతోష ప్రదమగునట్లు పండినవి. క్రితము పంట మీకు అందరకు కూడ పంచి పెట్టితిమి. ఈ సంవత్సరము పంట సగటున బయట పండిన పంటకన్న చాల అధికముగ నున్నది. బయట సగటున యెకరమునకు గోధుమలు 8, 10 మణుగులు పండుచున్నవి. కాని ఇచ్చట అందుకు రెట్టింపు పండుచున్నవి. ఈ విధముగ నీ రెండు సంవత్సరములలో దయాల్బాగు శ్రమజీవులు, కర్షకులును కష్టపడి తయారుచేసిన వస్తువులును, పండించిన పంటధాన్యములను మీ యెదుట పెట్టితిమి. మీరు ఆ రెండు రకముల సరుకులను ఉపయోగించు కొని చూచిరి. కావున మీరిపుడు ఈ ద్వివిధ సామగ్రియు దయాల్బాగునకు స్థిరత్వమును అభివృద్ధియు గల్గించుట కుపయోగించునని ఒప్పుకొనవలయును. కావున ఇచ్చటి కర్షకులయొక్కయు శ్రమజీవులయొక్కయు ఈ ద్వివిధ సేవ కొంతకాలము

నుండి అమూల్య లాభదాయకముగ నున్నది. ఇక ముందు శ్రమజీవుల యొక్కయు కర్షకులయొక్కయు రాజ్యమును స్థాపించెదమని కాంగ్రెసు వారు మాటలు చెప్పుచున్నారు. దయాల్బాగు ప్రత్యేకముగ శ్రమజీవులు కర్షకుల యొక్క వలస గ్రామమే అనియు, అట్టివారి మహాత్వమె ఇచట వ్యాపించి యున్నదనియు కాంగ్రెసు సభ్యులు చూచి తెలుసుకొన్నప్పుడు వారు ఆశ్చర్య చకితులు కాగలరు.

ఆ తర్వాత నిట్లు సెలవిచ్చిరి : మీరు పశువులమేత మొక్కల నెంత యెత్తున ఉత్పన్నము చేయుదురో మీ సేవకు అంత యెక్కువ ఫలితముండును, అంతయెక్కువ త్వరితముగ మీ యుద్ధారము కూడ అయిపోవును. మీరు అయిదడుగుల మేత మొక్కలు, అయిదు మొక్కలు కోసినచో మొత్తము 25 అడుగులు పొడువు అయినది. కాని 14 అడుగులు పొడుగైన అయిదు మొక్కలు కోసినచో 70 అడుగులు అయినది కదా. ఈ పొడుగు మొదటి కన్న 45 అడుగులు ఎక్కువ యున్నది. ఈ విధముగా మీ సేవకు పరిణా మము కూడ పెరిగినది. మీకు మొదటికన్న త్వరితముగ ముక్తిపొందుట కధికారమును గల్గినది. కుర్చీకి ఇరుప్రక్కల నిలబెట్టిన యీ రెండు పశు గ్రాసపు మొక్కలును, వాస్తవముగ సత్సంగమును సత్సంగులను సంరక్షిం చుటకై నియమించబడిన సత్సంగముయొక్క పహరావాండ్రు, ఇచ్చటి యెరు వులు, పరిశ్రమ, మీ అందరి సహకారము, డైరెక్టరుగారి కృపయు, వీని అన్నిటి వలన నెట్టి ఉజ్వల పరిణామము గలిగెనో, ఇప్పుడు ఈ మొక్కల పొడుగు, క్రితము రబీపంట యొక్క సంతోషప్రదమైన ఫలసాయమును చూచిన మీదట మీ అంతట మీకే తెలియగలదు. ఇకముందుకూడ భూము లను చక్కగ దున్నుచు, పర్యాప్త పరిమాణములో భూములకు, నీరుపెట్టి ఎరువులను వేయుచుండిన యెడల, ఇంతకన్న నెక్కువ ఫలసాయము గూడ పండించవచ్చుననియు, క్రితము మూడు సంవత్సరములనుండియు ఆరంభించి చేయుచున్న కృషికార్యము మీరూహించుకొనలేనంత యధికముగ అభివృద్ధి కాగలదనియు నాకు దృఢ విశ్వాసమున్నది.

## _‹8

ఆదివారము పిల్లల సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి:

సతగురు దీజే మోహిం ఇక దాత్ ॥ టేక్ ॥
నీచ నిబల మైం గున నహీం కోఈ,
బల పౌరుష కుఛ జోర న గాత్ ॥1॥

(ప్రేమ బిలాస్, శబ్ద 78)

శబ్ద పాఠమైన పిదప హుజూరువారు పిల్లలను ఇట్లు ప్రశ్నించిరి. మీరు కోరునదెట్టి వరదానము ?

ఒక విద్యార్థి : మేము ప్రేమీ భక్తుల వరదానమును కోరుచున్నాము.

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ప్రేమ భక్తుల వరదానమునకు పూర్వలక్షణమైనట్టియు, మీకుజీవన సంగ్రామములో సఫలత చేకూర్చునట్టియు రహస్యము ఏమనగా, మీరు మీ మానసిక వాసనలను ఇప్పటినుంచియు కొద్దిగొప్ప అణచుకొనుట నేర్చుకొనవలయును. చిత్తవృత్తిని చంచలముచేసి దిగ్భ్రమము చేయునట్టి సినిమాలకు పోకుండగను, వ్యర్థముగ వీధులలో షికార్లు కొట్టకుండగను ఉండవలయును. అట్లు చేసినందువలన మీకు జీవితములో సాఫల్యము చేకూరగలదు, ప్రేమదానమును లభ్యమగును. తర్వాత నీ క్రింది శబ్దమును చదివిరి:

పంచమ కిలా తఖ్త సుల్తానీ చాదశాహ సచ్చా నిజ జానీ॥

( సారబచన్, బచన్ 26, శబ్ద 5 )

పఠనానంతరము హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దమును విన్న మీదట, మీరే దీప ప్రకాశములు, తమాషాలను చూచుటకొరకును, ఏ సంగీత రాగములు వాద్యములును వినుట కొరకును ఆసక్తిగొని పిచ్చివాండ్రవలె నైపోయి, ధనమును ఖర్చుపెట్టుకొని సినిమాలకు వెళ్ళుచున్నారో ఆ దృశ్యములు సంగీతములును అన్నియు మీ ఆంతర్యముననే ఉన్నవనియు ఏ ఖర్చుపెట్టనక్కఱలేకుండగనే మీరు వానిని విని చూడగలరనియు మీకు బోధపడి యుండగలదు. బాహ్య విషయములను చూసి, అందుకొరకై మీ

శక్తిని, ఎనర్జీని ( Enrgy ), కాలమును, ధనమును నష్టపెట్టుకొని, దుర్వృత్తుల నలవరచుకొనుటకు బదులు మీరా విషయముల నాంతర్యముననే చూచుకొన యత్నించ వలయును. మీకిప్పుడు చెప్పిన హితబోధ ప్రకారము మీరు నడుచుకొనుచున్న యెడల, మీరీవిషయములు దృశ్యములును ఆంతర్యమున దర్శించుట అసాధ్యము కానేరదు.

ఇట్లు సెలవిచ్చిరి: నాలాగఢ రాణీగారు, నాలాగఢ యువరాజు మొదలగు వారు ఇప్పుడు వచ్చిరి. ఆ యువరాజు త్వరలో రాజుగారు అయిపోవనున్నాడు. కావున అతనికి యుక్తముగ సలహా యివ్వవలయును. నాలాగఢ రాణీ నన్ను అట్లు చేయుడని కోరినది. ఈ విషయములో దివ్యేచ్ఛకు రెండు శబ్దములను దీసి పాడిరి. ఇట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములలో యువరాజునకు లాభకరమైన హితోపదేశ మున్నది. అప్పుడు యువరాజును, మీకీ శబ్దములు అర్థమైనవా యని హుజూరువారు అడిగిరి. ఆయన తనకు ఈ శబ్దములు చాలవరకు అర్థమయినవని జవాబు చెప్పిరి. తిరిగి దివ్యేచ్ఛకు మూడవ శబ్దమును తీసిరి.

జోడ్ రీ కోఈ సురత నాము సె ॥ టేక్ ॥

(సారబచన్, బచన్ 15, శబ్ద 16)

ఇట్లు సెలవిచ్చిరి:- ఈ శబ్దములలో సలహా పారమార్థిక దృష్టి కోణముతో నివ్వబడినది. కాని ఆ సలహా సామాన్య జనుల దృష్టి కోణముతో చూచినను యుక్తముగనే యుండగలదు. మీరు రాజ్యపదవిలో శాసకులైనపుడు మీ క్రిందివారి విషయములో ఔదార్యము దయాభావముతోను ప్రవర్తించ వలయును. దయా స్వభావముగల తండ్రికి తన పిల్లవాని యందు దయాభావము ఎట్లుండునో, మీకుకూడ మీ ప్రజల యందట్టి దయ ఉండ వలయును. వారి కష్టములు మొరలు విని, వానిని నివారించుటకు యత్నించ వలయును. ప్రభుత్వముతో సహకారముగ నుండవలెను కాని ప్రతి కృత్యము లోను ప్రజల క్షేమ లాభములకు ప్రాధాన్య మివ్వవలయును. వీలైనంత వరకు ప్రతి కార్యములోను ఇదియ దృష్టికోణము పెట్టుకొనుచుండ వలయును. అట్లు చేసినందువలన మీ రాజ్యమునకు ఉన్నతి గలుగ గలదు, చివరకు మీరు భగవంతునికి కృపా పాత్రులును కాగలరు.

# 5

31 డిసెంబరు 1945 సాయంకాల సత్సంగములో నీ క్రింది శబ్దము చదవబడినది.

బిరహినీ గురు కీ సరన సమ్హారీ।

(సారబచన్, బచన్ 19, శబ్ద 8)

ఇట్లు సెలవిచ్చిరి:- ఈ రాత్రి 12 గంటలకు ఈ సంవత్సరము అంత్యమై క్రొత్త సంవత్సరము ప్రారంభమగును. కనుక ఇచ్చటినుండి యిండ్లకు వెళ్ళినతోడనే యీ సంవత్సరము ముగియుటకు మిగిలియున్న కాలములో మీరు ఈ సంవత్సర మంతలోను జరిగించిన కలాపమును నిరీక్షించుకొని, యీ సంవత్సరములో మీరు సొంతమునకుగాని మనుష్య జాతికిగాని యేమైన మంచి పనిచేసిరో, లేదో చూచుకొనుడు. మీరు మీ కాలములో నెంత సమయము వ్యర్థముగ పాడుచేసికొనిరో యెంత సమయము యుక్తముగ నుపయోగించిరో పరికించి చూచుకొనుడు. రెండవ విషయము నేను మీకు చెప్పదల్చుకొన్న దేమనగా, మీలో నిచ్చటకు ఏడాదికి 1, 2, 3 సార్లు వచ్చుచుండెడివారు యిచ్చటికి అట్లు తరుచు వచ్చినందువలన తమకేమైన లాభము గలిగినదో లేదో చూచుకొనుడు. అయితే లాభమనగ నెద్ది యను ప్రశ్న పొడముచున్నది. ఈ విషయములో సాహబ్జీ మహారాజువారు ఇట్లు సెలవిచ్చుచుండెడివారు. ఏమనగా, సత్సంగమునకు వచ్చెడి మనుష్యులు తామిచ్చటికి వచ్చినందువలన తమ హృదయములలో ప్రేమాగ్ని కణము రవులుకొనుచున్నదా లేదా అనియు, మరి యెవరిలోనైన నా అగ్నికణము అంతకుముందే రవుల్కొని యున్నయెడల, అది ముందు కన్న నిపుడెక్కువ తీక్ష్ణమగుచున్నదా లేదా అనియు పరికించుకొనవలయును. ఇచ్చటకు వచ్చుచుండినను వారిలో ఆ కణము అట్లు రవుల్కొనక పోయినను, లేదా రవుల్కొన్న కణము మరింత తీక్షణము కాకుండినను వారు దానిని రవుల్కొను లాగునకాని, తీక్ష్ణమగునట్లుగాని చేయుటకై యుపాయము నాలోచించుకొని, అట్లు ప్రయత్నము సాగించుకొనవలయును. ఇట్లాలోచించుకొని తమ లోపములను గమనించుకొనుచు ముందు సంవత్సరము తామే పద్ధతిని నడుచుకొనవలయునో నిర్ణయించుకొనవలయును. అట్లు చేసిన యెడల, క్రొత్త సంవత్సరము ఆరంభము నుండియు నావిధముగ పనిచేయుచు, దానిని సదుపయోగములోనికి తెచ్చుకొనవచ్చును. ఇదంతయు పారమార్థిక విషయములో చెప్పినమాట, ఇప్పుడు స్వార్థ దృష్టికోణమును బట్టి కూడ ఆలోచించు

కోనుడు. మీలో నెవరైతే ఇచ్చట సరుకులు కొనుగోలుచేసి యింకను వాని ఖరీదు కట్టలేదో వారును, ఈ సంవత్సరము తాలూకు బిల్లులు ఇంకను చెల్లించకుండ బాకీపెట్టిన వారును, వెంటనే ఆ మొత్తములు చెల్లించి అక్కౌంట్లు పూర్తి చేసికొన వలయును. ఈ సంవత్సరమే, అనగా మిగిలి యున్న యీ ఒకటి రెండు గంటల లోపుననే వారు ఆ మొత్తములు జమ కట్టి, క్రొత్తసంవత్సరము ప్రారంభమగు సరికే బాకీ లేదనిపించు కొన్నయెడల నింక నెక్కువ శ్రేష్ఠముగ నుండును. ఇప్పుడే వెంటనే చెల్లించ జాలని యెడల, రేపటి లోపున అక్కౌంటు తేల్చుకొని బాకీలేకుండ అక్కౌంటు ముగింప జేసుకొన్న యెడల నిచ్చటనుండి పోవునపుడు నిశ్చింతగ నుండును. రేపు ఉదయముకాని, లేక రేపు అంతలో నెప్పుడైన కాని వారు తమతమ బాకీ మొత్తములను కట్టివేసినచో, ఆ బాకీలు ఈ సంవత్సరములో చెల్లించ బడినట్లే యెంచుకొనబడును. కాని యెవరైనను పాతబాకీ తీర్చకుండ నుండి పోయి, వారి పేర్లు సత్సంగ లెడ్జరులో తిరిగి వ్రాయవలసి వచ్చినయెడల, హుజూరు సాహబ్జీ మహారాజువారి సమ్ముఖమున జనరల్ రిపోర్టు పెట్టినపుడు వారి బకాయీ పెట్టిన వారిపేర్లు అందులో చూచి, వారిని ఆడిట్ విభాగము నకు సముజాయిషీ చెప్పకొనుటకై పంపించెదరు. వారు అప్పుడా ఆడిట్ విభాగమువారు వేసెడి ప్రశ్నలకు సరియైన సమాధాన మిచ్చుకొన వలసి యుండును. అట్టి పరిస్థితి నుండి తప్పించుకొన గోరువారు ఇచ్చటనే వారి ఎక్కౌంట్లు పూర్తిగ బాకీ లేకుండ చేసుకొనియే వెళ్ళవలయును.

రాబోవు సంవత్సరము మీరు ఇచ్చటికి వచ్చినపుడు, ఒక్కొక్క వస్తువును ఒక గ్రోసు మూర్తులకు తక్కువ గాకుండ, కొనుగోలు చేయువల యునని నిశ్చయము చేసికొనిరండు. సాధ్యమైనంత వరకు ఒక గ్రోసు మూర్తుల కన్న నెక్కువయె కొనవలయును. ఇచ్చట నుండి వెళ్ళిన తర్వాత మీరీ సరుకును ఒక్క స్టోర్సులోనే పెట్టి అమ్మవలయు ననుకొనరాదు. స్టోర్సు కాకుండ యితర దుకాణములలో గూడ పెట్టి అమ్మవచ్చును. లాభములు తక్కువ వచ్చినను మీరు లెక్క సేయ వలదు. మీ మీ పట్టణ వాస్తవ్యు లకును ఇరుగు పొరుగు జనులకును గూడ తగు కమీషనుల మీద ఏజన్సీలు ఇచ్చి, సరుకులు అధికాధికముగ చలామణి అయిపోవు నట్లు చూడ వల యును. సేల్సు పెరిగిన యెడల ఇచ్చటి కార్ఖానాలకు ఉత్సాహము గలు గును. ఇంక నెక్కువ ఉత్తమమైన సరుకు చవుక ధరకు తయారు కాగలదు.

కావున మీరిచ్చట నుండి వెళ్ళిన తర్వాత ఇతరుల వద్దనుండి ఆర్డర్లు సంపాదించుడు. వారితో వ్యవహార సంబంధము నేర్పరుచు కొనుడు, కలిసి మెలిసి యుండుడు. మీరు జనవరి నెలలో ఈ పని చేసి విక్రియముల క్షేత్రమును పట్టుదలతో విస్తృతము చేసి, వేర్వేరు స్థలములలో ఏజన్సీలు ఏర్పాటు చేసిన యెడల, మన సరుకుల విక్రియములు నిస్సంశయముగ పెరిగి, మన కార్యక్రమము చిరస్థాయిగ సాగిపోగలదు. విక్రియములు పెరిగిపోవు చున్నకొలది మన సరకుల ధరలు క్రమక్రమముగ తగ్గిపోవుచుండును. ధరలు తగ్గి సరుకు అధిక శ్రేష్ఠముగ తయారైనపుడు జనులలో నీ సరుకు కెక్కువ చలామణి పెరిగిపోవును. మన వస్త్రోత్పాదన 1942 వ సంవత్సరములో నొక కోటి రూప్యముల విలువ గల్గినదై యుండెను. అది క్రమక్రమముగా పెరిగి 1943లో ఒక కోటి పదుతొమ్మిది లక్షలయ్యెను. 1944లో ఒక కోటి ఇరువది ఏడున్నర లక్షలకు మించిపోయెను. 1944 తర్వాత వస్త్రోత్పాదన తగ్గి అతి కష్టము పైన నొక కోటి రూప్యముల వరకు వచ్చెను. అందులో దయాల్బాగు ఇండస్ట్రీల సరుకేగాక, బయటనున్న దయాల్బాగు స్టోర్లు కార్ఖానాల తాలూకు (Cottage Industries) సరుకు గూడ కలపగా అంత మొత్తమయినది. ఈ యేడు మన వస్త్రోత్పాదన ఇంతవరకు డెబ్బది లక్షల వరకే అయినది. పరిస్థితి యిట్లె యుండిపోయిన యెడల రాబోవు సంవత్సరము ఏబది లక్షలు మాత్రమే తయారగుటలో ఆశ్చర్యమేమియు నుండదు. కావున మన వస్త్రోత్పాదన ప్రస్తుత పరిమాణములో నిలబెట్ట వలెనన్న మన అమ్మకము లిదివరలో కన్న మూడు రెట్లు పెంచుట యవసరము. ప్రతి వ్యక్తియు ముందుకన్న మూడు రెట్లెక్కువ సరుకుకొని అమ్ముటకు ప్రయత్నము చేయవలయును. పై దేశములలో గూడ ప్రతి దేశమునను, తమ వస్త్రోత్పాదన యథాశక్తిగా బాగుగ పెంచివేయుచు, సరుకు ఎగుమతి ఎక్కువ చేయుచు, యేయే సరుకులు దిగుమతి చేయనిచో కాలక్షేపము కాజాలదో అట్టి బహుముఖ్య సరుకులనే బయటినుండి దిగుమతి చేసుకొనుచు, దిగుమతులను గూడ శక్యమైనంత వరకు తగ్గించుకొను ప్రయత్నములో నున్నారు. మీరుకూడ మీ సాలుసరి బడ్జటు నిదే పద్ధతిని తయారు చేసికొని, సరుకు విరివిగా కొనుగోలు చేసి కొట్టులలో స్టాకు చేసికొని విక్రయములు అధికాధికముగ చేయుడు. మీ సొంత ఖర్చు బాగా తగ్గించుకొని పొదుపుగ నుండుడు. మీ సొంత అవసరముల కేమైన కొనవలసి వచ్చినపుడు ఖర్చు తగ్గించుటకు ప్రయత్నము చేయుడు. వ్యాపారములోను ఇండస్ట్రీస్ లోను నిశ్శంకగ

డబ్బు పెట్టుబడి పెట్టుడు. అందువలన ధనము నష్టము కానేరదు, మెల్ల మెల్లగా పెరుగును. ఈ ప్రకారము మీరు ప్రవర్తించినచో పర్యవసానము మీకు తప్పక తృప్తికరముగ నుండగలదు.

పాఠీలను దివ్యేచ్ఛకు శబ్దమును తీసి చదువమనియు, రాధాస్వామీ దయాళురు సత్సంగు లీవిధముగ నడుచుకొన్నయెడల వారికేమి బహుమాన మిచ్చెదరో వారిని ప్రార్థన పూర్వకముగ అడుగవలసిన దనియు సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది.

ఆజ హు ఆ మన మగన మోర సున సున గురు బతియాఁ

(ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 14 (1), శబ్ద 2)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దమును బట్టి, మీరు మీ పద్ధతిని సరిచేసి కొని, కార్యపటుత్వము చూపి పని చేయుచున్నయెడల, రాధాస్వామీ దయాళురు మీకు బహుమానము నిత్తురని మీకే స్వయముగ బోధపడవల యును. మీరీ శబ్దముయొక్క అంతిమ చరణమును తిరిగి చదువుడు.

రాధాస్వామీ సతగురు దయాల్, కీనా మోహిం అబ్ నిహాల<br>
అలఖ అగమ కే పార చాల, చరణ అంబు ఛకియాఁ ॥5॥

ఈ చరణములో వర్ణించిన ఉత్తమ గతిని మించి ఇంకేమి గొప్పస్థితి యుండ గలదు. దీనిని మించిన బహుమతి యేమున్నది. రాధాస్వామీ దయాళురు అట్టివానికి సమస్తకష్టములను తీర్చి సంపూర్ణ సుఖమునిచ్చి, అలఖ అగమ లోకములపైకి తీసికొని వెళ్ళి తమ దివ్యచరణము లందు నివాసము ననుగ్రహించి అమృత రసపానము చేయఁగల సావకాశమును గలిగించుదురు.



26.5.38